# సర్వ సిద్ధాంత సౌరభము

కర్త:
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ అనుభవానంద స్వాములవారు

## దర్శన ఖండము

ప్రథమ భాగము

సాంఖ్య – యోగదర్శనములు



ప్రకాశకులు:
శ్రీ అనుభవానంద గ్రంథమాల
భీమునిపట్టణము
బాపట్ల – బ్రాంచి.

Search for truth is the noblest
occupation of mankind; its
publication a duty

Taylor

సత్యాన్వేషణము మానవకోటికి పరమపవిత్ర
కర్తవ్యము; దాని ప్రచురణము ఒక విధి.

టేలర్

'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే సంకుచితత్వము బాసి, పర మత దూషణముల మాని, విశాలత్వమును విశ్వతోముఖము నగు ఆనందమును పొందనగును.

ఇదియే శ్రీ రామకృష్ణదేవుని ప్రత్యేక సాధనా విధానము! ఇదియే ప్రత్యక్ష అనుభవస్థితి! సాధనలనేకములుగాని అనుభవము ఒక్కటే! సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే! సకలానుభవ స్వరూపుడైన శ్రీరామకృష్ణుని సమస్త సాధనా విధానములను, సర్వమత సామరస్యమును, సకలానుభవ రహస్యములను వ్యక్తము చేయుటకే యీ శ్రీ అనుభవానంద గ్రంథమాలను శ్రీ అనుభవానంద స్వాములవారు సంస్థాపించిరి.

ఈ గ్రంథ ముద్రణమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు రు. 7,250-00 లు ఆర్థిక సహాయము చేసి, మా గ్రంథమాల కృషికి తోడ్పడినందులకు వారికి మా కృతజ్ఞతలు.

పాఠకులు దీనిని పఠించి, మన మహర్షుల భౌతికాభౌతిక విజ్ఞానసంపదకు వారసులై, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక సంస్కృతీ ప్రవాహమున నీదులాడి, యథార్థ భారతీయులై మనెదరుగాక!

వ్యాస పౌర్ణమి
13-7-84

మాతాజీ
త్యాగీశానంద

# విరాళకర్తలు

1 శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు
మర్చంటు - నెల్లూరు రు 200/-

2 శ్రీ కలిగొట్ల సూర్యనారాయణ నాయుడుగారు
ఎం. ఎల్. ఎ., మున్సిపల్ చైర్మన్, భీమునిపట్టణము రు 100/-

3 శ్రీ సదురుపాటి వీరరాజుగారు
శిర్లపాలెం - విశాఖపట్టణము జిల్లా రు 100/-

4 శ్రీ బొలిశెట్టి సీతారామయ్యగారు
అడ్వొకేటు - బాపట్ల రు 232/-

5 శ్రీ నందగిరి వేంకటరామదాసు పంతులుగారు
శిర్లపాలెం - విశాఖపట్టణము జిల్లా రు 100/-

6 శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు & సన్
ఆయిల్ మిల్ - భీమునిపట్టణము రు 100/-

7 శ్రీ బలభద్రుని చెన్నయ్యగారు & సన్సు
ఆయిల్ మిల్లు - భీమునిపట్టణము రు 100/-

8 శ్రీ దుర్గా దాసయ్యగారు & సన్
మర్చంట్సు - భీమునిపట్టణము రు 100/-

9 శ్రీ కాళ్ళకూరి సూర్యనారాయణగారు
అల్లిపురము - విశాఖపట్టణము రు 100/-

10 శ్రీ బూదరాజు నరసింహారావుగారు (డాక్టరు)
స్వర్ణ - గుంటూరు జిల్లా రు 100/-

11 శ్రీ వసుమర్తి శేషాచలంగారు
యారన్ & క్లాత్ మర్చంటు - నెల్లూరు రు 100/-

12 శ్రీ ఏడిద సూర్యనారాయణ భగవానులుగారు
భీమునిపట్టణము - విశాఖపట్టణము జిల్లా రు 50/-

13 విద్వాన్ శ్రీ గట్రె సత్యనారాయణ గుప్తగారు
చల్లంరాజువారివీధి - విజయవాడ రు 50/-

14 శ్రీ పెనుబోలు బ్రదర్సు
కమీషను మర్చంట్సు — నెల్లూరు రు 100/-

15 శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడు శెట్టిగారు
బంగారు వ్యాపారము — నెల్లూరు రు 58/-

16 శ్రీ రాయప్రరెడ్డి అప్పారావు నాయుడుగారు
వైస్ చైర్మన్ — భీమునిపట్టణము రు 100/-

17 శ్రీ కొత్త రమణాజీరావుగారు
కమీషను మర్చంట్సు — బొబ్బిలి రు 100/-

18 శ్రీ ఆడక్కి వేంకట హనుమంతరావుగారు
రైసుమిల్లు ప్రొప్రయిటర్సు — శ్రీకాకుళం రు 100/-

19 శ్రీ నిట్ట భీమశంకరంగారు
ఇన్‌కంటాక్సు ఇన్స్పెక్టరు — విశాఖపట్టణము రు 100/-

20 శ్రీ బండి వీరరాఘవమ్మగారు
చింతలపూడి, ప॥ గోదా[illegible]జిల్లా రు 100/-

21 శ్రీ బండి రామారావుగారు
చింతలపూడి, ప॥ గోదావరి జిల్లా రు 100/-

22 డాక్టరు గైనేడి వేంకట అప్పారావుగారు
విజయవాడ రు 100/-

23 శ్రీ ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు
కమీషను మర్చంట్సు — అనకాపల్లి రు 100/-

24 శ్రీ బి. హేమలతాదేవి బహదూర్ గారు
ఏలూరు ప॥ గోదావరి జిల్లా రు 100/-

25 శ్రీ చుండూరు రామానుజంగారు
నవాబుపేట — నెల్లూరు రు 100/-

26 శ్రీ వెలగపూడి సుందరరామదత్తుగారు
నెల్లూరు రు 100/-

27 శ్రీ నూనె శేషాచలం శెట్టిగారు
రైసుమిల్సు, కమీషను మర్చెంట్సు — నెల్లూరు రు 116/-

28 శ్రీ నూనె జగ్గయ్య శెట్టిగారు
రైసుమిల్సు, కమీషను మర్చంట్సు — నెల్లూరు రు 100/-

29 శ్రీ చిత్తూరు మునుస్వామి మొదలియార్‌గారు
మర్చెంట్సు — నెల్లూరు రు 116/-

30 శ్రీ యడ్లపల్లి గోవిందు శెట్టిగారు
ఐరన్ మర్చెంట్సు — నెలూరు రు 116/-

31 శ్రీ పోలిశెట్టి వేంకటరమణయ్యగారు
పాండ్రంగి — విశాఖపట్టణము జిల్లా రు 116/-

32 శ్రీ పూసర్ల జగన్నాథ అప్పలనరసయ్య & సన్సు
కలపవ్యాపారము — విజయనగరము రు 58/-

33 శ్రీ శారదా గ్రంథాలయము
శిర్లపాలెం — విశాఖపట్టణము జిల్లా రు 116/-

34 శ్రీ పొట్టా వీరరాజుగారు
భీమునిపట్టణము రు 116/-

35 శ్రీ నుదురుపాటి సత్యనారాయణ శెట్టిగారు
భీమునిపట్టణము రు 58/-

36 శ్రీ కులుకూరు సన్న్యాసి శెట్టిగారు
జనరల్ మర్చంట్సు — విశాఖపట్టణము రు 100/-

37 శ్రీ నంగునూరు మహబూబురెడ్డిగారు
దేశముఖుల — నరసంపేట్, వరంగల్లు జిల్లా రు 100/-

# సమర్పణము

శ్రీ రామాది దశావతారములకున్, శ్రీలక్ష్మి వాణీ ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగా నొప్పు నా
ప్రాణాధారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మిక స్థానమున్
ఆరాధించుచు గ్రంథ మిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై.

శ్రీవిద్యా ప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూత స్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావించే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై.

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభ కన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్ట తా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వసిద్ధాంత సా
రభమున్' నేను సమర్పణం బిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై.

శ్లో॥ స్థాపకాయ చ ధర్మస్య
సర్వధర్మ స్వరూపిణే
అవతార వరిష్ఠాయ
రామకృష్ణాయ తే నమః।

శ్రీ వివేకానందస్వామి

# విషయసూచిక

## ముఖ ప్రబంధము



## 1 సాంఖ్య దర్శనము

## 2 యోగ దర్శనము

# సర్వ సిద్ధాంత సౌరభము

## ముఖప్రబంధము

### మన మాతృభూమి

(I would have you, day by day, fix your 'eyes upon the greatness of your country, until you become filled with the love of her, and when you are impressed by the spectacle of her glory, reflect that it has been acquired by men, who knew their duty and had the courage to do it) సంపూర్ణముగ దేశభక్తిచే నిమగ్నమగు నంతవరకు, మీ మాతృభూమియొక్క ఔన్నత్యముపై అనుదినము మీరు దృష్టుల పరపించుట నా యభీష్టము. అట్టి యుత్కృష్ట తేజోవంతమగు దృశ్యము మీ హృదయముల నాటి నప్పుడు, తమ విధ్యుక్తధర్మముల గ్రహించి, నిర్వహణము నకై తగు ధైర్యస్థైర్యములుగల వ్యక్తులచే నది సంపాదిత మని యోచింపుడు అని ప్రాచీన గ్రీసుదేశపు తత్త్వవేత్తయగు (Piracles) పిరకిల్స్ వాక్యము. 'జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ' అను ఆర్యోక్తిని మూఢముగా నమ్మి మాతృ భూమి చిత్తరువు నారాధించుట గాక, పైవాక్యరీతి జన్మభూమి యొక్క సర్వతోముఖాధిక్యతను సక్రమ పరిశోధనా విధాన మున గ్రహించి (India I loved before I came away. Now

the very dust of India has become holy to me, the very air is now to me holy, it is now the holv land, the place of pilgrimage, the Tirtha) । నే నిటకు రాకపూర్వము భారతభూమిని ప్రేమించుచుంటిని. ఇప్పుడు భారతదేశము యొక్క ధూళియే నాకు పరమపావనముగ నున్నది. దాని గాలియే దివ్యము. అది నాకు యిప్పుడు ఒక యాత్రాస్థలమై తీర్థమై రాజిల్లుచున్నదని పాశ్చాత్యభూములు భారతీయాధ్యాత్మిక విజ్ఞాన డిండిమమును మ్రోగించి స్వపర దేశ తారతమ్యమును గ్రహించి మాతృదేశోన్ముఖుడై పయనమగుచున్న వివేకానందుని అద్భుత వచనము. (Hearken unto me, Ye children of immortality, all ye who once dwelt in abodes of divine, I have known the Supreme Person, the one whose light shines forth from beyond the darkness) పూర్వము పరమధామవాసులైన అమృతతనయులారా నన్ను వినుడు. అంధకారమును చీల్చుకొనుచు, అతీతముగ ప్రకాశించు తేజస్స్వరూపుడైన పరమపురుషుని నే గ్రహించియున్నాను అని తమ దివ్యాధ్యాత్మికానంద తేజోపుంజములచే మానవకోటియొక్క అజ్ఞానాంధకార విచ్ఛేదనాదీక్షాదక్షులై సర్వత్యాగమూర్తులైన మహర్షిగణముచేతను, అట్టి పరమాధ్యాత్మిక ప్రకాశప్రసారముల కాటంకదాయక అధర్మశక్తుల రూపుమాపి ధర్మదేవతను ఉన్నతస్థానమున పునఃప్రతిష్ఠ గావింప 'శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహం'...

1. Swami Vivekananda: The Life Vol 3 p 69

'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' (భ.గీ.4.7,8) అను రీతి బద్ధకంకణహస్తులైన అవతారవరేణ్యులచేతను, ఆరాధ్య దేవతయై; అనవరతమాధ్యాత్మికవాతావరణ వాసనావాహినుల జల్లగ భారతిపై ప్రసరింపజేయుచు, బ్రహ్మజిజ్ఞాసాపరుల నాకర్షించి ఆత్మానంద మనుగ్రహముల ప్రసాదించి తన్మయుల గావించి జ్ఞానప్రదాన యజ్ఞదీక్ష గడించిన హిమనగమును శిరో భూషణముగ ధరించి, జ్ఞానసంపద్విభూతి నిండారం జెల్వొందు ప్రవర్తవాహినీ సనాతనత్వ మవలంబించి దేశపర్యటనము న నాత్రిభువన భక్తి ముక్తి సింధు గంగాయమునాది పుణ్యనదీ సారసంశోభితయై యనాదికాలమునుండి నేటివరకు నవిచ్ఛిన్నలీల సర్వప్రపంచమునకు ఆధ్యాత్మిక గురుస్థాన మలంకరించియున్న మన భారతమాతయొక్క ప్రాచీనాధునిక తత్త్వపరిశీలనము గావించి, మనసా గ్రహించి, హృదయము ముప్పొంగ, పులకితశరీరుడై గద్గదగాత్రుడై గద్గదస్వరుడై ఆమె చరణయుగళమునకు జేమో డ్చినవాడు భారతీయుడు డనజెల్లదుగదా! అనాదికాలమునుండి కేవలము భౌతికవిజ్ఞాన సంజనిత సుఖసంపదల దులదూగుచుం డియు, సంతృప్తయై యుండక నిచ్చగింపక, 'లోకస్య కా గతిః' (ఛాం.1.8.7) లోకముయొక్కగతి ఏది? 'యేయం ప్రేతే విచి కిత్సా మనుష్యే స్త్యేకే నాయమస్తీతి చైకే' (కఠ.1.2.20) మరణానంతరము మానవు డేమగును? ఉండునని కొందరును లేడని కొంద రందురు. 'భగవాన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయంతే' (ప్ర.1.3) గురువరా, యీజీవు లెందుండి సృజింప బడిరి? మొదలగు అసంఖ్యాక సందేహముల నన్వేషించి సత్యానందవిభూతి విరాజిల్లిన భారతి (If theie is one place

on the face of the earth where all dreams of living men have found a home from the very earliest days where man began the dream of existence, it is India) 2 మానవునకు జీవితస్వప్నము ప్రారంభించిన ప్రాచీనకాలము నుండియు, మానవులు సర్వాశయముల బొందగల్గిన దేశము సర్వప్రపంచమున భారతమే యని (Romain Rolland) రోమెన్ రోలాం, (India has always been a nation of philosophers)[3] హిందూదేశము ఎల్లప్పుడును తత్త్వవిదుల నిలయము అని (Max Muller) మాక్సు ముల్లరు మొదలగు ననేక పాశ్చాత్య పండితప్రకాండులచే నానా వేనోళ్ల స్తుతింపబడుట యందాశ్చర్య మేమి?

---

## పూర్వాధునములు

అట్టి పరమపవిత్రచరిత్ర భారతమాతృ స్వరూపమును సమగ్రముగ నవగాహన మొనరింప (One has to travel far in time and space, to have glimses of what she was and what she said) 4 ఆమె పూర్వ మెట్లుండెనో, ఏమి వచించెనో, యను విషయముల గ్రహింప దేశకాలములలో బహుళదూరము పయనము గావింపవలయును. (The discovery of his past opened before man a new world of

---

2. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 64
3. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 2
4. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 161

the development with strict indifference. [8] శాస్త్రీయక విధానమునకు సాక్షికదృష్టిగాక, పరిణామమును తటస్థ పద్ధతి ననుసరించుటయే ముఖ్యమని యనునట్లు యీ సంస్కృతి వ్యక్తియొక్క నిత్యజీవితమున, సంఘమున, ప్రజా బాహుళ్య మెట్లు ప్రవేశించి పరివర్తనముల గలుగజేసెనో విచారించుట ముఖ్యము. అందులకై సంస్కృతీ తాత్పర్యమును గ్రహింప యత్నించెదముగాక !

The culture of a people represents its common soul. [9] ఒక జాతియొక్క సంస్కృతి దాని సర్వ సామాన్య వ్యక్తిత్వమును వ్యక్తపరచునని ధీరేంద్రనాథుడు నుడువునట్లు జాతికి సంస్కృతియే జీవగర్ర. మరియు Culture is that intangible yet all-pervasive something in the whole structure of a civilization which seeks to cultivate the inner and outer life of the people possessing that civilization. [10] ప్రజానీకముయొక్క బాహ్యాభ్యంతర పురోగమనము గలుగజేయు సంపూర్ణ నాగరిక సంస్కారవ్యవస్థలో నప్రత్యక్ష సర్వవ్యాపక తత్త్వమే సంస్కృతియనియు ధీరేంద్రనాథుని వచనము. అద్దానినే యిసుమంత వివరణముగావించుచు, నాగరికతా, సంస్కృతుల శబ్దార్థముల విడదీసి A particular civilization is the matter whose form is its culture. [11] ప్రత్యేక

8. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1 p 56
9. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 255.
10. Dr. Dhirendranath Roy : The Spirit of Indlan Civilization, p 65.
11. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 24

లందును, మానవ వేషభాషలందును, అనేకమైన మార్పుల గలిగించి, భూసారము నధిగమింపజేసి, పృథ్విని సస్యశ్యామల మొనరించి; మానవ జీవనవిధానమున బాహ్యమునకు మార్పును గలుగజేయును. దీనివలన భూగర్భమున వివిధ లోహజాతులు రూపాంతరముల బొంది, మానవోపకరణములై, యాతని జీవిత మును సున్నితమొనరించును. ఈ సంస్కృతీ బలమున గ్రిందికి ప్రవహించు జలములు పైకెగయుచు, ప్రజోపకరములుగ రూపొం దును. అనేక ప్రకృతి శక్తులు మానవ మేధాశక్తికధీనమై, అతని దుఃఖముల దగ్గించి, సుఖము నధికమొనరింప దోడ్పడ గలుగును. దీనిచే ప్రపంచ బాహ్యరూపమే మార్పు జెందినట్లు గోచరించును. ఈ సంస్కృతీ విభాగమునకు లౌకిక సంస్కృతి యని పూర్వమే నామకరణమొనర్చియుంటిమి.

సంస్కృతీ విభాగమున, ద్వితీయమును ధార్మికము అనగా నైతికము అనదగును. పూర్వ భాగమున ప్రకృతి శక్తుల ద్వారా ప్రకృతిసంపదను బెంపొందించి, అనుభవించి, సుఖింప నధికారము మానవుడు సంపాదింప, నీ భాగము అతని యథేచ్ఛా లాలసత్వము నిసుమంత నరికట్టును. అతని స్వార్థమును గొంచెము సడలించును. అతని స్వాతంత్ర్యము నొకించుక బాలించును. అనుభవింపనతనికధికారమీయబడినను, పరుల కాటంకము కారాదని శాసించును. అన్యులకు బాధాకరము గానటుల వారించును. తనతోడి జీవరాసులకందుగూడ భాగ మున్నదని దృష్టికి గోచరింపజేయును. ప్రకృతి సంపదాను భవమున దనకువోలె నితర ప్రాణులకు గూడ గల అధికారమును

దానియందు మునిగి జీవించుచున్నామను పండిత జవహరిలాల్ నెహ్రూ వచనరీతి అది మనయం దైక్యతనొంది యున్నదని విదితేము. కాన (If India forgets them she will no longer remain India, and much that has made her our joy and pride will cease to be) 10 భారతదేశము ప్రాచీనపురుషుల విస్మరించినచో అది భారతభూమిగా నికనుండజాలదు. తనకానంద దాయకమును, గర్వహేతువును అయిన కారణములన్నియు నదృశ్యమగునుయు నెహ్రూపండితుని సముచిత హెచ్చరిక. కాన గతమును మూఢముగ నారాధించుచు గర్వప్రవృత్తి లోపించి యుండుటయుగాక, గతమును నిరుపయోగకరముగ దూషించుచు ద్వేషించుటయు గాక, వర్తమానభవిష్యత్తుల కుపయుక్తవిధానమున దానిననువదించుటయే ముఖ్యకర్తవ్యము. (To combine it with the present and extend it to future to break from it where it cannot be so united, to make all this the pulsating and vibrating material for thought and action-that is life.) 10 భూతకాల విషయముల వర్తమానమున కనుసంధించి, భవిష్యత్తునకు మేళవించుచు, అట్టి సమన్వయమున కనుపయుక్తముల ద్రోసిపుచ్చుచు, సర్వమును భావన, ఆచరణములకొరకు సజీవముగను సచేతనముగ గావించుటయే కర్తవ్యము. అదియే జీవనము, అని నెహ్రూపండితుని యుద్బోధ.

(The philosophy of a country is the cream of its culture and civilization) 11 దేశముయొక్క సంస్కృతీ నాగరి

10. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 5
11. Satis Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p 14

కతలకు తత్త్వశాస్త్రము నెన్నవంటి దనునట్లు భారతభూమి యొక్క ఔన్నత్యము అనాది గురుపరంపరాగత ఆధ్యాత్మికవిద్యా వైభవమూలమున వ్యక్తమగుచునే యున్నది. ఆమెకు ఆధ్యాత్మికవిద్యయే జీవగర్రగా నొప్పారియున్నది. తన్మహిమాతిశయమున (India is the only country which has known God)[12] భారతావని యొక్కటియే భగవంతుని గ్రహించియున్నదనియు, (the repository of noblest spiritual tradition)[13] దివ్యాతి దివ్య ఆధ్యాత్మిక సంప్రదాయమున కాకరమనియు, (the greatest spiritual force of the world)[14] ప్రపంచమున అత్యున్నతాధ్యాత్మికశక్తియనియు (The beating heart of the world)[15] ప్రపంచమునకు హృదయస్థానమనియు, (The leader of the human evolution)[16] మానవ పరిణామమున కధినేతయనియు, (The head of the world)[17] ప్రపంచమునకు శిరమనియు (the Mother of the world)[18] జగన్మాతయనియు ప్రఖ్యాతిగడించి, పూత చరిత్రయై (India is not for herself but for God - - for the whole world)[19] భారతి స్వార్థపరము గాక ఈశ్వరనిమిత్తమును, లోక సంగ్రహణము కొరకును గలదనియు, అలౌకిక యశోనిధానయై ప్రకాశించుచున్నది.

12. Vecente Avelino, Consul General for Brazil.
13. Prof. Louis Renon: A talk in Santiniketan 1949
14. Dr. Kenneth Walker: A talk in London 1949
15. Sirish Kumar Mitra: The Vision of India p 96
16. Do Do p 37
17. Swami Rama Tirtha: The Complete Works Vol 7 p 122
18. Arabindo Ghosh
19. Sirish Kumar Mitra: The Vision of India p 97

# భారతదేశము - భౌతిక విజ్ఞానము

అట్లైనను (It is absurd to talk as though India produced nothing but Sadhus, Yogis, Mahatmas, Philosophers and the like. The life of India has displayed itself in all activities) 20 హిందూ దేశము కేవలము సాధువులను యోగులను మహాత్ములను తత్త్వవేత్తలను మాత్రమే నిర్మించినదని వచించుట అసందర్భము. భారతీయ జీవనము సర్వతోముఖశక్తుల ప్రదర్శించియున్నది. (In mathematics the ancient Indians made some epock-making discoveries notably that of the Zero sign, of the dicimal place-value system, of the use of minus sign and the use of algebra of letters) 21 గణితశాస్త్రమున సున్నయొక్క యుపయోగము, అంకెలకు స్థానము ననుసరించి విలువ గలుగు విధానము, సాంకేతిక గణితపద్ధతి మొదలగు అద్భుతాంశముల ప్రాచీనభారతీయులు గావించియుండిరి. ఈ దశసంఖ్యామానము ఋగ్వేదకాలముననే భారతావని నుపయుక్తమై యున్నటుల ప్రమాణములు గలవు అని నెహ్రూ పండితుడు వ్యక్తపరచి యున్నాడు. తొమ్మిదవ శతాబ్దమునకు జెందిన పారశీక పండితుడైన Al Jahize అల్ జహీజ్ గూడా భారతీయగణితశాస్త్ర విశిష్టతను స్తుతించుచు (Hindus excel in astrology, mathematics, medicine and in various other sciences] హిందు

20. Sir John Woodroffe: Shakti and Shakta p 431
21. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 87

పారమార్థిక భావములకును జరుగు పోరాటమువలన నేర్పడు ప్రపంచవ్యాప్త ఫలితాంశమే నాగరికత యనియు నతని నిర్వచనము. అనగా మానవులలో ననాదికాలమునుండి యురుదెంచుచున్న రజస్తమోగుణరూప పశు రాక్షస వృత్తులకును, ప్రపంచ జీవితమున నేర్పడుచున్న నైతికాధ్యాత్మిక ప్రవృత్తులకును ఏర్పడిన సంఘర్షణా ఫలితస్వరూపమే గమనరూప నాగరికత యని యాతని తాత్పర్యము. ప్రగతిని సూచించు యీ రెండవ నాగరికతా విధానమున మానవదృష్టి పశుత్వమునుండి మానవత్వమునకును, అటనుండి దేవత్వమునకును బరిణమించుచున్నది. అందుచే నిట భౌతిక విజ్ఞానసంబంధ యంత్రాదికములుగాని, తదితర సుఖాన్వేషణకారక ప్రవృత్తులుగాని గోచరింపవు. ఈ ద్వివిధ నిర్వచనములలో బూర్వము వచింపబడినటుల లౌకిక, ధార్మిక, ఆధ్యాత్మిక సంస్కృతీ త్రయమే తొంగిచూచుచు ప్రగతిరూప నాగరికతను ఆధ్యాత్మిక సంస్కృతియందును, స్థితనాగరికత ప్రథమ ద్వయమునను లీనము గావించుకొనినది. పై చర్చింపబడిన విషయముల ననుసరించి సంస్కృతీ స్వరూపమును నొకించుక గ్రహించినారము. దాని సమగ్ర విగ్రహము మన కట్టెదుట నిలువబెట్టబడినది. ఈ దృక్పథముతో భారతీయ సంస్కృతి నిసుమంత గ్రహించి, పై నిర్వచనములకనుగుణమై, మానవజాతికి సమగ్ర సంస్కృతీ వికాసమును గలుగజేయుగల శక్తి అందిమిడి యున్నదా అను విషయమును బరిశీలించెదముగాక!

---

యని స్తుతించుచు, సర్వజ్ఞాన ప్రదాత్రియగు భారతాంబపాద పద్మసన్నిధానమున నతడు ప్రణమిల్లెను. భూగర్భమునుండి కొంతకాలము క్రిందట బహిర్గత మొనర్పబడి, కనీసము 5000 సంవత్సరముల కాలమునాటివిగ దీర్మానింపబడియున్న మొహం జదరో, హరప్ప నగరనాగరికతా నైపుణ్యమును దిలకించిన అది ఎంతటి ఉన్నతస్థాయిని చేరియున్నదో తెలియకపోదు. ఢిల్లీనగర సమీపమున నొక పెద్ద ఇనుపస్థంభము గలదనియు, అది శీతోష్ణాదులకు లోంగక నెవ్విధమైన మార్పును చెందకయుండుటను గాంచి ఆధునిక శాస్త్రజ్ఞులు ఆశ్చర్యమును తెలుపుచున్నారనియు పండిత నెహూ్రి తెలుపుచున్నాడు. 24

ఇట్లు భూగోళసంబంధ విషయములనేగాక ప్రాచీనభారతీయులు తమ కుశాగ్రబుద్ధుల ఖగోళముపై ప్రసరింపజేసి, (The motion of the Moon and the Sun were carefully observed by the Hindus) 25 సూర్య చంద్ర గమనమును హిందువులు అతి సూక్ష్మముగ బరిశీలించియున్నారనియు, వారి చంద్రకళాపరిణామగ్రహణము నిర్దుష్టమనియు (Colebrooke) కోల్ బ్రూక్ వ్రాసియున్నాడు, తొమ్మిదవ శతాబ్దమునకు జెందిన Yaqubi యాకుబీ అను పర్షియా పండితుడుగూడ (Hindus are more exact in astronomy and astrology than any other people) సర్వేతర దేశస్థులకంటె భారతీయులు జ్యోతిష ఖగోళ శాస్త్రముల నిర్దుష్టతగలవారని కొనియాడి యున్నాడు. అందుచేతనే (We find that of all the ancient

25. Colebrooke: Bhaskara's Work of Algebra p xxii

nations the Hindus alone had well nigh aicurately determined the rate of the precision of the equinoxes) 26 (ప్రాచీన దేశస్థులలో భారతీయులుమాత్రమే అతిసక్రమరీతి ఆయన గమన విధానమును గ్రహించిరని బాలగంగాధర్ తిలక్ సగర్వముగ వచించెను. పతంజలిమహర్షి కృత యోగసూత్రముల దిలకించుచో 'భువనజ్ఞానం సూర్యే సంయమాత్' (3.26) సూర్యుని యందు బుద్ధిని సంయమనము గావించుటచే చతుర్దశ భువనముల జ్ఞానము గలుగునని సూచింప భాష్యకర్త యగు వ్యాసదేవుడు అయాభువనవైశాల్యాది వివరములనొసంగియున్నాడు. అట్లే 'చంద్రే తారావ్యూహ జ్ఞానం' (3.27) చంద్రునిపై నేకాగ్రబుద్ధి వలన నక్షత్రమండల జ్ఞానము కలుగును. 'ధ్రువే తద్గతిజ్ఞానం' (3.28) ధ్రువనక్షత్ర సంయమన విశేషమున తారాగమన జ్ఞానముగలుగును. అనియూ ఖగోళరహస్యముల గొన్నింటిని సూత్రప్రాయముగ పతంజలి మునివరేణ్యుడు వివరించియున్నాడు. ఆధునిక భౌతికశాస్త్రమున కాధారమైన పదార్థనిత్యత్వము మన పూర్వ ఋషీశ్వరులకు సువిదితమని రామకృష్ణానందస్వామియు తెలుపుచున్నాడు. (About cosmology and all that pertains to it and you will find how wonderfully they are in accordance with the latest discoveries of modern Science and where there is disharmony, you will find that it is modern Science which lacks and not they) 28 భూతసృష్టి

26. Bala Gangadhara Tilak: Orion p 212
27. Swami Ramakrishnananda: The Message of Eternal Wisdom p 93
28. Swami Vivekananda: The Complete Works Vol 2 p 431

సికములుగ బ్రసరింపజేయుచుండుటచే నాద్య రూమును Civilization నాగరికత అని చెప్పనొప్పును. పూర్వమే వచింపబడి యున్నటుల Culture సంస్కృతి వ్యష్టిజన్యమై వికసించి, Civilization నాగరికత రూపమున సంఘమున వ్యాపించును గదా! అందుచే మొదటి రెండు సంస్కృతీ భాగములు సంపూర్ణ ముగ సాంఘికములై నాగరికత యనుబడును. దాని విశదీక రించుచు, The word civilization has two distinct senses. It should be taken both as a process and a product. 19 నాగరికత అను పదమునకు రెండు విస్పష్ట భావములు గలవు. అవి కృషి ఫలితములననగును. As a process, it implies the act of making one civil or social. It is that act of man which serves to socialize him in all his relationships. Civilization in this respect is synonymous with sociaization. It refers primarily to the manner of iving. It makes man feel his oneness with others. 19 కృషి రూపమన వ్యక్తిని సాంఘికమొనర్చుట యనదగును. ఈ మానవకృషియే నతని సర్వ సంబంధ బాంధవ్య ములతో సాంఘికవాదిగ జేయును. ఈ దృష్టిలో నాగరికత సాంఘిక వ్యవస్థయే యగుచున్నది. జీవితపద్ధతియే ముఖ్యముగ నిందు సూచితము. పరులతో నేకత్వము ననుభవించునట్లు మానవుని నది యొనర్చును. అది నాగరికతయొక్క ప్రథమాంశ ముగ ధీరేంద్రనాథరాయ్ విశదీకరించియున్నాడు. నాగరికతా

9. Dr. Dhireneranath Roy : The Spirit of Indian Civilization, p 26, 31

## భారతి—విజ్ఞానప్రదాత్రి.

వైవిధ్యాన నసమాన సర్వతోముఖ సంస్కృతీ సంపదను సృజించి పెంపొందించి, అనుభవించి, ఆనందించుటయేగాక, త్యాగప్రధానమైన భారతజనని సర్వవిశ్వమానవకళ్యాణమే కాంక్షించుచు క్షేమైకస్వరూపిణియగుట చేతనే ఆశ్రయించినవారికేగాక ఆశ్రయించని వారలకుగూడ విజ్ఞానభిక్ష నొసంగి యజ్ఞాన వంచిత సుఖపంకిలమునుండి యుత్తీర్ణత చెంద గురుతర సహకారిణియై యనాదికాలమునుండి విరాజిల్లియుండుట ప్రాక్ప్రతీచీ పండిత లోకమునకు సువిదితమే. గ్రీసు దేశము ఈజిప్టు మాత్రము (Egypt herself in the earlier antiquity-recieved her laws, her social institutions, her arts and her sciences from India) అతిప్రాచీనకాలమున తన నిబంధనములను, సాంఘిక వ్యవస్థలను, కళలను, భౌతికశాస్త్రమును భారతదేశము నుండి గ్రహించియున్నదని దివ్యజ్ఞానసంఘ సంస్థాపకురాలైన (Madame Blavatsky) బ్లావట్స్కీ-విదుషీమణి తన Secret Doctrine అను గ్రంథమున తెలిపియున్నది. పాశ్చాత్య తత్త్వశాస్త్రమున కాదిపురుషులనదగు ముఖ్యులలో (Plato) ప్లేటో యను గ్రీసు దేశస్థుడు, తన గురువర్యుడగు Socretes సోక్రటీసు మరణానంతరము హిందూదేశమునకరుదెంచి తత్త్వశాస్త్రమును గ్రహించినట్లు తెలియుచున్నది. సోక్రటీసు కాలమునగూడ భారతీయ బ్రాహ్మణగురువర్యులనేకులు (Athens) ఎథెన్సుపట్టణమున బోధించుచు నుండెడివారని విదితము. మరియు క్రీ. పూ. 550 సంవత్సరములకు జెందిన (Pythogoras పైథాగొరసు

త్రయ విభాగమున, దృతీయమైన ఆధ్యాత్మిక సంస్కృతియే అతి ప్రధానమై, గమ్యమై యొప్పారి యుండుటచే, భారత చరిత్రాకథనమున యవనాది పరదేశీయ దండయాత్రలలోగాక, వివిధకాలముల దలలెత్తిన రాజ్య సామ్రాజ్యములందుగాక, మధ్య మధ్య గోచరించు గొప్ప చక్రవర్తుల విధానములందుగూడగాక, భారతీయైక్యత మరియొక తత్త్వమున గలదని సురేంద్రనాథ దాసుగుప్త వ్రాయుచు, It is essentially one of spiritual aspirations and obedience to the law of the spirit, which were regarded as superior to everything else; and it has outlived all the political changes through which India passed. 22 ఆధ్యాత్మిక తృష్ణయు, పారమార్థిక నియమపాలనముతే సర్వేతరములకు నధికతమములని నిర్ణయింపబడి యుండుట యొక ముఖ్యపద్ధతియై, భారతదేశము అనుభవించిన నసంఖ్యాక రాజకీయ పరివర్తనముల నన్నింటిని నధిగమించినదని యాతడు ఘంటాపథముగా వక్కాణించి యున్నాడు. శిశిర్ కుమార సేన్ పండితుడుగూడ Spirituality is indeed the keynote of the Indian mind. 23 భారతీయ చిత్తమునకును పారమార్థిక దృష్టియే ముఖ్యమగు మూలసూత్రముగ వచించి యున్నాడు. ఈ యపూర్వ అసమాన భారతీయ విచిత్రతత్త్వము ఎల్లరచే గమనార్హము, గవేషణీయము.

---

12. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy vol. 1 p vii

13. Prof. Sisir Kumar Mitra : The vision of India, p 123.

అదియును వివేకానందుని వచనములలో India's culture is incomparable, being developed thousands of years of trial and experimentation, till it attained to the highest standard ever reached by humanity and consequently possessed of an unshakable stability and strength all its own. 24 భారతీయ సంస్కృతి, మున్నెన్నడు మానవజాతి పొందని అత్యున్నత స్థాయి నందుకొనువరకు, అనేక వేల సంవత్సరముల పరిశీలనాకృషి ఫలితముగ నభివృద్ధి గాంచినదగుటచే ననమానము. తత్ఫలితముగ నది స్వకీయమైన శక్తిసామర్థ్యములలో అచంచల సుస్థిరతను గలిగియున్నది. ఈ విషయమునే హిరేంద్రనాథ దత్తుడుగూడ, Indian culture is of the greatest antiquity, among all the known cultures of our globe. 25 మన భూగోళమున దెలియబడిన సకల సంస్కృతులలో భారతీయ సంస్కృతి అతి ప్రాచీనమని వాకొనియున్నాడు. కేవలము ప్రాచీనతయే ప్రాశస్త్యమును బ్రసాదింపనొల్లక పోయినను, యనాదికాలమునుండి నేటిదనుక నది యెట్టి వికారములు లేక దన మార్గముననే సముచిత పరిణామము నొందుచు వచ్చుచుండుటచే బూర్వోక్త వివేకానందుని వచనములరీతి సుస్థిరత్వము దానికి జేకూరినది. ప్రాశస్త్యమున్నగాని అది సిద్ధింపనొల్లదని వేరుగ వచింప ననావశ్యము.

---

4. Swami Vivekananda : The Life, vol. 3 p 232.
5. Prof. Hirendranath Datta : Indian Culture, p 7.

చున్నాడని కొందరివాదము. అనగా భౌతికశాస్త్రఫలితములు సర్వమానవవ్యక్తమనియు ఆధ్యాత్మికవిషయములు సర్వసాధ్యములు గావనియు వారి సందేహము. కాని భౌతికశాస్త్ర ఫలితముల జూచుచు, అనుభవించుచు, ఆనందించుచు, యితరులకుగూడ నందజేయుచున్న 'తనను' మాత్రము అతడు విస్మరించుట చింతనీయము. అన్నింటిని సృజించుచు, పోషించుచు, నశింపజేయుచు, యీనిత్యలీలలో నానందవాహినుల గ్రుంకుచు సర్వము నాడించు నావిచిత్రఅదృశ్యనటకుని గుర్తింపక పోవుట విచారకరము, ఏది లేకున్న యీసర్వ జడప్రకృతి నిష్ఫలమై యొప్పారునో అట్టి భావాతీతశక్తిపై మనదృష్టులు ప్రసరింపకుండుట అజ్ఞాన మనదగును. అందుచే, నుపయుక్తపదార్థములకు ఆనందింపవలయునా ఉపయోగించు కర్తను గాంచి సంతసింపవలెనా యనునది ప్రశ్న.

అంతియగాక, భోగ్యము నుపయోగించు విధానములు ప్రత్యక్షములుగ రెండు. మొదటిది సక్రమము. రెండవది అక్రమము. తనకు భోగ్యమగు ప్రకృతిని అక్రమముగ నుపయోగించిన, ప్రపంచమునకే ముప్పువాటిల్లును. సక్రమోపయోగమైనచో సర్వసంక్షేమము. కాన ఆసక్రమాక్రమోపయోగవిధానముల వాని ఫలితముల వ్యక్తపరచి, విధినిషేధముల బోధించు నైతికవిధానము ధర్మనిరతి అత్యవసర మగుచున్నది. ప్రకృతిశక్తుల గ్రహింపకున్నను సుఖలోపముండ బోదుగాని, వాని అక్రమోపయోగము మహారిష్టదాయకమై యొప్పారుచున్నది. అందుచేతనే సర్వజీవరాసుల సృజించిన ఈశ్వరుడు, ఆజీవుల అన్యోన్యశ్రేయోభిలాషియై 'తచ్ఛ్రేయో

రూపమత్యసృజత ధర్మం -- తస్మాద్ధర్మాత్పరం నాస్తి' (1. 4.14) అద్భుతమైన ధర్మమును సృజించెనని, ఆ ధర్మము కంటె నుత్తమము లేదనియు బృహదారణ్యకోపనిషత్తు తెలుపుచున్నది. భౌతికజ్ఞానశాస్త్రజ్ఞులలో నగ్రగణ్యుడైన (Einstien) ఐన్‌స్టీన్‌గూడ (The fate of the human race was more than ever dependent on its moral strength today. The way to a joyful and happy state is through renunciation and self limitation everywhere. I am absolutely convinced that no wealth in the world can help humanity farward. The example of great and pure characters is the only thing that can produce fine ideas or noble deeds) 34 నేడు మానవజాతియొక్క శ్రేయస్సు పూర్వముకంటె తన నైతికశక్తిపై నాధారపడియున్నది. సర్వత్ర త్యాగము స్వార్థపరిమితియే సుఖసంతోషపరిస్థితికి యుపాయము. మానవజాతిని ధనసంపద పురోగమింప జేయజాలవని నా దృఢనమ్మకము. ఉత్తములగు మహాత్ముల యాదర్శమే పవిత్రభావజాలముల దివ్యమైన కార్యముల జనింపజేయజాలునని తేల్చి ప్రస్ఫుటముగ తెలిపియున్నాడు. కావున, అవసరము, ప్రస్ఫుటము సర్వవ్యాప్తమగునది ప్రకృతిశక్తులుగాక వాని నుపయోగించు ఆత్మధర్మమే యని తేలుచున్నది. అనగ భౌతికవిజ్ఞానఫలితముల కంటె ఆత్మజ్ఞానఫలితములనే మనమెక్కువ అనుభవించుచు నభివృద్ధి గాంచుచున్నామని విదితము. ఎట్లు భౌతిక విజ్ఞాని ప్రకృతిరహస్యముల మానవుల కందుబాటు గావించి

34. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 431

యుపయోగింపజేసి ప్రపంచమునకుపకారియగుచున్నాడో అంతకు వేయి మడుంగు లధికముగ ఆత్మతత్త్వజ్ఞాని ఆత్మధర్మముల బోధించి, సర్వమానవులు ప్రకృతిశక్తుల సక్రమోపయుక్తము గావింప బ్రబోధించి మహోపకారి యగుచున్నాడు. అది ఎంత ప్రస్ఫుటమో యిదియు నంతకు మించి ప్రస్ఫుటము. అది ఎంత అనుభవనీయమో యిదియు నంతియే. అది ఎట్లు సర్వమానవుల కందుబాటుగ నున్నదో అంతకంటె నధికతరముగ నిదియు సర్వులకు సన్నిహితమే యగుచున్నది.

---

## భౌతిక విజ్ఞానము – అశక్తత

అదియునుగాక, కొంచె మాలోచించి చూచినచో భౌతికవిజ్ఞానముగూడ కొంతదూర మేగిన పిమ్మట అగమ్యగోచరమగు అద్భుత అనంతత్వమున నిరుకుచు గిజగిజలాడుచున్నది. ఈవిషయమును మనదృక్పథమునకు గొనివచ్చుచు నెహ్రూ పండితుడు (It was obvious that there was a great unknown region all around us, and science with its magnificient achievements, knew little enough about it) మన చుట్టును అఖండమైన అగోచర తత్త్వముగలదు. భౌతికవిజ్ఞానము తన అద్భుత అసాధారణసాధనములతో దాని నిసుమంతయేని నెరుంగదు అని వచించియున్నాడు. యథార్థ మంతయేగదా!(Galilio) గెలీలియో (Copernicus) కోపర్నికస్ మొదలగు ఖగోళశాస్త్రజ్ఞులు సూర్యునిచుట్టు గ్రహములు తిరుగుట కనిపెట్టియుండిరి.

కాని గ్రహములు తమంతట తాము గమనింపక ఆదిత్యునిచుట్టు ఏలతిరుగవలెను? సూర్యునిలోని ఆకర్షణశక్తికారణమని వారు తృప్తి నొంద, పెద్దగ్రహముల పరిసరముల నొక శక్తియుండి తనచుట్టుగల వాతావరణమును వర్తులాకారముగ వంగదీయు ననియు నందుచే చిన్నగ్రహములు పెద్దవానిచుట్టు తిరుగుచున్న వనియు (Einstien) ఐన్‌స్టైన్ సిద్ధాంతము. (Gravity) గురుత్వ Law of Relativity రెలటివిటీసిద్ధాంతములకు రెంటికిని, పెద్దగ్రహ మునగల శక్తి సామాన్యమే. ఆశక్తి ఎందుకుండవలెను! అంతియు గాక అసలు యీగ్రహములందు చలనశక్తి ఎందు కేర్పడినది? ఎవరివలన సంభవము! అనువిషయములు ఇఁకను అనిర్ధారిత ములే. మరల నీసర్వగ్రహములకు ఆధారమై అణువు నందం తర్గతమై యొప్పు (Electron, Proton, Nutrons) ఎలెక్ట్రాన్ ప్రోటాన్, న్యూట్రాన్ శక్తి బీజములు, వాని లక్షణములే లేని (Cosmic showers) కాస్మిక్ షవర్స్ నాబడు వానినుండి ఎట్లు ద్భవము? ఎందులకు? ఈ కాస్మిక్ షవర్సు గ్రహమండలాంత రాళమునుండి కాంతివేగమున అనగా సెకండునకు 1,86,300 మైళ్లు వేగముగ నెందులకు పర్వోత్తవలెను? అవి ఎవముండి ఉద్భవము? (It is still one of unsolved riddles of science) 35 అది యింకను శాస్త్రజ్ఞుల కనిర్ధారితసమస్య అని ప్రఖ్యాతరచ యిత (George Gamow) జార్జి గమా స్పష్టపరచియున్నాడు. మరియు నీ ప్రోటాన్ న్యూట్రానులు ఏకమయి (Nuclie) న్యూక్లి యనగుచు అగోచరశక్తిచే స్నేహమునుండ తద్విరుద్ధశక్తిగల ఎలక్ట్రానులు కొన్ని దాని చుట్టును, గ్రహములు ఆదిత్యుని

35. George Gamow; One Two Three - - Infinity p 152

చుట్టు, తిరుగునట్లు ఆశ్చర్యకరముగ నదే విధానమున, దిరుగు చుండుట ఏల? వాని మధ్యనున్న (Cohesive forces) అనబడు పరస్పరాపేక్షిక శక్తి ఏది? ఎందుకు! అందున్నట్లు ఆంగ్లశాస్త్రజ్ఞుడగు (J. J. Thomson) జె. జె. థామ్సనుచే గ్రహింపబడిన ఎలెక్ట్రిక్ శక్తి ఎక్కడిది? దానికి కారణ మేది? మరియు తేజోప్రసారమునకు కారణమని తెలుపబడుచున్న (Light ether) కాంతిప్రసరణ కారణాకాశము (which so far had nothing but the name) నామమాత్రావశిష్టమై సామాన్య పదార్థ లక్షణదూరమై యుండి శాస్త్రజ్ఞులకు సమస్యయైయున్నది. అందు ప్రస్తుతము నిర్వచింపబడు అణునిర్మాణముగూడ అభావము. ఆ అనిర్వచనీయ తత్త్వమును (Space) అంతరాళ మనుచు శాస్త్రజ్ఞులు తృప్తి నొందిరి. అదే విధమున, ఈ సూక్ష్మయనుల నుండి (Cells) సెల్సు అనబడుచున్న జీవకణము లెట్లు జనితము? అచేతనమునుండి చేతనము సంభవమా? చేతనము అచేతనమున అంతరమా? ఆజీవకణములలో ప్రథమతః లేని లింగభేదరూప (Chromosomes) క్రోమోసోములు ఎట్లు గలిగెను? వాని కారణమేది? ఆజీవకణమునకు అశన, పరిణామ, సంఖ్యాభివృద్ధి శక్తులు ఎట్లు గలిగెను?

ఇట్లు మనము విచారించుచున్నచో, (Science) భౌతిక విజ్ఞానశాస్త్రము అడుగడుగునకు తనయశక్తతను తెలిసికొనుచు, అయినను ధైర్యమున ఆయారహస్యముల గ్రహింప యత్నించుచున్నది, కాని దాని యత్నము పదార్థముల (Why?) ఎందుకు? అను విషయ పరిశీలనముపైగాక, (How?) ఎట్లు? అను విషయముపైననే తన చాతుర్యమును ప్రసరించుచుండుటచేత జీవిత

రహస్యజ్ఞానమున కశక్తమై యొప్పారుచున్నది. కర్తృత్వ భోక్తృత్వ అహంకార మమకారాది లక్షణములతో గూడి యున్న జీవతత్త్వము నెఱుంగ నేరక (Science ignored the ultimate purposes and looked at the fact alone - Science had told us nothing about the purpose in life)36 భౌతిక విజ్ఞానశాస్త్రము పరమాదర్శముల లక్ష్యముంచక, యథాతథవిషయమునే గాంచజూచును. జీవనోద్దేశమును గూర్చి యది ఏమియు తెలుపలేదు అనియు, (Perhaps Science has been too narrow in its approach to life, and has ignored many vital aspects in it)37 బహుశః భౌతిక విజ్ఞానశాస్త్రము జీవనస్థితుల సంకుచితము జేసియుండును. కాన జీవనమున ననేక ముఖ్యవిషయముల నది గ్రహింపజాలకుండె నని నెహ్రూ పండితుడు వచించియున్నాడు. అందుచే మన యింద్రియములచే గ్రహింపబడినదిమాత్రమే జీవితపరమార్థము కాకపోవుటచేత, భౌతిక విజ్ఞానశాస్త్రము భౌతికవిషయజ్ఞానముననే సంతుష్టయై నిలచిపోవుటచేత ప్రపంచమున సుఖజీవిత విధానమునకు అది దూరమై యున్నదని చెప్పనగును. అందుచేత (Indeed culture can achieve its true aim only when it conduces to the growth of man into his higher possibilities, when all his expressions converge towards a greater than his present life in the Ignorance)38 సత్యమునకు, ఎప్పుడు తనప్రస్తుత అజ్ఞజీవితముకంటె నున్నతస్థితికొరకై

36. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 440
37. Do Do p 144
38. Sirish Kumar Mitra: The Vision of India p 283

తన సర్వప్రవృత్తులు ఏకీభూతములగునో, ఎప్పుడు తనయుత్కృష్టావకాశములకొరకు మానవాభివృద్ధికి అవకాశములుండునో, అప్పుడే సంస్కృతియొక్క పరమాదర్శము యీడేరి నట్లగును. అట్టిది భౌతికశాస్త్రమున కానరాదుగదా!

---

## తత్త్వజ్ఞాన ఆవశ్యకత

మరియు నెంత భౌతికశాస్త్రసహాయ జనితసుఖముల ప్రపంచమున మనము పెంపొందింప జేసినను, మృత్యువు, అకస్మాత్సంఘటనలు, దోషము, అనిత్యత, క్షణికత్వములనబడు (Ultimate Situations) 39 మానవాతీత సంఘటనలు మనల వెన్నంటుచు, మనయశక్తతను ప్రకటించుచున్నవిగదా! వాని నుండి తప్పించుకొనుటకు తెరవు లేదుగదా! వాని పరిశీలించి అతీతించుటకై యత్నించుటయేగదా తత్త్వార్థదృష్టి? అందు చేతనే బాహ్యమునకు బంగారువంటి ప్రపంచమునగల జీవదుఃఖమును దిలకించి, (If all the mountains were books and all the lakes ink and all the trees pens, still they would not suffice to dipict the misery) 40 పర్వతములన్నియు గ్రంథములై, సరములన్నియు సిరాయగుచు, వృక్షములన్నియు కలములైనను ప్రపంచమునగల దుఃఖమును వర్ణింప నసాధ్యమని Jacob Boehme జాకోబ్ బొహ్మెయను అనుభవవేత్త

39. Karl Jaspares: Way of Wisdom p 19

నుడివియున్నాడు. ప్రపంచగత దుఃఖము నారసి, తారణోపాయ మునకై సర్వము త్యజించి జగతి నుద్ధరించిన గౌతమ బుద్ధుడు గూడ (Running from birth to death, from death to birth we have shed, on this long way, truly more tears than water contained within the four great oceans) 40 జననము నుండి మృత్యువునకును, మృత్యువునుండి జన్మమునకును పర్వెడుచు, సుదీర్ఘమగు నీ యాత్రలో చతుస్సముద్రములగల నీటికంటె అధికమగు అశ్రుధారల యథార్థముగ మనము విడిచి యున్నామని వచించియున్నాడు.

ప్రపంచ యథార్థతను గమనించిన ప్రాచీన భారతీయ ఋషివరేణ్యులు, అందుచే, నీభౌతికప్రపంచముపై నాధారపడక, (Though we may be week and erring mortals, living a brief and uncertain span of life, yet there is something of the stuff of the immortal God in us) 41 మనము దుర్బలులమై దుష్టులమై అల్పమును అనిర్ధారితమును అగు జీవితమును గడుపుచున్నను, మనలో అమృత భగవత్తత్వ మొండు యిమిడి యున్నదని నెహ్రూ పండితు డన్నట్లు గుర్తెరింగి, (There is infinitely worthier subject - than all these trees and stones and even all these stars; there is the mind of man. What is man, and what can he become?) 42 చెట్లు పుట్టలు నక్షత్రములు మొదలగు విషయములకంటె అత్యుత్కృష్టవిషయ మొండు గలదు. మానవుని మనస్సు గలదు

40. Gautama Buddha: Samyukta Nikaya.
41. Pandit Jawaharlal Nehru: The Discovery of India p 484
42. Will Dnrant; The Story of Philosophy p 6

గదా! మానవు డెవడు, అతడేమి కాగలడు అను విషయములు యోచనార్హములను (Socrates) సోక్రటీసు కంటె ముందే గ్రహించి, భౌతికశాస్త్ర పరమావధియే తత్త్వశాస్త్రమను రహస్యమును తెలిసి, 'భోగాయతనం శరీరం'(న్యా•సూ•1.1.9) భోగమున కధిష్ఠానము శరీరమనియు, అది లేకున్న జగత్తే లేద నియు, కాని 'దేహో దేవాలయ ప్రోక్తో' అను శ్రుతివచన విధానమున నది జీవునకు ఆశ్రయ స్థానమనియు, ఆశ్రయ ఆశ్రయీభావసంబంధమున వాని కన్యత్వము గోచరింప, తీవ్ర జిజ్ఞాసాపరులై, 'న ఖలు నిత్యం కించిజ్జాయతే మ్రియతే వా' (న్యా. సూ. 4 1.7)జనించునది మరణించునది నిత్యము కాకుండు టచే పుట్టుచు గిట్టుచున్న సర్వదృశ్య పదార్థములు నశ్వరము లనియు, 'తత్రాత్మా సర్వస్య ద్రష్టా సర్వస్య భోక్తా సర్వజ్ఞః సర్వానుభావీ' (న్యా•సూ•1.1.9వా)ఆత్మయే సర్వదృక్ భోక్త్రాది లక్షణలక్షితుడైన చేతనుడని గుర్తెరింగి తరించి, అజ్ఞమానవుల గూడ ప్రబోధించియుండిరి.

---

## తత్త్వజ్ఞానము : మతానుష్ఠానము

అయినను శుష్కతత్త్వవిచారణమునకాలముగడుపనొల్లక (Philosophy is the study of the nature of experience as a whole) 43 తత్త్వశాస్త్రమన సంపూర్ణ అనుభవతత్త్వ విచారణమే యగుటచే (Mainly all enlightened life led with

43. John S. Mackanzec: A Manual of Ethics p 23

far-sight, fore-sight, and in-sight) 44 అది ముఖ్యముగా దూరదృష్టి ఊర్ధ్వదృష్టి, అంతర్దృష్టులతో గూడిన దివ్యజీవన విధానమే యగుటచేతను, దాని మూలముననే (Self comprehension of Reality) 45 పరమార్థతత్త్వము స్వస్వరూపముగ వ్యక్తమగును గావునను, దాని నాశ్రయించి, తమ నిత్యజీవితములలో సమన్వయించిరి. ఈశ్వరునుగూర్చి మన కెట్టిభావనము తాత్త్వికముగ నున్నను, అది మన నిత్యజీవితములో ప్రతిబింబింపకపోయినచో నది వ్యర్థమేగదా? అట్టి సమన్వయమే అనగా తత్త్వార్థముల బోధించు తత్త్వశాస్త్రమునకును, తత్త్వార్థముల ననుభవింపజేయు అనుష్ఠానమగు మతజీవితమునకును సంపూర్ణ ఐక్యత ఏర్పడిననే మానవలోక వికాసము. అదియే పరమార్థ ప్రకాశము. అందుచేతనే, భౌతికవిజ్ఞానముకంటె, తత్త్వశాస్త్రము బలీయము, దానికంటె అనుభవమును ప్రసాదించు మతము ముఖ్యము. (of all the forces that have worked and are still working to mould the destinies of the human races, none certainly, is more potent than that manifestation which we call religion) 46 మానవ అవధుల నిర్మించియున్న నిర్మించుచున్న సర్వేతరశక్తులలో మతముకంటె ప్రత్యక్షమై శక్తివంతమగునది ఏద్దియు లేదు అని వివేకానందుడు వచించెను. కాని పూర్వోక్తచందము భౌతిక విజ్ఞాన శాస్త్రము అసలు ముఖ్యవిషయముల విస్మ

---

44. Satischamdra Chatterjee:An Introduction to Indian Philosophy p 15
45. J. N. Mukharjee: Sankhya
46. Swami Vivekananda: The Complete Works Vol 2 p 57

రింప, తత్త్వశాస్త్రము వాని విచారించుచు, నొకానొక కాలమున శుష్కమై జీవితము ననుసంధింప కుండెను. మతములు నిత్యజీవిత పద్ధతుల నియమించి, తత్త్వార్థముల ననుసంధించి, మానవానీకమును సంఘటితపరచియున్నను, ఒకానొకచో, పాషండముగ రూపొందియున్నవి. కాని తత్త్వశాస్త్ర, మతములు బాహ్య విషయదూరములగుటచే నందు దోషములు సులభసంస్కరణీయములే యగుచున్నవి. ఆద్వయమే మానవాళికి మహాసభ్యతల సృజించి, వర్ధిల్ల జేసెను. కేవల అంతర్దృష్టి జనిత ఆత్మానంద సంపదల సూఱుటయేగాక, బాహ్యదృష్టి గలిగి అజ్ఞమానవలోకమునకు పవిత్ర సాంఘిక జీవిత విధానమును బోధించి, బ్రహ్మపథమునకు దారిచూపెను. కాన ప్రపంచ శాంతి సౌఖ్యములకు భౌతికవిజ్ఞానశాస్త్రము కంటె ధార్మికజీవిత ప్రబోధ గావించు తత్త్వశాస్త్ర మతజీవితములే ముఖ్యకారణములని చెప్పకయే చాటుచున్నవి. కావున మానవకళ్యాణమును కాంక్షించు భారతమాత పూర్వోక్తచందము భౌతిక జీవనవిధానమున కవసరమగు విజ్ఞానములకొరకు కృషిసల్పి పొంది అనేకవిధముల బ్రపంచమున కుపయుక్తమై యున్నను, వీని కన్నింటికంటె అత్యంతావసరమగు నైతికాధ్యాత్మికజీవనములకే అధికతర ప్రాధాన్యత నొసంగి సర్వప్రపంచమునకు శ్రేయోమార్గ ప్రబోధకురాలై అతిప్రాచీన కాలమునుండి విరాజిల్లుచుండుట సర్వజనవిదితము. కాన హిందూసంప్రదాయ సంస్కృతులు స్థూలమగు బాహ్యప్రపంచ విషయ సుఖాన్వేషణాయుక్తముగాక అతిసూక్ష్మ అంతఃప్రపంచగత అవ్యయానంద అన్వేషణములో మునిగియున్నవని

గ్రాహ్యము. కాన వివేకానందుని వాక్యములలో (Here first sprang up inquiries into the nature of man and into the internal world) 47 ప్రథమతః యిచ్చటనే మానవతత్త్వము అంతః ప్రపంచముల గూర్చి అన్వేషణము లుద్భవించియున్నవి. ఏతద్రహస్యము ను గుర్తించి, గ్రహించి, అనుసరించి, ఆనందించి, ఆమార్గమున 'క్రిణ్వంతు విశ్వం ఆర్యం' అను సూక్తి ననుసరించి సర్వప్రపంచమును ఆర్యభూమిగ అనగ ధార్మికభూమిగ పరిణమింపజేయ సర్వులు బద్ధకంకణహస్తు లగుదురు గాక!



ప్రబోధ

అంతియగాక, అనాది కాలమునుండి భారత దేశమునకు ఆధ్యాత్మికజీవితమే జీవిత పరమార్థముగాన, జన్మతః యగుదెంచు స్వభావమును మార్చుకొనుట మానవునకు ఎంత దుర్లభమో అటులే దేశస్వభావమునుమార్చుకొనుట అంతకష్టసాధ్యమై వివేకానందవచనములలో (give it up and you die) 48 దానిపరిత్యాగము ఆత్మహత్యా పరిణామము నొందుట యనిగుర్తెరింగి, (It is feared that even this small ramnent of philosophical learning will vanish in one or two generations, as the youths of the day, do not take to those studies) 49 యువకులు యీ విద్యాభ్యాసము నవలంబింపకుండుటచే ప్రస్తుత

47. Swami Vivekananda: The Complete Works Vol 2 p 57
48. Do. Do. Vol 3 p 285
49. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p xvii

మున్న తత్త్వవిద్యాజ్ఞాన లేశము గూడ నదృశ్యమగునేమో యను భయముగలదను (Max Muller) మాక్సు ముల్లరు హెచ్చరికను హృదయముల సంస్థాపించి, (Europe is today turning towards India in her search for a saner and surer attitude of life and humanity than that which has brought her to the brink of ruin)[50] తనను విధ్వంస సమ్ముఖమునకు గొనివచ్చిన జీవిత విధానముకంటె, సరసమును, స్థిరమును అయిన జీవితము నన్వేషించుచు, యూరోపు దేశము భారత దేశముపై దృష్టుల బ్రసరించి చూచుచున్నదను (Cousins) కజిన్సు. పలుకుల నాలకించి, (to bring new life and new vitality to the Western and other nations, which are now almost borne down half killed and degraded by political ambitions and social scheming)[51] రాజకీయ కాంక్షలచేతను, సాంఘిక వ్యూహములచేతను పతితమై చాల వరకు మరణోన్ముఖమై యున్న పాశ్చాత్య దేశములకును యితర ప్రపంచమునకును నూత్నశక్తిని, వినూత్నజీవనవిధానమును గలిగింప, భారతీయు లెల్లరు నడుములు బిగింపవలయును. అందులకై (A nation cannot be strong unless it believes in God) భగవద్విశ్వాస మున్న గాని దేశము బలవంతము కాజాలదను (Plato) ప్లేటో పలుకుల విధాన, అనాదికాలము నుండి ఆధ్యాత్మిక కృషిసల్పి, (There is no study so elevating - - as that of the Upanishads)[51] ఉపనిషత్తులవంటి

---

50. Dr. James H. Cousins: Oriental Culture and World Renaissance

51. Arthur Schoupenhaur

దివ్యమైన అధ్యయనము వేరొండు లేదని ప్రశస్తిగాంచిన యుప నిషత్తులను; (The six systems in which the philosophical thought of India has found its full realisation) 52 షడ్దర్శనములలో భారతీయాధ్యాత్మికవిజ్ఞానము పూర్ణసిద్ధిని గాంచిన దని కీర్తిగడించిన దర్శనశాస్త్రములను. మరే యితర దేశ ములకైన నభావమైన పురాణేతిహాస ధార్మికసాహిత్యసంపదను గలిగి సర్వాంగసుందరియై యలరారు భారతిని సర్వాధ్యాత్మిక సింహాసనమున పట్టాభిషేకము గావింప, యత్నింతము గాక! (The Indian who has lost his Indian soul much regain it) తనభారతీయత్వమును గోల్పోయిన భారతీయుడు జాతీయతను పునః సంపాదించి, కోల్పోవనివాడు దాని నభివృద్ధిగావించి పున రుద్ధరించెదముగాక!

(Therefore, my friends, the way out is, that first and fore-most work, we must keep firm hold on spirituality that inestimable gift handed down to us by our ancient fore-fathers) 53 అందుచేత, సోదరులారా, మనప్రాచీన పితృవర్యులచే పరంపరాగతముగ బహూకరింపబడిన అమూల్య సంపత్తు అగు ఆధ్యాత్మిక జీవితవిధానమును మనము గట్టిగా నంటిపెట్టుకొనుటయే ముఖ్యాతిముఖ్య మార్గము,

అట్లు గావించి 'స్వయంతీర్ణః పరాం తారయతి' తాము తరించి యితరుల దరింపజేయు సమర్థతను ఆర్జించి మన ప్రాచీన

---

52. Sir John Woodroffe: Shakti and Shakta p 37
53. Swami Vivekananda: The Complete Works Vol 2 p 153

ఋషివరేణ్యులను మన ఋణవిముక్తి గావించి, ఆర్యులమని గర్వించెదము గాక! ఆనందించెదము గాక!

---

## సర్వ సిద్ధాంత సౌరభము

సర్వతోముఖ ఆధ్యాత్మికాభివృద్ధికి సమరస సాధన ఎంత యవసరమో, అంత నిష్పాక్షిక సిద్ధాంతజ్ఞానమును అవసరమే యగుచున్నది. కాని సర్వసాధారణముగా నెల్లరు ప్రథమవిషయమునకు మాత్రమే ప్రాధాన్యత నొసంగుచు, ద్వితీయమునందు వారికి లక్ష్యశుద్ధిలోపించుటచే, అనుష్ఠానపరుల సాధన సక్రమమై యొప్పారినను, విశాలదృక్పథము అభావమై పాషండత్వమునకు దారితీసి, పరమత సిద్ధాంతఖండనాది దుస్సంఘటనలకు అవకాశ మేర్పడుచున్నది. అందుచే సర్వసిద్ధాంత జ్ఞానము సాధ్యమగునంతవరకు అవసరమై వాని సమన్వయబుద్ధి అత్యావసరమగుచున్నది. అట్లున్నగాని మతజీవనము సమరసమై సుఖకరమై అభివృద్ధిదాయకమై యొప్పారదు. మరియు, సిద్ధాంతపాఠము ఎంత ముఖ్యమో, ఆసిద్ధాంత ప్రతిపాదకుని చరితా విశేషములును, అనుభవసంపదయునంత ముఖ్యమగుచున్నవి. అత్యుత్తమ సాధనాదులలోని అసాధారణ అనుభవకోటి నీదులాడు మహాత్ముని పలుకు లమోఘ శక్తిసంపన్నములై మనహృదయముల నాటును. ఆసిద్ధాంతము ప్రామాణ్యతను సంపాదింపగల్గును. ముఖ్యముగ మన ఆర్షసంప్రదాయమున సిద్ధాంతము ఎంత ప్రాధాన్యమో, ఆవ్యక్తి జీవితవిశేషములును అంతప్రాధాన్యమే.

కాన సిద్ధాంతపఠనముతో సంస్థాపకవిషయములను అవశ్యపఠ
నీయములు,

అందుచేత సర్వవిధ సాధనాదుల మునింగి, సర్వసమన్వ
యముల గావించి, అనుభవించి, ఆనందించియున్న శ్రీసింగరి
దాస భక్తవరేణ్యుని పౌత్రుడనగను, సత్య నిరాడంబరజీవితమున
ప్రపంచ వ్యవహారదూరుడై, శ్రీరామనామోచ్చారణా తరంగ
వాహినుల మునుగుచు విశాలహృదయుడైన చెన్నకేశవుని
కిని, సరళహృదయ ప్రేమైక స్వరూపిణి ఆదర్శ గృహిణి సరస్వ
తమ్మకు సుతుడనగుటచే నైయుండనోపు, చిన్ననాటనుండి పరం
పరాగత ఆధ్యాత్మికజిజ్ఞాసాపరుడనై రాజిల్లుచు, కాలక్రమమున
సర్వమత సర్వసిద్ధాంత సర్వసాధన సర్వస్వరూపుడైన శ్రీరామ
కృష్ణపరమహంసదేవుని అసమాన దివ్యవాతావరణముచే నాకర్షిం
పబడి, సర్వసమన్వయమున కానందించి, ఆసంప్రదాయమున
తురీయాశ్రమము స్వీకరించి, ఆయవతారవరేణ్యుని యడుగు
జాడల ననుగమించుచు నుండువాడను. కాన విశాలదృష్టి
లోపించిన సంఘమున ఏదైన నిసుమంత సేవ గావింప కోర్కె
జనించి, బాపట్ల, భీమునిపట్టణములలో రెండు ఆశ్రమముల నెల
కొల్పి వాని కేంద్రములుగా నొక గ్రంథమాలను గూడ స్థాపించి,
నాకోర్కెనీడేర్ప యత్నించు సాధకుడను. ఈశ్వరానుగ్రహ
విశేషమున నింతవరకు కొన్ని ప్రచురణములు అందు వెలువడి
ఆంధ్రమునకేగాక, యితరరాష్ట్రములగూడ నవి వ్యాప్తములై
ప్రజానీక హృదయమున స్థానము సంపాదించుకొని నందులకు
ఆనందించు సేవకుడను.

ప్రస్తుతమునకు నారచనములలో నీసర్వసిద్ధాంత సౌరభమే యుద్గ్రంథము. అది హైందవ సాంప్రదాయిక సిద్ధాంతములన్నిటిచే వాని కర్తల ప్రాపకుల విశేషములతో గూడ అలంకృతమైయుండుటచేతను, అయినను అది సమగ్రముగాక, ఆయా మహాపురుషుల గూర్చియేమి, సిద్ధాంత సాధనల గూర్చియేమి క్లుప్తముగ సూచించుచు, పూర్తి జ్ఞానమునకు యితర యుద్గ్రంథములకును, అంతకు మించు మహర్షి ప్రోక్త గ్రంథావళిని సూచించుచు, మన భారతీయ విజ్ఞానకుసుమశ్రేణియొక్క పరిమళమును మాత్రమే పాఠకులకు అందజేయుచు, ఆకుసుమరాజముల దర్శన సంపాదన అనుభవ ఆనందములకు పాఠకుల ప్రోత్సహించునది యగుటచే సౌరభ నామమును గలిగి, 'సర్వసిద్ధాంత సౌరభము' అని బరగుచున్నది. సాధ్యమగు నంతవరకు భారతీయ సాంప్రదాయిక సిద్ధాంతముల నన్నిటిని స్థూలారుంధతీ న్యాయమున స్థూలముగ సూచించు విధానమునకు గడంగుట దీని ధర్మమై యున్నది.

ఆదర్శ ముత్తమమై యున్నను, దాని సువ్యక్తముగావింప శక్తిసామర్థ్యములు కర్త కుండవలెను. అట్టి యర్హతలు నాకు కొంత లోపించి యున్నను, రచన కాధారములు నాకు సుదూరములైయున్నను, అట్టిరచనమునకు యత్నింపవలయునను పట్టుదలయే ముఖ్యయర్హతగ దలంచి, యీ యుద్గ్రంథరచనకు బూనుకొంటిని. ఇది సంపూర్ణము కాకుంటచేతను, అనేకస్థలముల అనేక విధముల దోషములు దొర్లియుండ నవకాశము లుండుట చేతను చిన్ని యీ నా కృషి సమర్థులగు వారిని

ప్రోత్సహించి, నిర్దుష్టగ్రంథరచనమునకు మార్గదర్శియగునుగదా యను అభిలాషయు నా యుద్యమమునకు కారణము.

ఈగ్రంథ రచనమున, సిద్ధాంత వివరణముననూ, ఆయా కర్తల విషయ వివరణముననూ, ప్రాక్ప్రతీచీ పండితవర్గముచే రచింపబడిన అసంఖ్యాక గ్రంథములు నాకుఁదోడ్పడినవి. సిద్ధాంత భాగమెట్లున్నను సిద్ధాంతులగు మహర్షుల పుట్టు పూర్వోత్తరముల విషయములు, వివరణగ్రంథములు మనకు లోపించుట చేతను; ఆయా మహర్షులే గాక, తర్వాత వారుగూడ చరితా కథన విధానమునకు ఇచ్ఛలేనివారై సరియగు విషయముల నొసంగకుండుటచే; నిరాడంబరత్వమే ప్రధానమై ఉద్గ్రంథముల రచించుటతో తృప్తిగాంచి, వానికి తమనామములనైన అనుసంధింప నొల్లని త్యాగస్వరూపులగుటచే, వారి జీవిత విశేషముల కాలనిర్ణయముల అనుభవ విభూతుల గ్రహించి యానందింప నుత్సహించు అనేక సాధకలోకమునకు ఆశాభంగము గలుగును. అంతియగాక వాని నిర్ణయింపయత్నించు ఆధునిక పండితలోకమున అగణిత విభిన్నమార్గములకు అవకాశమిచ్చి, ఉన్న సమస్యల నధికము గావించి, జిజ్ఞాసాపరుల కెక్కువ మనస్తాపమునకు గారణమగుచున్నది. అందుచే నీగ్రంథము అట్టి చర్చలగూడ సప్రమాణముగ గొంత చర్చించి ఆర్షమతానుసారముగ నొక తీర్మానము నూహించి నిశ్చయింప యత్నించి యున్నది. కాన విమర్శాగ్రేసరుల గ్రంథములనుండి అనేక ఆంగ్ల ప్రమాణములు గ్రంథమునఁ గాననగును. అయినను వెంటనే ఆంధ్ర అనువాద ముండుటచే ఆంగ్ల భాషా జ్ఞానలోపము గల వారి కేకష్టమును ఉండబోదు. ఇట్టి విమర్శావిధానమునకు నాకు

అత్యంతోపయుక్త రచయితల కందరికి నాకృతజ్ఞతను వెలిబుచ్చుచున్నాను.

మరియు నీరచనమునందు, పాక్షికభావములకును, ఖండనములకును చోటు నివ్వక, ఆయా సిద్ధాంతావలంబకులు తమతమ మతముల నెట్లు గ్రహించి వివరించియుండిరో, ఆదే విధానము; సర్వదర్శనములకు వ్యాఖ్యానములు విరచించి విశాల దృష్టికాదర్శమును ప్రకటించి ఆధ్యాత్మికసాహిత్యమునకు మహోపకారియైన వాచస్పతిమిశ్రులను, సర్వ విధాధ్యాత్మిక సాధనానుష్ఠాన నిరతి నాయా మార్గములగల అనుభవానంద పెన్నిధిని గడించి ప్రపంచతరుణోపాయముగ చాటియున్న శ్రీరామకృష్ణ దేవుని ఆదర్శమూర్తులనుగా గైకొని యీరచనమునకు గడంగి యుంటిని. కాన ఆసిద్ధాంతముల సమర్థించుచు నందలి శ్రేష్ఠత్వముపైననే దృష్టినుంచి లోపముల సరకుసేయకుండుట యీగ్రంథమునందలి విశిష్టత. అంతియగాక విశాలదృష్టి బరికించుచో నొక్కొక్క సిద్ధాంతము పరవాదముల గోచరించు కొన్నిదోషముల దొలగింప యత్నించి నూత్నదోషముల కల్పించుటయు గాననగును. మరియు, కేవలము బుద్ధికి ప్రాధాన్యత నొసంగి వాదముల బరిశీలించుచో ననేకదోషములందు బొడకట్టినట్లుండును, గాని సాధన కధిష్ఠానమైన హృదయమునకే ప్రాధాన్యత నొసంగుచో నాయామతములగల లోపములుగాక, వాని యుత్కృష్టతయే గోచరించును. ఆకారణమున కేవలము విమర్శాబుద్ధిగల పండితులకొరకు గాక వివిధ సిద్ధాంత రహస్యముల గ్రహింప నుత్సహించు సాధకలోకముకొరకై యిది రచింపబడుటయు ముఖ్యతాత్పర్యము. అందుచే 'సౌరభము' సర్వ

మతావలంబకుల కవశ్యపఠనీయమై విశాలదృక్పథ సంపాదన మునకు దోహదమిచ్చుచు సర్వ సమన్వయకార్యమున కుప యుక్తమగునని దృఢవిశ్వాసము, ఈయుద్గ్రంథమును 1939 సంవత్సరమున నధికభాగమును రచించియుంటిని. కాని ప్రచు రింప సంకల్పము లేకుండుటచే నది యింతకాలము విశ్రమించి, అనేక మిత్రుల ప్రోత్సాహముచే నేటికి వెలువడుచున్నందుల కెంతయు సంతసించుచున్నాడను.

సౌరభగ్రంథము ముఖ్యముగ షట్భాగముల చెల్వొం దును. అందు, సర్వమానవాళికి ఆధ్యాత్మిక వికాసమునకు తత్త్వ శాస్త్ర ప్రదాన మొసంగియున్న షడ్దర్శనములు ప్రథమఖండ మున చర్చింపబడెను. ప్రఖ్యాత ఆచార్యుడైన మాధవుడు దర్శ నముల షోడశకముగ విభజించి వాని వేదాంతదృష్టి నమర్చి చార్వాక, బౌద్ధ, జైన, రామానుజ, మాధ్వ, పాశుపత, శైవ, ప్రత్యభిజ్ఞ, రసేశ్వర, వైశేషిక, న్యాయ, మీమాంస, వ్యాకరణ, సాంఖ్య, యోగ, వేదాంతములుగ క్రోడీకరించి చర్చించియున్నాడు. కాని యీషోడశకము, సాంఖ్య యోగ, న్యాయ వైశేషిక, మీమాంస వేదాంతము నాబడు షట్కమున నంతర్గతము. కాన ప్రథమమున వాని గ్రహించి, వాని నుండి జనించిన యితర మతముల దర్వాత గ్రహింప యత్నిం చుట సముచితము.

ఋగ్వేదాది శాస్త్రముల యందంతర్గతమై యుపనిష త్తుల ప్రస్ఫుటముగ బహిర్గతమై పండితజన ఆశ్రయమై, అపర శివావతారమని కీర్తిగడించియున్న శ్రీశంకరభగవత్పాదప్రతిపా దిత అద్వైతవాదము ద్వితీయ ఖండముగ గ్రహింపబడెను, ఇందు

వాభ్యుదయమునకు గారణమగువానికి బ్రాధాన్యము నొసంగి, అప్రాధాన్యముల విసర్జించుట సమంజసము. అంతియగాక వ్యక్తి గత, వర్ణగత, జాతిగత, దేశగత ఆచార వ్యవహారముల, సర్వ సామాన్యమొనరింపబూనుట యసమంజసము. అందులకు మిక్కిలి జాగ్రత్త అవసరము. వ్యర్థములైన ఆచారనుల విసర్జించినందు వలన సంస్కృతీ ప్రవర్ధమానమునకెట్టి లోటును ఏర్పడదని భావము. ఈ విధముగ భారతీయ సంస్కృతీ సంపూర్ణ స్వరూప మును గ్రహించి, యనుసరించి, ఆనందింప, బెద్ద యాటంక ములవోలె గోచరించు భాష, వర్ణ, ఆచారములు యథార్థమున యాటంకములుగాక, దాని సమగ్ర స్వరూప గ్రహణమునకు దోడ్పడు ఆవశ్యక శక్తులై యొప్పారునని గ్రహింపగలముగాక. వాని ప్రస్తుత ప్రయోజనము లెట్లున్నను, పూర్వమున భారతీయ సంస్కృతీ యవలంబనము, అభివృద్ధి, గమ్యముల గమనింప, నవి బహుళముగ శక్తిమంతముగ దోడ్పడుటయందెట్టి సంశయ మనావశ్యకము. కాని వాని నేటికిని నభివృద్ధి నొందించి, అవలం బించుట విచారణీయము. ఎట్టులైనను వాని యథాతథముగ స్వీకరింప నవకాశములేకున్నను, వానిలో గల యుత్కృష్ట విష యము, మానవాభ్యుదయకారణ సూత్రముల గ్రహించి, ప్రజా నీకమున జొప్పించి, అనుష్ఠింప నవకాశమొసంగుట సారగ్రహణ పారీణుల ముఖ్య కర్తవ్యము. లేకున్న in the process of cleaning the house the gold goes with the dust [51] గృహమును శుభ్రపరచు కార్యమున దుమ్ము ధూళితో బంగారముగూడ జారిపోవును.

---

51. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 195

## దర్శన ఖండము

పూర్వోక్తఖండము దర్శన ఖండము. కపిలమహర్షి ప్రోక్తమగు సాంఖ్యము, పతంజలి మునివరనిర్మిత యోగము, గౌతమ మునీంద్రస్థాపిత న్యాయము, కణాద సంయమీంద్రరచిత వైశేషికము, జైమిని మునివరేణ్యరచిత పూర్వమీమాంస, వ్యాసభగవానుని వేదాంతముతోడను అలంకృతము. ఈదర్శన షట్కము, సూక్ష్మదృష్టికి మరల సాంఖ్య యోగ, న్యాయ వైశేషిక పూర్ణ మీమాంసలుగా త్రయమే యగుచున్నవి. సిద్ధాంతమునకుగూడ ఆద్వయములకు సామాన్యత్వమధికముగ గోచరించును. సాంఖ్యము ముఖ్యముగ ప్రకృతిపరిణామమును బోధించుచు, పురుషకైవల్య విధానమును స్థూలముగ వివరింప; యోగము నాసిద్ధాంతమును స్థూలముగ గైకొనుచు, మానసిక పరిణామమునకు ప్రాధాన్యత నొసంగి సాధనావిధానమును వివరించి, కైవల్యప్రాప్తికి సహకారి యగుచున్నది. వైశేషికము నవద్రవ్యములతో సప్తపదార్థముల వివరించుచు, సృష్టికి కారణమైన అణువాదమును ప్రతిపాదింప; ఆవాదము నేగ్రహించి, సిద్ధాంత స్థాపనమున కవసరమగు స్వపక్షప్రతిపాదన ప్రతిపక్షఖండన మొదలగు తర్కరహస్యముల బోధించి మతస్థాపనమునకు న్యాయము సహకారి యగుచున్నది. మీమాంసము జీవుని దృష్టి ఐహికమునుండి పరమునకు మరల్చి, జీవితమును నియమబద్ధ మొనరించి, నిష్కామ్యతను ధర్మమును నుద్ధరించి, ఈశ్వరాస్తికతను బోధింప; వేదాంతము దాని స్వీకరించి, జీవుని కర్మనుండి రక్షించి భక్తి జ్ఞాన వైరాగ్యముల నవలంబింపజేసి

బ్రహ్మప్రాప్తికి దారి జూపియున్నది. అందుచే సౌరభగ్రంథము దర్శనముల నారెండు రెండుగనే స్వీకరించి వివరింప యత్నించి యున్నది.



## ప్రథమ భాగము

దర్శనముల వివరించు తత్త్వజ్ఞులు, తత్త్వచారిత్రకులు సర్వసామాన్యముగా నీదర్శనములయందుగల తత్త్వవిషయములనే ప్రధానముగ గైకొని, భౌతికవిషయముల బోధించు గావున, న్యాయ వైశేషికముల ప్రథమమునను, మానసిక పరిణామాది రహస్యముల బోధించు సాంఖ్య యోగముల ద్వితీయముగను, ఆధ్యాత్మిక తత్త్వముల బోధించు మీమాంసాద్వయమును తృతీయముగను విచారించుచుందురు. కాని విషయప్రాధాన్యత ననుసరించి చూచుచో, ఉపనిషత్తులచేగూడస్తుతింపబడి, తర్వాత దర్శనములకు ఖండనార్థము విషయముల అనేక పూర్వపక్షరూపముల నందించిన సాంఖ్యమునకే అగ్రస్థానము నొసంగుట భావ్యము. కాలనిర్ణయము ననుసరించినను స్వాయంభువ మనువు మన్వంతరమున సృష్ట్యాదిన గల తత్త్వశాస్త్రజనకునికి అట్టి ప్రథమస్థాన మిచ్చుటయు సమంజసము. అందుచేత, సౌరభము కపిలసాంఖ్యమునే ప్రథమతః చేబట్టి తత్త్వశాస్త్రమునకు ఆదిగురువైన కపిలాచార్యుని ఋణము తీర్చుకొనినది. సాంఖ్యమును తాత్త్వికముగ స్వీకరించి, కాలదృష్టికి యితరదర్శనములకు తర్వాతది అయినను యోగము సాంఖ్యము నాశ్ర

యుంచి ద్వితీయస్థానము నలంకరించి యున్నది. అదియు సమంజసమే.

అసలు ముఖ్యముగ దర్శనముల బరిశీలించుచో సర్వతత్త్వార్థశాస్త్రము పరిపూర్ణతనొంది యుంచుమించు, విభేదము గోచరించుచున్నను, తత్త్వపరిణామమున ప్రధానములై సర్వాధిష్ఠానమగు ఉపనిషత్తులపైననే దర్శనషట్కము ఆధారపడి యున్నదనుట సర్వవిజ్ఞులకు స్పష్టము.

దర్శనములేగాక సౌరభము వివరింపబోవు అద్వైతాది సమన్వయ ఖండపర్యంత గ్రంథమంతయు నుపనిషత్ప్రతిపాదిత సిద్ధాంతములనే బోధించుచుండుటచే, ఆర్ష సంప్రదాయములుగ గైకొనబడి అవశ్య గౌరవపాత్రములగునుగాక.

కాన సర్వ సిద్ధాంత సౌరభమున గల దశాధికభాగములలో ప్రథమమైన సాంఖ్య యోగ గ్రంథము ప్రధానగ్రంథమై ఆంధ్రభాషాభిమానుల హస్తముల నలంకరించి, అచిరకాలమున మిగిలిన భాగముల నన్నిటి ప్రకటింపజేయుగాక అనియు, దానికై భారతీయాధ్యాత్మిక జిజ్ఞాసాపరులు యీమహత్కార్యమును తమదిగ భావించి చేయూత నొసంగుదురుగాక అనియు ఆశించుచున్నాను.

మంగళం మహత్



# సర్వ సిద్ధాంత సారభము

## దర్శనఖండము

## సాంఖ్య దర్శనము

ఓం.

# సాంఖ్య దర్శనము

## ఉపోద్ఘాతము

### భారత విజ్ఞాన ప్రాశస్త్యము

మం॥ బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।
స బ్రహ్మావిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ॥

ముండకోపనిషత్తు 1,1.

విశ్వకర్తయు భువనపాలకుడును అగు బ్రహ్మ, దేవతలలో ప్రథమమున జనించెను. సర్వవిద్యామూలమగు బ్రహ్మావిద్యను అతడు తన జ్యేష్ఠపుత్రుడగు అథర్వునకుపదేశించెను, అను ముండకశ్రుతివాక్యము బ్రహ్మవిద్యయొక్క శ్రేష్ఠత్వమును,సర్వ విద్యా ప్రతిష్ఠితత్వమును బోధించుచున్నది. దీనినను సరించి యుండనోపు నార్థికశాస్త్రవేత్తయగు కౌటిల్యుడుగూడ (Philosophy is the lamp of all the Sciences)సర్వశాస్త్రము

లకు దత్త్వశాస్త్రము వెలుగువంటిదని వచించియున్నాడు. మరియు(Philosophy is one of the noblest of life's persuits)[1] జీవితాశయములలో దత్త్వజిజ్ఞాస అతి పవిత్రమైనదని(Sir John Woodroffe) సర్ జాన్ వుడ్రాఫ్ అను పాశ్చాత్యతంత్రశాస్త్ర కోవిదుడును, పలికియున్నాడు. ఆకారణముననే (The East is ever bold in search of the mysteries of the internal world)2 అంతఃప్రపంచ రహస్యాన్వేషణములో బ్రాగ్దేశము సదా ధైర్యోపేతమై యొప్పారినదను శ్రీ వివేకానందుని వచనము రీతిగ, (In the infancy of human civilization, India has lit the fire of spirituality)[3] ప్రపంచ విజ్ఞానము శిశుప్రాయమున నున్న కాలమునందే, భరతవర్షము ఆధ్యాత్మికజ్యోతిని వెలిగించి యున్నదని అమెరికాదేశీయుడగు శ్రీ అతులానందుడు నుడివినట్లు, భారతావని ఆధ్యాత్మిక తేజోనిధానమై (Here activity prevailed when even Greece did not exist, when Rome was not thought of, when the very fathers of the modern Europeans lived in forests and painted themselves blue. Even earlier, when history has no record, and tradition dares not peer into the gloom of that intense past, even from there until now, ideas after ideas have marched out from her.)4 గ్రీసు దేశము నెలకొనకపూర్వము, రోమునుగూర్చి తలంపకముందు, ఆధునికయూరోపు దేశీయుల పితృవ్యులు ముఖముల రంగుధరించి అరణ్యముల గ్రు

1. Sir John Woodroffe:- Shakti and Shakta p. 103
2. Swami Vivekananda:- The Compte Works Vol 3 p 459
3. Swami Atulananda:- Indian Civilization V, K. 1935
4. Swam Vivekananda:- The Complete Works Vol 3 p 106

మొసంగిరి. కాని క్రమక్రమముగా దేజోకిరణప్రసార రహస్యము లకై యనేక యత్నముల గావించిన శాస్త్రజ్ఞులు దాని ద్రోసి పుచ్చిరి. And in spite of many attempts, no reasonable mechanical interpretation of the properties of the mysterious carrier of light waves was found possible 62 కాంతితరంగముల బ్రసరింపజేయగల ఆ యవిస్పష్ట వాహకశక్తియొక్క లక్షణముల సకారణ స్థూల వివరణములు ఎంత కృషి చేసినను గానరాకున్నవి అని George Gamow జార్జి గామౌ వ్రాసియున్నాడు. అయినను అట్టిది లేదనుటకు సంపూర్తిగ నవకాశము అలభ్యము. సెకండునకు 1,86,284 మైళ్ళ వేగమున బర్వెత్తు కాంతితరంగములకాధార మెయ్యది యను సమస్య యింకను అనిర్ధారణముగనే శాస్త్రజ్ఞుల మనముల నిలచియున్నది. In fact, the space through which light travels with such ease seems to be completely empty 62 యథార్థముగ, దేజస్సు సునాయాసముగ బ్రసరించుచున్న యంతరాళము, సంపూర్ణముగ శూన్యముగ నున్నది యని వచించినను కాంతిప్రసారము అనుటతోడ బ్రసారమునకవకాశ మొసంగు పదార్థము అవసరమగుచున్నది. శాస్త్రదృష్టికది అగమ్యమైనను యుక్తికది యవసరమగుచున్నది. దానికెట్టి లక్షణములైన అగోచరములు. అందుచే నది యున్నదనిగాని, లేదనిగాని వచించుటకు గష్టసాధ్యమై యొప్పారినది. కావున The nature of light is still one of the fun-

62. Dr. George Gamow : One Two Three—Infinity, p 95.

వర్తమున తత్త్వశాస్త్రము స్వాపేక్షికమై యుండ, సర్వేతర శాస్త్రములు దానినుండి యుత్సాహమును సాహాయమును పొందియున్నవి. కాన (It is the master science guiding other sciences)8 అది అన్యశాస్త్రముల మార్గదర్శియగు సర్వోత్తమ శాస్త్రమైయున్నదని రాధాకృష్ణపండితుడు వచించెను. పై వాక్యముల ననుసరించి యోచించుచో (India's culture is incomparable, being developed thousands of years of trial and experimentation till it attained to the highest standard ever reached by humanity and consequently possessed of an unshakable stability and strength all its own)9 హైందవ విజ్ఞానము అసమానము. మానవకోటిచే బొందబడిన అత్యుత్తమ సంస్థితిని లభింపజేసికొను నంతవరకది సహస్రాధిక సంవత్సరముల సంతత కృషి ఫలితముగా నభివృద్ధి గాంచియున్నది. అందుచే నది స్వతఃసిద్ధమైన సుస్థిరమును అచంచలమును అగు శక్తిని గలిగియున్నదను శ్రీవివేకానందుల వచనములెంతయు సముచితములగుచున్నవి. ఇక (Prof.Garbis) ప్రొఫెసర్ గార్బిస్ మొదలగు పండితులచే (Highly gifted races of mankind) 10 మానవలోకమున అసాధారణప్రజ్ఞానిధులనియు, (we are constrained to bend our knee before the East and to see in the cradle of human race the mature land of highest philosophy)11 మానవలోకమునకు దల్లియగు నీ ప్రాగ్దేశమునకు, ఉత్తమ తత్త్వశాస్త్రమున కాట

9, Swami Vivekananda: The Life Vol 3 p 232
10, Prof Garbis:- The Sankhya Sutras
11. Victor Cousins.

పట్టగు నీ ప్రౌఢకు, మనము తలయొగ్గక తప్పదని (Victor Cousins) విక్టరు కసిన్సు పలుకులలో వందనీయులనియు, (All that we value most has come to us from the East)12 మన కమూల్యములగు విషయములు ఆపూర్వదేశములనుండియే వచ్చినవను (Max Muller) మాక్సు ముల్లరు మొదలగు అసంఖ్యాక ప్రాక్ప్రతీచీ విజ్ఞలోకముచే నారాధింపబడుచున్నది, మన పుణ్యభూమియగు నార్యావర్తము.

## సాంఖ్య ప్రశంస.

పైవిధాన నసమాన యశోనిధానమై (There is no achievement in the world which can compare favourably with that of Indian speculative Philosophy)13 యావత్ప్రపంచములో భారతీయ తత్త్వశాస్త్రముతో బోల్ప బడదగు ఘనకార్యము వేరొండు లేదని ఉత్తమ విమర్శానిపుణు డగు వి. వి. సోవాని యన్నట్లు, అద్వితీయ వైజ్ఞానికాంతరిక్ష మున విరాజిల్లు మన తత్త్వశాస్త్రమునకు తేజోనిధానమగు దివాకరునిలె నలంకరించినది సాంఖ్యసిద్ధాంతము. (The Sankhya is generally considered to be the oldest school of the Indian Philosophy)14భారతీయతత్త్వదర్శనములన్నింట సాంఖ్యము అతి ప్రాచీనమని సర్వసమ్మతము అని సూర్య నారాయణశాస్త్రియు, (Sankhya is the oldest of the

12. F. Max Muller:- India, What it can teach us P 29
13. Dr. V. V. Sovami:- A Critical Study of the Sankhya System p vii
14. Dr. S. S, Suryanarayana Sastry:- The Sankhya Karika,

existing systems) 15 ప్రస్తుతమున్న సిద్ధాంతదర్శనములలో సాంఖ్య మతి ప్రాచీనమని (Weber) వెబ్బరు పండితుడు కూడ నీ యభిప్రాయమును తెలిపెను. కేవల ప్రాచీనతయేగాక, (Without the help of the Sankhya, the world cannot be properly known, and as the unworldly can be studied only through the worldly, Sankhya has been given an important place by the most of the systems)16 సాంఖ్యాపేక్షలేక ప్రపంచ ముచితరీతి నగ్రాహ్యము. అలౌకికము లౌకిక ద్వారమున గ్రాహ్యముగాన అనేకదర్శనములచేత దీనికి ప్రాధాన్యత యొసంగబడియున్నది. అంతియగాక (These different systems have one common psychology, and that it is the psychology of the Sankhya system)17 ఈ వివిధదర్శనముల కొకే తత్త్వశాస్త్రము సామాన్యముగనున్నది. అదియే సాంఖ్యతత్త్వము. అందుచేతనే భారతావనియందేగాక సర్వ ప్రపంచ తత్త్వశాస్త్రమునకు నీ సాంఖ్యమే యాధారమని (The psychology is very clear and most precise and yet it is the oldest rational thought in the world. Wherever there is any philosophy or rational thought, it owes somthing or other to Kapila)18 అధ్యాత్మవిద్య ప్రస్ఫుటము, క్లుప్తము అయిన నది ప్రపంచములో నతి ప్రాచీన యౌక్తికవిధానము. ఎప్పుడు యే తత్త్వ విచారణమున్నను అది కొంతవరకైనను కపిలునకు జెందియుండునను వివేకానంద

15. Weber:- The History of Indian Literature p 235
16. Dr. V. V. Sovani:- A Critical Study of the Sanhkya System p xv
17. Swami Vivekananda:- The Complete Works Vol p 358
18. Swami Vivekananda;- Thc Complete Works Vol 2 p 453

వాక్యములు ప్రాముఖ్యములు. దీని ననుసరించియే ఆ యతి పుంగవుడు (Pythogorus learnt it in India and tanght it in Greece. Later on Plato got an inkling of it, and still later the Gnostics carried the thought to Alexandria, and from there it came to Europe. So wherever there is any attempt at psychology or philosophy, the great father of it is this man Kapila)[19] పైథాగొరసు దీనిని భరత వర్షమున నేర్చి గ్రీసు దేశమున బోధించెను. అంత ప్లేటో దీనిని సూచించెను. అటుపైన నాస్టిక్ శాఖీయులు దీనిని అలెగ్జాండ్రియాకు గొంపోయిరి. అటనుండి యిది యూరోపున కరుదెంచినది. కాన నెచ్చట నే తాత్త్విక, ఆధ్యాత్మికకృషియున్నను దానియొక్క పరమ పిత యీ కపిలాచార్యుడే యని ఘంటా పథముగా వచించియున్నాడు. కావున (I hope that the time will come when no one will claim that name (philosopher) who is not acquainted at least with the two prominent systems of ancient Indian philosophy, the Vedanta and the Sankhya)[20] ప్రాచీన హిందూ తత్త్వశాస్త్రమున ప్రధాన సిద్ధాంతములగు వేదాంత సాంఖ్యముల బరిచయము లేని వాడు తత్త్వవేత్తయను నామమును గోరజాలని కాలము వచ్చునని సాంఖ్య ప్రాధాన్యతను గ్రహించి (Max Muller) మాక్సు ముల్లరు గూడ నొక్క పలికియున్నాడు.



19 F. Max Muller:-The Six Systems of Indian Philosophy Introduction p xvi
20. F. Max Muller:- The Six Systems of Indian philosophy Introduction p l

## సాంఖ్యకర్త — కపిలముని.

అట్లు సుప్రశస్తమై, సర్వప్రపంచ తత్త్వశాస్త్రమునకు బునాదియై యలరారు యీయుత్కృష్ట సాంఖ్యశాస్త్రమును ప్రబోధించిన మహాత్ముడెవరో, వాని జీవితాంశములెవ్వియో కొంత గ్రహింప యత్నింతము.

(While in most countries a history of philosophy is inseparable from a history of the philosophers, in India we have indeed ample material for watching the origin and growth of philosophical ideas, but hardly any for studying the lives or characters of those who founded or supported the philosophical systems).20 అనేక దేశముల తత్త్వశాస్త్రచారిత్రముతో నాశాస్త్రాచార్యుల చారిత్రము అభిన్నముగ నుండును. కాని భారతభూమిలో తాత్త్వికసిద్ధాంత ప్రారంభపరిణామగ్రహణమునకు విస్తారముగ విషయమున్నది, కాని ఆయా సిద్ధాంతముల స్థాపకులయొక్కయు, ప్రాపకులయొక్కయు, జీవితవిశేషముల నెరుంగ నాధారము లావంతయు మనకు లేవు. కాన (We have some idea of who Thales was, and who Plato was, where and when they lived and what they did, but of Kapila, and of Patanjali, of Gautama and Kanada, of Badarayana and Jaimini, we know next to nothing)20 థేల్సు ఎవరో, ప్లేటో ఎవరో, ఎచ్చట ఎప్పుడుండిరో, ఏమిచేసిరో మనకు కొంచెము

20. F, Max Muller:- The Six Systems of Indian Philosophy Introduction p i

భావింప నవకాశమున్నది గాని, కపిల పతంజలి, గౌతమ కణాద, బాదరాయణ జైమినుల గురించి మనకు శూన్యమే తెలియునని మాకప్పు ముల్లరు చింతించియున్నాడు. (The history of the rise of the Sankhya school of thought is wrapped in impenetrable obscurity)21 సాంఖ్యదర్శనతత్త్వాభివృద్ధి చారిత్రము అభేద్యమగు నంధకారమున మరుగుపడిపోయినదని భారతీయ తత్త్వశాస్త్ర పరిణామచారిత్రకారుడగు పి. టి. శ్రీనివాసఅయ్యంగారు కూడ వచించుచున్నాడు.

అయినను, 'శ్లో॥ సాంఖ్యస్య వక్తా కపిలః పరమఋషిః పురాతనః। హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః॥'22 అని సంప్రదాయికముగ, సాంఖ్యకారుడు పరమఋషివరేణ్యుడును, అతి ప్రాచీనుడును, హిరణ్యగర్భుడును, అగు శ్రీకపిలాచార్యుడేయని విదితమగుచున్నది. మరియు వేదాంతసూత్రకర్తయైన శ్రీవ్యాసభగవానుడును, స్మృత్యధికరణమున కాపిల సాంఖ్యమునగల ప్రధానప్రసంగము జేసెను. మరియు బద్మపురాణముగూడ 'శ్లో॥ కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్। గౌతమేన తథా న్యాయం సాంఖ్యం తు కపిలేన తు॥' 23 అని కపిలమహర్షిని సాంఖ్యప్రవక్తగా తెలుపుచున్నది. 'శ్లో॥ కాణాద కపిలాద్యైస్తు మునీంద్రైరపి కీర్తితం। మంద బుద్ధ్యనుసారేణ కేవలం పరికీర్తితం॥' అనుచు వైశేషిక సాంఖ్య దర్శనాచార్యుల నూతనసంహిత ప్రస్తావించియున్నది. మరియు విష్ణుసహస్రనామస్తోత్రమున 'మహర్షి కపిలాచార్యః' అను

21, P. T. Srinivasa Iyangar:- Out lines of Hindu Philosophy p 108
22. మహాభారతము:- శాంతిపర్వము: మోక్షధర్మము.
32 పద్మపురాణము: ఉత్తరఖండము: 263

నామమునకు తద్భాష్యకర్తయగు శ్రీశంకరాచార్యులు 'మహర్షి కపిలాచార్య ఇతి సవిశేషేణానేకం నామ। మహాంశ్చాసా వృషిశ్చేతి మహర్షిః। కృత్స్నస్య వేదస్య దర్శనాత్ అన్యేతు వేదైకదేశదర్శనా దృషయః కపిలశ్చాసౌ సాంఖ్యస్య శుద్ధాత్మ తత్త్వవిజ్ఞానాచార్యః' (శ్లో॥ 70) మహర్షి కపిలాచార్య యనునది ఏకనామము, అనుచు సాంఖ్యశుద్ధాత్మతత్త్వవిజ్ఞానాచార్యుడే కపిలమహర్షి యని వ్రాక్కుచ్చియున్నాడు పాతంజలయోగదర్శనమున తద్భాష్యకర్తయగు వ్యాసదేవుడును, 'ఆదివిద్వాన్ నిర్మాణచిత్తమధిష్ఠాయ కారుణ్యా ద్భగవాన్పరమర్షిరాసురయే జిజ్ఞాసమానాయ తంత్రం ప్రోవాచ।' (1.25) ఆదవిద్వాంసుడును పరమర్షిచంద్రుడును అగు కపిలాచార్యుడు కారుణ్యముతో నిర్మాణచిత్తమునధిష్ఠించి ఆసురియను శిష్యునకు తంత్రమును బోధించెనని వచించెను. ఏతద్వ్యాఖ్యాతయగు వాచస్పతిమిశ్రులును 'ఆదివిద్వాన్' అనగ పంచశిఖాచార్యదృష్టికి కపిలమహర్షి యనియు, 'తస్యాపి సాంఖ్యయోగప్రాప్తి ర్వేదే శ్రూయత ఇతి॥' అతనికి సాంఖ్యయోగప్రాప్తి గలిగినట్లు వేదములందు గోచరమని వివరించెను. ఇంకను ''పంచమః కపిలో నామ సిద్ధేశః కాలవిప్లుతం। ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామ వినిర్ణయం।'(1.3.11) పంచమావతారమగు కపిలనామక సిద్ధేశుడు తత్త్వనిర్ణయ సాంఖ్యశాస్త్రమును ఆసురికి బోధించెను అని భాగవత పురాణమునందును, 'అగ్నిః స కపిలో నామ సాంఖ్యశాస్త్రప్రవర్తకః' అని మహాభారతాది సకల పురాణేతిహాసములందును సాంఖ్యదర్శనాచార్యుడు పరమర్షిశేఖరుడగు శ్రీకపిల మునీశ్వరుడే యని వ్యక్తమగుచున్నది.

has so far failed to grasp the reality, - - -, it is the general recognition that we are not yet in contact with the ultimate reality [75] భౌతిక విజ్ఞానము యథార్థమును గ్రహింపజాలనిదగుటచే, మనమింకను పరమార్థ స్పర్శకు దూరముగనే యున్నామను యథార్థమును జేమ్సు జీన్సు వచించుచుండ, ప్రస్తుతకాలమున భౌతికవిజ్ఞానవిశ్వము, పూర్వము కంటె నగోచరమై యున్నదనియు, ప్రకృతిపరిణామ జ్ఞానము ప్రస్తుతమధికముగనున్నను, This knowledge is, in a way, less satisfactory, for in every direction we are faced by ambiguities and contradictions [76] అన్ని దిక్కుల నసందర్భములు, పరస్పర వ్యతిరేకతలు, మనల నెదుర్కొనుచుండుటచే, నీ జ్ఞానము సంతృప్తికరముకాదని సల్లివాన్ వక్కాణించెను. దీనినే యింక గొంత వివరించుచు లింకన్ బార్నెట్ But the ireny of man's quest for reality is that as nature is stripped of its disguses, as order emerges from chaos and unity from diversity, as consepts merge and fundumental laws, assume increasingly simpler form, the evolving picture becomes ever more remote from experience - far stranger indeed and less recognizable [77] ప్రకృతిని గుప్తమొనరించు తెరల దొలగించు కొలది, సంక్షోభమునుండి క్రమత్వముదయింప, నానాత్వమునుండి ఏకత్వమవతరింప, భావములు లయింప, మూలసూత్రములు అధికతరముగ సులభత్వము

75 Dr. James Jeans : Prabuddha Bharata, 1946 a, p. 206.
76. Dr. J. W N. Sullivan : The Limitations of Science, p 69.
77. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 122

## కపిలమహర్షి-శ్రుతిస్మృతులు

కాని వేదములనుండి సాంఖ్యకారికా కాలమువరకు గల ఉపనిషత్పురాణేతిహాసాదికములవరకు గల పెక్కు గ్రంథరాజములలో గపిలమునీంద్రుని నామము వివిధ ప్రసంగముల వినంబడుచుండుటయు, నాఋషికులాలంకారుని జీవితవిశేషములేగాక జీవితకాలముగూడ కాలవిప్లుతమగుటయు, మిగుల విచారకరము. శ్రీ సూర్యనారాయణశాస్త్రి వచనములలో (The founder of the System is said to be the sage Kapila. Who he was, and when he flourished are questions yet unsettled)[24] సాంఖ్యసిద్ధాంతప్రవక్త కపిలమహర్షి యని వచింపబడును. కాని ఈతడెవరో, ఏకాలమున నుండెనో మొదలగు ప్రశ్నలింకను అనిర్ధారితములు. అదెట్లో యొకించుక బరిశీలించెదముగాక.

కేవలము సాంఖ్యోపనిషత్తు అని పండితులచే పేర్కొనబడిన శ్వేతాశ్వతరోపనిషత్తులో ప్రథమతః కపిలముని నామస్మరణమును తత్ప్రోక్త సాంఖ్యతత్త్వము విస్తృతపరుపబడినవి. అందు 'శ్లో॥ యో యోనిం యోనిమధితిష్ఠత్యేకో విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః । ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత' (5. 2) ఏకస్వరూపుడై సర్వోత్పత్తికారణములను, సకలరూపములను, ఎవడు నియమించునో, సృష్ట్యాదిలో జనించిన కపిలమహర్షి యను తనకుమారునికి సర్వ జ్ఞానముల బ్రసాదించెనో అనుచు నా బ్రహ్మదేవుని

24. Dr. S. S. Suryanarayana Sastry; Sankhya Karika

యీ యుపనిషత్తు స్తుతించుచున్నది. దీని దృష్టి దిలకించుచో గపిలుడు సృష్ట్యాదిలో జనించెననియు, బ్రహ్మమానసపుత్రు డనియు, సర్వజ్ఞుడనియు దెలియుచున్నది. కావుననే గౌడపాదు డును కపిలుని పూర్వోక్తరీతి బ్రహ్మమానసపుత్రులలో జేర్చి నమస్కరించియుండెను. మరియు సాంఖ్యకారికాభాష్యమున సాంసిద్ధికభావముల వివరించుచు, 'యథా భగవతః కపిల స్యాదిసర్గే ఉత్పద్యమానస్య చత్వారో భావాః సహోత్పన్నాః- ధర్మః జ్ఞానం వైరాగ్యం ఐశ్వర్య మితి', (సా. కా. గా. 43) సాంసిద్ధికభావములు ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్య రూపమున చతు ర్విధములనియు, నవి సృష్ట్యాదిన భగవంతుడైన కపిలాచార్యుని సహోత్పన్నములనియు వక్కాణించియున్నాడు. కపిలానంతర జన్ములగు సనకసనందాదులకు 'ప్రాకృతాః కథ్యంతే బ్రహ్మణ శ్చత్వారః పుత్రాః సనక సనందన సనాతన సనత్కుమారా బభూవుః। తేషాముత్పన్న కార్యకారణానాం శరీరిణాం షోడశ వర్షాణాం ఏతే భావాశ్చత్వారః సముత్పన్నాః' (సా. కా. గా. 43) ప్రాకృతికములన, బ్రహ్మదేవపుత్రులును, షోడశవర్ష శరీర ధారులును' కార్య కారణోద్భూత భావులును అగు సనకాదిచతు ష్టయముతో జనించిన భావములు ప్రాకృతికములని పేర్కొ నుచు కపిలదేవుని ప్రాశస్త్యమును గౌడపాదుడు ప్రకటించెను. సర్వోత్తమ ఋషివర్యుని ప్రాధాన్యతను గ్రహించియే శ్వేతా శ్వతరము 'శ్లో॥ నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్। తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వ పాశైవ (6 . 13) నిత్యములకు నిత్యుడును, చేతనములకు జేతనుడును

అనేకములలో నేకుడును, సర్వకామప్రదాతయునగు వాడు ఆత్మ. సాంఖ్యయోగములచే గ్రాహ్యమగు నీ దేవత నెవడెరుంగునో వాడు సర్వబంధ విముక్తినొందును అనుచు కపిల ప్రోక్త సాంఖ్య యోగాదుల బ్రస్తుతించు చున్నది. అందుచే (At the time of the composition of the Swetaswatara, the Sankhya was not a new system) 25 శ్వేతాశ్వతరరచన కాలమున సాంఖ్యము నూత్న సిద్ధాంతము కాదను (Dr. E. Roer) డాక్టరు. ఇ. రోయర్ వ్రాత యుచిత మనిపించును.

భాగవతపురాణము కేవల పరమాత్మయగు శ్రీ వాసుదేవుడే కర్దమప్రజాపతిద్వారా దేవహూతి గర్భవాసమున కపిలుడై యవతరించె ననుచు "కపిలస్తత్త్వ సంఖ్యాతా భగవానాత్మమాయయా। జాతః స్వయ మజః సాక్షాదాత్మప్రజ్ఞప్తయే నృణాం॥" (3 . 25 . 1) తత్త్వసంఖ్యాతయగు కపిలుడు స్వతః అజుడైయుండియు భగవంతుని మాయాప్రాబల్యమున నరులకు ఆత్మబోధార్థమై జనించెను అని విశదపరచుచున్నది. ఇంకను 'పంచమః కపిలో నామ సిద్ధేశః కాలవిప్లుతం। ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామ వినిర్ణయం' (1 . 3 . 11) కాలవిప్లుతమైన సాంఖ్యమును పంచమావతారుడైన కపిలుడు ఆసురి కుపదేశించినట్లు భాగవతగ్రంథమే స్పష్టపరచుచున్నది. ఈ వాక్యముల వివరించుచు బలరామ ఉదాసీనుడు తన యోగభాష్యటీక యందు 'ఇతి స్మృతౌ పంచమావతారత్వోక్తే విష్ణోరవతారః కపిల ఇతి భావః' (1 . 25) స్మృతిలో పంచమావతారమనగ

25. Dr. E. Roer:- The Twelve Principal Upanishads p 257

intellect, all byways of theory and conjucture lead ultimately to an abyss that human ingenuity can never span 85 సర్వవిజ్ఞాన మార్గములు, సకల యూహాసిద్ధాంత పక్షములు పర్యవసానమునకు, మానవప్రతిభ దాట నశక్యమైన యగాధమునకు ద్రోవదీయుచున్నవి. ఎందుచేతనన For man is enchained by the very condition of his being, his finiteness and involvement in nauture. Man is thus his own mystery 85 తన వ్యక్తిత్వమున, తన సంకుచితత్వమున, ప్రకృతిబద్ధుడై మానవుడు బంధింపబడియున్నాడు. అట్లు మానవుడు, తనకే నిగూఢతత్త్వమై యొప్పియున్నాడు. తనను దాను గ్రహింపకుండుటచే నతడు, విశాల విశ్వమును గ్రహింపజాలకున్నాడు. విశ్వాంతరాళమున గల ప్రకృతి ధూళిచే నతని దేహము, గర్వించు నతని బుద్ధియు నిర్మితము. కావున Standind midway between macrocosm and microcosm he finds barriers on every side 85 బ్రహ్మాండ పిండాండముల మధ్య మహదణువుల మధ్యనుండి అతడు, సర్వదిక్కుల నాటంకములనే గనుచున్నాడని చాల చక్కగా, వివరముగ, ఆధునిక భౌతిక విజ్ఞాన నిజస్వరూప కథనము నతడు, గావించియున్నాడు. పై జగ్గాంశములవలన, ప్రస్తుత ప్రపంచమును దారుమారు గావించుచున్న భౌతికశాస్త్రము, విశ్వ ప్రకృతి రహస్యముల గ్రహింప నసమర్థమనియు, దద్గ్రహణమునకు దానిపై నాధారపడుట ఉచితము కాదనియు, నది తాత్కాలిక సుఖాదుల మానవ జీవితమున కందించినను, యథార్థ సుఖస్వరూపమునది.

---

85. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 127

ములు గలవాడని వర్ణింపబడియున్నది. 26 శ్రీమద్వాల్మీకిరామాయణము 'శ్లో॥ యస్యేయం వసుధాకృత్స్నా వాసుదేవస్య ధీమతః । కాపిలం రూపమాస్థాయ ధారయ త్యనిశం ధరాం॥' (బా. 40. 2) అనురీతి శ్రీవాసుదేవుడే కపిలరూపమును ధరించెనని పేర్కొనెను. ఆ కపిలుడే వేయిమంది సగరాత్మజుల భస్మముగావించెనని తెలుపుచు శ్రీవాల్మీకిమహర్షి 'కపిలేన మహాత్మనా॥' (బా.40.30) అని వివరింపగా నా'మహాత్మ' పదమునకు వివరణముగా 'మహాకాయా' అనియు 'కపిల' అనగా కపిలావతారమనియు శ్రీగోవిందరాజవ్యాఖ్య ఆదిపురాణగత కపిలరూపమును స్ఫురింపజేయుచున్నది. అటులే 'సనాతనాతనతమః కపిలః' (శ్లో. 108) అనుచోట 'బడబానలస్య కపిలో వర్ణ ఇతి తద్రూపీ కపిలః' అని శ్రీశంకరులవారు విష్ణుసహస్రనామభాష్యమున రచించిరి. మరియు నితరపురాణములలో గపిలుని అగ్నిదేవునిగను, విష్ణువుగను, శివునిగను పలుపలువిధముల రూపించియున్నారు.

వైవిధానమున (It had found many adherents; it was the doctrine of Manu, of some parts of the Mahabharata; and to its founder, divine honours had been assigned by general consent) 27 సాంఖ్యము అనేకములగు అనుచరులబొందెను. మనుధర్మమునను, కొంతవరకు మహాభారతమున నది అవలంబింపబడినది. దానికర్త సర్వసమ్మతముగా నవతారగౌరవముల బొందెను. (The imagination of the

26. Dr. Har Datta Sarma:- Sankhya Karika
27. Dr. E. Roer:- The Twelve Principal Upanishads

Hindus has thrown a viel of mystery and fable around Kapila, the traditional author of the Sankhya philosophy. So much reverence gradually attached to his name, that he was some times called the 'divine Kapila', and was said to have been a son of Brahma the creative form of Brahman, an incarnation of Vishnu or a form of Agni)28 సాంఖ్యదర్శనాచార్యుడైన కపిలుని చుట్టు హిందూ కవితాశక్తి ఒక అద్భుతము, కల్పితము అగు అవనికను క్రమ్మినైచినది. కాన, అతడు దేవాంశుడగు కపిలుడనియు, బ్రహ్మము యొక్క సృష్టిశక్తి పుత్రుడనియు, విష్ణుయొక్క, అగ్ని యొక్క అవతారమనియు ననేక విధములగు గౌరవమర్యాదలు అతని నామమునకు ఏర్పడినవని (John Davis) జాన్ డేవిస్ వ్రాయుచున్నాడు. (If there was ever a sage Kapila, who expounded philosophy, he had disappeared into a mass of abscure tradition at an early date). 29 తత్త్వప్రబోధకుడగు కపిలుడను ఋషి పూర్వముండియున్నను, అతడు అస్పష్టమగు గాథాబాహుళ్యమున నదృశ్యమయ్యెను అని (A.B.Kieth) కీత్తు పండితుడు అభిప్రాయపడెను (Moreover, there is grave reason to suspect his real existence at all, in view of the fact that he may owe his name merely to the use of Kapila in the Swetaswatara (5-2) as a description of Hiranya-garbha) 29 అంతియగాక, శ్వేతాశ్వతరోపనిషత్తులో హిరణ్యగర్భ వర్ణనముగా గపిల శబ్దముండుటచే, ఆనామ మతని కేర్పడు

28. John Davis:- Sankhya Karika.
29. Prof A. B. Kieth:- The Sankhya System p 47

టచే, యథార్థమున నితడు పుట్టలేదేమో అనుట కవకాశమున్న దని కీత్తు వ్రాసెను. (The idea that in this verse, we are to see the first mention of the founder of the Sankhya as a real person is fantastic to be upheld, it is not at all unlikely that the origin of the doctrine of Kapila as the founder of the Sankhya is to be traced to this passage) 30 శ్వేతాశ్వతరములోని యీశ్లోకమున సాంఖ్య కర్త యథార్థమైన వ్యక్తిగా ప్రథమతః సూచింపపడిన దనుటను సమర్థించుట మిక్కిలి విపరీతము. కపిలుడు సాంఖ్యప్రవచన కర్తయని యీ శ్లోకము నాధారముగా గొనుటగలదు అనియు నీతడు భావమును వెలువరించెను. ఈవిషయమునే చర్చించుచు, (All the early teachers of the Sankhya appear in legendary guise, the reality of Kapila the alleged founder of the system, has been abandened by Jacobee) 31 మొదటి సాంఖ్య దర్శనాచార్యులందరును కల్పితులవలె నగుపించెదరు. సాంఖ్యదర్శనకర్త యనబరగు కపిలుని వ్యక్తిత్వముగూడ జకోబీ పండితుడు త్రోసిరాజనెనని మాక్సు ముల్లరు సూచించెను. (Indeed the very existence of such a person as Kapila has been doubted, in spite of the unanimity with which the Indian tradition disignates a man of this name as the founder of the system) 32 సాంఖ్యదర్శనాచార్యుడుగా ఏకముఖముగా హైందవ సంప్రదాయము తెలుపుచున్నను కపిలుని వ్యక్తిత్వమే సందేహింపబడినది అని సంస్కృతవాఙ్మయ

30. Prof. A. B. Kieth:- The Sankhya System p 7
31. F. Max Muller:- The Six Systems of Indian philosophy p 488
32. Dr. A, A, Macdonell:- A History of Sanskrit Literature p 385

చరిత్రకారుడగు (Macdonell) మాక్డోనెల్ వ్యక్తపరచెను.

ఇట్లుండ వేదాంతసూత్రముల స్మృత్యధికరణమున ప్రథమసూత్రభాష్యమున సాంఖ్యఖండనము గావించుచు శ్రీ శంకరులు కపిలప్రసంగముఁజేసి 'యా తు శ్రుతిః కపిలస్య జ్ఞానాతిశయం ప్రదర్శయంతీ ప్రదర్శిత న తయా శ్రుతి విరుద్ధమపి కాపిలం మతం శ్రద్ధాతుం శక్యం, కపిల మితి శ్రుతి సామాన్య మాత్రాత్ అన్యస్య చ కపిలస్య సగరపుత్రాణాం ప్రతప్తుర్వాసుదేవనామ్నః స్మరణాత్' (2. 1. 1) కపిలుని జ్ఞానాతిశయమును జూపుచున్న యే శ్రుతి యిట నుదాహరింపబడెనదో యందు కపిలశబ్ద సామాన్యమే వినంబడుటవలనను, సగరపుత్రుల దహించినవాఁడును, వాసుదేవాంశమున బుట్టినవాడు నగు వేరొక కపిలుడున్నట్లు వినంబడుటవలన నాశ్రుతిచే వేదవిరుద్ధమగు కాపిల మతము విశ్వసింపదగినదికాదు అని సాంఖ్యస్మృతికర్తయగు కపిలుడొకడనియు, రామాయణాది పురాణముల సూచింపబడిన సగరాత్మజ హంతకుడగు కపిలుడు మరొకడనియు వాదించెను. దీనికి రత్నప్రభాకారుడగు గోవిందానందుడును'కపిలశబ్దమాత్రేణ సాంఖ్యకర్తా శ్రౌత ఇతి భ్రాంతిరయుక్తా' కపిల శబ్దమాత్రమున సాంఖ్యకర్తయగు కపిలుడు శ్రుతి సమ్మతుడను భ్రమ అయుక్తము అని తీర్మానించెను. ఈభావమునే ప్రస్ఫుటము సేయుచు, 'బడబానలస్య కపిలో వర్ణ ఇతి తద్రూపీ కపిలః' (శ్లో.108) బడబానలముయొక్క వర్ణముకపిలమనియు, ఆవర్ణము గలవాడు కపిలుడనియు నర్థమున, 'కపిలం' అను పదము సర్వనామశబ్దముకాక ఆవర్ణమును సూచించు విశేషణమనియు. కపిలవర్ణముగలవాడు హిరణ్యవర్ణముఁగల హిరణ్యగర్భుడే

యనియు, సాంఖ్యకర్త కానేరడనియు శ్రీశంకరులు సమన్వయము గావించిరి. అటులనే తన విష్ణుసహస్రనామభాష్యమునఁగూడ 'మహార్షి కపిలాచార్యః' (శ్లో. 69) అను చోట 'కపిలశ్చాసౌ సాంఖ్యస్య శుద్ధాత్మతత్త్వవిజ్ఞానాచార్యః' శుద్ధాత్మతత్త్వవిజ్ఞానమను సాంఖ్యమునకు ఆచార్యుడు కపిలుడని వ్యాఖ్యానించుచు, 'వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానం' అను సాంఖ్య నిర్వచనమును వదలి 'శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయతే ఇతి వ్యాసస్మృతే' సాంఖ్యమనగ శుద్ధాత్మతత్త్వవిజ్ఞానమని వ్యాసస్మృతులు నిర్వచించునని అన్వయించుకొనెను. అనగా సాంఖ్యపదమును, కపిలపదమును సాంఖ్యదర్శన కపిలాచార్యులకును అన్వయింపకుండునట్లు శ్రీశంకరులు చాల జాగ్రత్తపడెనని తాత్పర్యము. కాన పూర్వోక్త సూత్రభాష్యమునకు టీకాకారుడైన ఆనందగిరి కూడ వైదికుడగు కపిలుడు సగరపుత్రసహస్రమును సంహరించినవాడని వ్యాఖ్యానించెను.

ఇక పూర్వమే వచించినట్లు పాతంజలయోగసూత్రమునకు భాష్యకర్త శ్రీవ్యాసదేవుడు 'ఆదివిద్వాన్ — —' అను రీతిగ కపిలుని స్మరించుటయు, దానికి వాచస్పతులు వివరణగా 'కపిలస్యాపి జాయమానస్య మహేశ్వరానుగ్రహాదేవ జ్ఞానప్రాప్తిః శ్రూయత ఇతి। కపిలోనామ విష్ణోరవతార విశేషః ప్రసిద్ధః। స్వయంభూస్తు హిరణ్యగర్భః। తస్యాపి సాంఖ్యయోగప్రాప్తిర్వేదే శ్రూయత ఇతి స ఏవేశ్వర ఆదివిద్వాన్ కపిలో విష్ణుర్వా స్వయంభూ రితి భావః। స్వాయంభువానాం త్వీశ్వర ఇతి భావః '(1-25) పుట్టుకతోడనే మహేశ్వరానుగ్రహమున జ్ఞానప్రాప్తినొందినవాడు కపిలుడని వాడుకకలదు. ఆతడు విష్ణువు

యొక్క యవతారమని ప్రసిద్ధియు గలదు. హిరణ్యగర్భుడే స్వాయంభువు. ఆహిరణ్యగర్భునకుగూడ సాంఖ్యజ్ఞానము గలదని వేదమున గలదు. ఆయీశ్వరుడే స్వయంవ్యక్తుడగు విష్ణువే, ఆదివిద్వాంసుడగు కపిలుడగునని భావము. స్వయంభువులలోనీ కపిలు డీశ్వరుడని గ్రాహ్యము అని వ్రాసి కపిలుడన సాంఖ్యవిజ్ఞాతయగు విష్ణువేయని నిర్ధారణము గావించియున్నాడు. అంతియగాక విష్ణుసహస్రనామమున 'మహర్షి కపిలాచార్యః' 'కపిలః' అని విష్ణువునకును, శివసహస్రమున 'సాంఖ్యప్రద' అని శివునకును కపిల నామము అన్వయింపబడియున్నది. కాబట్టి (While these accounts are mystical it may be accepted that a historical individual of the name of Kapila was responsible for the Sankhya tendency of thought. ) 33 కపిలునిగూర్చిన పిషయము అస్పష్టమైయుండ సాంఖ్యవాదకారకుడగు కపిలనామకుడొకడు చారిత్రక పురుషుండుండెనని సమ్మతింపనగు నని రాధాకృష్ణపండితుని తీర్మానము. మరియు (Kapila plays a great figure in the philosophy of the epic; he is authoritative in all philosophic matters, and his tenets are of the most divine kinds. In the strict sense of the word, he is indeed, the only founder of a system recognised by the epic, the other persons being either gods or his disciples.) 34 భారతపురాణ గత తత్త్వజ్ఞానమున కపిలుడు గొప్ప ప్రముఖ పాత్ర నిర్వహించును, సర్వతాత్త్విక విషయముల నాతడే ప్రమాణము. ఆతని సిద్ధాంతము లతి పవిత్రములు. యథార్థమునకు నాపురాణతత్త్వశాస్త్ర

33. Prof S. Radhakrishna.- Indian Philosophy Vol 2 p 251
34. Prof. A, B. Kieth:- The Sankhya System p 46

మున కాతడే కర్త యగును. ఇతరులు దేవతలుగను, ఆతని శిష్యులుగను అగుదురు అనియు కీర్తుమహాశయుని సిద్ధాంతము. (Tradition affirms that Kapila lived as a recluse- he is called a muni in Bhagavata x. 1-52 and that he possessed a super-natural power not always used with philosophical calmness) 35 కపిలుడు పరివ్రాజక జీవితమును గడిపెనని వాడుక గట్టిగా తెలుపుచున్నది. అతని కొక అమానుషశక్తి యుండియు వివేకమున దాని నుపయోగింపడని భాగవతము గూడ తెలుపుచున్నదనియు' (We can only say that he was probably a Brahmin who being disgusted with the prevailing beliefs and practices of his time, wrought out for himself a system by which he hoped to solve the mysteries in connected with spirit and matter by reason) 35 అతడొక బ్రాహ్మణుడనియు, నాటి ఆచారవ్యవహారములవలన విసుగుజెంది, పురుషప్రకృతుల సంబంధములగల అగోచరత్వమును యుక్తిమూలమున దీర్మానింప దలచియుండు ననియు జాన్ డేవిసు సమన్వయపరుపజూచెను. కపిలుడను వాడనువాడై చతురాశ్రమముల విభజించెనని బౌద్ధాయనసూత్రవచనము. శ్రాద్ధ, వివాహ, ప్రాయశ్చిత్తములగూర్చి కపిల స్మృతి కర్తయగు కపిలుడొకడు గలడనియు సంప్రదాయముగలదు.

కపిల దేవుని వృత్తాంతమింత క్లిష్టమైయొప్పారుట దిలకించి కపిలుడు చారిత్రకపురుషుడు కాడని (Colebrooke) కోల్ బ్రూక్ (Jacobee) జకోబీ మొదలగు విద్వాంసులు వచింప సాహసించిరి. అందుచేతనే (Thus we find no strong

35 John Davis:- Sankhya Karika

proof for believing Kapila a historical person) 36 అటుల కపిలుని చారిత్రిక పురుషునిగా విశ్వసింప ప్రబల ప్రమాణములు లేకున్నవని హరదత్తశర్మయు, (He is not a historical person. His name occurs in various contexts and somehow it came to be associated with the Sankhya) 37 ఆతడు చారిత్రకుడు కాడనియు, ఆతని నామ మనేకసందర్భముల గోచరించుచు నేదోవిధముగ సాంఖ్యమునకు ముడిపెట్టబడియున్నదని సోవానియు గూడ వ్రాసిరి. కాని పూర్వోక్తరీతి రాధాకృష్ణాది పండితులాయభిప్రాయముతో నేకీభవింపక కపిలుని చారిత్రిక పురుషుడుగనే విశ్వసించిరి. కపిలుడు బుద్ధునికి పూర్వకాలీనుడను అనేక బౌద్ధ ప్రమాణములనుగూడ గైకొని, (Buddhistic legends mention Kapila as one of the predecessors of Buddha)38 కపిలుడు బుద్ధునికి పూర్వుడని బౌద్ధశాస్త్రములు తెలుపుచున్నవనియు,(We shall not be wrong if we place him in the century preceeding Buddha)38 బుద్ధునికి పూర్వశతాబ్దమున నితని నుంచుట తప్పిదము కాదనియు రాధాకృష్ణుడు అభిప్రాయపడెను. (There is abundant evidence, both in Hindu and Buddhists works, of unquestionable antiquity and autheticity of the Sankhya and Yoga systems having been current before the time of Buddha)39 బుద్ధునికాలమునకు బూర్వమే సాంఖ్య యోగ సిద్ధాంతములు ప్రామాణికమును

---

36. Dr. Har Datta Sharma: Sankhya Karika p 14
37. Dr. V. V. Sovani: A critical Study of the Sankhya System
38. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251
39. Dr. Rajendralal Mitra: The Yoga Sutra

ప్రాచీనములునుగా నిస్సందేహముగనున్న వని తెలుపుటకు బహుళ సాక్ష్యము హైందవ బౌద్ధగ్రంథములగలదని యోగసూత్ర వ్యాఖ్యాతయగు రాజేంద్రలాలుడు నొక్కి వచించియున్నాడు. (Sankhya ideas themselves preceeded Buddha)40 సాంఖ్య భావజాలము బుద్ధుని పూర్వములు అని రాధాకృష్ణుడు విశ్వసించి యున్నాడు. బుద్ధుని జన్మస్థానమగు కపిలవస్తుపురమును (Kipilavastu had been built by the sons of Ikshwaku by the permission of the sage Kapila) 41 కపిలసంయమి యాజ్ఞానుసారముగ ఇక్ష్వాకుతనయులు కపిలవస్తునగరమును సృజించియుండిరని పురాణవాక్యముల విశ్వసించి జాన్ డేవిసు బుద్ధునికి కపిలుడు తప్పక ప్రాచీనుడని తీర్మానించెను.



## కపిలాచార్యుని కాలము.

పూర్వోక్త గ్రంథ విధానమున కపిలాచార్యుని చారిత్రకత్వమునే తీర్మానింపజాలని పండితవర్గము, (There seems in fact, good reason to believe that the Sankhya doctrine came in to being as a system between 800 and 550 B.C.)42 సాంఖ్యభావములు సిద్ధాంతరూపమున క్రీస్తుకు పూర్వము 800 నుండి 550 వత్సరముల మధ్య రూపొందియుండు ననుట సమంజసమని (Macdonell) మాక్డొనెల్ పండితుడును, (It is probable

40. Prof. S. Radhakrishnan; Indian Philosophy Vol 2 p 251
41. John Davis; Sankhya Karika
42. Dr, A. A. Macdonell; India's Past

that he lived in the 7th or 8th century before Christ) 43 అతడు క్రీస్తుకు బూర్వము ఏడు ఎనిమిది శతాబ్దముల వాడై యుండునని (John Davis) జాన్ డేవిసు భావించిరి. ఇంతియు గాక క్రీస్తుకు పూర్వ మొక శతాబ్దమువాడని కొందరును, క్రీస్తుకు తర్వాత శతాబ్దమువాడని మరికొందరు ఊహాగాన మొనరించిరి. ఈ కాలనిర్ణయము లెంతవరకు సమంజసములో విజ్ఞు లాలోచించుకొందురుగాక.

అట్లుగాక మనకు బ్రమాణభూతములగు పురాణాది శాస్త్రముల బరిశీలించిచూచి కపిలావతారకాల మొకించుక నిర్ణయింప యత్నింతము.

ఆర్ష కాలమానమునననుసరించి చతుర్ముఖ బ్రహ్మయొక్క ఆయువు వందసంవత్సరములు. కాని ఆవత్సరములకును మానుష సంవత్సరములకును బహుళ వ్యత్యాసముగలదు. ఆ బ్రహ్మ ఆయుఃప్రమాణమున నొక దినము చతుర్దశ మన్వంతర పరిమితి గలిగియుండును. మరల నొక్కొక్క మన్వంతరమున డెబ్బది యొక్క మహాయుగములుండును. ఒక్కొక్క మహాయుగ మున నాలుగు యుగము లంతర్గతములు. అవియే కృత త్రేతా ద్వాపర కలియుగములు. అందు కృతయుగమున 17,28 000 సంవత్సరములును, త్రేతాయుగమున 12,96,000 సంవత్సరము లును, ద్వాపరంబున 8,64,000 సంవత్సరములును, కలిలో 4,32,000 సంవత్సరములును గలవు. అనగా నొక మహాయుగ మున 43,20,000 సంవత్సరములును, ఒక మన్వంతరమునకు 30,67,20,000 మానుష సంవత్సరములుండును. అట్టివి

43. John Davis:- Sankhya Karika.

14 మన్వంతరములుకాగా అనగా 429,40,80,000 మానుష సంవత్సరములు బ్రహ్మదేవున కొక యహమగుచున్నది. ఈకాల మానము ప్రకారము విజయనామ సంవత్సర పంచాంగమున సృష్ట్యాదినుండి యీ వత్సరమునకు 195,58,85,054 మానుష సంవత్సరములు గడిచియున్నట్లు గుణింపబడియున్నది. అందు ఆరుమన్వంతరములు గతించి సప్తమము నడుచుచున్నది. సప్తమ మగు వైవస్వత మన్వంతరమున 12,05,53,054 సంవత్సరములు గడిచినవి.

ఇక మన కపిల కాలనిర్ణయమున కుపక్రమించి చూచి నచో, భాగవత పురాణ ప్రమాణ ప్రకారము కపిలముని సృష్ట్యాదినగల స్వాయంభువమనువుయొక్క కాలమువాడని విశదము. అందుచే పైసృష్ట్యాది యబ్దములలో నొక మన్వంతర కాలమును మినహాయింపగా మిగిలిన 164,91,65,054సంవత్సర ములకు బూర్వుడని తేలుచున్నది. అనగా ప్రథమ మనువు కాలపరిమితి 30,67,20,000 సంవత్సరములలో నతడుండియుండు ననుట నిర్ధారణము. కాని యీ కాలనిర్ణయము ఆధునికుల కభూతముగ నొప్పారకమానదు. అయినను ఆర్షమునందు విశ్వాసముగలవారు దీని ప్రమాణముగా స్వీకరింతురు. అంతియు గాక నీ కాలము ననుసరించి 2,36,24,195 అబ్దములకు బూర్వ కాలీనుడగు హరిశ్చంద్ర మహారాజునకు ఆదిపురుషుడగు ఇక్ష్వా కునిపుత్రులు కపిలాజ్ఞననుసరించి కపిలవస్తునగరమును నిర్మించి యుండుటచే కపిలుడు హరిశ్చంద్రకాలమునకే అతి ప్రాచీనుడని విదితము. అంత ప్రాచీనుని ఏసుక్రీస్తు కాలముతో బోల్చిగణించి కాలనిర్ణయ మొనర్చుట కేవలము హాస్యాస్పద మనిపించును.

no anchorage, no objectives or purposes in life [106] నైతికాధ్యాత్మిక, తాత్త్విక, భావములగు స్థూల ప్రపంచ గ్రహణమునకతీత తాత్త్విక విషయములపై గొంత విశ్వాసమవసరమగుచున్నది. లేకున్న మనకు, శాంతిగాని జీవితోద్దేశ్యములుగాని లేకపోవునని నెహ్రూ పండితుడు తాత్త్విక చింతనావశ్యకతను నొక్కి వక్కాణించియున్నాడు. ఆ విచారణము భౌతికశాస్త్రమునకు బరమనియు, భౌతిక శాస్త్రవిషయములు స్వల్పమగుటచే తాత్త్విక విషయశాస్త్రములకవి అనవసరములనియు,ననుట ఉచితమే యని యొప్పుకొనుచు, It is probably true that the problems with which science deals are intrinsically inferior in human interest to those dealt with by either philosophy or religion [107] భౌతిక విజ్ఞానశాస్త్రము విచారించు సమస్యలు, పారమార్థిక తత్త్వశాస్త్రములు విచారించు విషయములకంటె సహజముగ మానవునకు స్వల్పములనియు, నాధునిక భౌతిక శాస్త్రవాదులు సమ్మతించుచున్నారు. లోకమునవాధ్యాత్మికతత్త్వమే ప్రధానమనుచు, ఆధునిక భౌతికతత్త్వవేత్తలకగ్రసరుడైన ఆల్బర్టు ఐన్‌స్టీన్ Restricting the body of knowledge to a small group deadens the philosopical spirit of a people and leads to spiritual poverty [108] విజ్ఞాన సముచ్చయమును అల్పసంఖ్యాకమైన కొందరిలో నిమిడ్చియుంచినచో ప్రజానీకము యొక్క తాత్త్విక వ్యవస్థ నశించి, పారమార్థిక దారిద్ర్యమునకు

106. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 441.
107. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p. 163
108. Dr Albert Einstein : Foreward, The Universe and Dr. Einstein

పుత్రి దత్త్వబోధ నర్థింప గరుణాంతరంగుండై కపిలుండు సాంఖ్యంబునంతయు నుపదేశించి తల్లిని ధన్యగాజేసెనని భాగవతాఖ్య పురాణము బోధించుచున్నది. (3-4 స్కం.)

ఆదికావ్యమనబడు శ్రీ వాల్మీకి రామాయణంబునగూడ కపిలస్మరణము గావింపబడినది. (బా.40) మున్ను సగరమహీపతి అశ్వమేధయాగంబు సేయనెంచి యజ్ఞాశ్వమును దేశమున నలుదిక్కులకు బంపుచు దానివెంట తన సహస్ర తనయుల బంపెను. ఆతురగమును వాసవుడు దొంగిలించెను. కాన సగరాత్మజులు ఆ తురగాన్వేషణము సేయుచు సర్వదిక్కుల గాలించుచు భూమిం ద్రవ్వుచు నయ్యశ్వంబు గానక నీశాన్యదిశం గలయ సంసిద్ధులైరి. అచ్చట కపిలాశ్రమంబునగల కపిలు తురగమునుగాంచి అది తమదిగా భ్రమించి, అశ్వమునెత్తుకొనిపోవుచుండగా కపిలుని భావించి, తపంబాచరించుచున్న నా మహాత్ముని బాధింప దొడగిరి. అందులకు రోషాకులితలోచనుడై మహాత్ముడైన కపిలుడు ఆ సగరసుతుల శపించి భస్మీభూతులగావించెను. కపిలరూపమును వివరించుచు వాల్మీకిమహర్షి 'యస్యేయం వసుధాకృత్స్నా వాసుదేవస్య ధీమతః। కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరాం' అనుచు కపిలావతారము వాసుదేవాంశమేయని వక్కాణించియున్నాడు.

ఇంతియగాక మహాభారతంబున కపిలనామస్మరణంబును, తత్ప్రోక్త సాంఖ్యయోగ వివరణంబును వివిధరీతుల ననేకసందర్భముల గోచరించును. శాంతిపర్వమున జనకున కుపదేశింప తత్త్వజ్ఞానఘనుండును, నిర్ద్వంద్వుండును, సంశయరహితుండు

నగుపంచశిఖుండు అరుదెంచెను. అతడు కపిలగురుకుటుంబమునకు జెందినవాడగుట కాపిలేయుడనబరగునని యందు ప్రస్తావింప బడినది. (శాంతి-4) గుణత్రయవిచారమును పంచశిఖాచార్యుడు జనకున కుపదేశించెను. మరల కపిలగోసంవాదమను శీర్షికలో కపిలమునివరుండు గోవునందు సూక్ష్మరూపంబుతో బ్రవేశించి యున్న శ్యూమరశ్మికి ఇంద్రియ జయతత్వమును బోధించెను. మరియు నా శ్యూమరశ్మికి కపిలదేవుడు వేదప్రామాణ్యంబు నుపదేశించెను. (శాంతి-4) భీష్ముడు ధర్మజునకు కపిలప్రోక్త సాంఖ్యయోగమును ప్రశంసించెను. (శాంతి-5) తర్వాత జనక సులభా సంవాదంబున, తాను సాంఖ్యయోగంబును పంచ శిఖాచార్యునొద్ద గ్రహించితిననియు, దాను పంచశిఖుని శిష్యు డననియు జనకుడు వచించుకొనును. ఆనుశాసనికపర్వమున రుద్రునకు సనత్కుమారుడు సాంఖ్యము నెరింగించును. (అను-4) ఆసందర్భమున కపిలాచార్యుడు తన గురువనియు, ఆకపిలుని దగ్గర బహుశిష్యులు దీపితవిజ్ఞానులైరనియు సనత్కుమారుడు తెలియజేయును. అటులే యాపర్వంబుననే పరమశివుడు పార్వతికి సాంఖ్యము నుపదేశించి, సాంఖ్యుల మార్గము జ్ఞానమనియు, దాన వారు ముక్తులగుదురనియు జెప్పి, యిది కపిలాది పరమర్షి సేవితంబైన సాంఖ్యధర్మంబని (అను-5) విస్పష్టలీల దెలుపును.

పైవిధాన సాంఖ్యయోగప్రవర్తకుడును, జ్ఞానేశ్వరుండును, విష్ణ్వంశసంభూతుడును, ఆదివిద్వాంసుడును అగు కపిలమహర్షి ప్రవరుని వృత్తాంతంబు ప్రస్ఫుటముగ పురాణేతిహాసశాస్త్రము లందు గోచరించుచుండ ననేక సంశయంబుల కవకాశమెందులకు కలిగెనో విచార్యము. ప్రస్తుతము సాంఖ్యశాస్త్రము నాబడు

సాంఖ్యకారికాశాస్త్రమునకు బూర్వంబునంగల సాంఖ్యము భక్తి జ్ఞాన పరిపూరితమై ఈశ్వరాపేక్షకమై యొప్పారుటయు, కారికలందు భగవద్విషయ ప్రస్తావనమే లేకుండుటయు ముఖ్య కారణము. కాన నది కాలగతమున నిరీశ్వరమనియు, వేదబాహ్యమనియు, నాస్తికమనియు దూషితమై, కారికాగత సాంఖ్యోపదేష్టయగు కపిలుండొకడనియు, శాస్త్రోక్త కపిలుం డొకడనియు శంకరాది విజ్ఞలోకమున గలవరపాటునకు గారణభూతమయ్యెననితో చెడిని. (Kapila established no society and no heirarchy) 44 కపిలుడు ఏసంస్థనుగాని సంప్రదాయమునుగాని నెలకొల్పలేదు అని జాన్ డేవిసు అనుమానించినటుల, కపిలుని సంప్రదాయముగాని, రచించిన గ్రంథముగాని మనకు దురదృష్టమున సంప్రాప్తింపకబోవుటయు, గపిల సిద్ధాంతమున బ్రకరణ గ్రంథములుమాత్రమే లభించుటయు, నవియు సమగ్రములు గాక చాల సంక్షిప్తములగుటయు నిన్నియపోహల కవకాశ మిచ్చుచున్నవని తాత్పర్యము.

---

## సాంఖ్యాచార్యులు.

ఇంతదనుక సాంఖ్యప్రణేతయగు శ్రీ కపిలాచార్య వృత్తాంతము జూచియున్నారము. ఆతత్త్వప్రచారకుల విషయముగూడ నొకించుక నాలోచింతముగాక. ఈశ్వరకృష్ణ కారికల బ్రధానముగా గైకొని సాంఖ్యాచార్యుల గారికాపూర్వ, కారికానంతరరూపమున ద్వివిధముగా విభజింపనగును. కారికా

44. John Davis:- Sankhya Karika

భౌతిక శాస్త్రము, విమర్శించి సమన్వయించుట తత్త్వశాస్త్రముగ విల్ డ్యూరెంటు కథనము. అట్లు విభిన్న దృష్టులు రెండును గోచరించినను, Science without philosophy, facts without perspective and valuation, cannot save us from havoc and despair. Science gives us knowledge, but only philosophy can give us wisdom 115 తత్త్వశాస్త్రములేని భౌతిక విజ్ఞానము, దూరదృష్టి యోగ్యతలులేని వివరములు, మనల నిరాశా వినాశమునుండి రక్షింపజాలవు. భౌతిక విజ్ఞానము మనకు జ్ఞానము నొసంగ, తత్త్వార్థచింతనముమాత్రమే వివేకమును బ్రసాదించునని డ్యూరెంటు మహాశయుని గాఢ విశ్వాసము. If philosophy is to be a tool of integration or synthesis, the ties between philosophy and science are of the utmost importance 116 తత్త్వశాస్త్రము సమన్వయమునకే యుపకరణముగాన తత్త్వ, భౌతికశాస్త్రముల సంబంధము మిగుల ప్రధానమనియు, నందుచే Mankind needs religious leaders who face with open eyes the results of science, and mankind needs scientists who have the moral courage to act according to their knowledge 117 భౌతిక శాస్త్రి ఫలితముల గమనించి, సమన్వయ దృష్టితో నెదుర్కొనగల మతాచార్యులు, మానవ సమాజమునకవసరము. అటులే తమ జ్ఞానమునకనుగుణముగ వ్యవహరింప నైతిక

115. Prof. Will Durant : The Story of Philosophy, p xxvi.

116. Prof Philipp Frank : Relatively, p 94.

117. Prof. Philipp Frank : Relatively, p 120

face life 112 భౌతికశాస్త్రముయొక్క స్వభావవిధానములతో తత్త్వశాస్త్రమును జోడించి, అతీతముగనున్న పరతత్త్వముపై గౌరవముంచి, మనము జీవితము నెదుర్కొనవలయును. దానిచే నొకవిధమైన సమగ్రదృష్టి జీవితమున నుదయించి, దానిచే భూత వర్తమానములు తమ తమ గుణదోషములతో ప్రత్యక్షముకాగా, we may look with serenity towords the future 112 మనము భవిష్యత్తునకు ప్రశాంతముగ జూడవచ్చునని నెహ్రూ పండితుని సలహా.

అట్లయిన భౌతిక విజ్ఞానమునకు, ఆధ్యాత్మిక చింతనమునకు పొత్తు కుదరగలదా యను ప్రశ్న, ఆధునికులలో జాలమందికి గలదు. దానికి సమాధానముగ నాధునిక లోకమున, ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన తత్త్వవేత్త, మన ఉపరాష్ట్రపతి రాధాకృష్ణ పండితుడు, It is worng to imagine that science was opposed to religion. It was an unfortunate immpression and an untrue one. In all history of the world, whenever a religious thesis has to be sustained, it was sustained by the spirit and method of science 113 భౌతికశాస్త్రము, ధార్మిక చింతనమునకు వ్యతిరిక్తమనుట తప్పు. ఆ భావము దురదృష్టకరము, అసత్యము. ప్రపంచ చారిత్రమునందంతట, మతవిషయిక సిద్ధాంత ప్రతిపాదనమును సమర్థించుకొనువేళల, భౌతికవిజ్ఞాన శాస్త్ర తత్త్వవిధానములమూలముగమాత్రమే కావింపబడుచున్నవి.

112. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 442

113. Sir S. Radhakrishnan : Address, Indian Institute of Culture Bangalore, 29-5-1956

without more proof)46 ఇంతకుమించి ప్రమాణములు గోచరింప నందున ఆసురి కేవలము నామమాత్రమై, చారిత్రకుడని సమ్మ తింపజాలమనియు, (The epic asserts that he taught Panchasikha, whence no doubt comes the statement in the Karika) 46 నితడు పంచశిఖునకు బోధించినట్లు భారతము గట్టిగా వచించుచున్నది. ఇటనుండియే కారికావాక్య ముత్పన్న మగుట నిస్సందేహమనియు, (A. B. Keith) కీత్తు అభిప్రాయ పడెను. అనగా ఆధారము లగుపడకుండుటచే నా వ్యక్తియొక్క యునికియే సందేహాస్పదమని యీ విమర్శ్యాగ్రేసరుల తీర్మాన ముగానుండును. కాని పండితు లెల్ల రట్లు నిర్ణయింపక (Kapila is stated in the Sankhya Karika 70 to have taught his philosophy to Asuri who is mentioned in the Sathapatha Brahmana as a teacher Asurayana and Yaska who followed Asuri were the teachers of Jatukarnya a contemporary of Akshapada Gautama.) 47 శతపథబ్రాహ్మణము ననుసరించి చూచినచో అక్షపాదగౌతము నకు సమకాలికుడగు జాతుకర్ణ్యున కుపదేష్టలగు ఆసురాయణ, యాస్కులకు గురువగు ఆసురికి కపిలు డుపదేశించినట్లు 70 సాంఖ్య కారిక బోధించుచున్నది. కాన ఆసురి వ్యక్తిత్వమును సందే హించుట సమంజసము కాదు. అట్లే (It is said that Asuri popularised it and Panchasikha made it atheistic) 48 ఆసురియే సాంఖ్యమును ప్రసిద్ధిపరచెను. పంచశిఖుడు దాని నాస్తికమొనర్చెననియు (Asuri probably lived before 600 B.C. if he be one with the Asuri of the Sathapatha

46 Dr. A. B. Keith:- The Sankhya System p 47

47. Dr. Nandalal Sinha: The Sutras of Gotmaa

Brahmana) 48 ఇతడు శతపథబ్రాహ్మణములోగల ఆసురియే అయిన క్రీస్తుకుపూర్వము 600 సంవత్సరములకు చెందియుండు నని రాధాకృష్ణ పండితుడు అభిప్రాయమును వెలిబుచ్చెను. కాని కపిలాచార్య కాలనిర్ణయమునసే చర్చింపబడి తీర్మానింప బడినట్లు కపిలునితో దనశిష్యుడగు ఆసురియు నా కాలమునకు అనగా స్వాయంభువమనువు కాలమువాడై యుండక తప్పదని తాత్పర్యము.



పంచశిఖ.

'శ్లో॥ ఏతత్పవిత్ర మగ్ర్యం మునిరాసురయేనుకంపయా ప్రదదా।ఆసురిరపి పంచశిఖాయ తేన చ బహుధాకృతం తంత్రం॥' (సా. కా.70) పవిత్రమును పరమును అగు యీజ్ఞానమును కపిలు డనుకంపమున ఆసురికి బ్రసాదించెను. ఆసురియు బంచశిఖున కుపదేశింపగా నతడద్దాని బహుధాకృత మొనరించెనను ఈశ్వర కృష్ణుని వచనరీతిగా బరికింప బంచశిఖుడు ఆసురియొక్క శిష్య రత్నమనియు, నత డీసాంఖ్యమును బహురీతుల విస్తరింపజేసె ననియు దెలియనయ్యెడిని. ఈతనినుండియే గురుశిష్య పారంపర్య ముగా సాంఖ్యము ఈశ్వరకృష్ణునివరకు నవిచ్ఛిన్నముగా నేతెంచె నని 'శిష్య పరంపరాగతం' (సా. కా. 70) అని యీశ్వరకృష్ణుడే చెప్పుకొనియున్నాడు. కపిలప్రోక్తములని సాంఖ్యప్రవచన సూత్రము, తత్త్వసమాసలకొరకు వాదించువారున్నను, అది

48. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251

నిర్ధారితము కాకుండుటయు, అయినను (He seems to have been held in high esteem even by the advocates of other systems. His knowledge and integrity are praised even where his system is condemned) 49 అన్య సిద్ధాంతులనుండిగూడ నితడు గొప్ప గౌరవమున జూడబడుచుండెను. ఆతని సిద్ధాంతము ఖండింపబడు సమయములందుగూడ నాతని జ్ఞానాతిశయము నుతింపబడియుండుటకు గారణము, ఆతడు బ్రహ్మకృపాజనిత జ్ఞానసంపన్నుడై 'పురుషార్థజ్ఞాన మిదం గుహ్యాం పరమర్షిణా సమాఖ్యాతం' (సా. కా. 69) పురుషార్థమగు నీ రహస్యజ్ఞానమును పరమర్షియగు కపిలునిచే బ్రకటింపబడుటయై యుండనోపు. అందుచే నీతడు గ్రంథము నేదేని రచింపక సిద్ధాంత ప్రకటనమును మాత్రము జేసెననియు నా సిద్ధాంత రాజమును గ్రంథరూపమున జేసి బహుళప్రచార మొనర్చిన వాడు ప్రశిష్యుడగు పంచశిఖాచార్యుడే యనియు వ్యాఖ్యాత బలరామ ఉదాసీనుని అభిప్రాయము. పూర్వోక్తమగు ఈశ్వరకృష్ణవచనానుసరణి బహుధాకృతకర్త పంచశిఖుడనుటకు దార్ఢ్యణముగ నితడు షష్టితంత్రమనబడు ఉద్గ్రంథమును రచించెననియు నది 60,000 శ్లోకముల గొప్ప గ్రంథరాజ మనియు చైనాదేశీయ గ్రంథములు తెలుపుచున్నవని యందురు.

అంత ప్రశస్తుడగుట కారణమున నతని నామ మనేక సిద్ధాంతులచేత బ్రమాణముగా స్వీకరింపబడుచు బలుగ్రంథముల స్మరింపబడియున్నది. (1) యోగసూత్రభాష్యములో బెక్కు-

49. Dr. S. S. Suryanarayana Sastry:- Sankhya Karika

చోట్ల నతని వాక్యములు వ్యాసునిచే నుదాహరింపబడియున్నవి. (2) సాంఖ్య ప్రవచన సూత్రములలో రెండు పర్యాయములు యతని నామము సూచింపబడినది. భామతీకారుడైన వాచస్పతులును తన వ్యాససూత్రభాష్యమునందు (2. 2. 10) బంచశిఖాచార్య భావమును గైకొనెను. ఇక సాంఖ్యకారికా భాష్యకారుడైన గౌడపాదుడును ప్రథమముననే 'శ్లో॥ పంచవింశతితత్త్వజ్ఞో యత్ర కుత్రాశ్రమే రతః। జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః॥' (సా. కా. గౌ.1) అను పంచశిఖ వాక్యమును ప్రమాణముగ స్వీకరించియున్నాడు. ఈశ్లోకమును మరొక ప్రఖ్యాతవ్యాఖ్యాత మాఠరుడుకూడ నుపయోగించుకొని యున్నాడు. (సా కా మా.22)

అటులనేపురాణగ్రంథములందుగూడ పంచశిఖుడు జనక చక్రవర్తికి సాంఖ్యము నుపదేశించుటయు జనకుడు పంచశిఖునే తన గురువుగా జెప్పుకొనుటయు గననగును.50 షష్టి తంత్రశాస్త్ర కర్త యితడని కొందరనుచుండ, సాంఖ్యప్రవచన సూత్రముల నితడే విరచించినట్లు స్వప్నేశ్వరాదులును, 'తత్త్వసమాస' ను యితడు రచించెనని మరికొందరును భావించుచున్నారు. (The case of Panchasikha offers more difficulty, and he was often been treated as an authentic teacher) 51 పంచశిఖునివిషయము మరింతక్లిష్టమైనను అతడు ప్రామాణికాచార్యుడుగాపరిగణింపబడుచున్నాడని (A. B. Keith) కీత్తుపండితుడును (Panchasikha made it atheistic and attributed it to

50. మహాభారతము:- శాంతి 4, 6

51. Dr. A. B. Keith:, The Sankhya System p 47

Kapila) 52 సాంఖ్యమును పంచశిఖుడు నాస్తిక మొనర్చి కపిలున కన్వయించెను అని రాధాకృష్ణుడనుచు, (It is however, difficult to be difinite about all this) 52 కాని దీనిని స్థిరపరుచుట కష్టమని తీర్మానించెను. ఎందుచేత నన భారతము నగల పంచశిఖుడు జనకుని గురువుగా ప్రస్తావింపబడినప్పుడుగాని 'పంచశిఖో నామ కాపిలేయో మహామునిః' అని పేరెన్నికగనుట జూడ నటు బంచశిఖుడు నాస్తికుడు కానేరడు. కాని అసంపూర్ణములును క్లిష్టములును అనంతర కాలాంతర నర్తకనులును అగు సాంఖ్యకారికాది యీశ్వర ప్రతిపాదనారహిత సాంఖ్యశాస్త్రములతో బోల్చి యీపండితవర్గము క్లిష్టత్వమును జూచుచున్నారు. అందుచేతనే (It is difficult to decide whether the Panchasikha of the tradition is the same as the Panchasikha referred to in the epic since a divergence between the views attributed to him in the Mahabharata and those to be gathered from the Sankhya and Yoga works) 52 మహాభారతము నందును సాంఖ్యయోగశాస్త్రములందును పంచశిఖునకన్వయింప బడుచున్న యభిప్రాయములందు వ్యత్యాసముండుటచే సంప్రదాయక పంచశిఖుడును మహాభారత పంచశిఖుడును నొక్కరే యని నిర్ణయించుట కష్టమని రాధాకృష్ణపండితుని అభిప్రాయము. ఏదెట్లున్నను యిందరు పంచశిఖులున్నట్లు ప్రమాణము లేకుండుటచేతను పురాణముల బంచశిఖుడు కాపిలేయుడనబడుచు

52. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251

ఆస్తికవాదమునే ప్రచారమొనరించి యుండుటచేతను, విరుద్ధముగా గోచరించు నీ రెండుతత్త్వముల సమన్వయ మొనరించుటయే యుక్తము. ఆవిషయము ముందు కాననగును.

---

## ఇతరులు.

వింధ్యవాసుడు అనువాడు సాంఖ్యాచార్యులలో ప్రసిద్ధుడు. ఈత డొకసాంఖ్యగ్రంథమును రచించినట్లు వాడుక గలదు. ఈతడే యీశ్వరకృష్ణుడని కొందరును, వోఢు యని మరికొందరును భావించిరి. వింధ్యవాస అనునది నామము కాదనియు, అందుచే నట్లనబడువారు పెక్కురుండిరని కొందరి యూహ.

వార్షగణ్యుడును ప్రశస్తుడే. ఈతని వాక్యములు వ్యాస భాష్యమునందును, భామతియందును, సాంఖ్యకారికా భాష్యములందును ప్రమాణములుగా స్వీకరింపబడినవి షష్టితంత్రము నితడే రచించెనని కొందరి భావము.

జైగీషవ్యుడు యోగములో ప్రమాణపాత్రుడుగా గ్రహింపబడును. ఆతని యోగశక్తిచే 'భగవతో జైగీషవ్యస్య సంస్కార సాక్షాత్కారణా ద్దశసు మహాసర్గేషు జన్మపరిణామ క్రమ మనుపశ్యతో వివేకజం జ్ఞానం ప్రాదురభూత్'. (యో. సూ. భా. 2-55, 3-18) భగవంతుడైన జైగీషవ్యుడు సంస్కార సాక్షాత్కారము నొందుటచే పది మహాసర్గలవరకు గల జన్మ పరిణామ క్రమ జ్ఞానమును పొందెను అని తెలుపబడినది బుద్ధ

చరిత్రలో యీజైగీషవ్యుడు, జనక పరాశరులు సాంఖ్యముమూల మున ముక్తులైనట్లు గలదు (12.67). మహాభారతమున నితడు దేవలునకు సాంఖ్యము నుపదేశించినట్లు గోచరించును.

అసితదేవళ అనియు దేవల అనియు జైగీషవ్యుని దగ్గర సాంఖ్యమును గ్రహించినవాడు ప్రఖ్యాతుడే. అతనికిని నారదునకును భారతమున సంవాదము కాననగును. ఈతడు ధర్మ శాస్త్ర కర్తయగుటచే యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యయైన అప రార్కుయందు నితడు ప్రమాణముగా గొనిరి. అంతటి సుప్రసిద్ధ ధర్మశాస్త్రకారులచేగూడ సాంఖ్య మవలంబింపబడియుండుటచే నది యవశ్యము ఖండనీయమని 'దేవలప్రభృతిభిశ్చ కైశ్చిద్ధర్మ సూత్రకారైస్స్వగ్రంథేష్వాశ్రితః తేనతత్ప్రతిషేధ ఏవయత్నోఽ తీవ కృతః' (1.4.28) అనుచు శ్రీ శంకరులు బ్రహ్మసూత్ర భాష్యమున సాంఖ్యమును ఖండించిరి. ఇతడు బృహస్పతి, కాత్యాయనుల కాలము వాడని కొందరి అభిప్రాయము.

సనక సనందాదులు నారదుడును, భారతపురాణ మున, సాంఖ్యోపదేష్టలుగా రూపింపబడియుండిరి. ఇతరుల విషయమేమియు దెలియరాదు.

---

## ఈశ్వర కృష్ణుడు

ఇంతవరకు సాంఖ్యకారికా కాల పూర్వుల విచారించి యుంటిమి. ఇక కారికాకారుడైన యీశ్వరకృష్ణుని విషయ మిసుమంత తెలిసికొన యత్నింతము. 'శ్లో॥ శిష్య పరంపర

యాగత మీశ్వరకృష్ణేన చైతదార్యాభిః। సంక్షిప్త మార్యమతినా సమ్యగ్విజ్ఞాయ సిద్ధాంతం॥' (సా. కా.70) శిష్య పరంపరాగతమగు నిది నార్యా ఛందమున, సిద్ధాంతము సంపూర్ణముగా గ్రహించియున్న యీశ్వరకృష్ణునిచే సంక్షిప్తము చేయబడినదని, తనకారికా సమాప్తమున నీశ్వరకృష్ణుడు చెప్పుకొనియున్నాడు. ఈకారికాగ్రంథమున డెబ్బదిశ్లోకములుండుటచే 'శ్లో॥ సప్తత్యాం కిల యేఽర్థా స్తేఽర్థాః కృత్స్నస్య షష్టితంత్రస్య॥' (సా. కా. 70) ఈసప్తతిలో షష్టితంత్రముయొక్క సంపూర్ణ విషయములు గ్రహింపబడి యున్నవనియు వ్రాసియున్నాడు. ఈశాస్త్రము సుప్రసిద్ధమై (It provides a clear and definite exposition of the Sankhya to this day)53 నేటివరకు స్పష్టమును నిర్ధారితమునగు సాంఖ్యవివరణము నిది యొసంగుచున్నది. అందుచేతనే (It has been the basis of all later Sankhya treatises and criticisms) అనంతర వ్యాఖ్యలకును ఖండనములకును యిదియే యాధారమైయున్నదని సోవాని వ్రాసియున్నాడు. (The oldest systematic manual which has been preserved is the Sankhya Karika of Iswara Krishna) 54 ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికయే మనకు జాగ్రత పరుపబడిన అతిప్రాచీన సక్రమవివరణగ్రంథమనియు (The oldest and completely preserved) 55 ప్రాచీనతమమును సమగ్రమును అని (Macdonell) మాక్డొనెల్ దానిని స్తుతించెను. అట్లే (The Sankhya Karika of Iswara

53. Dr. V. V, Sovani: A critical Study of The Sankhya System p 9
54. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p 385
55. Dr. A. A. Macdonell: India's Past

Krishna is the earliest available as well as the most popular text book of the school) 56 ఈశ్వరకృష్ణుని సాంఖ్య కారికయే ప్రథమమును సుప్రసిద్ధమును అయి లభ్యమానమగు గ్రంథముగా రాధాకృష్ణపండితుడును, (Sankhya Karika is a work of oldest exposition of Kapila's philosophy that has come down to the present time) 57 ఆధునిక కాలము వరకుగల కాపిలేయ సిద్ధాంత వివరణములలో సాంఖ్యకారికయే అతి ప్రాచీనగ్రంథమని (John Davis) జాన్ డేవిసు, రచించిరి. మరియు ఫ్రాన్సు దేశమున సంస్కృత భాషా కోవిదుడగు (Auguste Barth) ఆగస్టు బార్త్ (The pearl of the whole scholastic literature of India) 58 భారతీయ తత్త్వశాస్త్ర పండిత వాఙ్మయములో నిది ముత్యముగా వర్ణించియున్నాడు. (Max Muller) మ్యాక్సు ముల్లరుకూడ (Our first definite text is the Sankhya Karika of Iswara Krishna) 59 ఈశ్వర కృష్ణుని సాంఖ్యకారికాగ్రంథమే సుస్పష్ట ప్రాచీనగ్రంథమని వాకొనెను. దీనికే హిరణ్యసప్తతి యనియు సువర్ణసప్తతి యనియు ప్రతీతి గలదు. జైనగ్రంథములలో దీనినే కనకసప్తతి లేక కనకసప్తతియనియు నందురు. చైనాదేశమున నిది సాంఖ్య సప్తతి యనియు ప్రఖ్యాతము. ఇంత బహుళ ప్రశస్తమగు నీగ్రంథము పరమార్థుడను భారత ప్రచారకునిచే 557-569

56. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251
57. Dr. John Davis: Sankhya Karika
58. Dr. A. A, Macdonell: India's Past
Max Muller: The Six Systems of Indian Philosophy p 489

A.D ప్రాంతమున చైనాభాషలోని కనువదింపబడి ప్రచారము గాంచెను. అందుచేతనే యనేక భాష్యములచేగూడ నిది యలంకరింపబడియున్నది అయినను తద్రచయిత మాత్రము పూర్తిగ నగావ్యముగ నుండుట మిగుల విచారకరము. (From Buddhist sources we hear of an older contemporary of Vasubhandhu (320 A.D.) Varshaganya, who wrote a Shashti Tantra on the Sankhya, his pupil Vindhyavasa corrected his master's views in a set of 70 verses known as the Golden Seventy verses. It is natural to identify Vindhyavasa with Iswara Krishna, and though the identity is unproven, it is not improbable) 59 క్రీస్తుకు పిమ్మట 320 సంవత్సరమునగల వసుబంధునికి జ్యేష్ఠుడగు సమకాలికుడు గలడని బౌద్ధ గ్రంథములనుండి తెలియుచున్నది. సాంఖ్యమునుగూర్చి ఒక షష్టితంత్రమును రచించిన వార్షగణ్యుడే అతడు. ఆతని శిష్యుడగు వింధ్యవాసుడు తన గురుభావముల సవరించి 70 శ్లోకముల వ్రాసెను. ఈశ్వరకృష్ణుని వింధ్యవాసునితో నేకముగా జూచుట స్వాభావికమే. అది నిర్ధారణము కాకపోయినను అసంభవముకాదు, అని (Max Muller) మ్యాక్సు ముల్లరు తెలుపుచున్నాడు అనగా ఈశ్వరకృష్ణుడు వింధ్యవాసుడే యనియు నీతడు క్రీ.త, 320 తర్వాతవాడని యూహించెను. క్రీ, త. 5వ శతాబ్దమువాడని కొందరును, 280-360 వాడని కొందరును 60 నిర్ణయించిరి. కాళీపాదభట్టాచార్యులు 61

60. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p. 251
61. Dr. Kalipada Bhattacharya: Some Problems of Sankhya Philosophy and Sankhya literature

ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాఽశుద్ధమేవ చ। అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం॥' (మైత్రాయణ. 4.4.6) శుద్ధాశుద్ధ రూపమున మనస్సు ద్వివిధము. కామసంకల్పాత్మకము అశుద్ధము, కామవివర్జితము శుద్ధమనునటుల శుద్ధమైనదై, 'న హ్యధ్రువైః ప్రాప్యతె హి ధృవం తత్' (కఠ. 1.2.10) ఆ స్థిరమగు బ్రహ్మము అస్థిరములచే తన ప్రాప్యముగాన, నా స్థిరత్వ ప్రాప్తికై, యిసుమంత విషయముల దగ్గించి, దృష్టుల నా బ్రహ్మాన్వేషణ కార్యమున మగ్నము గావింపవలయునని శ్రుతి ఆదేశము. అందువలన, ఒకప్రయోజనమునే గోరుచో నీ విషయములవలన గలుగు తాత్కాలిక అల్ప, క్షణిక సుఖములకంటె 'తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతే ఽయనాయ' (శ్వే. 6.15) దాని గ్రహించి, మృత్యువునకతీతస్థితి నొందుచున్నాడు. ఈ స్థితికి మార్గాంతరము లేదు అనియు నుపనిషత్తుల హెచ్చరిక. అనగ నేమి యనియు సందేహించినచో, 'యేఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం' (కఠ. 1-5-12) అట్లుగాంచిన ధీరులు అనగా వివేకవంతులు, నిత్య సుఖమును బొందుచున్నారు. ఇతరులు దాని బొందజాలరు అనియు, నుపనిషత్తు రహస్యమును వెలిబుచ్చియున్నది.

కావున What matter is not our knowledge of God but attitude towards God [134] భగవంతునిగూర్చి మనకుగల బుద్ధియే ప్రధానమనునటుల విశుద్ధ చిత్తమున నాతని గ్రహించి, వినమ్రచిత్తమున సర్వార్పణము గావింపకున్నచో సర్వము నిష్ఫలము. అదేవిధముగ Whatever conception

134. Karl Jaspers : Way of Wisdom p 47

## కారికా భాష్యకర్తలు.

ఈ సాంఖ్యకారికలకు క్రీ. త. ఒకటవ శతాబ్దములో మాఠరుడు వృత్తినామక వ్యాఖ్య నొకదు సృజించెను. ఇది కారికలకు ప్రథమ వివరణగ్రంథమై యుండునని కొందరిభావము. దీనిని సంక్షిప్తమొనర్చి గౌడపాదుడు భాష్యము వ్రాసి యుండు నని కొందరు తలంతురు. కాని వృత్తి యనునది భాష్యము నకు పిమ్మట రచితమగుననియు, కాన భాష్యము మొదటిదనియు తర్వాతనే మాఠరవృత్తియని రాధాకృష్ణుని అభిప్రాయము. గౌడపాదుడు 'శ్లో॥ అల్పగ్రంథం స్పష్టం ప్రమాణసిద్ధాంత హేతు భిర్యుక్తం। శాస్త్రం శిష్యహితాయ సమాసతోహం ప్రవక్ష్యామి॥' (సా. కా. గౌ. 1) శిష్యహితము నపేక్షించి, యీ శాస్త్రమును అల్పముగను స్పష్టముగను, ప్రమాణసిద్ధాంత హేతువులతో వ్రాయుచున్నాను అని ప్రథమమునను 'శ్లో॥ సాంఖ్యం కపిల మునినా ప్రోక్తం సంసార విముక్తికారణం హి। యత్రైతాః సప్తతిరార్యాభాష్యం చాత్ర గౌడపాదకృతం॥ (సా, కా. గౌ. 69) సంసారవిముక్తి కారణమైన సాంఖ్యమును కపిలముని వచించెను. ఇందు సప్తతి శ్లోకములును గౌడపాద భాష్యమును సమాప్తము అని స్మరించి గౌడపాదుడు భాష్యమును రచించెను. ఈ భాష్య ముత్తమమని (Excellent commentary on the Sankhya Karika)[64] (Macdonell) మాక్డొనెల్ వ్రాసెను. ఇంతకంటె సుప్రసిద్ధుడై మాండూక్యోపనిషత్తునకు కారికాకారుడై శ్రీశంకర

64. Dr. A. A. Macdonell: A Hsitory of Sanskrit literature p 385

భగవత్పాదుల సంస్తుతిపాత్రుడై అద్వైతాచార్యుడైన గౌడపాదు లోకమంతటిచే నీయబడు లోక గౌరవమును సందియము ముత్పన్న మగును. అందుచేత (Gaudapada the eminent Vedantist and teacher of Sankara's teacher Govinda, wrote a commentary to Iswara Krishna's Sankhya) శంకరుని గురువగు గోవిందుని గురువగు గౌడపాదుడను ప్రఖ్యాత వేదాంతి ఈశ్వరకృష్ణసాంఖ్యమునకు భాష్యమును రచించెనని (Dr.E.Roer) రోయరు వ్రాసెను. ఈ విషయమునే విమర్శించుచు (Gaudapada wrote a commentary on the Karika, whether this commentator is the same as the author of the Karika on the Mandukyopanishad cannot be decided in view of the diversent of thought between the two works) 65 కారికలకు గౌడపాదు లొక భాష్యమును విరచించెను, మాండూక్యోపనిషత్తునకు కారికలు రచించినవా డితడేనని తీర్మానించుట కష్టసాధ్యము. ఆ రెండు రచనలకు భావవైరుధ్యము గలదని రాధాకృష్ణపండితుని అభిప్రాయము. అదియునుగాక ప్రఖ్యాతుడైన అద్వైతాచార్యుడు సాంఖ్యకారికలవంటి గ్రంథమునకు అనిష్టముగా వ్యాఖ్య వ్రాయుటయు, సదియు మతము ననుసరించి రచించుట అసంబద్ధమనియు అంతటివానికి గౌరవము కానియు గాదని పండితాభిప్రాయము. మరియు విరుద్ధ భావముల బోధించు కారికలకు అద్వైతపు వివరణము లిఖించునా అను సందేహముగూడ గలుగును. కాని అల్పగ్రంథమును రచించుట కారణము కాజాలదు. సందిగ్ధవ్యక్తుల గ్రంథములనే

65. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251

ఈ రహస్యమును బూర్వమే యెరింగియున్న మన శ్రుతులుగూడ నిట్లే బోధించుచున్నవి. 'తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యం' (శ్వే. 6.13) దాని గ్రహించుకొనునది సాంఖ్య, యోగములే యని శ్వేతాశ్వతరముపదేశించుచుండ, 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, (ముం. 3.2.3) వేదజ్ఞానముచేగాని, దాని గ్రహణముచేగాని, వివిధ విజ్ఞానములచే గాని యీ యాత్మ గ్రహింపబడదని ముండక శ్రుతి హెచ్చరించు చుండ, పరమ గుహ్యమైన యీ వేదాంతవిద్యను, 'నాప్రశాం తాయ దాతవ్యం' (శ్వే. 6.22) ప్రశాంతిలేనివానికి బోధింపగూడ దనిగూడ శ్వేతాశ్వతరము నిషేధించినది. అయిన నింత కష్టసాధ్య మైనదానికై ఎందుకు ప్రయాస యనుచో, బూర్వ గ్రంథపఠనము మరియొక పర్యాయము గావింపవలయునని సలహా. అట్లైనను ప్రపంచోత్పత్తినుండి నేటివరకు, మానవుడెన్ని విషయముల నాలోచింపలేదు! ఎన్నింటికై కృషి సలుపలేదు! కొన్నివేళల నిష్ఫలము కాలేదు! నేటికిని, సామాన్య మానవునికి ప్రస్తుతమప్ర యోజనమైన ఎన్నివిషయములలో అతిసాహసముగ మానవ ధీశక్తి ప్రవేశించుటలేదు! ఎవరెస్టు నధిరోహించుట ఎందులకు? పసిఫిక్ మహాసాగరమున మునుగుట ఎందులకు? గ్రహాంతరాళ గవేష ణములెందుకు? ఈ సాహస చర్యలు ప్రత్యక్షముగ సామాన్య మానవునకెట్లుపయోగపడుచున్నవి? కాని యిది ఆ విధముగాక, మానవునకన్యముకానిది, మానవ ప్రవృత్తులకు, బుద్ధికి, తత్త్వము నకు, పరముగాని పరమతత్త్వ విచారణముగావించి, దాని సుగాఢ గుప్త రహస్యముల గ్రహింప యత్నించి, ఏయొక్క అదృష్ట వంతుడో సాధించి కృతకృత్యుడైనచో, దా దుఃఖ నివృత్తినొంది

## సాంఖ్య గ్రంథములు: షష్టితంత్రము.

సాంఖ్యదర్శనమునకు సాంఖ్యకారికాంతర్గతముగాక మరి కొన్ని గ్రంథములు గోచరించుచున్నవి. వానినిగూర్చి సూక్ష్మముగా జర్చించు టవసరము. సాంఖ్యకారికలకు మూల గ్రంథములలో ముఖ్యమైనది 'సప్తత్యాం కిల యేऽర్థాస్తేऽర్థాః కృత్స్నస్య షష్టితంత్రస్య' (సా. కా. 70) అనునట్లు కారికా గ్రంథమున కాధారభూతమైన షష్టితంత్రమునుగూర్చి యించుక విచారింతము. షష్టితంత్రమునగల 'ఆఖ్యాయికా విరహితాః పర వాద వివర్జితాశ్చాపి' (సా. కా. 70). అను కారికాంశము వలన ఆఖ్యాయికలను పరవాదఖండనలను తొలగించి సప్తతి వ్రాయ బడినట్లు విదితము. ఈషష్టితంత్రమను పేరుగల గ్రంథకర్త యెవరను విషయము అనిర్ధారితము. సాంఖ్యమున షష్టి విషయములు గలవనియు నదియే షష్టితంత్రమనబడినదనియు నందురు. షష్టితంత్రము రెండు మండలములుగల గ్రంథమనియు నందు 32 ప్రకృతులు, 28 వికృతులును వర్ణింపబడి యున్నవనియు అహిర్బుధ్నసంహితలో 66 [illegible] కాని జైన గ్రంథములననుసరించి [illegible] శ్లోకములుగల గ్రంథమని అభిప్రాయము. పద్యరూపమున నొకటియు గద్యరూపమున నొకటియు రెండు షష్టి తంత్రములు గలిగియుండునని కొందరి యభిప్రాయము. 66 [illegible] షష్టితంత్రికర్త పంచశిఖుడు, [illegible]

66. Dr. Har Da''ta Sharma: Sankhya Karika;
Dr. V. V, Sovani: A Critical Study of the Sankhya System

యింకనుగలము. 'పంచశిఖేన మునినా బహుధాకృతం తంత్రం। షష్టితంత్రాఖ్యం షష్టిఖండం కృతమితి। తత్రైవ హి షష్టిరర్థా వ్యాఖ్యాతాః' [67] అను వాక్యానుసరణముగ షష్టితంత్ర మరువది ఖండముల గ్రంథమనియు, దానికర్త పంచశిఖుడనియు నందు అరువది విషయములు చర్చింపబడియున్నవనియు విదితము. కాని 'కపిలమహర్షి ప్రణీత షష్టితంత్రాఖ్యస్మృతేః' (వే.సూ 2.1.1) అని భాస్కరాచార్యులు తెలిపియుండుటచేతను మరి యితర కారణముల నాధారముగాగొని దానికర్త సాంఖ్యదర్శనాచార్యుడగు కపిలమునియే యని ఉదయవీరశర్మరయొక్క తీర్మానము. (వే. సూ. 2.1.1) కాళీపాదభట్టాచార్యుడుగూడ దీని విశ్వసించి నాయాది షష్టితంత్రమును పంచశిఖాచార్యుడు తన షష్టితంత్రమున విస్తృతపరచెనని భావించెను (సా.కా.26). అనగా వీరి అభిప్రాయము ప్రకారము కపిలప్రోక్త షష్టితంత్రము, పంచశిఖ కృత షష్టితంత్రముగా రెండు గ్రంథములుండనగునని యూహా' కాని షష్టితంత్రము 60 భాగములుగలదనియు, అది 60 విషయముల చర్చించుననియు, అందుచేత షష్టితంత్రమనా బేరు బొందెననియు, దాని రచయిత పంచశిఖాచార్యుడేయనియు హిరియన్న పండితుడు తీర్మానించెను [68]. కాని యీ షష్టితంత్రమలభ్యమగుటచే దానికర్త విషయమును దాని విషయమును యింక ననిర్ధారణముగనే యున్నవి.

---

67. Dr. Har Datta Sharma: Saṅkhya Karika P 27.
68. Prof. Hiriyanna: Shashti Tantra and Varshaganya.

## సాంఖ్య ప్రవచన సూత్రము.

సాంఖ్య సిద్ధాంతమునగల లభ్యమాన గ్రంథములలో సాంఖ్యసూత్రములు ప్రధానములు. దీనినే సాంఖ్య ప్రవచన సూత్రమనియు నందురు..'శ్రుత్యవిరోధినీ రుపపత్తిః షడధ్యాయీ రూపేణ వివేక శాస్త్రేణ కపిలమూర్తి ర్భగవాన్ ఉపదిదేశ' శ్రుతికి విరోధము కాని యీ ఆరధ్యాయముల గ్రంథమగు వివేకశాస్త్రమును కపిలభగవాను డుపదేశించెను, అను విజ్ఞాన భిక్షువు వచించినసరణి యిది ఆరధ్యాయముల గ్రంథము. మొదటి అధ్యాయమున 164 సూత్రములుగలవు. ద్వితీయమున 47 ను, తృతీయాధ్యాయమున 84, నాలుగవ దానిలో 32 ను, పంచమాధ్యాయమున 129 యును, కడపటిదగు షష్టమున 70 సూత్రములును గలిగి మొత్తమునకు 526 సూత్రగ్రంథము. దీనికర్త కపిలాచార్యుడేయని భిక్షువన్నట్లు 'కర్దమాద్దేవహూత్యా మభిజాతస్య సేశ్వర సాంఖ్యవాదినః కపిలస్యోపదేశసూత్రాణి' (సా. సూ.) కర్దమ దేవహూతుల కన్నకుమారుడును సేశ్వర సాంఖ్యవాదియునగు కపిలోపదేశ సూత్రములని మేధాకరశాస్త్రి వ్రాయుచున్నాడు. కాని (There is no evidence to show that Sankhya Pravachana Sutra and Tatwa Samasa generally attributed to Kapila were composed by him) 69 సాధారణముగ సాంఖ్యప్రవచనసూత్రములకు తత్త్వసమాసమునకు కర్తృత్వము కపిలున కాపాదించుటకు దగునాధారములు లేవని రాధా

---

69. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251

కృష్ణునిఅభిప్రాయము. ఎందులకనగ సాంఖ్యమునుగూర్చి రచించిన గౌడపాద, మాఠర, వాచస్పతి, మొదలైనవారేమి, ఖండించిన శంకర మాధవాదులేమి, దీని ప్రశంస నెత్తకుండుటచే నాకాలమున నిది లేక ఆకర్తల తర్వాతనే సూత్రరచనమై యుండునని విజ్ఞుల వాదము. కపిలప్రోక్త సూత్రము లుండ ఆ విమర్శకులు కారికల గైకొనుట అహేతుకమేయగును. కాన ప్రవచన సూత్రములు (Sankhya Sutras have been proved by Dr. F. Hall to be not earlier than about 1380 A.D. and they may be even later. Therefore these Sutras should be looked upon as a mere refaccimenis to take the place of earlier sutras, which as early as the 6th century A. D. had probably been already Superceded by the popular Sankhya Karikas and then forgotten)[70] సాంఖ్య సూత్రములు క్రీ.త. 1380 సంవత్సరములకుబూర్వము కానేరవని డా. హాల్ నిరూపించెను. అవి యింకను అర్వాచీనములు కావచ్చును. ఆరవ శతాబ్దమునకు బూర్వమే ప్రఖ్యాతమగు సాంఖ్యకారికా ప్రాబల్యముచే వెనుకబడి విస్మరింపబడిన సూత్రములకు యీసూత్రములు పునర్నిర్మాణములై యుండవచ్చునని (Max Muller) మ్యాక్సుముల్లరు వ్రాసిరి, ఇవి చాల అర్వాచీనములనియు పదునైదవ శతాబ్దమున నీరూపుదాల్చి యుండవగుననియు, (but is in all likelihood based on another Sankhya Sutra that was known many centuries earlier)[71] అనేకశతాబ్దములకు పూర్వముగల మరొక సాంఖ్యసూత్ర

70. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 84
71. Dr. A. A. Macdonell: India's Past.

గ్రంథమును ప్రాతిపదికగాగల గ్రంథమై యుండవచ్చునని (Macdonell) మాక్డోనెల్ పూర్వాభిప్రాయమునే అనుసరించిరి. ఈసాంఖ్యప్రవచనసూత్రములకు విజ్ఞానభిక్షువు భాష్యమును రచించెను. దానికి వృత్తిని అనిరుద్ధుడు నిర్మించెను.

---

## తత్త్వసమాస.

సాంఖ్యమున ప్రఖ్యాతమయిన 'తత్త్వసమాస' అనునది మూడవది. ఇది చాల ప్రాచీనమని మ్యాక్సు ముల్లరు అభిప్రాయపడెను. కాని (The Tatwa Samasa Sutras--strikes us as being a rather later index of some pre-existing Sutra work) 72 తత్త్వసమాససూత్రము పూర్వకాలీనమగు నొక సూత్రగ్రంథమునకు విషయసూచికవలె నగుపించునని శ్రీనివాస అయ్యంగారు వచించుట ఉచితమనిపించును. ఇది చాల ప్రఖ్యాతమని (Max Muller) మ్యాక్సు ముల్లరు భావించియున్నను, దీనికి భాష్యములు కాని, విమర్శనలుగాని కానుపించని కారణమున నిది కారికలవలె గాకపోయినను ప్రవచన సూత్రరీతిగనైన సన్మానింపబడలేదని విదితము. "సమాస" యనుటచే నిది మరొక యుద్గ్రంథముయొక్క సంక్షిప్తస్వరూపముగా గార్బే 73 భావించెను. అంతియగాక నది (at any

---

72. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 108

73. Dr. V. V. Sovani: A critical Study of the Sankhya System p 9

rate is not of much philosophic importance) 74
తాత్త్వికప్రాధాన్యతగలది కాదనియు బండితులు తీర్మానించిరి.

---

## రాజవార్తిక.

'రాజవార్తిక' అనునది మరొకటి నామమాత్రముగ గలదు గాని గ్రంథరూపమున నలభ్యము. యోగసూత్రములకు 'రాజమార్తాండా'ది గ్రంథ కర్తయగు భోజరాజు దీనికి కర్త యయి యుండునని కొందరి అనుమానము.

---

74. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 108

# సాంఖ్య దర్శన చరిత్రము

## సాంఖ్య ప్రాచీనత—ప్రాధాన్యత

శ్లో॥ నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్।
తత్కారణం సాంఖ్యయోగాధి గమ్యం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వ పాశైః॥ (శ్వే 6.13)

అనిత్యములలో నిత్యమును, అచేతనములలో చేతనమును అనేకములలో నేకమును కామప్రదాతయు నగు నాబ్రహ్మమును సాంఖ్యయోగములచే నెవ్వడు తెలిసికొనునో అతడు సర్వబంధములనుండి విముక్తిగాంచును.

శ్లో॥ యో యోనిం యోనిమధి తిష్ఠ త్యేకో
విశ్వాని రూపాణి యోనిశ్చ సర్వాః।
ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే
జ్ఞానై ర్బిభర్తి జ్ఞాయమానం చ పశ్యేత్॥ (శ్వే 5.2)

ఒక్కడగు నేపరమాత్మ సర్వరూపములను వాని యుత్పత్తికారణములను నియమించునో, సృష్ట్యాదిలో దనకుమారుడగు కపిల మహర్షికి, పుట్టినప్పుడనే చూచి సర్వజ్ఞానముల బ్రసాదించెనో యనుచు విస్పష్టలీల సాంఖ్యమునే గాక, సాంఖ్యదర్శనకర్తయగు కపిలమహర్షినిగూడ శ్వేతాశ్వతరోపనిషత్తు స్మరించుచున్నది. ఇట్లుపనిషత్ప్రతిపాదితమును, తత్పూర్వమును అగుటచే బూర్వ

ప్రకరణమున నిర్ణయింపబడియున్న రీతి (of all the philosophical systems, Sankhya has been considered by all to be the most ancient) [75] సకల తత్త్వ సిద్ధాంతములలో సాంఖ్యమతి ప్రాచీనముగ పరిగణింపబడియున్నదనియు (The Sankhya is one of the oldest systems of thought and we find it already prominent at the threshold of philosophical enquiry) [76] తత్త్వవిచారణముయొక్క ముఖద్వారముననే ప్రముఖస్థానమలంకరించియున్నది సాంఖ్యమని సాంఖ్యశాస్త్ర గవేషణమునందు ప్రబలప్రామాణికులును ఆధునిక పండితులును అగు హరదత్తశర్మ, వి. వి. సోవాని ప్రభృతుల సుస్థిరాభిప్రాయము. ఇట్లు ప్రాచీనతయేగాక, వివేకానందస్వామివచనములలో (Sankhya is the basis of the philosophy of the whole world) [77] సర్వప్రపంచతత్త్వశాస్త్రమునకు సాంఖ్యము పునాదియనియు (There is no philosophy in the world that is not indebted to Kapila) [77] కపిలసహాయమును పొందని తత్త్వశాస్త్రము ప్రపంచమున లేదనియు నిశ్చయము. అంత ప్రాచీనమైయున్నను ఆధునికమునకు సమన్వయింపని కాలాంతరస్థితిని బొందియుండక (The system so ancient in birth and so modern in spirit) [78] ప్రాచీనజన్మమును ఆధునికతత్త్వమును గలిగి వినూత్నశోభనశీలమై యొప్పుచున్న దీసాంఖ్యము. ఇట్టి అద్భుత ప్రాధాన్యత

---

75. Dr. Har Datta Sharma: Sankhya Karika p 1

76. Dr. V. V. Sovani: A critical Study of the Sankhya System p 2

77. Swami Vivekananda: The complete Works Vol 2 p 448

78. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy P 109

గలదని గమనించితో (In Kapila's doctrine for the first time in the history of the world, the complete independence and freedom of the human mind, its full confidence in its powers, were exhibited) 79 (ప్రపంచచారిత్రములో ప్రథమతః సాంఖ్యదర్శనశాస్త్రమునందు మనోస్వాతంత్ర్యత దాని స్వశక్తిసామర్థ్యములందు సంపూర్ణవిశ్వాసమును ప్రకటితమై యున్నదని (Richard Garbe) రిచర్డ్ గార్బుయును, (The Sankhya philosophy of Kapila was the first rational system that the world ever saw) 80 (ప్రపంచము మున్నెరుంగని ప్రథమ యౌక్తికవిధానము కపిలప్రోక్త సాంఖ్యసిద్ధాంతముగా వివేకానందస్వామియు, (The system of Kapila may be said to have only an historical value, but on this account alone it is interesting as a chapter in the history of human mind) 81 కపిల సిద్ధాంతమునకు చారిత్రక ప్రాధాన్యతగలదు. అందుచేత, మానవమనోచారిత్రమున నిది చాల అద్భుతముఅని తజ్ఞుల నుడులు. ఎందుచేతనన (It is the earliest attempt on record to give an answer from reason alone to the mysterious questions which arise in every thoughtful mind, about the origin of the world, the nature and relations of man and his future destiny) 81 (ప్రతి యోచనాశీలమగుచిత్తములో, ప్రపంచసృష్టినిగూర్చియు, మానవుని ప్రకృతి, సంబంధములు, వాని భవిష్యన్నిర్ణయములగూర్చి

79. Dr. Richard Garbe: Philosophy of Ancient India p 3
80. Swami Vivekananda: The Complete Works Vol 2 p 443
81. Dr. John Davis: Sankhya Karika

గలుగు అగోచరసమస్యలకు యుక్తియుక్తముగా సమాధానముల నొసంగు (ప్రథమయత్నమే సాంఖ్యమని John Davis) జాన్ డేవిసు మొదలగు పండితప్రకాండులు వ్రాయుచున్నారు. అంతియగాక (The Sankhya is a finished metaphysics and a finished psychology) [82] సాంఖ్యము పరిపక్వమైన తత్త్వశాస్త్రమును, మనోధర్మశాస్త్రమునై విరాజిల్లును. ఎందుచేతనన (How completely free from traditional religion and bias the systems are, will be obvious from the fact that the Sankhya is silent about the existence of God, though certain about its theoritical indemonstrability) [83] భగవదాస్తికత, యుక్తిమూలమున నిరూపణాసాధ్యము కాదని నిర్ధారణముగ గ్రహించియుండియు సాంఖ్యము దాని విషయమున మౌనము ధరించునను సత్యము ననుసరించి చూడ దర్శనములు సాంప్రదాయికమతములనుండి ఎంతస్వతంత్రమో వ్యక్తమనియు, అందుచేత (Sankhya is a notable attempt in the realm of pure philosophy) [84] శుద్ధతత్త్వశాస్త్రమున సాంఖ్యము ప్రఖ్యాత యత్నమనియు రాధాకృష్ణుడు వాదించును. ఈవిషయమునే (John Davis) జాన్ డేవిసు కూడ (The System of Kapila, called the Sankhya or Rationalistic -- contains nearly all that India has produced in the department of pure philosophy) [85] సాంఖ్యమనబడు కాపిలేయదర్శనము,

---

82. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 108
83, Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol I p 27
84. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 248
85. Dr, John Davis: Sankhya Karika

సృష్టితత్త్వ విషయమున భారతావని వెలువరించిన విషయసమా గ్రతను బొందియున్నదని ప్రస్ఫుటపరచెను. మహాభారత పురాణము కూడ సాంఖ్యతుల్యజ్ఞాన మెందును లేదని స్తుతించు చున్నది (శాం. 2.316), ఇన్ని సంస్తుతులకు కారణము (Though physics and metaphysics are clearly distinct and cannot be blended, still a philosophic scheme must be in harmony with the results of natural science) 86 ప్రకృతి తత్త్వశాస్త్రములు వ్యతిరిక్తములై ఏకసమన్వయమొనరింప నసాధ్యములైనను, ప్రకృతి శాస్త్రఫలితముల కన్వయించుచు తాత్త్విక విధానమొప్పారవలయును. (But to extend to the universe at large what is true of physical world, would be to commit the fallacy of scientific metaphysics, and the Sankhya asks us to be beware of the danger) 86 అట్లుకాక ప్రాకృతిక ప్రపంచధర్మముల సర్వవిశ్వమున కన్వయించుట హేత్వాభాసమే యగుననియు నట్టి అపాయమునుండి మనల సాంఖ్యము హెచ్చరించుచున్నదని రాధాకృష్ణపండితుడు హెచ్చరించెను. అనగా భౌతికాభౌతిక సమన్వయమే సాంఖ్య తాత్పర్యమని దీని యన్వయము. కావున (The Sankhya proves its conclusions by the intellectual analysis of human experience - - . In this path each man can start only with his own experience, and starting there from, he denudes it of all that is not himself) 87 మానవ నిత్యాను

---

86. Prof. S. Radhakrishnan: Indian philosophy Vol 2 p 769

87. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 108

భూతిని సయుక్తికవిచారణమున సాంఖ్యము నిరూపించును. ఈపథమున ప్రతివ్యక్తి స్వానుభవమున ప్రారంభించి, యట నుండి తన కన్యమగు సర్వమును బయలుపరచును, అనియు ననగా (The Sankhya endevours to give an intelligible account of all experience, why we have it and how we acquire it) 88 ఎందు కనుభవ మవసరమో, ఎట్లు అనుభూతిని సాధించుటో మొదలగు అనుభూతి సంతతినిగూర్చి సాంఖ్యము సువిస్పష్ట వివరణమొసంగుచు.(The point of view of Sankhya is logical and not psychological) 89 అధ్యాత్మముకాని యౌక్తికవిధానమును సాంఖ్యమవలంబించి, (The starting point of Sankhya is every day experience. It's philosophy is a systematic explanation or interpretation of experience) 90 సాంఖ్యముయొక్క అంకురార్పణము నిత్యానుభవము. అనుభవముయొక్క సక్రమనిర్వచనమే దాని తత్త్వమను ముఖర్జీమహాశయుని భావమురీతి సాంఖ్యముత్కృష్టమగు అనుభూతిశాస్త్రమై యున్నది. అట్లు సర్వస్వతంత్రమై, స్వాపేక్షికవిధానము నవలంబించుచు, మానవలోకమునకు అసాధారణమును అసమమునగు తాత్త్వికసిద్ధాంతమును ప్రసాదించిన యీసాంఖ్యముమీద గొప్ప అభిమానమును చూపించు ముఖర్జీ, సాంఖ్యశాస్త్రమును చిన్నపరుపయత్నించు విమర్శకులపై నాగ్రహించి (Some Indian philosophers have tried to arrange the six systems of Indian thought in a hierar-

88. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 248
89. J. N. Mukharjee: Sankhya p 8
90. Do Do p 31

chial scale with Vedanta at the top. Sankhya is treated as the second best. Sankhya, however, emphatically protests against any such sub-ordination. It propounds a unique philosophy and any attempt to sub-ordinate it to Vedanta betrays a complete misunderstanding of its principles) 91 భారతీయషడ్దర్శనముల శ్రేష్ఠత్వము ననుసరించి వేదాంతమును మొదటినుంచి, కొందరు భారతతత్త్వవేత్తలు క్రమము నేర్పాటుగావించిరి. సాంఖ్యమునకు ద్వితీయస్థానమీయబడెను. అట్టి యప్రాధాన్యతకు సాంఖ్యము తన యసమ్మతిని తీవ్రముగా వ్యక్తపరచుచున్నది. అది ఒక అద్భుత తత్త్వసిద్ధాంతమును ప్రతిపాదించుచున్నది. అట్టిదానిని వేదాంతమునకు ద్వితీయముగ ద్రోసిపుచ్చుట దాని సిద్ధాంతజ్ఞానలోపమని విదితమగుచున్నదని వ్రాసెను. మరియు (Sankhya is neither scared by the dreams of a gloomy pessimist nor drawn by any eccentric fascination for the experience of an abstract ecstacy. It sends, on the other hand, the clarion call of an active vigorous, youthful life lived for the world, in the world and through the world) 92 వ్యాకులచిత్తులగు నైరాశ్యుల యూహలచేగాని, యూహాతీతమగు తన్మయత్వము ననుభవించుటకై విపరీతవ్యామోహముచేగాని, సాంఖ్యమాకర్షింపబడదు. ప్రపంచముద్వార. ప్రపంచమున, ప్రపంచము కొరకు దృఢమును నిశితమును, సంతతమును అగు జీవిత సందేశము నది యొసంగుచున్నదనియు, (Yoga of Sankhya is

---

91. J. N. Mukharjee: Sankhya p 8

92, Do Do p 41

but of literature 165 దాని విశాల భావమున వేదము ఒక ప్రత్యేక గ్రంథముగాక, ఒక సాహిత్యమే అగుచున్నది.

'వేదయతీతి వేదః' తెలియజేయునది గాన వేదము అని వ్యుత్పత్తి, అది దేనిసెరింగించును? 'ప్రత్యక్షేణానుమాన మిత్యావా యస్తూపాయో న బుధ్యతే। ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య అతః' ప్రత్యక్షానుమాన ప్రమాణములచేతగాని, యితరోపాయముల చేగాని, తెలియబడజాలని విషయములను దెలుపునది గాన వేదము నకు వేదత్వము సిద్ధమగుచున్నది. అట్టి ప్రమాణాతీత విషయము లెవ్వి? 'విదంతి యుతో ధర్మాధర్మావితి వేదః' దేనివలన ధర్మాధర్మములు తెలియబడునో అది వేదము అనురీతి, ధర్మాధర్మముల నది మానవకోటి కెరుంగజేయుటచే, వేదముగ బరిగణింపబడినది. ఈ ధర్మాదుల నభ్యశించుటచే లభించు యే పరానుభవ సముచ్చయము గలదో, అట్టి 'అలౌకికోపాయబోధకత్వం వేదత్వం' అలౌకికోపాయముల బోధించుటచేగూడ నది వేదమయినది. మరియు 'భూతం భవద్భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' త్రికాలముల జరుగు సర్వవిషయములును, వేదము ననుసరించియే జరుగు ననియు నన్వయము. అనగా నిది సర్వ జ్ఞానస్వరూపమగుటచే, నందు బూర్వమే వచింపబడని విషయమెందును, ఎప్పుడును బ్రపంచమున వ్యక్తముగాదని తాత్పర్యము. 'శ్రూయత ఇతి శ్రుతిః' ఈశ్వరునినుండి 'జ్ఞానస్య పారగమాత్ ఋషిః' జ్ఞానము యొక్క పారమును బొందిన ఋషివరేణ్యులును, అట గురుశిష్య

165. Prof. Suredranath Das Gupta : A History of Indian Philosophy vol. 1 p 11.

మునకు సాంఖ్యదర్శనకర్తయగు కపిలుని గైకొని (Kapila confesses openly that his system is atheistic) 95 కపిలుడు తన సిద్ధాంతము నాస్తికమని బహిరంగముగా జెప్పెననియు, (but inspite of that, his system was treated as legitimate by his contemporaries, because, it was reasoned out consistently) 95 అయిన నాతని దర్శనము సుసంగతముగా విచారింపబడినదగుటచే సక్రమమని యాతని సమకాలికులచే స్వీకరింపబడినదనియు స్పష్టపరచుచున్నాడు. తత్కారణము చేతనే, దానికి ప్రస్ఫుటసిద్ధాంతగ్రంథము ప్రమాణముగ లేకున్నను, (Nobody can gainsay that this occupies a prominent place in all the shastras, since this is either supported or controverted by every philosophical system) 96 సాంఖ్యము సర్వత్ర త్వసిద్ధాంతములచేత ఖండనమునో మండనమునో పొందియుండుటచే సర్వసిద్ధాంతములలో నది అతి ప్రధానస్థానము నలంకరించియున్నదనుట కెవ్వరును కాదనజాలరు, (The Vedanta Sutras make a definite attempt to oppose it. The Buddhists controverted some of its teachings. The Vaiseshikas from the beginning opposed its fundamental principle of సత్కార్యవాద, the axim that effects pre-exist in a potential form in their causes. But very soon and especially outside these schools, the Sankhya came to be regarded as a revelation and absorbed bodily and welded firmly into later Indian

96. Dr. Har Datta Sharma: Sankhya Karika p I

thought) 97 వేదాంతసూత్రములు దాని నెన్నోక్కన ప్రశ్నించినవి. దాని కొన్ని బోధలను బౌద్ధులు ఖండించిరి. కార్యము కారణమున నంతర్గతమైయుండునను సాంఖ్యము యొక్క మూల సత్కార్యవాదమును వైశేషికులు మొదటినుండి ప్రతిఘటించిరి. కాని అచిరకాలమున యితరవాదములచే సాంఖ్యము శ్రౌతముగా బరిగణింపబడి, సంపూర్ణముగా లయింపజేయబడి తర్వాతి హైందవవిజ్ఞానమున సుస్థిరముగా బాదగబడిపోయినదిగా బండితుల భావము. వేదాంతసూత్రములుగాక యితర దర్శనములన్నియు తామసికములనియు వేద మపార్థకములనియు బద్మపురాణము 'శ్లో॥ కణాదేన తు యత్ ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్। గౌతమేన తథా న్యాయం సాంఖ్యం తు కపిలేన తు॥ ద్విజన్మనా జైమినినా పూర్వం వేదమపార్థకం శాస్త్రాణి చైవ గిరిజే తామసాని నిబోధ మే॥' (ఉత్తరఖండ-263) అని నిందించినది. అటులే 'శ్లో॥ కాణాద కపిలాద్యైస్తు మునీంద్రైరపి కీర్తితం। మందబుద్ధ్యనుసారేణ కేవలం పరికీర్తితం॥' వైశేషిక సాంఖ్యములు మునీంద్రులచే గీర్తింపబడినను మందబుద్ధులకై రచింపబడినవని సూతసంహిత తెలుపుచున్నది. అందుచే, కీర్తింపబడినను, నిందింపబడినను, (Sankhya was the ruling philosophy ,of the pre-Buddhistic Epic culture) 98 బౌద్ధమునకు బూర్వకాలికమగు పురాణవిజ్ఞానమునకు సాంఖ్యము సర్వాధిపత్యముగల సిద్ధాంతముగ నుండెను. శ్రీశంకరులుగూడ పూర్వోక్తచందము, కార్యకారణముల కనన్యత్వాంగీకారము

97. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy P 110
98, J. N. Mukharjee; Sankhya

వలనను, ధర్మశాస్త్రజ్ఞులగు దేవలాదులచే నవలంబింపబడుట వలనను సాంఖ్యము ప్రఖ్యాతముగాన దాని ఖండన మవసరముగా వేదాంతసూత్రభాష్యమున (1.4.28) దాని ఘనత నంగీకరించియున్నారు. ఈవిధముగ నన్నిశాస్త్రములచేతను సాంఖ్యమురొుక్క ప్రాధాన్యత గుర్తింపబడియున్నదనుట నిర్వివాదము.

---

## సాంఖ్యము-శ్రుతులు

సాంఖ్యసిద్ధాంత మతి ప్రాచీనమైనదనియు, శ్వేతాశ్వతరోపనిషత్తున దీని నామము కర్తయు తెలుపబడుచు మున్నే నిరూపింపబడియున్నది. కాని యింక కొంచము విచారించి సూక్ష్మదృష్టి బరికించిన, 'తమఆసీ త్తమసాగుళ్హమగ్రేఽప్రకేత' (10 129.3) తమమున్నది. ప్రథమమున నాతమస్సునుండి యవ్యక్త మావిర్భవించెను, అని ఋగ్వేదము సత్కార్యవాదమును, తమోకారణత్వమును, భూతలయస్థానమును సూచించుచు సాంఖ్యవాదమును నిర్ధారణమొనరించుచున్నదని పండితుల భావము. మరల నాఋగ్వేదమే 'తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛంత విశ్వే। అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః' (10.82.6) అను మంత్రముద్వారా, సాంఖ్య ప్రతిపాదితమగు ప్రధానమునే 'యజ' శబ్దమున సూచించుచు దానినుండి సర్వసృష్టియు, దానియందే సర్వాప్యయమును తెలుపుచున్నది. అంతియగాక అథర్వణవేదమున మూడుపాశములచే జుట్టబడిన

లకు ప్రారంభ శక్తిగ భారతదేశము కనుపించుననీ, మాక్సు ముల్లరు వచించినట్లు గోచరించి, శిశిర్ కుమార్ మిత్రవాక్యము లలో, Almost from the dawn of her history it has been the sole privelege of India to carry the torch of her unique ideals to distant lands and inspire them to noble adventures both in the inner and outer fields of human activity 151 ఆమె చరిత్ర యుదయించిన కాలమునుండి, సుదూరదేశములకు గూడ దన అద్భుతాదర్శజ్యోతిని దీసికొనిపోయి, మానవ కర్మకలాపములలో, బాహ్యాభ్యంతరముల దివ్యమైన సాహస కృత్యములకు బురిగొల్పు యర్హతను నార్జించి యున్నది. అందుచేతనే most fascinating and most mysterious country on the face of the globe 152 భూగోళమున నిగూఢమై, అత్యాకర్షణీయమైన దేశమని దీని స్తుతించుచు, గౌరవనీయ ఫ్లెచ్చెర్ విలియమ్సు It is impossible to difine the endless spell which excercises on you 152 అది నీ మీద గలుగజేయు ననంత మోహనము నిర్వచింప దుర్లభమనియు నుడివెను. This is the land from whence, like the tidal waves of spirituality and philosophy have again and again rushed out and deluged the world 153 ఆధ్యాత్మిక, తాత్త్విక మహత్తరంగములు పుంఖాను పుంఖములుగ బహిర్గతమై, ప్రపంచమును ముంచెత్తినది దేశము

---

151. Prof Sisir Kumar Mitra : The Vision of India, p 161

152. Rev. S. Fletcher Williams : Life and Work in india. p 12.

153. Swami Vivekananda : The Complete Works, vol. 3 p 285.

కారణమగు సర్వము జ్ఞాతమగుచున్నదో అనుచు సాంఖ్యపరిణామవాదమును బలపరచుచున్నది. ఇంకను 'యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య' (6.4.1) అగ్నికి రక్తవర్ణమును, శుక్లము జలమునకును, కృష్ణవర్ణము పృథివికి చెందినవని త్రివర్ణములమూలమున ప్రధానముయొక్క గుణత్రయస్వరూపమును తెలుపుచున్నది. ఇట్లే శ్వేతాశ్వతరోపనిషత్తుగూడ 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానం సరూపాః। అజో హ్యేకో జుషమాణోऽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోऽన్యః' (4.5) పుట్టుకలేనిదియు, నేకమును త్రివర్ణాత్మకమును, సరూపులగు ననేకుల సృజింపజేయుచున్నదియు నగు నొకదానిని, (ప్రకృతిని) అజమును ఏకమును అగు ఆత్మ స్వీయభోగార్థము జేరును. ఆత్మ ప్రకృతిభోగానంతరము దానిని త్యజించును అను మంత్రముగూడ సాంఖ్యప్రతిపాదిత పురుషప్రకృతుల నిర్వచనము సేయుచున్నది. దీనినే స్పష్టపరుచుచు 'శ్లో॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోऽభిచాకశీతి' (4.6) ఒకేవృక్షముపై నొకేజాతి పక్షులు రెండు సదా కలసి నివసించుచున్నవి. అందొకటి ఆపిప్పలఫలములను నుపభోగించుచున్నది. రెండవది సాక్షివలె జూచుచున్నది యని శ్వేతాశ్వతరమేగాక ముండకోపనిషత్తుగూడ పురుషప్రకృతిరహస్యములు జాటినవి (3.1). మరల 'క్షరం ప్రధాన మమృతాక్షరం హరః' (1.10) ప్రకృతి క్షరమును పురుషుడు అక్షరమును అనియు శ్వేతాశ్వతరము పలుకును. ఉపనిషత్తుల బ్రాధాన్యతనార్జించిన కఠోపనిషత్తు

నందుగూడ 'శ్లో॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః। మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః॥' (3.10) అనుమంత్రమున సాంఖ్యవాచకమైన అహంకార పర్యాయపదమగు మహత్తుయును, 'శ్లో॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః। పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః॥' (3.11) అను మంత్రము మహ దవ్యక్త పురుషులు ప్రతిపాదించుచు సాంఖ్యక్రమమును బోధించుచున్నది. ఈవిధముగ సాంఖ్యభావజాలముల ప్రతిబింబింపజేయు యుపనిషత్తులు ప్రశ్న మైత్రాయణి మొదలగున వెన్నియో గలవు.

సాంఖ్యముయొక్క వేదప్రామాణికత్వమును గూర్చి చర్చించుచు, నుపనిషత్తులు బ్రహ్మప్రతిపాదన మొనరించు చుండుటచే (It is impossible to find in the Upanishads any real evidence of the Sankhya system) 99 సాంఖ్యమునుగూర్చి యుపనిషత్తులలో ఎట్టి ప్రమాణమునైన గాంచుట దుస్సాధ్యము. కాని(Just like the Vedanta of Sankara or the Vedanta of Badarayana, the Sankhya is a system built on the Upanishads, from both of these it differs in that it goes radically and essentially beyond the teaching of the Upanishads) 99 శంకర బాదరాయణుల వేదాంతములవలె సాంఖ్యముకూడ యుపనిషత్తులపైనాధారపడి నిర్మితమైయున్నది. పైరెంటికంటె నిది ముఖ్యముగను, సమూలముగను యుపనిషద్బోధల దాటిపోవును. ఎట్లన,(There are elements here and there which mark the growth of ideas which later were

99. Dr. A. B. Keith: The Sankhya System p 7

thrown into a systematic form in the Sankhya; but it is impossible to see in these fragmentary hints any indication that the Sankhya philosophy was there in process of formation. It is, of course, possible as a matter of abstract argument, to insist that the elements in the Upanishads which suggest the later Sankhya views are really borrowings by the Upanishads of doctrines already extent in a Sankhya system. But, in the absence of the slightest evidence for the existence of such a system in the Vedic literature, it is methodically unsound to take this hypothesis as possessing any value) 99 ఉపనిషత్తులలో నచ్చటచ్చట తర్వాత సాంఖ్య వాద నిర్మాణకారకములగు కొన్ని భావములున్నవి. కాని ఆయల్పసూచనలలో సాంఖ్యము వ్యక్తిత్వము నొందుచున్న దనుట యసంభవము. ఉపనిషత్తులకు బూర్వమేగల రొుక సాంఖ్యసిద్ధాంతమునుండి తర్వాత సాంఖ్యభావసూచికములగు భావముల నుపనిషత్తులచే గ్రహింపబడినవని సమర్థించు అవి స్పష్టవాదమున కవకాశమున్నది. అట్టి సిద్ధాంతముయొక్క యునికి వేదసాహిత్యమున గోచరింపనంతవరకు, యీవాదమున కెట్టి విలువ నిచ్చుట యసంగతముగా (A. B. Keith) కీత్తు వాదించియున్నాడు. కాని (Max Muller) మ్యాక్సు ముల్లరు కీత్తువలె ననిర్ధారితముగ వాదింపక (While the Vedanta is a direct descendent of the Upanishad discussions, and the systems of logic and atomism, at least, do not go out of their way to challenge orthodoxy, and ultimately adopt

99. Dr. A. B. Keith: The Sankhya System p 7

more and more the authority of the scripture, the Sankhya system in its original form unquestionably marks a break with tradition. But this is a very different thing that philosophy is not derived by legitimate process of development from ideas found in the Upanishads. The issne eventually turns on the interpretation to be given to the fact that a number of Upanishads, in special the Katha, present features which may either be regarded as a preliminary stage in the development of the Sankhya or as the inheritence of an already existing Saukhya on the Upanishads) 100 ఉపనిషద్భావములకు వేదాంతము సాక్షాత్సంబంధము గల్గియుండ, న్యాయ పరమాణు వాదములు సనాతనము నెదిరించి బహిర్గతము కాకపోవుటయే గాక, క్రమక్రమముగా శ్రుతిప్రమాణమును పర్యవసానమున గ్రహించెను. తన సహజస్వరూపమున సాంఖ్యము నిస్సందేహముగా సంప్రదాయముతో భేదించినది. కాని యుపనిషత్తుల భావములనుండియే, శాస్త్రీయముగా తత్త్వశాస్త్ర మంకురించి యభివృద్ధిగాంచవలయునా యను విషయ మప్రస్తుతము. సాంఖ్య పరిణామమున కనసగమగు ప్రాథమికస్థితులుగాని, పూర్వమే గల సాంఖ్యముయొక్క భావము లుపనిషత్తులకు వచ్చినవనిగాని అనేక యుపనిషత్తుల ముఖ్యముగ, కఠయందుగల భావముల వివరించుటయందే యసలు సమస్యగలదని వ్రాయుచున్నాడు. అందుచేతనే పూర్వ ముల్లేఖింపబడినట్లు శంకరులు, సాంఖ్య, ప్రధాన, కపిల మొదలగు సాంఖ్యవాదసూచికపదముల నన్య

100. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 487

ముగ నన్వయపరచియుండిరి. అంతియగాక (Some scholars have maintained that it is వేదవిరుద్ధ. Sankaracharya also seeing that Sankhya is opposed to Advaita avers that Sankhya is not rooted in the Sruties) [101] సాంఖ్యము అవైదికముగా గొందరు పండితులు భావించుచున్నారు. అద్వైత వ్యతిరేకముగ నుండుటచే సాంఖ్యము వేదజనితముకాదని శంకరాచార్యులు స్థిరపరచియున్నారు. కాని అనాదము దోషభూయిష్ఠము. ఎట్లన (Besides, the Sankhya has not openly rejected the authority of the Vedas. It has definitely accepted the Sruti pramana as one of the pramanas) [102] సాంఖ్యము వేదమును అప్రమాణమని త్రోసిపుచ్చలేదు. ప్రమాణములలో శ్రుతిప్రమాణమును అది నిస్సందేహముగా గైకొనెను అని హరదత్తశర్మ సూర్యనారాయణశాస్త్రి వాదించిరి. రాధాకృష్ణపండితుడును, (When the Sankhya claims to be the system based on the Upanishads, there is some justification for it) [103] ఉపనిషత్తులమీద నాధారపడి యున్నట్లు సాంఖ్యము చెప్పుకొనుటయందు కొంత యవకాశము గలదని వ్రాసియున్నాడు. వేదములపై వేదాంత మెంతవరకు ఆధారపడి జనించినదో అంతగానే సాంఖ్యముగూడ జనించినదని వివరించుచు వివేకానందులు, (If according to Vyasa, even the great Muni Kapila "the greatest among perfect Souls", is himself deeply involved in error, then who would say

101. Dr. Har Datta Sharma: Sankhya Karika p 3
102. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika
103. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 249

that Vyasa may not be so involved in a greater measure? Did Kapila fail to understand the Vedas?) 104 సిద్ధులలో మహాసిద్ధుడగు కపిలమునివంటివాడే దోషయుక్తుడుగా వ్యాసాభిప్రాయమైయున్నచో, నంతకంటె నధికతర దోషముల వ్యాసుడు తగుల్కొనలేదని ఎవరు చెప్పగలరు? కపిలుడు వేదముల గ్రహింపజాలక పోయెనా? యని గట్టిగా ప్రశ్నించిరి కావున (We think the Sankhya philosophy is the first attempt to harmonise the philosophy of the Vedas through reason) 105 వేదగత తత్త్వశాస్త్రమును సయుక్తముగా సమన్వయపరుప సాంఖ్యసిద్ధాంతము ప్రథమయత్నమనియు నిర్ణయమనియు స్వాములవారు విశదపరచిరి.

---

సాంఖ్యము–మహాభారతము–పురాణములు

మరియు, మహాభారతపురాణమున 'యథాశ్రుతి నిదర్శనః' 'యథా శాస్త్రవిశారదాః' (శాంతి.5) అనుచు సేశ్వర సాంఖ్యముయొక్క వైదికత్వమును (Moreover, even the atheistic Sankhya is Vaidika in character in as much as the traditional catagories have been borrowed from the Upanishads) 106 మరియు నుపనిషత్తులనుండి సంప్రదాయిక చతుర్వింశతితత్త్వముల గ్రహించియుండుటచే నిరీశ్వరసాంఖ్యము

104. Swami Vivekananda: The Complete Works Vol 2 p 443
105. Do Do Vol 5 p 222
106. Dr. Har Datta Sharma: Sankhya Karika p 4

పరంపరగా నేటివరకు నది ప్రవహించుచుండుటచే శ్రుతి యనబడు చున్నది. అటులనే 'ఆమ్నాయతే పరంపరయేత్యామ్నాయః' పరంపరగా అభ్యసింపబడుచుండుటచే నామ్నాయమనియు దాని నామాంతరము. ఈ విధముగ వేదము సర్వతోముఖమై, సార్వకాలికమై, సర్వవ్యాప్తమై, సర్వవిషయసంపూర్ణమై యున్నదని విజ్ఞుల తాత్పర్యము.

## వేదకాలము

ఇటీవలవరకు వేదముల యపౌరుషేయత్వమును విశ్వసించు చున్న భారతీయుల మనముల, పాశ్చాత్య సంస్కృత విద్వాంసుల సామాన్య దృష్టిఫలిత గవేషణా మూలమున, సర్వ గ్రంథముల వలెనే వేదముగూడ నొక కర్తచే రచితమనియు, నందుచే నది యొకకాలమున లిఖితమనియు నను భావములచే నొక కలవర మేర్పడెను. రచయితలేని గ్రంథముండునా ? అను ప్రశ్న అతి బలీయముగ దోచెను. కాని తన్నిరూపణార్థము, సర్వసాధారణ ముగ గ్రంథములగల కర్తయొక్క వంశావళితో గూడిన గద్యాదులుగాని, సమకాలిక, కాలాంతర గ్రంథములందైనను వేదకర్త, లేక కర్తల ప్రశంసగాని లేకుండుటయు, నెంతయోచించినను దుస్తరమై, నిర్ణయింపబడజాలని అనేక సమస్యాపూరితమై, శాస్త్రజ్ఞుని నెదుర్కొను సామాన్యమైన విషయము. కావుననే Can we, or can we not ascertain the age of the Vedas? This is a question which has baffled the ingenuity of many an ancient and modern scholar [166]

---

166. Sri Bala Gangadhar Thilak : Orion, p 2.

భారతీపురాణము. పూర్వోక్తవిధాన నది సాంఖ్యాచార్యుల వారి సంవాదముల ననేకముల వర్ణించియున్నది. శాంతిపర్వమున జనక సులభాసంవాదమున 'సౌక్ష్మ్యం సాంఖ్యక్రమహా' అనుచు సాంఖ్యమును భారతము బహుధా స్తుతించియున్నది. అంతియగాక (Sankhya is the dominent philosophy of the Mahabharata) [107] భారతముయొక్క ప్రధానతత్త్వశాస్త్రము సాంఖ్యమేయని (Dahlmann) దహ్లామన్ అను విమర్శకుడు వచించెను. కేవలము సాంఖ్యమును బోధించుటయేగాక మహా భారతము సంపూర్తిగ సాంఖ్యస్వరూపమని ముఖర్జి సర్వసమన్వయము చేయును. సాంఖ్యతత్త్వములే మహాభారత పాత్రలనుచు శ్రీకృష్ణుడు పురుషుడు, పంచపాండవులు కర్మేంద్రియ పంచకము, ద్రౌపది కళాస్వరూపమున ఆనందమయి, అంధమున కుత్పన్నమగు తమస్సుయొక్క బహుళరూపములే కౌరవులనియు సాత్త్విక తామసిక ప్రవృత్తుల పోరాటమే మహాభారత యుద్ధమనియు ముఖర్జీ వివరించిరి 108. ఈసాంఖ్యశాస్త్రమునే గీతా శాస్త్రమున శ్రీకృష్ణభగవానుడు అర్జునున కుపదేశించెనని యీతని సిద్ధాంతము. భగవద్గీత కపిలుని స్మరించుటయేకాక 'శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే। సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం॥' (18.13) అర్జునా మనుజుడే కర్మమొనర్చినను ఫలము బడయవలెనన్న నైదు కార్యసాధనములు గావలయునని సాంఖ్యమునందు జెప్పబడి యున్నది. వానిని క్రమముగా నెరింగించెద వినుము అనుచోట

---

107. J. N. Mukharjee: Sankhya p I
108. Do Do Do

సాంఖ్యసూత్రములు ప్రమాణముగ స్వీకరించుచు 'శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః। ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి॥' (8.19) జ్ఞానకర్మలు కర్తయొక్క గుణవిభాగము ననుసరించి తెలియబడును. వాని వివరింతును వినుము అనుచు శ్రీకృష్ణభగవానుడు సాంఖ్య గుణవిభాగమును వివరించెను. ఈశ్లోకములగల 'గుణ సంఖ్యాన' పదముల శ్రీ శంకరులు కాపిలీయముగనే వివరించి యున్నారు. అదియుగాక ద్వితీయాధ్యాయమున జ్ఞానము నుపదేశించుచు సాంఖ్యయోగ మనగనే నామకరణ మొనరించియుండుటచే, భగవద్గీతా శాస్త్రము సాంఖ్యపరమనుటకు ప్రబలకారణ మేర్పడుచున్నది.

శ్రీమద్భాగవతము ను బరిశీలించిన తృతీయస్కంధమున విష్ణుభక్తి బోధకముగ సాంఖ్యసిద్ధాంతమే బోధింపబడియున్నది. ఇటులనే బ్రహ్మాండాది పురాణగ్రంథము లందును బెక్కు తెరంగుల నీసాంఖ్యవాదము ముక్తిదాయక శాస్త్రరాజముగ నుపదేశింప బడియున్నది. గాన దాని ప్రాశస్త్యము సుబోధకము. ఇదే విధముగ ఋషిప్రోక్తములగు స్మృతుల బరికించినను సర్వేసర్వత్ర సాంఖ్య మితరసిద్ధాంతములకంటె బహుళ ప్రాధాన్యత వహించి నన్నెకెక్కినట్లు విదితము. సుప్రశస్తిని బహుళవ్యాప్తిని సంపాదించియుండుటయేగాక (Buddhism and other systems are the outcome of his thought) [109] బౌద్ధాది సిద్ధాంతములు కపిలభావమునుండి యుత్పన్నములని వివేకానందుడును, (On the Sankhya were based the two heterdox religious

109. Swami Vivekananda: The Complete Works Vol 2 p 438

systems of Buddhism and Jainism) [110] అసంప్రదాయికములగు బౌద్ధ జైన మతములు రెండును సాంఖ్యముపై నాధారపడియున్నవి అని (Macdonell) మాక్డొనెల్ అన్నటు సాంఖ్యము రెండు ముఖ్యమతములకు గారణమైయున్నది.

---

## కారికా పూర్వ సాంఖ్యము.

ఇంతదనుక కాపిలేయ సాంఖ్యము యొక్క వైదికత్వమును నిరూపించుచు, నీశాస్త్రరాజము సర్వ శ్రుతి స్మృతి పురాణేతిహాస సంస్తుతిపాత్రమై సుప్రశస్తమై అనుష్ఠానయోగ్యమై ముక్తిదమై యున్నదని వ్యక్తపరుపబడినది. కాలక్రమము ననుసరించి విజ్ఞలోకముచే, గారికాపూర్వ కారికానంతర రూపమున సాంఖ్యము ద్వివిధముగ విభజింపబడియున్నది. కారికలకుగూడ ప్రత్యేకత నొసంగి కారికాపూర్వ, కారికా, కారికా నంతరవిభాగమున త్రివిధముగగూడ గొందరు సాంఖ్యమును విభాగించిరి. ఈవిభాగము పరస్పరాపేక్షికముగనున్నను, సాంఖ్యగ్రహణమునకు స్థూలముగ నిది యుపయుక్తమగును. (The consensus of opinion is that the pre-Karika Sankhya marks an 'embriyonic state and that the post-Karika, a state of deterioration from the settled form in the Karika) [111] కారికాపూర్వసాంఖ్యము

---

110, Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p 385
111. Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 2

బీజరూపము సుస్థిరరూపమగు కారికాసాంఖ్యము నుండి క్షీణ స్థితియే కారికానంతరసాంఖ్యమని సర్వసమ్మతాభిప్రాయముగా సోవాని వచనము. ఈమూడు విభాగములలో పూర్వగ్రంథ భాగమున జర్చింపబడియున్నటుల, (The pre-Karika Sankhya is vague and no complete book on the subject is extent) III కారికాపూర్వసాంఖ్య మస్పష్టమై. యొక్కటేని గ్రంథము లేకయున్నది. అయినను యథార్థదృష్టి యనగా నిష్పక్షపాతదృష్టి గాంచినచో, (The pre-Karika Sankhya is the characteristic product of an India newly stirred to its depths by the impetus of creative philosophical activity) III అభివృద్ధికారకశక్తులచే గదిలింపబడిన భారతనవ్యతత్త్వ విశిష్టఫలమే కారికాపూర్వసాంఖ్యముగా దెలియనగును. కాని (These springs were to remain, however, for long, mere rills and rivulets of negligible magnitude, till in the period of the Upanishads we have them swelling into a mighty boisterous current) III ఈప్రసంతులు నామమాత్రముగ చిరకాల ముండిపోయినవి. ఉపనిషత్తులకాలములో నవి భీకరప్రవాహములుగా విజృంభించినవని సోవాని చక్కగ విశదపరచెను. ఉపనిషత్తులకంటె సాంఖ్యభావము లతిప్రాచీనములని యీవిమర్శకాగ్రణియొక్క దృఢవిశ్వాసము. ఈభావమునమసరించి(The teaching of the Sankhya, however, already excercised some influence on the second chronological stratum of the Upanishads,

---

III. Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 2

కఠ, శ్వేతాశ్వతర, ప్రశ్న, మైత్రి) 112 కాలక్రమము ననుసరించి ద్వితీయశ్రేణికి జెందిన కఠ శ్వేతాశ్వతర ప్రశ్న మైత్రాయణి యుపనిషత్తులపై సాంఖ్యభావములు కొంత పనిజేసినవని (Macdonell) మాక్డొనెల్ కూడ తెలిపెను. కాన (The pre-Karika Sankhya in the meanwhile, may be considered a notable legacy of the early thinkers) 113 ఆదివిద్యాసిద్ధుల యొక్క ప్రఖ్యాతవారసత్వమే యీసాంఖ్యముగా పరిగణింప వలెను అని సోవాని సగర్వముగా వ్రాయుచున్నాడు.

---

## కారికా సాంఖ్యము

ఇక కారికాసాంఖ్యమన్న (Settled form) సుస్థిర రూపము. కారికాప్రాశస్త్యమునుగూర్చి (The appearance of Iswara Krishna's Karika removes a period of uncertainity because it provides a clear and definite exposition of the Sankhya to this day) 113 ఈశ్వరకృష్ణుని కారికారచనముతో సాంఖ్యముయొక్క అస్థిరత్వము నశించినది నేటివరకు సాంఖ్యమునకు నది సుస్థిరమును, స్పష్టమును అగు వివరణము నొసంగినది అందుచేత నది ఉత్తరోత్తరగ్రంథముల కాధారమై యున్నదని పూర్వమే గ్రహించియున్నాము.

---

112. Dr. A. A. Macdonell: India's Past

113. Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 2

## కారికానంతర సాంఖ్యము

సాంఖ్యకారికానంతర సాంఖ్యము, కారికాభాష్యముల తోడను, సాంఖ్యప్రవచనసూత్ర, తత్త్వసమాసాది గ్రంథము లతో ప్రారంభము. పూర్వసాంఖ్యమునగల నాస్తికత తొలగింప బడి, ఆస్తికత ప్రవేశపెట్టబడుటచేతను, పూర్వమే వచింప బడిన యితర కారణములచేతను, అది పూర్వసాంఖ్యముయొక్క క్షీణదశయని కొందరిభావము. కాని, కారికాపూర్వసాంఖ్య మున ప్రమాణగ్రంథము ఒక్కటియు లభింపకుండుటచే నావిషయ మెంతవరకు సమర్థనీయమో తెలియరాదు.

---

## త్రివిధభేద ఖండనము

అంతియగాక, అసలు యీత్రివిధవిభాగమే అసంబద్ధ మేమో! ఇంతవరకు జర్చింపబడినతెరంగు నీసాంఖ్యము, 'శిష్య పరంపరయా గతం' అని విదితమగుచున్నది. కపిలదేవు డాసురి కుపదేశించుటయు, దాని పంచశిఖు డాసురినుండి గ్రహించుటయు నతడు జనకాదులకు బోధించుటయు, షష్టి తంత్రమను బృహద్గ్రంథమును రచించి బహుళ ప్రచారమొన రించుటయు సాంఖ్యప్రమాణగ్రంథములందును, భారతాది పురాణములందును సువిదితము. ఇటుల నీశ్వరకృష్ణునివరకు నేతెం చిన సాంఖ్యమునందు భిన్నభావములున్నట్లుగాని, కపిలగురు

వస్తు బోధకు వ్యతిరేకముగ శిష్యులు ప్రవర్తించి బోధించి రని
గాని ప్రమాణాభావముచే నేకప్రవాహముగ నది యనాది
కాలమునుండి యరుదెంచుచున్న దనవలయును. ఈశ్వరకృష్ణుడు
గూడ 'శ్లో॥ సప్తత్యాం కిల యేఽర్థాస్తేఽర్థాః కృత్స్నస్య షష్టి
తంత్రస్య। ఆఖ్యాయికా విరహితాః పరవాద వివర్జితా శ్చాపి॥'
(సాం.కా.70) అనుచు షష్టితంత్రమునగల యర్థముల యథార్థ
ముగ నుంచుచు, గ్రంథవిస్తరభీతిచే, నందుగల ఆఖ్యాయికా
పరవాద వివర్జితముగ సప్తతిరూపముగ కారికారచనము గావించి
నట్లు స్పష్టము. అందుచేత నీశ్వరకృష్ణుడు సిద్ధాంతద్రోహము
గావింపలేదని గ్రాహ్యము. కారికాగ్రంథము నిరీశ్వరమనియు
కారికాపూర్వసాంఖ్యము సేశ్వరమనియు కొందరివాదము. కాని
ఆవిషయమునగూడ బండితలోకమున నభిప్రాయభేదము
లనేకముగా నుండును. కారికాపూర్వసాంఖ్యాచార్యులలో కపిల,
ఆసురి, పంచశిఖ ఆచార్యత్రయములో నిరీశ్వరవాదులెవరో
యింకను అనిర్ణీతమే అని మన పూర్వగ్రంథమున వ్యక్తము.
అందుచేత కారికాపూర్వసాంఖ్యముయొక్క సేశ్వర నిరీశ్వరత్వము
గూడ నిశ్చయింపబడనప్పుడిక దాని ననుసరించి కారికా
సాంఖ్యము నిరీశ్వరముగా నన్వయించుట యన్యాయము. కొందరు
పండితులు కారికాసాంఖ్యము నంతటిని నిరీశ్వరముగా జూచు
చుండ, ముఖర్జీమహాశయుని దృష్టిలో కారికాసప్తతి కొంత
సేశ్వరము కొంత నిరీశ్వరముగా నున్నది. మనకు స్పష్టముకాని
విధాన, మన గవేషణల కందక ననామకుడగు ఒక ఆస్తికుడు
కారికలనే సంకర మొనర్చెనని ముఖర్జీయొక్క వాదము. ఈవిష
యమును జర్చించుచు (The two Sankhyas in Sankhya

Karika may be separated from each other. The first 52 Karikas without the term ముక్తి contain the geienuine Sankhya, while the 16 Karikas from 53-68 propound the false Sankhya) [114] సాంఖ్యకారికలగల సాంఖ్యవాద ద్వయమును విభజింపనగును. ముక్తి పదములేని ప్రథమ 52 కారికలు శుద్ధసాంఖ్యమును, 53-68 వరకుగల 16 కారికలు కల్పిత సాంఖ్యమును గలిగియున్నట్లు వివరించెను. ఈవిషయము ముందు కానగును.

---

## సాంఖ్య సేశ్వర-నిరీశ్వరత్వ విచారము

ఈవిధముగ కారికాపూర్వ కారికానంతర కారికారూపమున త్రివిధపరిణామరూపముగ వర్ణింపబడుటయేగాక సాంఖ్యము నిరీశ్వర సేశ్వర విధానమున ద్వివిధముగ గోచరమని పండితుల అభిప్రాయము. ఇది నిరీశ్వరమా సేశ్వరమా అను సమస్య చాల వాద ప్రతివాదసంకులమై యున్నది. అంతియగాక కాలానుగత విభాగములలో నెయ్యది ఏరూపమున నున్నదను మీమాంసయును చాల సంశయాస్పదముగ నున్నది. ఆవిషయము నొకించుక బరిశీలింతము.

(The atheism of the Sankhya is one of its out-standing feature) [115] సాంఖ్యముయొక్క నిరీశ్వరవాదము

114. J. N. Mukharjee: Sankhya
115. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya

దానిముఖ్యలక్షణములలో నొక్కటియని సూర్యనారాయణ శాస్త్రి అభిప్రాయమురీతి సాంఖ్యమునకు నిరీశ్వరత్వ మొక భూషణముగా గొందరు పండితులచే బైవిధాన బరిగణింపబడి నను, సాంఖ్యము ప్రథమమునుండి నిరీశ్వరము కాదనియు గాలానుగతముగ దానియందు మార్పులేర్పడి యున్నవనియు గొందరివాదము. అందుచే సాంఖ్యమును మొత్తముగ నిరీశ్వర మని త్రోసిపుచ్చుట అసమంజసమని వీరి భావము. కపిలుడు చతుర్వింశతితత్త్వముల బ్రతిపాదించుచు, నీశ్వరప్రస్తావనయే లేని నిరీశ్వరవాదమును స్థాపించెనని 116 మల్లాది సూర్యనారాయణ శాస్త్రియు వ్రాసెను. కాని (From the fact that many Vaishnava schools accept the Sankhya cosmogony-Kapila's own doctrine was probably theistic) 117 సాంఖ్యసృష్టివిచారణ మనేక వైష్ణవవాదులచే స్వీకరింపబడుటచే బహుశః కపిలుని సిద్ధాంతము సేశ్వరమైయుండు ననియు, (Panchasikha probably modified Kapila's work in an atheistic way and passed it as Kapila's work) 117 బహుశః కాపిలదర్శనమును బంచశిఖుడు నిరీశ్వరముగమార్చి, కాపిలముగనే వ్యవహరింప జేసియుండునేమో యనియు ప్రఖ్యాత తత్త్వశాస్త్రచరిత్ర కారుడగు దాసుగుప్త వ్రాసెను. (The Sankhya was ignored, it is often said, on account of its atheistic tendencies. This argument as it stands is not correct.

---

116. సూర్యనారాయణశాస్త్రి: సంస్కృతవాఙ్మయ చరిత్ర సం ౨.

117. Prof. S. Das Gupta: Indian PhilosoPhy
S. S. S, Sastry: Sankhya Karika

The Sankhya was classed amongst the orthodox systems) 118 నిరీశ్వరతత్త్వముచే సాంఖ్యము పేక్షింపబడినదని తరచు వచింపబడుచున్నది. కాని అది సత్యదూరము. సాంఖ్యము సనాతనవాదములలో నొకటిగ బరిగణింపబడుచున్న దని సోవాని దృఢవాదము. అంతియకాక, (It always ranked higher than the monastic philosophy of Sankara) 118 శంకరుని అద్వైతవాదముకంటె సాంఖ్య ముత్కృష్టముగ తరచు గ్రహింపబడుననియు నతని అభిప్రాయము. కేవలము కారికా దృష్టి బరికించిచూచినను, (Truely speaking Sankhya could be devided into two - one Seswara, the other Nireswara) 119 యథార్థమునకు సాంఖ్యము సేశ్వర నిరీశ్వరముగా ద్వివిధముగ విభజింపనగును. (Let the theists not take the Nireswara Sankhya propounded in the Karika etc., as rooted in the Sruti, but who can take exception to the Vaidica Character of the Seswara Sankhya as propounded in the Upanishads, the Mahabharata and the Puranas) 119 కారికలందు ఉపదిశ్యమైన నిరీశ్వరసాంఖ్యము నవైదికమని ఆస్తికులు త్రోసిపుచ్చినను, ఉపనిషద్భారతపురాణాదులందు వక్కాణింపబడిన సేశ్వరసాంఖ్యముయొక్క వైదికత్వము నెట్లు కాదనగలరు? అని హరదత్తుని ప్రశ్న. కారికా సాంఖ్యము నిరీశ్వరమను హరదత్తుని అభిప్రాయముగూడ పూర్వపక్షమే యగును. హరదత్తుని అనుసరించియే (Jacobe)

118. Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 3
119. Dr. Har Datta Sharma: Sankhya Karika p 4

జకోబిగారు నిరీశ్వరసాంఖ్యము ప్రాచీనమనియు, నుపనిషద్భారత గీతాదులలో సేశ్వర నిరీశ్వర సాంఖ్యసమన్వయము జరిగినదనియు భావించెను. 120 (Kapila never refers to Him in his Sutras. As a careful reasoner, however, he doesnot go so far as to say that he can prove the non - existence of such a Being, but he is satisfied with stating like Kant, that he can not establish His existence by the ordinary channals of evidential knowledge) 121 ఈశ్వరునిగూర్చి కపిలుడు తన సూత్రములలో ప్రస్తావింపలేదు. జాగ్రత్తగల తార్కికుడగుటచే, నీశ్వరుని నాస్తికత్వ నిరూపణము జేయుగల నని యాతడు పలుకలేదు. కాని తత్త్వవేత్తయగు కాంట్ వలె, సామాన్య ప్రమాణములద్వారా యీశ్వరాస్తికత్వమును స్థిర పరుపజాలనని యతడు తృప్తినొందెననియు (We must distinguish, however, Kapila though he boldly confessed himself an aheist, was by no means a nihilist or Nastika. He recognised in every man a soul which he called Purusha) 12 కాని కపిలుడునిరీశ్వరుడుగజాటుకొనినను నాస్తికుడు మాత్రముగాదు. ప్రతిమానవునిలో నాత్మ యున్నదని సమ్మతించి పురుషుడని యతడు నామకరణ మొనరించెనని (Max Muller) మ్యాక్సు మ్యుల్లరు తలంచును. సాంఖ్యమేగాక యితరములైనను (From philosophical point of view, no theory of evolution, whether ancient or modern, can provide any room for a creator or governor of the world, and hence the

120. Dr. Jacobe Har Datta Sharma: Sankhya Karika p 4
121. F. Max Muller: The Six Systems of Indian Philosophy !

Sankhya philosophy declares it self fearlessly as an un-Iswara, Lordless, leaving it to another philosophy the Yoga, to find in the old Sankhya system some place for an Iswara or a personal God) [122] తాత్త్విక దృక్పథములో ప్రాచీనాప్రాచీనముల పరిణామవాద మెద్దియైనను, ప్రపంచసృష్టికర్తకు, పాలకుని కెట్టి యవకాశమును కల్పింపజాలదు, అందుచే సాంఖ్యము నిరీశ్వరముగా భయములేక ప్రకటించినది. మరి యొక సిద్ధాంతమైన యోగమునకు నీశ్వరప్రతిపాదనమును అది విడిచినదని (Max Muller) మాక్సుముల్లరు వ్రాసెను. కాని యీవిధముగా కారికాపూర్వసాంఖ్య సేశ్వర నిరీశ్వరత్వ విషయమున ననేకములగా నభిప్రాయభేదములు గోచరించుచుండ, యింకను పండితు లద్దాని విషయమున మీమాంసించుచుండ, పైన మ్యాక్సుముల్లరు వచించినట్లు కాపిలము నిరీశ్వరమనియు, తర్వాత నీశ్వరుడు లేడనుట సరిగాదని సాంఖ్యమున నీశ్వరుని జేర్చి పతంజలి సాంఖ్యప్రవచన యోగదర్శనమును నిర్మించెనని సంస్కృత వాఙ్మయ చరిత్రకర్తయగు మ. సూర్యనారాయణ శాస్త్రి వ్రాసెను. ఇదేభావమును దాసుగుప్తయు గాపిలముకూడ సేశ్వరమనియు వచించి (The details of which are lost, but which is kept in a modified form by the Patanjali School of Sankhya) [123] దాని వివరములు ఖిలము కాగా పాతంజలసాంఖ్యము దాని రూపాంతరమును పదిలపరచె ననియు జెప్పుచున్నాడు. కాని కపిలుడు సాంఖ్యమును తత్త్వసిద్ధాంతమును

122. F. Max Muller: The Six Systems of Indian Philosophy ix
123. Prof. S. Das Gupta: Indian Philosophy
S. S. S. Sastry: Sankhya Karika

ప్రతిపాదించిన ప్రథమ బ్రాహ్మణుడనియు, (But his work on the Subject not having come down to us in its original form, we are not in a position to ascertain what relation it bore to the Vedas) 124 కాని ఆశాస్త్రముపై నతని కృతి యొక్కటియు గూడ శుద్ధముగ మనకు లభింపకుండుట చే, నాసిద్ధాంతమునకు వేదములకెట్టి సంబంధమున్నదియు దెలుపుట కష్టమని నందలాల్ సింహా అన్నాటుల, దృఢముగా నొకవిధముగా కారికాపూర్వసాంఖ్యమును నిర్ణయింప ప్రమాణ గ్రంథాభావ మే ముఖ్యాటంకముగ నున్నది. అయినను దానిపై స్తుతు లుపనిషత్తు లందును, పురాణములందును స్మృతులందును విరివిగా గోచరిం చుటచే నది తప్పక సేశ్వరముగా నిర్ణయము గావలయును. అసమగ్రమును అసంపూర్ణమును అగు కారికాగ్రంథముతో బోల్చి, సృష్టిప్రతిపాదనమున కనవసరమగు యీశ్వరప్రశంస అందు లేకుండుటచే కారికాపూర్వసాంఖ్యముగూడ నిరీశ్వరమని నిందించుట అసమంజసము, అసంగతము, అన్యాయముగా దోచును. శంకరులుగూడ వేదాంతసూత్రభాష్యమున 'తేషామపి ప్రధాన వదశబ్దత్వాచ్ఛబ్ద విరోధిత్వాచ్చేతి' (1.4.28) అణ్వాది కారణవాదము లన్నియు బ్రధానవాదమువలె నశబ్దములు శబ్ద విరుద్ధములు నగుటవలన ననుచోట సాంఖ్యము వేదవిరుద్ధ మనియే వాదించెను గాని నిరీశ్వరమని వాదించలేదు. అనగా 'తేషాం వాదానాం ప్రధానవాదవ దశ్రౌతత్వం' ఆవాదములు గూడ ప్రధానవాదము చందము అశ్రౌతత్వములు అని రత్న ప్రభావ్యాఖ్యాతయు వివరించును. ఎప్పుడేని నెటనేని సాంఖ్య

124. Dr. Nandalal Sinha: The Sutras of Gotama

వాదమునకు నాస్తికపదము ప్రయోగింపబడియున్నను మనుస్మృతి నిర్వచనమునసుసరించి 'నాస్తికో వేదనిందకః' (2.11) యనియు, 'నాస్తికో యత్తో వేదనిందకః' (ముక్తావళి.2.11) అనురీతి సాంఖ్యులు వేదనిందకులని యన్వయింపనగు గాని, నిరీశ్వరులని నిందించుట కవకాశము లేదు. దాని వైదికత్వవిషయము పూర్వమే సమగ్రరీతి జర్చించి తీర్మానించి యుంటిమి. కాని పూర్వ సాంఖ్యము నిరీశ్వరమనియు అవైదికమనియు దీర్మానించుట బాడికాదని యిందలి తాత్పర్యము.

---

## కారికా నిరీశ్వరత్వము

అంత కారికాసాంఖ్యముయొక్క నిరీశ్వరత్వమునుగూర్చి ప్రథముగ నధికసంఖ్యాకులు వాకుృచ్చిరి. (In the classical Sankhya of which the Sankhya Karika is an exposition, we have but Prakriti on the one hand and a magnitude of Purushas on the other. The functions assigned to God-creation, sustentation etc., are discharged by Prakriti aided by the presence of the Purushas) 125 సాంఖ్యకారికావ్యాఖ్యనుగల సంప్రదాయక సాంఖ్యమున నొక ప్రకృతియు ననేక పురుషులును గలరు. ఈశ్వరకార్యములగు సృష్టిస్థిత్యాదిక ధర్మములను పురుష సన్నిధానముచే బ్రకృతియే నిర్వహించు ననుచు సాంఖ్యకారికా నిరీశ్వరత్వమును సూర్య

125. Dr. Suryanarayana Sastry: Sankhya Karika

నారాయణశాస్త్రి వ్యక్తపరచెను. మరియు (The hypothesis of a devine creation of the world leads to many difficulties. These are not set out anywhere in the Karika) 125 సృష్టికి ఈశ్వరకర్తృత్వ మనేక సమస్యలకు దారిచూపును. కారికలలో నెచ్చటను వీని జర్చింపలేదు. అయినను, (It is queite possible that they are thought of, but were omitted from the Karika which is a condensed exposition Omitting all discussions of rival views) 125 వానిని యోచించియుండుట కవకాశమున్నది కాని, పరవాదములు లేని, సంక్షిప్తరూపముగల కారికలలో నవి విరమింపబడి యుండవచ్చును. అయినను గ్రంథము యథాతథరీతి యోచించుచో, నీశ్వరాపేక్ష లేకయే, నిర్వహింపవలెనన్న యత్నముకంటె నీశ్వర నిరాసమునం దెక్కువ శ్రద్ధ చూపలేదనుట కెక్కువ యవకాశములున్నవని సూర్యనారాయణశాస్త్రి తీర్మానించెను. అనగా నీశ్వరకృష్ణు డీశ్వరప్రతిపాదనమున కవసరము లేకయే వ్యవహరించెనుగాని, ఈశ్వరుడు లేడని వాదించలేదని తాత్పర్యము. కర్తృభావ మెట్టిదైనను, కారికాపరిశోధన ననుసరించి (The Sankhya Karika too,should be considered atheistic) 125 సాంఖ్యకారిక నిరీశ్వరమే యని తీర్మానింపవలెనని యతని తుది పలుకు. పైభావములనే దృఢపరచుచు కారిక సంపూర్తిగ నిరీశ్వరమని తీర్మానించుచు, భాష్యకర్తలు సేశ్వరభావముల జెప్పుట యటుండ కారికాగ్రంథమునే సంకరము గావించిరని ముఖర్జీవాదము. కఠ, శ్వేతాశ్వతర, గీతాది గ్రంథములగల

125. Dr. Suryanarayana Sastry: Sankhya Karika

సాంఖ్యమునకును కారికాసాంఖ్య తత్త్వమునకును తుల్యత్వము లేదనియు, కారికాసాంఖ్యమునగూడ సేశ్వర నిరీశ్వరత్వములు గలవనియు, అందు 52 వ కారికవరకు శుద్ధసాంఖ్య మనియు, 53_68 వరకుగల 16 కారికలలో తద్విరుద్ధ మైన కల్పితసాంఖ్యము గలదనియు నాతని భావము, (There is one obvious objection against the hypothesis we have advanced that 16 Karikas have been added to the original body) [126] మూలగ్రంథమునకు నా 16 కారికలు చేర్పబడినవను ఆవాదమున కొక అభ్యంతరముగలదు. అది ఎద్దియన కారికాగ్రంథము సప్తతి యనబడుచున్నదిగదా! కాని సప్తతి యనబడుటకు బూర్వమే యీసంకరముగ ప్రక్షిప్తము జరిగెనని యతని వాదము. కారికలలోగల యీద్వివిధ విభాగ మును జర్చించుచు, ప్రథమభాగము బంధములతో ప్రారంభింప, ద్వితీయము దుఃఖముతో నుపక్రమించెననియు, సిద్ధులతో నొకటి సమాప్తియగుచుండ, మోక్షముతో రెండవది పూర్తి గాంచెననియు, ఇట్లు అష్టవిధ భేదము లీభాగద్వయమున గోచ రించి పరస్పరవైరుధ్యము సూచించునట్లు, నిరీశ్వరమగు ప్రథమ మునకు సేశ్వర వేదాంతభావముల గల్పింప 16 కారికలు చేర్ప బడినవనియు నితని నేరారోపణము. అయినను, యీసిద్ధాంత రాద్ధాంతములన్నియు ననిర్ధారితములు. ఇది, యిట్లుండ కారికా గ్రంథము సప్తతి యనబడినను, మనకు 69 కారికలే లభించు చున్నవనియు, నా 70 వ కారిక యదృశ్యమైనదనియు దలంచి, ప్రఖ్యాత విమర్శాగ్రేసరుడగు బాలగంగాధర తిలక్ కారికలలో

126. J. N. Mukharjee: Sankhya

61 వ కారికకు గౌడపాదుని భాష్యము నాధారముగా గైకొని 'శ్లో॥ కారణమీశ్వరమేకే బ్రువతే కాలం పరే స్వభావం వా। ప్రజాః కథం నిర్గుణతో వ్యక్తః కాలః స్వభావశ్చ॥' అను శ్లోకము బూరించిరి. సృష్టికారణము యీశ్వరుడనియు కాలమనియు స్వభావమనియు నందురు. కాని నిర్గుణుడైన యీశ్వరునుండి ప్రజలెట్లుద్భవింతురు? కాల స్వభావములు వ్యక్తావ్యక్తముల సంతానతను లగుట నవియు కారణములు గావను తాత్పర్యముగల యీశ్లోకముండి యుండుననియు, కాని యది నిరీశ్వరత్వమునకు బూర్తిగ [illegible] విరోధములచే తొలగింపబడి యుం[illegible] తిలకు మహాశయుని యూహ 127. అసలు సప్తతిలో నొక కారిక లేదని గ్రంథముతః (Wilson) విల్సన్ కనుగొనెనట. అంత తిలకు మహాశయుడు కృషి గావించి పై శ్లోకమును పూరించెను. (But it is not clear on what ground the loss of one Karika is manifest. If the already existing 70th verse is to be rejected as not forming an essential part of the Saptati, the 69th verse can also be rejected on the same ground. Disquisition of the principles of the Sankhya is over at the 68th Karika and if the 69th Karika is necessary to impress the authenticity of the work, the 70th is needed to give the line of succession of the old teachers, and the uninterrupted tradition of the system)128 కాని యీ కారికా నష్టమెట్లేర్పడెనో యగ్రాహ్యము. సప్తతిలో 70 వ శ్లోకము కారికా భాగము కాదని త్రోసివుచ్చుట కవకాశమున్నచో నదే

127. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 251
128. Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 54

కారణమున 69 వ కారికగూడ పరిత్యాజ్యమే యగును. 68 వ కారికతో సాంఖ్య తత్త్వమీమాంస సమాప్తి చెందెను. గ్రంథ ప్రాశంసికకు 69 వ కారిక యవసరమగుచో, పూర్వాచార్య పరంపరా సూచికముగను అనవచ్ఛిన్న సిద్ధాంత పారం పర్య నిరూపణముకొరకును 70 వ కారిక యుపసరమగుచున్నదని జోహాను హైమానుగారు తన యసమ్మతిని వెలిబుచ్చెను. ఇంత వరకు సూచినవిధాన కారికాసాంఖ్యముగూడ అవిస్పష్టముగ నున్నదని తేలుచున్నది. అనగా కారికలందు యీశ్వర ప్రస్తావన లేకున్నను. అది పూర్వసాంఖ్య క్లుప్త స్వరూపముగాన, అందు సృష్టి పరిణామక్రమ ప్రతిపాదనయు, పురుషుడు జీవుడై పరిభ్రమించి మరల పురుషత్వరూప కైవల్యమునొందు విధానము వివరింపబడియుండుటచే నిట బ్రహ్మప్రతిపాదనముగాని కర్తయై పాలకుడనబడు యీశ్వర ప్రసంగముగాని యనవసరమయ్యెనని యిందలి తాత్పర్యము.

తర్వాత కారికానంతర సాంఖ్యమున నింత కల్లోలము లేదని చెప్పనగును. భాష్యకారులందరును ఏదియో విధముగ కారికలలో సేశ్వరభావముల వెలిబుచ్చిరి. అంతియుగాక, కారికాపూర్వముగాని, కారికాంతర్గతముగాని నిరీశ్వరమను భావమే వీరికి లేదనియు దోచును. కపిలాది యీశ్వరకృష్ణ పర్యంత సాంఖ్యాచార్యులెల్లరును, పరమ ఋషీశ్వరులుగనే స్వీకరింపబడి వందనీయులైరి. కాన కారికానంతరసాంఖ్యము చాల వరకు సేశ్వరముగనే రూపించియున్నది.

కాని (the hypothesis of three strata of Sankhya a theistic one - - - second atheistic one - - - and a third

atheistic modification as the orthodox Sankhya System, has yet to be proved)[129] సేశ్వరము, ద్వితీయము నిరీశ్వరము, సంప్రదాయక సాంఖ్యరూపముననున్న నిరీశ్వరము తృతీయము అను త్రివిధ విభేదసిద్ధాంతము యింకను అనిర్ణీతము. నైజముగా నీదర్శనమున నీశ్వరప్రస్తావన ఏల రాకపోయెనో యిసుమంత విచారించిన యింత మీమాంస కవకాశమే యుండెడిది కాదు. అది (purely rationalistic)[130] పూర్తిగా హేతుకమై (Sankhya is logical)[131] సాంఖ్యము తార్కికముగా గ్రాహ్యము. ఆస్తికత పూర్వోక్తచందము అజ్ఞ చిత్తములలో క్రమధీపరిణామమునకాటంకదాయకమగుటచే దాని సాంఖ్యులప్రధానము చేసియుండిరి.[132] మరియు (Nyaya and Vaiseshika lay stress on the practical side, Sankhya and Yoga emphasize the mental aspect, while Mimamsa Systems stress the spiritual aspect)[133] న్యాయ వైశేషికములు భౌతికమును, సాంఖ్య యోగములు మానసికమును, మీమాంసాద్వయము ఆధ్యాత్మమును ప్రతిపాదించునను వచనము లతి సముచితములు. అట్లు దర్శనములలో క్రమత్వమే లేనిచో, పరస్పరాపేక్షికములు కానిచో, నవి దర్శనములని చేర్కొనబడి భారతీయ విజ్ఞానసౌధమునకు బునాదులై యొప్పారవు. ఈవిషయమునే యెక్కుడు పరిశీలనము గావించిన

129. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika
130, Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System p 4
131. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika
132. Dr V. V. Sovani: A Critical Study of the Sankhya System p 4
133, Kalyana Kalpa Taru 1936

(Max Muller) మ్యాక్సు ముల్లరు (The longer I have studied the various systems, the more I have become impressed with the truth of the view taken by Vijnana Bhikshu and others that there is behind the variety of the six systems a common fund of what may be called national or popular philosophy)[134] వివిధముగ గోచరించు దర్శనముల కాధారముగ జాతీయ తత్త్వసిద్ధాంతము గలదని విజ్ఞానభిక్షువు మొదలగు పండితాభిప్రాయముయొక్క సమంజసత్వము, దర్శనవిచారమును నే గావించినకొలదిని నాకు వ్యక్త మగుచున్నదని వచించెను. (The Nyaya, Vaiseshika, Sankhya and the Yoga Sutra and the Uttara Mimamsa are but successive steps of one and the same ladder) న్యాయవైశేషిక సాంఖ్య మీమాంస లొకే శ్రేణియొక్క క్రమ క్రమ సోపానములని కొందరుపండితులును, (The Nyaya-Vaiseshika realism, the Sankhya-Yoga dualism, and the Vedanta monism donot differ as true and false. They are adopted to the needs of the మంద, మధ్యమ, ఉత్తమాధికారి respectively)[135] న్యాయవైశేషిక లౌకికము, సాంఖ్య యోగముల ద్వైతము, వేదాంతముయొక్క ఏకేశ్వరత్వములు సత్యాసత్యవిభాగమున భేదింపవు. మంద మధ్యమ ఉత్తమాధి కారుల యవసరాన్వయమునకై యవి యేర్పడియున్నవని సముచితవాక్యముల వ్రాసియున్నారు. అందుచేతనే (In obedience of custom, which it would be vain to try to unse-

134. F. Max Muller: The Six Systems of Indian Philosophy xvii
135. Prof. S. Radhakrishnan: Indian philosophy Vol 2 p 770

ttle, we shall start with Nyaya and Vaiseshika theories, which give us an analysis of the world of experience, and pass on to the Sankhya and the Yoga which try to explain experience by bold speculative ventures; and we shall conclude with a discussion of the Mimamsa, which attempt to show that the revelation of Sruti are in harmony with the conclusions of philosophy. Such a treatment has at least the support of sound logic though not of sound chronology) 136 మార్పుయుక్తింపి వ్యర్థమగు ఆచారమునకు దలయొగ్గి, ప్రపంచానుభూతివివరణము గావించు న్యాయవైశేషికములతో ప్రారంభించి, అనుభవమును ధైర్యోపేత తార్కిక సాహసములద్వారా అనుభవింపజూచు సాంఖ్యయోగములకు గదలుదము. శ్రుతిప్రమాణము తత్త్వశాస్త్రసిద్ధాంతములతో నేకీభవించునని నిరూపింప యత్నించు మీమాంస విచారణముతో బరిసమాప్తి గావింతముగాక యని రాధాకృష్ణుడు తన భారతతత్త్వశాస్త్ర పీఠికలో వ్రాసియున్నాడు. అదిసముచితమనియు న్యాయమనియు నిస్సంశయము.

---

## సాంఖ్య ప్రశస్తి

అందుచేత నేయేశాస్త్రమేయే సత్యముల బోధించునో ఆయా విషయముల గ్రహింప యత్నించుటయేవిజ్ఞ విధానము గాని, ఆశాస్త్రము సర్వవిజ్ఞాన సర్వస్వముగ నూహించుట

136. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 28

అతివాదమే మో. అందుచేతనే తాను చెప్పదలచిన విషయ మును సమగ్రలీల విస్పష్టముగ సాధకబాధకముల లక్ష్యమిడు నేయక ప్రకటించియున్న దిగాన సాంఖ్యము నాటనుండి నేటివరకు (It is the most magnificient system of philosophy that India has produced) 137 హిందూదేశము వెలువరించిన తత్త్వసిద్ధాంతములలో సాంఖ్య ముత్కృష్టమైనదని ప్రఖ్యాతి గడించినదై (Sankhya was the ruling philosophy) 138 అన్నట్లు ఏకఛత్రాధిపత్యముగల సిద్ధాంతరాజమై (There is no achievement in the world which can compare favourably with that of Indian speculative philosophy) 139 భారతీయ తత్త్వశాస్త్రముతో బోల్పదగు మహత్కార్యము లోకమున మరొండు లేదను ఘనతను భారతవిజ్ఞానమున కార్జించి, సిద్ధులలో నగ్రగణ్యత నొందుటలో దృష్టినొందక హిరణ్యగర్భ విష్ణు శివాది దేవతాతుల్య స్వరూపము నొందిన పరమయోగీంద్రచంద్రుడైన కపిలమునీంద్రచంద్రుని అనుగ్రహ విశేషముచేతను; గురుముఖజనిత సుధాస్వాదనా తన్మయత శిష్యరత్నమగు పంచశిఖాచార్యునకు, ముక్తిదమగు నీసిద్ధాంతము నుపదేశించు 'ఆసురి ర్మండలే తస్మిన్ ప్రతిపేదే తదవ్యయం' 140 అన్నటుల బ్రహ్మము నందంతర్లీనమైన ఆసుర మునివర్య కృపా విశేషమున సుబోధితమై, భిక్షువై జనకాది రాజన్యులనేగాక పరాశరాది మహర్షుల సహితము శిష్యులనుగావించుకొని సాంఖ్య

137. Prof. S, Radhakrishnan: Indian PhilosoPhy Vol 2 p 28
138, J. N. Mukharjee: Sankhya
139. Dr, V, V, Sovani: A Gritical Study of the Sankhya Systdm V
140. మహాభారతము: శాంతి 13, 218.

ప్రదాతయై, జ్ఞానరూపమగు నాసిద్ధాంత మాధుర్యమును బహుకృత మొనరించి మనకు ప్రసరింపజేసిన పంచశిఖాచార్యుని కరుణావిశిష్టత చేతను; సంతత షోడశవర్ష ప్రాయులై, అలౌకికానంద సంధానులై యొప్పు సద్గురు కారుణ్యముచేతను; సాంఖ్య సిద్ధాంతామృతపానోన్మత్త సంజనితానంద పుంజ స్వరముల కారికా రూపమున మనకు దాని ప్రసాదించిన నీశ్వరకృష్ణుని యపార దయాగరిమచేతను; మనకు సంప్రాప్తించిన నీ సాంఖ్యము మిగుల సుప్రశస్తము, సుప్రఖ్యాతము, ముక్తిదము. అందులకు అఖిల భారతావనియేగాక సకల ప్రపంచమున గల సర్వముముక్షుకోటియు గృతజ్ఞులై తత్ జ్ఞాన సంవాదనాజనిత మహదానంద ప్రకాశమున మునిగి ఆ ఋషివర్యుల ఋణము దీర్చుకొందురుగాక! ధన్యులగుదురుగాక!

---

## సాంఖ్యనామ విచారణ

ఇంతవరకు మీమాంసింపబడిన తత్త్వశాస్త్రము సాంఖ్య దర్శనమనియు సాంఖ్యతంత్రమనియు వచింపబడుచున్నది. ఈనామముగల యర్థము నొకించుక బరిశీలింతముగాక.

ఆదివిద్వాన్ శ్రీకపిలాచార్యునిచే సృష్ట్యాదిన బోధింపబడుచు, 'తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం' అని ప్రతీతి గాంచియున్న సాంఖ్యదర్శనము (The word Sankhya need mean nothing more than wisdom) [141] జ్ఞానమునకన్వార్థము

141. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika

లేదు అనునట్లు సాంఖ్యపదమునకు ముక్తిదాయక జ్ఞానమనియు (The natural and traditionally accepted interpretation is from Sankhya-buddhi or Knowledge) [142] సామాన్యముగను సంప్రదాయకముగను సాంఖ్యపదమునకు బుద్ధియనియు జ్ఞానమనియు నర్థముగా బండితాభిప్రాయము. దీని ననుసరించియే భగవద్గీతా ద్వితీయాధ్యాయమునకు నామకరణ మొనరించియుండురని తోచును. అమరమునందు 'చర్చా సంఖ్యా విచారణా' (1.5.3) యని యుండుటచే చర్చారూప విచారణయే సాంఖ్యమని యర్థము. (The system takes its name from the fact that it arrives at its conclusions by means of theoritical investigation) [143] పరికల్పనాత్మక విచారణమున తన తీర్మానముల బొందునుగాన నీశాస్త్రమున కానామము గలిగినదని రాధాకృష్ణుడు వచించుటయు దీని ననుసరించియుండును. (Thinking may be with reference to basic principles or knowledge of Self) [144] ఆత్మవిచారణగాని చతుర్వింశతి తత్త్వవిచారణగాని అయియుండును. (the first of these stages is the discriminative wisdom which distinquishes spirit from the matter) [145] ప్రకృతినుండి పురుషుని విభజించు జ్ఞానమే ప్రథమస్థితి యగును. ఈయభిప్రాయము సాంఖ్యనామ వ్యుత్పత్తినిగూర్చి యన్యభావములవలె దాత్త్వి

---

142, Dr. V. V. Sovani: A Critical Study of the Sankhya System
143. Prof. S. Radhakrishnan: Indian philosophy Vol 2 p 249
144. Dr. Har Datta Sharma: Sankhya Karika p 2
145. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika

కముగను, వ్యక్తిత్వానుసారముగను సంతృప్తికరముగ నుండుట యొక విశేషముగా సూర్యనారాయణశాస్త్రి వర్ణించును. (Sankhya means theory of Reality. Reality is triune)[146] సాంఖ్యమన సత్పదార్థజ్ఞానము. ఆసత్పదార్థము త్రయాత్మకమని ముఖర్జియను శాస్త్రివచనముల ననుసరించెను.

అట్లుగాక (The word Sankhya was originally used in the sense of counting and it was then applied to the system of Kapila which enumerates the 25 principles)[147] గణించుట యను యర్థముననే సాంఖ్యపదము తొలి ప్రయోగమనియు, నట పంచవింశతి తత్త్వముల లెక్కించు కపిల సిద్ధాంతమున కది యన్వయింపబడినదనియు (Garbe) గార్బె (Jacobe) జకోబీల అభిప్రాయము. (The term Sankhya is from the noun 'Sankhya' number and also calculation, reasoning)[148] సంఖ్యయను సర్వనామమునుండి సాంఖ్యపద ముత్పన్నమనియు, దానికి గణనము విచారణ అగు ననియు (John Davis) జాన్ డేవిసు అభిప్రాయము. మహాభారతమున 'శ్లో॥ సంఖ్యాం ప్రకుర్వతే చైవ ప్రకృతిం చ ప్రచక్షతే। తత్త్వాని చ చతుర్వింశతేన సాంఖ్యం ప్రకీర్తితం॥' (12.311) సంఖ్యారూప విచారణసేయుచు, ప్రకృతి చతుర్వింశతి తత్త్వముల జర్చించునుగాన సాంఖ్య మనబడినట్లు తెలుపబడి యున్నది. అనగా నీసాంఖ్యమునకు సామాన్యముగ జ్ఞానమనియు,

146. J. N. Mukharjee: Sankhya
147. Dr. Har Datta Sharma: Sankhya p 2
148. Dr. John Davis: Sankhya Karika

చతుర్వింశతి తత్త్వ పరిజ్ఞానమనియు, ద్వివిధార్థములు భారతము ననుసరించియుండ నీరెంటిని విజ్ఞాన భిక్షువు అన్వయించెను. ఈ రెండు భావములలో దేని దీర్మానించుటయో నిశ్చయింప వలనుపడదనియు, చతుర్వింశతి తత్త్వముల బరిశీలించి యతత్త్వ ములుగా బరిత్యజించి, యిరువదియైదవదియగు పురుషుని గ్రహించుటయే యాశ్లోక తాత్పర్యము. అనగా పురుషప్రకృతుల విచక్షణాజ్ఞానమును బోధించుచు, ప్రకృతి తంత్రమును వర్జించుట సాంఖ్యదర్శనోపదేశ మగుచున్నది. తత్కారణముగ (It is not unlikely that this final abandonment (పరిసంఖ్యాన) gave its name to the system)[149] పరిసంఖ్యాన మనబడు యీతుది పరిత్యాగమువలన నీదర్శనమునకు యీనామము గలిగియుండ వచ్చునని భావము. సాంఖ్యుల పరిసంఖ్యాన సాధనముల సూచించుచు నిర్లే (Jacobe) జకోబికూడ యన్వయించెను.

(It is also suggested that the system derived its name from its first founder Sankha, though there is little evidence for this)[150] ప్రథమ స్థాపకాచార్యుడగు సంఖుడనువాని ననుసరించి దీనికానామము గలిగియుండునని యందురు గాని దానికి కొంచెమేని ప్రమాణము లేకపోవుటచే, షడ్దర్శన సముచ్చయ గ్రంథకర్త గుణరత్న యూహించియున్నను, సమ్మతము కాజాలనిదయ్యెను.

---

149. Dr. S. S. Suryanarayana Sastry: Sankhya Karika
150. Prof. S. Radhakrishnan: Indian hilosophy Vol 2 p 249

'శుద్ధాత్మ తత్త్వవిజ్ఞానం సాంఖ్యమి త్యభిధీయతే' 151 యను వ్యాస నిర్వచనమును శంకరులు స్వీకరించియుండిరి. చతుర్వింశతి తత్త్వములకు విభిన్నమగు ఆత్మజ్ఞానమే సాంఖ్యమను యర్థము యీనిర్వచనమున స్ఫురించుచున్నది. ఆత్మనే సాంఖ్య పరిభాషలో పురుషుడందురు. 'సమ్యక్ ఖ్యాయతే అస్మిన్ పరంబ్రహ్మేతి' కరచరణాదుల వ్యాపారము జేయుచుండియు ఆత్మతత్త్వప్రకాశ మెట చక్కగ అవిచ్ఛిన్నముగనుండునో అది సాంఖ్యముగ భగవద్గీతావ్యాఖ్యాన సహజానందోపాధ్యాయులు నిర్వచించిరి. అనగా కరచరణాది చతుర్వింశతితత్త్వ ప్రవృత్తుల నధిగమించి ఆత్మ యనబరగు పురుష తత్త్వజ్ఞానము నొందుటయే సాంఖ్యముగా నర్థమగును. కాన కారికాభావము ననుసరించి, 'శ్రేయాన్ వ్యక్తావ్యక్త జ్ఞ విజ్ఞానాత్' (సా. కా. 2) పంచవింశతి తత్త్వవిజ్ఞానమే శ్రేయోదాయకమనియు 'శ్లో॥ పంచవింశతి తత్త్వజ్ఞో -- ముచ్యతే నాత్ర సంశయః' (సా. కా. గా, 1) పంచవింశతి తత్త్వజ్ఞుడు నిస్సంశయముగ ముక్తిగాంచు నను పంచశిఖాచార్యు ననుసరించియు జూచిన, పురుషప్రకృతుల విచక్షణయే ముక్తిదముగ నుండుటచే పరిసంఖ్యానార్థమే సమంజసమని తోచును.

---

## దర్శన పదార్థము

కేవలము సాంఖ్యపదమే గాక సాంఖ్యదర్శనమనియు దీనికి నామము. దర్శనపదము సాంఖ్యాది వేదాంతపర్యంతము గల

---

151. శ్రీ శంకరభగవత్పాదాచార్యః విష్ణు సహస్రనామస్తోత్ర 70

యాస్తిక షడ్దర్శనములకేగాక బౌద్ధజైనాది యవైదికములకూడ చేర్చి షోడశకముగా మాధవాచార్యులు అన్వయించియున్నారు. అవియే 1) చార్వాక 2) బౌద్ధ 3) జైన-అర్హత 4) రామానుజ 5) పూర్ణప్రజ్ఞ-మధ్వ 6) పాశుపత-నకులేశ 7) శైవ 8) ప్రత్యభిజ్ఞ 9) రసేశ్వర 10) వైశేషిక-ఔలూక్య 11) అక్షపాద-న్యాయ 12) జైమినీయ 13) పాణినీయ 14) సాంఖ్య 15) పాతంజల-యోగ 16) వేదాంత-శంకర ము లనుచు పదియారు. ఈదర్శనపదార్థము నన్వేషించుచు ధృవపండితుడు (The seers of the Vedas both know the truth and saw it; the sages who came after possessed the knowledge alone but not the vision; the search for the vision in its various stages is embodied in the darsanas)[152] వేదకాలఋషులు సత్పదార్థమును గ్రహించి దర్శించియుండిరి. తర్వాతవారు దాని జ్ఞానము మాత్రము గలిగి దర్శనము లేకుండిరి. తద్దర్శనార్థము వివిధాన్వేషణములే దర్శనతాత్పర్యమని నూతన సిద్ధాంతమును వచించెను. కాని సూక్ష్మదృష్టి బరిశీలించిన కపిలాది దర్శనాచార్యులు కేవలపండితమాత్రులై యనుభవజ్ఞాన రహితులనుట కేవల మభూతము. కాన 'దర్శ్యతే తత్త్వ మనేన దర్శనం' అను వ్యుత్పత్తి ననుసరించి, తత్త్వార్థదర్శనము గలిగించు జ్ఞాన మనుటయే యుక్తము. (All logical attempts to gather the floating conceptions of the world into some great general ideas were regarded as darsanas) [153] (ప్రపంచమును

152. Dr. A. B. Dhruva: S. S. S. Sastry Sankhya Karika
153 శ్రీ మాధవాచార్య: సర్వదర్శన సంగ్రహము.

గూర్చి క్రోడీకరింపబడని భావజాలమును విశాల భావసముదాయముగ జేర్పు యాంత్రిక విధానములే దర్శనములనియు నొక యన్వయముగలదు. దీనినే చక్కని భాషలో విశ్వమనెడి జటిల సమస్యలను పరిష్కరించుటకై యొనర్చిన మనీషుల నిరంతర ప్రయత్నప్రవాహముల కాదిమస్రోతస్సులు భారతీయ దర్శనములని 154 పం. గోపదేవ్ వ్రాసెను. కాన (They all help us to see some aspect of the truth) 155 దర్శనములన్నియు సత్పదార్థమునొక్క యొకతత్త్వమును దర్శింపజేయు నన్నటుల దర్శనకారణజ్ఞానమును దర్శనమనుటయే యుత్తమమగుచున్నది. అందుచేతనే యీశాస్త్రమును తంత్రమనియు వ్యవహరింతురు. (The real meaning of the word Tantra is shastra) 156 తంత్రమనగా సామాన్యార్థముగా శాస్త్రమని యున్నను. 'తన్యతే, విస్తార్యతే అనేన ఇతి తంత్రం', 'తన్' అనగ వ్యాపింపజేయుట, 'త్ర' యన రక్షించుట యగును. అందుచే, రక్షించు జ్ఞానమును బ్రసరింపజేయు శాస్త్రము తంత్రమగుటచే సాంఖ్యము పైవిధానమున దర్శనమనియు, తంత్రమనియు బ్రఖ్యాతి నొందు టెంతయు సముచితమై యొప్పారుచున్నది.

---

154. పం. గోపదేవ్: వైశేషిక దర్శనము

155. prof. S. Radhakrishnan; Indian PhilosoPhy Vol I p 18

156. Swami Vivekananda: The Complete Works Vol 3 p 458

శ్రీమదీశ్వరకృష్ణ ప్రణీతాః

# సాంఖ్య కారికాః

దుఃఖత్రయాభిఘాతాజ్జిజ్ఞాసా తదభిఘాతకే హేతౌ।
దృష్టే సాఽపార్థా చేన్నైకాంతాత్యంతతోఽభావాత్॥ ౧
దృష్టవదానుశ్రవికః స హ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః।
తద్విపరీతః శ్రేయాన్ వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానాత్॥ ౨
మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త।
షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః॥ ౩
దృష్టమనుమానమాప్తవచనం చ, సర్వప్రమాణసిద్ధత్వాత్।
త్రివిధం ప్రమాణమిష్టం, ప్రమేయసిద్ధిః ప్రమాణాద్ధి॥ ౪
ప్రతివిషయాధ్యవసాయో దృష్టం, త్రివిధమనుమానమాఖ్యాతం
తల్లింగలింగిపూర్వకం, ఆప్తశ్రుతిరాప్తవచనం చ॥ ౫
సామాన్యతస్తు దృష్టాదతీంద్రియాణాం ప్రసిద్ధిరనుమానాత్।
తస్మాదపి చాసిద్ధం పరోక్షమాప్తాగమాత్ సిద్ధం॥ ౬
అతిదూరాత్ సామీప్యాదింద్రియఘాతాన్మనోఽనవస్థానాత్।
సౌక్ష్మ్యాద్ వ్యవధానాదభిభావాత్ సమానాభిహారాచ్చ॥ ౭
సౌక్ష్మ్యాత్తదనుపలబ్ధిర్నాభావాత్, కార్యతస్తదుపలబ్ధిః।
మహదాది తచ్చ కార్యం, ప్రకృతివిరూపం సరూపం చ॥ ౮
అసదకరణాదుపాదానగ్రహణాత్, సర్వసంభవాభావాత్।
శక్తస్య శక్యకరణాత్, కారణభావాచ్చ, సత్కార్యం॥ ౯
హేతుమదనిత్యమవ్యాపి సక్రియమనేకమాశ్రితం లింగం।
సావయవం పరతంత్రం వ్యక్తం విపరీతమవ్యక్తం॥ ౧౦

త్రిగుణమవివేకి విషయః సామాన్యమచేతనం ప్రసవధర్మి।
వ్యక్తం తథా ప్రధానం, తద్విపరీతస్తథా చ పుమాన్॥ ౧౧
ప్రీత్యప్రీతివిషాదాత్మకాః ప్రకాశప్రవృత్తినియమార్థాః।
అన్యోఽన్యాభిభవాశ్రయజననమిథునవృత్తయశ్చ గుణాః॥ ౧౨
సత్త్వం లఘు ప్రకాశకమిష్టముపష్టంభకం చలం చ రజః।
గురు వరణకమేవ తమః ప్రదీపవచ్చార్థతో వృత్తిః॥ ౧౩
అవివేక్యాదిః సిద్ధః త్రైగుణ్యాత్తద్విపర్యయాభావాత్।
కారణగుణాత్మకత్వాత్ కార్యస్యావ్యక్తమపి సిద్ధం॥ ౧౪
భేదానాం పరిమాణాత్, సమన్వయాత్, శక్తితః ప్రవృత్తేశ్చ।
కారణకార్యవిభాగాత్, అవిభాగాద్వైశ్వరూప్యస్య॥ ౧౫
కారణమస్త్యవ్యక్తం ప్రవర్తతే త్రిగుణతః సముదయాచ్చ।
పరిణామతః సలిలవత్ ప్రతిప్రతిగుణాశ్రయవిశేషాత్॥ ౧౬
సంఘాతపరార్థత్వాత్, త్రిగుణాదివిపర్యయాదధిష్ఠానాత్।
పురుషోఽస్తి భోక్తృభావాత్ కైవల్యార్థం ప్రవృత్తేశ్చ॥ ౧౭
జననమరణకరణానాం ప్రతినియమాదయుగపత్ప్రవృత్తేశ్చ।
పురుషబహుత్వం సిద్ధం త్రైగుణ్యవిపర్యయాచ్చైవ॥ ౧౮
తస్మాచ్చ విపర్యాసాత్ సిద్ధం సాక్షిత్వమస్య పురుషస్య।
కైవల్యం మాధ్యస్థ్యం ద్రష్టృత్వమకర్తృభావశ్చ॥ ౧౯
తస్మాత్తత్సంయోగాదచేతనం చేతనావదివ లింగం।
గుణకర్తృత్వే చ తథా కర్తేవ భవత్యుదాసీనః॥ ౨౦
పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య।
పంగ్వంధవదుభయోరపి సంయోగస్తత్కృతః సర్గః॥ ౨౧
ప్రకృతేర్మహాన్, తతోఽహంకారః, తస్మాద్గణశ్చ షోడశకః।
తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచ భూతాని॥ ౨౨

అధ్యవసాయో బుద్ధిర్ధర్మో జ్ఞానం విరాగ ఐశ్వర్యం।
సాత్త్వికమేతద్రూపం తామసమస్మాద్విపర్యస్తం॥ ౨౩
అభిమానోఽహంకార స్తస్మాద్ద్వివిధః ప్రవర్తతే సర్గః।
ఏకాదశకశ్చ గణ స్తన్మాత్రః పంచకశ్చైవ॥ ౨౪
సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహంకారాత్।
భూతాదే స్తన్మాత్రః స తామసః, తైజసాదుభయం॥ ౨౫
బుద్ధీంద్రియాణి చక్షుః శ్రోత్రఘ్రాణరసనస్పర్శనకాని।
వాక్పాణి పాదపాయూపస్థాన్ కర్మేంద్రియాణ్యాహుః॥ ౨౬
ఉభయాత్మకమత్ర మనః సంకల్పకమింద్రియం చ సాధర్మ్యాత్।
గుణపరిణామ విశేషాన్నానాత్వం బాహ్య భేదాశ్చ॥ ౨౭
శబ్దాదిషు పంచానామాలోచన మాత్రమిష్యతే వృత్తిః।
వచనాదానవిహరణోత్సర్గానందాశ్చ పంచానాం॥ ౨౮
స్వాలక్షణ్యం వృత్తిస్త్రయస్య సైషా భవత్యసామాన్యా।
సామాన్య కరణవృత్తిః ప్రాణాద్యా వాయవః పంచ॥ ౨౯
యుగపచ్చతుష్టయస్య తు వృత్తిః క్రమశశ్చ తస్య నిర్దిష్టా।
దృష్టే తథాఽప్యదృష్టే త్రయస్య తత్పూర్వికా వృత్తిః॥ 30
స్వాం స్వాం ప్రతిపద్యంతే పరస్పరాకూతహేతుకాం వృత్తిం।
పురుషార్థ ఏవ హేతుర్న కేనచిత్కార్యతే కరణం॥ 31
కరణం త్రయోదశవిధం తదాహరణధారణప్రకాశకరం।
కార్యం చ తస్య దశధాఽఽహార్యం ధార్యం ప్రకాశ్యం చ॥ 32
అంతఃకరణం త్రివిధం దశధా బాహ్యం త్రయస్య విషయాఖ్యం।
సాంప్రతకాలం బాహ్యం త్రికాలమాభ్యంతరం కరణం॥ 33
బుద్ధీంద్రియాణి తేషాం పంచ విశేషావిశేషవిషయాణి।
వాగ్భవతి శబ్దవిషయా శేషాణి తు పంచవిషయాణి॥ 34

సాంతఃకరణా బుద్ధిః సర్వం విషయమవగాహతే యస్మాత్।
తస్మాత్ త్రివిధం కరణం ద్వారి ద్వారాణి శేషాణి॥ ౩౫
ఏతే ప్రదీపకల్పాః పరస్పరవిలక్షణా గుణవిశేషాః।
కృత్స్నం పురుషస్యార్థం ప్రకాశ్య బుద్ధౌ ప్రయచ్ఛంతి॥ ౩౬
సర్వం ప్రత్యుపభోగం యస్మాత్ పురుషస్య సాధయతి బుద్ధిః।
సైవ చ విశినష్టి పునః ప్రధానపురుషాంతరం సూక్ష్మం॥ ౩౭
తన్మాత్రాణ్యవిశేషాః తేభ్యో భూతాని పంచ పంచభ్యః।
ఏతే స్మృతా విశేషాః శాంతా ఘోరాశ్చ మూఢాశ్చ॥ ౩౮
సూక్ష్మా మాతాపితృజాః సహ ప్రభూతైస్త్రిధా విశేషాః స్యుః।
సూక్ష్మాస్తేషాం నియతా మాతాపితృజా నివర్తంతే॥ ౩౯
పూర్వోత్పన్నమసక్తం నియతం మహదాదిసూక్ష్మపర్యంతం।
సంసరతి నిరుపభోగం భావైరధివాసితం లింగం॥ ౪౦
చిత్రం యథాశ్రయమృతే స్థాణ్వాదిభ్యో యథా వినా ఛాయా।
తద్వద్వినాఽవిశేషైః న తిష్ఠతి నిరాశ్రయం లింగం॥ ౪౧
పురుషార్థహేతుకమిదం నిమిత్తనైమిత్తికప్రసంగేన।
ప్రకృతేర్విభుత్వయోగాత్ నటవద్వ్యవతిష్ఠతే లింగం॥ ౪౨
సాంసిద్ధికాశ్చ భావాః ప్రాకృతికా వైకృతికాశ్చ ధర్మాద్యాః।
దృష్టాః కరణాశ్రయిణః కార్యాశ్రయిణశ్చ కలలాద్యాః॥ ౪౩
ధర్మేణ గమనమూర్ధ్వం గమనమధస్తాద్ భవత్యధర్మేణ।
జ్ఞానేన చాపవర్గో విపర్యయాదిష్యతే బంధః॥ ౪౪
వైరాగ్యాత్ ప్రకృతిలయః సంసారో భవతి రాజసాద్రాగాత్।
ఐశ్వర్యాదవిఘాతో విపర్యయాత్ తద్విపర్యాసః॥ ౪౫
ఏష ప్రత్యయసర్గో విపర్యయాశక్తితుష్టిసిద్ధ్యాఖ్యః।
గుణవైషమ్యవిమర్దేన తస్య భేదాస్తు పంచాశత్॥ ౪౬

పంచ విపర్యయభేదా భవంత్యశక్తిశ్చ కరణవైకల్యాత్।
అష్టావింశతిభేదా తుష్టిర్నవధాఽష్టధా సిద్ధిః॥ ౪౭
భేదస్తమసోఽష్టవిధో మోహస్య చ, దశవిధో మహామోహః।
తామిస్రోఽష్టాదశధా, తథా భవత్యంధతామిస్రః॥ ౪౮
ఏకాదశేంద్రియవధాః సహ బుద్ధివధైరశక్తిరుద్దిష్టా।
సప్తదశ వధా బుద్ధేర్విపర్యయాత్ తుష్టిసిద్ధీనాం॥ ౪౯
ఆధ్యాత్మికాశ్చతస్రః ప్రకృత్యుపాదానకాలభాగ్యాఖ్యాః।
బాహ్యా విషయోపరమాత్ పంచ, నవతుష్టయోఽభిహితాః॥ ౫౦
ఊహః శబ్దోఽధ్యయనం దుఃఖవిఘాతాస్త్రయః సుహృత్ప్రాప్తిః।
దానం చ సిద్ధయోఽష్టౌ సిద్ధేః పూర్వోఽంకుశస్త్రివిధః॥ ౫౧
న వినా భావైర్లింగం న లింగేన భావ నిర్వృత్తిః।
లింగాఖ్యో భావాఖ్యస్తస్మాద్ ద్వివిధః ప్రవర్తతే సర్గః॥ ౫౨
అష్టవికల్పో దైవస్తైర్యగ్యోనశ్చ పంచధా భవతి।
మానుషశ్చైకవిధః సమాసతోఽయం త్రిధా సర్గః॥ ౫౩
ఊర్ధ్వం సత్త్వవిశాలస్తమోవిశాలశ్చ మూలతః సర్గః।
మధ్యే రజోవిశాలో బ్రహ్మాదిస్తంబపర్యంతః॥ ౫౪
తత్ర జరామరణకృతం దుఃఖం ప్రాప్నోతి చేతనః పురుషః।
లింగస్యావినివృత్తేః, తస్మాద్ దుఃఖం స్వభావేన॥ ౫౫
ఇత్యేష ప్రకృతికృతో మహదాదివిశేషభూతపర్యంతః।
ప్రతిపురుష విమోక్షార్థం స్వార్థ ఇవ పరార్థ ఆరంభః॥ ౫౬
వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తిరజ్ఞస్య।
పురుషవిమోక్షనిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య॥ ౫౭
ఔత్సుక్యనివృత్త్యర్థం యథా క్రియాసు ప్రవర్తతే లోకః।
పురుషస్య విమోక్షార్థం ప్రవర్తతే తద్వదవ్యక్తం॥ ౫౮

రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్।
పురుషస్య తథాఽఽత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః॥ ౫౯
నానావిధైరుపాయైరుపకారిణ్యనుపకారిణః పుంసః।
గుణవత్యగుణస్య సతస్తస్యార్థమపార్థకం చరతి॥ ౬౦
ప్రకృతేః సుకుమారతరం న కించిదస్తీతి మే మతిర్భవతి।
యా దృష్టాస్మీతి పునర్న దర్శనముపైతి పురుషస్య॥ ౬౧
తస్మాన్న బధ్యతే నాపి ముచ్యతే నాపి సంసరతి కశ్చిత్।
సంసరతి బధ్యతే ముచ్యతే చ నానాశ్రయా ప్రకృతిః॥ ౬౨
రూపైః సప్తభిరేవ తు బధ్నాత్యాత్మానమాత్మనా ప్రకృతిః।
సైవ చ పురుషార్థం ప్రతి విమోచయత్యేకరూపేణ॥ ౬౩
ఏవం తత్త్వాభ్యాసాన్నాస్మి న మే నాహమిత్యపరిశేషం।
అవిపర్యయాద్విశుద్ధం కేవలముత్పద్యతే జ్ఞానం॥ ౬౪
తేన నివృత్తప్రసవామర్థవశాత్ సప్తరూప వినివృత్తాం।
ప్రకృతిం పశ్యతి పురుషః ప్రేక్షకవదవస్థితః స్వస్థః। ౬౫
రంగస్థ ఇత్యుపేక్షక ఏకో దృష్టాహమిత్యుపరమత్యేకా।
సతి సంయోగేఽపి తయోః ప్రయోజనం నాస్తి సర్గస్య॥ ౬౬
సమ్యగ్జ్ఞానాధిగమాద్ధర్మాదీనామకారణప్రాప్తౌ।
తిష్ఠతి సంస్కారవశాచ్చక్రభ్రమవద్ ధృతశరీరః॥ ౬౭
ప్రాప్తే శరీరభేదే చరితార్థత్వాత్ ప్రధానవినివృత్తౌ।
ఏకాంతికమాత్యంతికముభయం కైవల్యమాప్నోతి॥ ౬౮
పురుషార్థజ్ఞానమిదం గుహ్యం పరమర్షిణా సమాఖ్యాతం।
స్థిత్యుత్పత్తిప్రలయాశ్చింత్యంతే యత్ర భూతానాం॥ ౬౯
ఏతత్పవిత్రమగ్ర్యం మునిరాసురయేఽనుకంపయా ప్రదదౌ।
ఆసురిరపి పంచశిఖాయ తేన చ బహుధా కృతం తంత్రం॥ ౭౦

శిష్య పరంపరయా ఽఽగత మీశ్వరకృష్ణేన చైతదార్యాభిః।
సంక్షిప్తమార్యమతినా సమ్యగ్విజ్ఞాయ సిద్ధాంతం॥ ౭౦
సప్తత్యాం కిల యేఽర్థాస్తేఽర్థాః కృత్స్నస్య షష్టితంత్రస్య।
ఆఖ్యాయికావిరహితాః పరవాదవివర్జితాశ్చాపి॥ ౭౧



# సాంఖ్య తత్త్వ విమర్శ

## సృష్టి విషయము

"Philosophy is the self-comprehension of Reality"
Mukharjee

"Philoso phy carries us to the Gates of the promised land"
Radhakrishnan

సత్య జ్ఞానాపరోక్షత్వమే తత్త్వశాస్త్రము. మోక్ష ద్వారముల సన్నిధికి తత్త్వశాస్త్రము గొంపోవును. కాని 'ప్రకృతిర్వియోగో మోక్షః' (హరిభద్ర) అనుసూత్రము ననుసరించి ప్రకృతినుండి వియోగమే మోక్ష మగుచున్నది. ఆప్రికృతియన్న ప్రత్యక్షమును నిత్యానుభూతమును అగు దుఃఖమూలమై యున్నది. కాన ప్రత్యక్షానుభవ గోచరమగు నాదుఃఖ నిర్మూలనార్థము తత్కారణ స్వరూపమగు సర్వప్రకృతిని గ్రహించి, ప్రయత్నతః తన్నిరాసముగావించి, 'కేవలభావా న్మోక్షః' (సా. కా. గా. 68) కేవల భావరూపమోక్షము నెల్లరు నందుకొనుటకే, సర్వముముక్షులోకముపై 'ననుకంపమున' (సా. కా. 70) 'సత్కారుణ్యమున' (సా. కా. గా. 1) భగవాన్ శ్రీకపిలాచార్యునిచేత మనకు బ్రసాదింపబడిన యుత్తమ తత్త్వశాస్త్రరాజము సాంఖ్యము. పూర్వవచనానుసరణి 'ప్రధీయతే ఇతి ప్రధానః' (తౌ. సూ. భా-2.18) అను వ్యుత్పత్తిరీతి, సర్వకార్యముల కాధారమైయుండుచు, 'అవిద్యా జ్ఞాన విరోధత్వాత్' (తత్త్వత్రయ-48) జ్ఞాన నిరోధకమగుటచే నవిద్యయగుచు, 'జ్ఞానేన చాపవర్గః' (సా. కా. 44) అపవర్గ నాపదు

మోక్షప్రదాతయగు జ్ఞానమునాటంకపరచుచు, 'అత్యంత దుఃఖ నివృత్యా కృతకృత్యతా' (సా.సూ 65) అత్యంత నివృత్తి నా గృతకృత్యత్వమును బొందనీయక ప్రకృతి ముముక్షువుల నాటంక పరచుచున్నది. ఇట్లు అంత్యమున సంప్రాప్తించు దుఃఖనివృత్తి రూప కైవల్యస్థితికి ప్రకృతిజన్య దుఃఖమే యావరకమగుటచే నీకారికా గ్రంథము 'శ్లో॥ దుఃఖత్రయాభిఘాతా జ్జిజ్ఞాసా తదభి ఘాతకే హేతౌ।' (సా. కా. 1) త్రివిధరూప దుఃఖముండుట వలన దన్నివారణోపాయ విచారణ మావశ్యకమనియు, 'అథ త్రివిధ దుఃఖాత్యంతనివృత్తి రత్యంత పురుషార్థః' (సా.సూ 1.1) దుఃఖత్రయ నివృత్తియే యత్యంత పురుషార్థమనుచు సాంఖ్యప్రవ చన సూత్రగ్రంథముకూడ ప్రారంభింపబడియున్నది. అనగా సూక్ష్మవిషయ గ్రహణమునకు ప్రారంభము స్థూలమునుండియు, నపరోక్షజ్ఞానమునకు ప్రత్యక్షమునుండియు, నను క్రమమున నప్రత్యక్షభూతమగు నలౌకికముక్తి సాధించుటకై నిత్యప్రత్యక్షా నుభూతమగు దుఃఖకారణమారసి దాని నివారింప యత్నించుట కడుంగడు సమంజసముగా నున్నది. అందుచే దుఃఖకారణమగు సర్గ మెట్లేర్పడుచున్నదను రహస్యము ప్రథమమున ముఖ్యము గాన దాని బ్రస్తుతము విచారింతము.

'శ్లో॥ పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధా నస్య। పంగ్వంధవదుభయోరపి సంయోగస్తత్కృతః సర్గః॥' (సా.కా.21) పురుషుడు ప్రకృతితో గలియుట దర్శనార్థమనియు, ననగా మహదాదికార్య భూతపర్యంతమును బురుషు డుప భోగించుటకొరకగుననియు, 'ప్రధానస్యాపి పురుషేణసంయోగః కైవల్యార్థం" (సా. కా. గౌ. 21) ప్రధాన పురుషసంయోగము

ఈశ్వరత్వ జీవత్వములు లేవు అని కొన్ని యుపనిషచ్చయము, మాయాప్రాభవముననే సృష్టి స్థితి లయములును, జీవేశ్వర విభేద కల్పనమును భ్రాంతిచే నేర్పఢడినట్లు వచించుచున్నవి. ఇంక గొన్ని మాయయే ఈశ్వరశక్తిగ విశ్వసించి, 'హృదయే చైతన్య రూపిణీం - - - స్మితముఖీం సుందరీం మహామాయాం సర్వ శుభగాం' (త్రిపురతాపిని. 1) హృదయస్థమైన చైతన్య రూపిణిని, మందస్మితాననము గల దానిని, సుందరిని, మహా మాయా స్వరూపిణిని సర్వ శుభప్రదమైన దానినిగ స్తుతించి యున్నవి. 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహే శ్వరం।' (శ్వే. 4. 10) ప్రకృతినే మాయగా గ్రహింపుము. దానితో గలిసియున్నవాని మహేశ్వరునిగా దెలిసికొనుము. 'అతి మోహ కరీ మాయా' (శరభ. 21) అతి విమోహనమైనది మాయ. 'నాస్తి మాయా పరాత్మని' (పాశుపతబ్రహ్మ. 18) పరమాత్మలో మాయ లేదు. 'సంకోచవికాసాత్మక మహామాయా' (త్రి. మ. నా. 3) సంకోచవికాసములు గలది మహామాయ. 'మహామాయా శక్తిః' (త్రి. మ. న, 6) 'మాయోపాధికో నారాయణో ఆసీత్' (త్రి. మ. నా. 2) మాయోపాధికుడైన నారాయణుడుండెను. 'వైష్ణవీం మహామాయాం నమస్కృత్య' (త్రి. మ.నా.6) వైష్ణవ శక్తియైన మహామాయకు నమస్కరించి, 'అజేయా వైష్ణవీ మాయా' (కృష్ణ) జయింపరానిది వైష్ణవమాయ. 'వైష్ణవీ మహాయోగమాయా' (త్రి. మ నా. 4) వైష్ణవమైన మహాయోగమాయ యని కొన్ని యుపనిషత్తులు దాని ఈశ్వరశక్తిగ రూపొందించి స్తుతించి యున్నవి. 'మాయయా మోహితం జగత్' (కృష్ణ) జగత్తు

పురుషార్థము ద్వివిధమై 'దర్శనార్థం కైవల్యార్థం' (సా. కా. 21) అన్నటుల, 'పురుషస్య ప్రధానేన సహ సంయోగో దర్శనార్థం' (సా. కా. గౌ. 21) ప్రధానములో పురుషుని యొక్క సంయోగము దర్శనార్థమై 'ప్రకృతిం మహాదాది కార్యం భూతాదిపర్యంతం పురుషః పశ్యతి' (సా. కా. గౌ. 21) మహాదాది కార్యభూతపర్యంత ప్రకృతిని పురుషుడు దర్శించు ననియు 'ప్రధానస్యాపి పురుషేణ సంయోగః కైవల్యార్థం' (సా. కా. గౌ. 21) ప్రధానము పురుషునితో సంయోగము కైవల్యార్థమనియు నన్నటుల పురుషునికొరకే ప్రకృతి ప్రవర్తించుచున్నదని పూర్వమే వచింపబడియున్నది. అందు ప్రథమమగు దర్శనార్థ ప్రసంగమే ముఖ్యమై 'శబ్దాద్యుపలబ్ధిలక్షణో' (సా. కా. గౌ. 42) శబ్దాద్యనుభవరూపమై యొప్పారును. పురుషుని కాదర్శనాపేక్షయు 'అనాదిత్వాచ్చసర్గస్య' (సా. కా. గౌ. 52) సర్గ మనాది యగుటవలన 'పూర్వాపూర్వసంస్కారాదృష్టకారితత్వాత్' (సా. కా. గౌ. 52) పూర్వాపూర్వ సంస్కారజన్యమగు అదృష్టకారణమైన గలుగుచుండగా నా ప్రకృతి 'సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రధానం' (సా. కా. గౌ. 16) అన్నరీతి త్రిగుణసామ్యావస్థా రూపమైయున్నను, 'స్వభావాత్ కృతగుణపరిణామేనేతి' (సా. కా. గౌ. 27) గుణ పరిణామమను స్వభావకృతముగా నీనానాత్వ మేర్పడుచున్నది. కాని, వ్యక్తావ్యక్త పురుషులనబడు తత్త్వత్రయములో 'సర్వకర్తృత్వాత్ ...ప్రధానమేవ కారణం। స్వభావోఽప్యత్రైవ లీనః। తస్మాత్ ...కారణం, నాపి స్వభావ ఇతి తస్మాత్ ప్రకృతిరేవ కారణం' (సా. కా. గౌ. 61) సర్వకర్తృత్వము గలదగుటచే

ప్రధానమే కారణము. స్వభావము దానిలో నేకము. కాన ప్రధానమే కారణము కాని స్వభావము కాదు. ఈవిషయమే 'న ప్రకృతేః కారణాంతరమస్తీతి' (సా. కా. గా. 61) ప్రకృతికంటె గారణాంతరము లేదు అని నిశ్చయింప బడియున్నది, అందుచేత నవ్యక్తమనబడు ప్రకృతి 'కారణమస్త్యవ్యక్తం ప్రవర్తతే' (సా. కా. 16) అన్నటుల కారణమైయొప్పుచు 'త్రిగుణతః సముదయాచ్చ। పరిణామతః సలిలవత్' (సా. కా. 16) త్రిగుణములద్వార జలమువలె బరిణమించుచు సృష్టికారణమగుచున్నది. అదియు 'ప్రతిప్రతిగుణాశ్రయవిశేషాత్' (సా. కా. 16) ప్రతిగుణోపాధియొక్క విశేషమునలన నానాత్వముగా సృజించుచున్నది. మరియు 'మూలప్రకృతి రవికృతిః' (సా కా. 3) 'మూలప్రకృతిః ప్రధానం' (సా. కా. గా. 3) ప్రధాననామమున బరగు మూలప్రకృతి కారణజన్యమగు కార్యము కాదు కావున, సర్వకారణమైయొప్పు 'శ్లో॥ప్రకృతేర్మహాన్, తతోహంకారః, తస్మాద్గణశ్చ షోడశకః। తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచభూతాని॥' (సా. కా. 22) ప్రకృతినుండి మహన్నామక బుద్ధియు దానినుండి యహంకారమును, దానినుండి పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియము లనబడు షోడశకమును జనించుచున్నవి. ఈషోడశకమునగల బంచతన్మాత్రలనుండి పంచభూతము లుత్పన్నములు. అనగా ప్రకృతినుండి ప్రథమమున 'మహాన్, బుద్ధిః. ఆసురీ, మతిః, ఖ్యాతిః, జ్ఞానం ఇతి ప్రజ్ఞాపర్యాయైరుత్పద్యతే' (సా. కా. గా. 22) అనువిధముగ వివిధనామములుగల బుద్ధి జనించుచున్నది. ప్రధానమునందు సామ్యావస్థలోనున్న అవ్యక్త గుణత్రయము విషమపరిణామ మొందుటవలన బుద్ధ్యాదిసృష్టి

కలుగుటచే, నీబుద్ధియందును మొదట 'యోయమవివేక్యాది ర్గుణః స త్రైగుణ్యాన్మహదాదౌ' (సా. కా. గౌ. 14) అవివేకాది గుణములు త్రిగుణాత్మకమగు మహదాదులం దిమిడియున్నవగుటచే వ్యక్తమై విరాజిల్లుచున్నవి. మరియు నీబుద్ధి 'అధ్యవసాయో బుద్ధిః' (సా. సూ 2-13) 'ధర్మో జ్ఞానం విరాగఐశ్వర్యం సాత్త్వికమేతద్రూపం తామసమస్మాద్విపర్యస్తం' (సా. కా. 23) అను కారికానుసరణముగ అధ్యవసాయమే లక్షణముగాగలది. 'యథాబీజేభవిష్యద్వృత్తికోఽఙ్కుర స్తద్వదధ్యవసాయః' (సా. కా. గౌ. 23) బీజమునందు భవిష్యత్కాలమగు అంకురముండినట్లు యీయధ్యవసాయము బుద్ధియందుండును, ధర్మ జ్ఞాన, విరాగ ఐశ్వర్యములు దాని సాత్త్వికరూపములు. తద్విపరీతములు తామసికములు. అనగా బుద్ధి ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యములు నా సాత్త్వికధర్మముల తోడను, తద్విపరీతములగు అధర్మాజ్ఞాన రాగానైశ్వర్యములనబడు తామసిక వృత్తులతోడను యీయష్ట లక్షణముల గలిగి యుండును. మరల యీబుద్ధి 'సర్వం ప్రత్యుపభోగం యస్మాత్ పురుషస్య సాధయతి బుద్ధిః' (సా. కా, 37) పురుషునికిసర్వభోగముల నొసంగునదిగానుండును, 'తతోఽహంకారః' (సా. కా. 22) ఆబుద్ధినుండి యహంకార ముద్భవమగుచున్నది. ఆయహంకారము 'అభిమానోఽహంకారః' (సా. సూ. 2. 16, సా. కా. 24) నావచనరీతి నభిమానరూపముగా నుండును. 'తస్మాద్ ద్వివిధః ప్రవర్తతే సర్గః' (సా. కా. 24) దానినుండి ద్వివిధరూపసర్గ ముత్పన్నమగుచున్నది. అవి ఎవ్వియన 'ఏకాదశకశ్చ గణ స్తన్మాత్రః పంచకశ్చైవ' (సా. కా. 24) షోడశకమునగల ఏకాదశేంద్రియములును, పంచలక్షణోపేత

(సా.కా.గౌ.24) పంచతన్మాత్రలును జనించును. మరల నీ త్రిగుణ భేదమున నది త్రివిధమైయుండును. ఎట్లన 'శ్లో॥సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహంకారాత్ । భూతాదేస్తన్మాత్రః స తామసః తైజసాదుభయం' (సా.కా. 25, సా.సూ. 2 18) సత్త్వగుణ ప్రధానమైన వైకృతాహంకారమునుండి ఏకాదశకములు, తామసికమైన భూతాదినుండి తన్మాత్రపంచకమును, తైజసాహంకారమునుండి యుభయమును గలుగును. అనగా గుణప్రాధాన్యతచే నహంకారము త్రివిధమై సత్త్వప్రధానమున వైకృతముగను, తమోగుణముచే భూతాదిగను, రజోగుణాధిక్యతచే తైజసముగను రూపొంది తత్సంబంధ సృష్టులగావించుచున్నదని పూర్వాచార్యుల వచనము. (సా.కా.గౌ. 25) వైకృతరూప ఏకాదశకములో 'కర్మేంద్రియ బుద్ధీంద్రియైరాంతరమేకాదశకం' (సా.సూ. 2. 19) కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనస్సులుగలిసి యేకాదశకముగా నగును. అందు 'బుద్ధీంద్రియాణి చక్షుఃశ్రోత్రఘ్రాణరసనస్పర్శనకాని' (సా. కా. 26) శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములను ధీంద్రియపంచకమును 'వాక్పాణి పాదపాయూపస్థాన్ కర్మేంద్రియాణ్యాహుః' (సా. కా. 26) అనురీతి కర్మేంద్రియ పంచకమును, 'ఉభయాత్మకమత్ర మనః' (సా.కా. 27) ద్వివిధేంద్రియములకు సామాన్యమైన మనస్సును జేరి ఏకాదశకములగుచున్నది. అటులనే భూతాదికార్యములగు 'తన్మాత్రాణ్యవిశేషాః' (సా.కా. 38) అవిశేషములగు తన్మాత్రపంచకము శబ్దస్పర్శరూపరసగంధ రూపమున జనించుచున్నది. అవి 'దేవానామేతే సుఖలక్షణా విషయా దుఃఖమోహరహితాః' (సా.కా.గౌ. 38) దేవతాగణ

విషయములై శోకమోహశూన్యములై సుఖదములైయుండును గాన నవిశేషము లనబరగుచున్నవి. పూర్వోక్త వైకృతిక భూతాది సృష్టులకు తైజసాహంకార మత్యవసరము. ఎట్లన 'తైజసాదుభయం' (సా. కా. 25) తైజసమునుండి యుభయము గలుగునని తాత్పర్యము. అనగా నుభయమున నేకాదశగణము తన్మాత్రపంచకమగును. వానిలో సాత్వికాహంకారమగు వైకృతికము ఏకాదశేంద్రియముల నుద్భవింప జేయును. అది తైజసాహంకార సహాయమును గైకొనును. ఎందుచేనన 'సాత్వికో నిష్క్రియః స తైజసయుక్త ఇంద్రియోత్పత్తౌ సమర్థః' (సా. కా. గౌ. 25) సాత్వికము నిష్క్రియము. తైజసయుక్తమై ఇంద్రియోత్పత్తికి సమర్థమగుచున్నది. అట్లే 'తథా తామసోఽహంకారో భూతాదిసంజ్ఞితో నిష్క్రియత్వాత్ తైజసేనాహంకారేణ క్రియావతా యుక్తస్తన్మాత్రాణ్యుత్పాదయతి'(సా. కా. గౌ.25) భూతాదినామక తామసాహంకారము తైజసాహంకారముచే క్రియాసమర్థమై తన్మాత్రల నుద్భవింపజేయుచున్నది. ఈవిధముగ తైజసాహంకార ముభయాత్మకముగా బ్రవర్తించుచుండును. మరల నీ పంచతన్మాత్రలనుండి 'తేభ్యో భూతాని పంచ పంచభ్యః' (సా. కా. 38) పంచభూతము లుత్పన్నములు. అవియే 'పృథివ్యప్తేజోవాయ్వాకాశసంజ్ఞాని' (సా. కా గౌ. 38) పృథివ్యాది పంచభూతములు. ఈవిధముగా అహంకారమునుండి ద్వివిధమగు సృష్టి గలుగుచున్నది. 'మహతోఽహంకారోఽహంకారాత్ పంచతన్మాత్రాణ్యుభయమింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని' (సా. సూ. 1. 61) అనియు సాంఖ్యసూత్రము సృష్టిక్రమము నుపదేశించుచున్నది.

## శరీరోత్పత్తి

'శ్లో॥ న వినా భావైర్లింగం న లింగేన భావ నిర్వృత్తిః। లింగాఖ్యో భావాఖ్యస్తస్మాద్ ద్వివిధః ప్రవర్తతే సర్గః॥' (సా. కా. 52) భావములులేక లింగముగాని, లింగాభావమున భావవ్యాప్తిగాని యుండనేరదు. అందుచే దాలి పురుషాధార మగు భావలింగరూప ద్వివిధసృష్టి గలుగుచున్నది. పూర్వోక్త మగు వైకృతికభూతాది ద్వివిధసృష్టి సర్వసృష్టికాధార మగుచుండ, నీభావలింగరూప ద్వివిధసృష్టి పురుషునకధిష్ఠానమై యతని పురుషార్థముల కుపయుక్తమగుచున్నవి. ఇచట భావ ములన ప్రత్యయరూపమగు బుద్ధియనియు లింగమన తన్మాత్ర సర్గమనియు గౌడపాద దాత్పర్యము. తన్మాత్రసర్గయన లిం గమునునిర్వచించుచు 'సూక్ష్మైః పరమాణుభిస్తన్మాత్రైరుపచితం శరీరం త్రయోదశవిధకరణోపేతం' (సా. కా. గౌ. 42) పరమాణు రూపములగు తన్మాత్రలకు త్రయోదశములగు కరణములుచేరి యగునని యతని వివరణము. దీనినే చతుర్దశతత్త్వములుగా వివరించియుండిరి. అనగా లింగము సూక్ష్మశరీరమని యన్వయ మగుచున్నది. ఆలింగము భావరూపమగు బుద్ధిని విడిచియుండ జాలదని యర్థము. కాన 'శ్లో॥ పూర్వోత్పన్నమసక్తం నియతం మహదాది సూక్ష్మపర్యంతం। సంసరతి నిరుపభోగం భావైరధి వాసితం లింగం॥' (సా. కా. 40) పూర్వోత్పన్నమన 'యదా లోకా అనుత్పన్నాః ప్రధానాదిసర్గే తదా సూక్ష్మశరీరముత్ప న్నమితి' (సా. కా. గౌ. 40) విశ్వోత్పత్తికాకపూర్వము, ప్రధాన మునుండి యాదిసర్గకాలమున సూక్ష్మశరీరముద్భవించుచున్నదని

యర్థము. అది తిర్యగ్దేవమానుష స్థానములందు 'సూక్ష్మత్వాత్' సూక్ష్మమగుటచే సంయుక్తముకాక, సంసరించుచునుండును. దానికి భావములుగలవు. ధర్మాదికనే భావములు. వానిబొంది యిది సంసృతిప్రవాహమున దిరుగుచుండును. అట్లనుటచే లింగము అతిసూక్ష్మమై 'ప్రళయకాలే మహదాదిసూక్ష్మపర్యంతం కరణోపేతం ప్రధానే లీయతే' (సా. కా. గా. 40) బుద్ధి అహంకార మన తన్మాత్రలును కరణములతో లింగము ప్రళయకాలమున ప్రధానమందు లయించియుండి. అసంసరణకాలము నందు ప్రధానమునందేయుండి, 'పునః సర్గకాలే సంసరతి' మరల సర్గకాలమునందు సంసరించుటచే 'తస్మాత్ లింగం సూక్ష్మం' (సా. కా. గా. 40) లింగము సూక్ష్మమనబడుచున్నది. అది 'యావన్న జ్ఞానము త్పద్యతే తావత్సం సరతి' (సా. కా. గా. 40) జ్ఞానముగలుగనంతకాలము నిరాటంకముగా విశ్వమంతయు పర్యటించుచుండును. కాని స్థూలశరీరాపేక్షలేక దీని సుఖదుఃఖ భోగములుండవు. అనగా మాతాపితృజమైన స్థూలశరీరము గలిగినప్పుడుభోగసమర్థమగుచున్నదిలింగము. మరియునీలింగము 'శ్లో॥చిత్రంయథాశ్రయమృతేస్థాణ్వాదిభ్యోయథా వినా ఛాయా। తద్వద్వినాఽవిశేషైః న తిష్ఠతి నిరాశ్రయం లింగం॥' (సా. కా. 41) ఆశ్రయములేక చిత్ర ముండజాలనట్లు, స్థాణ్వాద్యపేక్షలేక ఛాయ యభావమైనటుల, అవిశేషములగు తన్మాత్రలులేక యుండనేరదు. పైచర్చలో లింగ లింగశరీరములకు విభేదము సూచితము. మహదాద్యహంకారేకాదశేంద్రియకమైన లింగ శరీరము లింగమున కాశ్రయమగును. 'లింగం సూక్ష్మైః పరమాణుభి స్తన్మాత్రైరుపచితం శరీరం త్రయోదశవిధకరణోపేతం

మానుష దేవతిర్యగ్యోనిషు వ్యవతిష్ఠతే' (సా.కా.గా.42) తన్మాత్రలయొక్క పరమాణువులచే నిర్మితమై త్రయోదశకరణోపేతమై దేవనరతిర్యగాదిశరీరముల వర్తించునది లింగమని నిర్వచనము.

మరియు లింగము 'సాంసిద్ధికాశ్చ భావాః ప్రాకృతికా వైకృతికాశ్చ ధర్మాద్యాః' (సా.కా.43) ధర్మాదులగు భావములు సాంసిద్ధిక, ప్రాకృతిక వైకృతికరూపములుగనుండ, వానితోనేకమై, బీజాంకురన్యాయమున నన్యోన్యాశ్రయమున్నతి మెలగుచుండును లింగభావములు త్రైవిధ్యముగనున్న భావములలో 'తత్ర సాంసిద్ధికా యథా భగవతః కపిలస్యాదిసర్గే ఉత్పద్యమానస్య చత్వారో భావాః సహోత్పన్నాః-ధర్మః జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యమితి' (సా.కా.గా.43) ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యములు సాంసిద్ధికములు. ఆదిసర్గకాలమున నవి కపిలునితో నుత్పన్నములు. ప్రాకృతికములు బ్రహ్మపుత్రులగు సనకాదులతో సహోత్పన్నములు. కాని యవి 'తేషాముత్పన్న కార్యకారణానాం' కార్యకారణజన్యములు కాన ప్రాకృతికములనబరగును. అనగా బూర్వజన్మకర్మ ఫలహేతుకములు. ఇక వైకృతికములన గుర్వనుగ్రహ నిమిత్తికములు. అనగ గురు బోధనాఫలితముగ జనించినవని యర్థము. జ్ఞానమునుండి వైరాగ్యము, దానినుండి ధర్మము, ధర్మమునుండి యైశ్వర్యమును గలుగును. ఆచార్యశరీరము వైకృతముగాన నవి వైకృతికములన బడినవి. ఇవి మానవ సంబంధకములు. ఇట్లు 'భావైరధివాసితం లింగం సంసరతి' (సా.కా.గా.43) భావములతో గూడినదై లింగమునాబడు సూక్ష్మశరీరము సంసరించుచు,

'శ్లో॥పురుషార్థహేతుకమిదం నిమిత్తనైమిత్తికప్రసంగేన। ప్రకృతే ర్విభుత్వయోగాత్ నటవద్వ్యవతిష్ఠతే లింగం' (సా. కా. 42) నిమిత్తనైమిత్తికరూపముగను, అనగాధర్మాది యూర్ధ్వగమనాది (సా. కా. గౌ. 42) రూపముగను, 'పురుషార్థః కర్తవ్య ఇతి ప్రధానం ప్రవర్తతే' (సా. కా. గౌ. 42) అనురీతి పురుషార్థ సిద్ధికొరకు ప్రధానమువ్యవహరించునుగాన దానిశక్తి యోగమున, నటునివలె లింగము వ్యవహరించును. పూర్వోక్తముగ, దర్శన కైవల్యార్థములను ద్వివిధ పురుషార్థములకై ధర్మాది ప్రవృత్తికారణమున స్వర్గాదిఫలితమునకై లింగము ప్రవర్తించును. 'యథా రాజా స్వరాష్ట్రే విభుత్వాత్ యద్యదిచ్ఛతి తత్తత్ కరోతీతి, తథా ప్రకృతేః సర్వత్ర విభుత్వయోగాత్ నిమిత్తనైమిత్తికప్రసంగేన వ్యవతిష్ఠతే పృథక్పృథక్ దేహధారణే లింగస్య వ్యవస్థాం కరోతి' (సా. కా. గౌ. 42) స్వరాష్ట్రమున సర్వాధికారియగు ప్రభువు స్వేచ్ఛానువర్తియై చరించువిధాన, ప్రకృతియొక్క అధికారమున నుండు లింగాదిసర్వము కార్యకారణసంబంధమున ప్రవర్తించును. అనగా లింగమునకు బునఃపునః దేహధారణమును ప్రకృతి నిర్ణయించును. ప్రకృతి యధీనమున లింగము స్థూల దేహధారణము గావించుచుండునని తాత్పర్యము.

ఈ లింగ లింగశరీరమీమాంస యతిసూక్ష్మమై భాష్యకారులలోగూడ వివిధాభిప్రాయములకు గారణమైనది. ప్రతి పురుషున కొక్కొక్క లింగశరీరము సృష్ట్యాదిలోగలదని వాచస్పతిభావము. కాని సాంఖ్యసూత్రముల నాధారముగ గైకొని 'సప్తదశైకం లింగం' (సా. సూ. 3. 9) బుద్ధిమినహా, అహంకారాది తన్మాత్రపర్యంత సప్తదశైకతత్త్వములు లింగశరీర

మనియు, వ్యాఖ్యానించుచు. సృష్ట్యాదిలో సమష్టి లింగరూప మున్నదనియు, 'వ్యష్టిభేదః కర్మవిశేషాత్' (సా. సూ. 3 10) కర్మతారతమ్యమున వ్యక్తిభేదము గలుగుచున్నదను సూత్రములకు వ్యాఖ్యానముఁ వ్రాయుచు, 'యద్యపి సర్గాదౌ హిరణ్యగర్భోపాధిరూపమేకమేవ లింగం' సృష్ట్యాదియందు హిరణ్యగర్భరూపమున నొకేలింగము గలదనియు 'తథాపి, తస్య పశ్చాత్ వ్యక్తిభేదో వ్యక్తిరూపేణాంశతో నానాత్వమపి భవతి' (సా. సూ. వి. 3. 10) అయినను, తర్వాత వ్యక్తిభేదమువలన నానాత్వమేర్పడుచున్నదనియు విజ్ఞానభిక్షువు తెలిపెను. సమష్టి రూప హిరణ్యగర్భత్వము సాంఖ్యసిద్ధాంతమునకు విరుద్ధమని కొందరిభావము. మహదహంకార మనోయింద్రియదశముతో త్రయోదశకముగ నున్నదే లింగమని వాచస్పతి భావము. పైత్రయోదశకము లింగమనియు, అది తన్మాత్రలతోగూడ నష్టాదశకమై లింగశరీరమగుననియు, లింగము లింగశరీరము నాశ్రయించియుండుననియు నితని భావము. కాని త్రయోదశకమే లింగశరీరమనియు నది తన్మాత్రల కన్యముగనుండనేరదని గౌడపాదుని యభిప్రాయము. గౌడపాదుని భావమే సమంజసముగా బండితు లంగీకరించిరి.

లింగము పూర్వోక్తముగ ననాదిసిద్ధమై పూర్వాపూర్వ సంస్కారభావ భూయిష్ఠమై సంసరించుచు, 'శ్లో॥ సూక్ష్మా మాతాపితృజాః సహ ప్రభూతైస్త్రిధా విశేషాః స్యుః। సూక్ష్మాస్తేషాం నియతా మాతాపితృజా నివర్తంతే॥' (సా. కా. 39) తన్మాత్రలు, మాతాపితృజములు, స్థూలభూతములని త్రివిధములు. అందు సూక్ష్మములగు తన్మాత్రలు నిత్యములు.

మాతాపితృజము లనిత్యములు. అనగా తన్మాత్రోపాధిక మైన సూక్ష్మశరీరము సదా యుండుచు, సంసరించుచుండును. మాతాపితృజమై పంచభూతాత్మకముగనున్న స్థూలశరీరము జననమరణాదులను బొందుచు ననిత్యమై యుండును. సంసృతి భ్రమణబద్ధమగు సూక్ష్మశరీరము, 'కర్మవశాత్ పశుమృగపక్షి సరీసృపస్థావరజాతిషు సంసరతి' (సా. కా. గా. 39) కర్మవశమున నానాజాతులలో జనించుచుండును. 'ధర్మవశాదింద్రాది లోకేషు' (సా. కా. గా. 39) పుణ్యవశమున నింద్రాదిలోకముల బొందును. ఇట్లు లింగశరీరము 'ఏవమేతత్ నియతం సూక్ష్మ శరీరం సంసరతి న యావత్ జ్ఞానముత్పద్యతే' (సా. కా. గా. 39) జ్ఞానోత్పత్తిపర్యంతము సంసరించును. సంసరించు కాలమున 'ధర్మేణ గమనమూర్ధ్వం' (సా. కా. 44) ధర్మప్రవృత్తిమూలమున ఊర్ధ్వజన్మగమనమును, బొందును. 'ఊర్ధ్వమిత్యష్టౌ స్థానాని గృహ్యంతే' ఊర్ధ్వమున కెనిమిది స్థానములుగలవు. అవి బ్రహ్మ, ప్రజాపతి, సోమ, ఇంద్ర, యక్ష, గాంధర్వ, రాక్షస, పిశాచములు. తద్విపరీతములగు పశుమృగాదు లధర్మసంజాతములు. అనగా సూక్ష్మశరీరము సంసరిచుచుండు సృష్టియంతయు 'శ్లో॥ అష్టవికల్పో దైవస్తైర్యగ్యోనిశ్చ పంచధా భవతి। మానుషశ్చైకవిధః సమాసతోయం త్రిధా సర్గః॥' (సా. కా. 53) దైవమష్టవిధముగను. తిర్యగముపంచవిధముగను, మానుషమేకముగ నుండి మొత్తమునకు త్రివిధమై యున్నది. అన్నియుగలిసి చతుర్దశధా యనియు వచింపబడును.

పై త్రివిధరూపసృష్టిలో 'శ్లో॥ ఊర్ధ్వం సత్త్వవిశాలస్తమోవిశాలశ్చ మూలతః సర్గః। మధ్యే రజోవిశాలో బ్రహ్మాది

స్తంబపర్యంతః' (సా. కా. 54) ఊర్ధ్వసృష్టిలో సత్త్వాధిక్యతయు, అధమమున తామసాధిక్యతయు, మధ్యమమున రజో ప్రాధాన్యతయు గలదు. ఆబ్రహ్మస్తంబపర్యంత సృష్టియంతయు నిట్లేయుండును. ఊర్ధ్వమన అష్టదేవస్థానములనియు మూలమన పశ్వాదిస్థావరాంతము వరకుగల సృష్టియనియు మధ్యయన మనుష్యులనియు నన్వయము. ఈసృష్టియంతయు షోడశవిధ సర్గలుగా మరల విభజింపబడియున్నది. ఎట్లన 'అభౌతికః సర్గః లింగసర్గః భావసర్గః, భూతసర్గః, దైవమానుషతైర్యగ్యోనాః, ఇత్యేవ ప్రధానకృతః షోడశవిధః సర్గః' (సా. కా. గౌ. 54) అనగా దేవ, మానుష, జంగమ, స్థావరరూప చతుర్విధసర్గలును, మరల అభౌతిక, లింగ, భావ, భూతరూపములుగ నగుటచే, నవి మొత్తమునకు షోడశకమగుచున్నవని గౌడపాదుని తాత్పర్యముగ హరదత్తుని అభిప్రాయము. కాని, ప్రధానమునుండి మహత్తు, మహత్తునుండి యహంకారము జనించుట ద్వివిధ సర్గములగును. అహంకారమునుండి వైకృతిక భూతాదిరూప ద్వివిధ సర్గమేర్పడుచున్నది. అందు వైకృతికమునుండి యేకాదశకసర్గములతో పంచసర్గ లేర్పడినవి. భూతాదినుండి తన్మాత్రల సర్గ షష్ఠము. ఏకాదశకమునుండి దశేంద్రియప్రవృత్తులు. మనస్సు జనించుటచే సప్త సర్గలగును. తన్మాత్రలనుండి స్థూలభూత సృష్టితో దొమ్మిదిసర్గ లేర్పడుచున్నవి. లింగము దశమ సర్గము. సాంసిద్ధిక, ప్రాకృతిక, వైకృతిక భావములతో త్రయోదశమును దేవమానవతిర్యక్కులతో షోడశసర్గ లేర్పడుచున్నవనుట సమంజసము. ఈవిధానమున బురుషునకు దర్శనార్థము కైవల్యార్థముపయుక్తమగు సృష్టి గలిగినదని సాంఖ్యతాత్పర్యము.

# ప్రకృతి రహస్యము.

'మూలప్రకృతి రవికృతిః' (సా. కా. 3) మూలప్రకృతి కార్యముకానిది. 'ప్రధీయతే ఇతి ప్రధానః' (యో. సూ. వా 2) సర్వకార్యముల కధిష్ఠాతయగుటచే ప్రధానమను సూత్రమురీతి 'మూలప్రకృతిః ప్రధానాత్' (సా. కా. గౌ. 3) ప్రధానమగుటచే మూలప్రకృతియనియు, నవగా 'ప్రకృతివికృతి సప్తకస్య మూలభూతత్వాత్' (సా. కా. గౌ. 3) కార్యకారణములగు మహదాదిసప్తకమునకు మూలభూతమగుటవలన ప్రధానమనియు, 'మూలం చ సా ప్రకృతిశ్చ మూలప్రకృతిః' (సా. కా. గౌ. 3) సర్వకారణ కారణమగుటచే మూలప్రకృతియనియు, 'మూలే మూలాభావాదమూలం మూలం' (సా. సూ. 1. 67) కారణము లేనికారణముగాన మూలమనియు, ప్రధాన ప్రకృతి పదముల కన్వయము మరియు 'ప్రకృతిరిత్యుచ్యతే వికారోపాదానకత్వాత్' (సా. కా. గౌ. ) సర్వ వికారముల కుపాదానకత్వముచే ప్రకృతియనియు 'అవిద్యా జ్ఞాననిరోధత్వాత్' (సా. కా. గౌ. ) జ్ఞాన విరోధియగుటచే నవిద్య యనియు 'మాయా విచిత్రసృష్టి కారకత్వాత్' (సా. కా. గౌ.) విచిత్రసృష్టికారణముగాన మాయ యనియు, ప్రకృతికి నామాంతరము లనేకములు గలవు. ఈప్రకృతి శబ్దమునకు 'శ్లో॥ నామరూపవినిర్ముక్తం యస్మిన్ సంతిష్ఠతే జగత్। తం ఆహుః ప్రకృతిః కేచిన్ మాయాం అన్యే పరే త్వణూం॥' (బృహదార్వాశిష్ట-విజ్ఞానభిక్షు) జగత్తు నామరూపవిముక్తినొంది ఎచ్చట లయించియుండునో దానిని ప్రకృతి యందురనియు

వర్ణించిరి. మరల దీనికే 'అవ్యక్తం ప్రధానం' (సా. కా. గౌ.2) అన్నట్లు అవ్యక్తమనియు వచించిరి. అందుచే నిది సర్వకార్య రూపములగు నామరూపముల కుపాదానత్వము వహించి యున్నను. 'సౌక్ష్మ్యాత్తదనుపలబ్ధిః' (సా. కా. 8) అతిసూక్ష్మ మగుటచే నింద్రియముల కగోచరమై 'కార్యత స్తదుపలబ్ధిః' (సా. కా. 8) స్వతః యగోచరమై యున్నను. తజ్జనిత కార్య గణములగు మహదాదులద్వార గ్రాహ్యపడుచున్నది. ఈవిష యమునే 'కార్యదర్శనాత్తదుపలబ్ధేః' (సా. సూ. 1. 110) అనియు సూత్రము వచించుచున్నది. మరియు దాని గ్రహింప 'శ్రుతిలింగాదిభిస్తత్సిద్ధిః' (సా. సూ. 5.21) శ్రుతిమూలమునను దానికిగల గుణములమూలమునను సాధ్యము. హేతుమత్త్వాది లక్షణములుగల వ్యక్తమునకు వ్యతిరేకములగు నిత్యత్వ, సర్వగ తత్వ, అక్రియత్వ, ఏకత్వ, అనాశ్రయత్వ, అలింగత్వ, నిరవయ వత్వ స్వతంత్రాది లక్షణములు ప్రధానము గలిగియున్నట్లు 'శ్లో॥ హేతుమదనిత్యమవ్యాపి సక్రియమనేకమాశ్రితం లింగం। సావయవం పరతంత్రం వ్యక్తం విపరీతమవ్యక్తం॥' (సా. కా.10) కారిక నిర్వచించియేయున్నది. అంతియగాక 'త్రిగుణమవివేకి విషయః సామాన్యమచేతనం ప్రసవధర్మి। వ్యక్తం తథా ప్రధానం' (సా. కా. 11) వ్యక్తావ్యక్తములురెండును, త్రిగుణాత్మక ములు, అవివేకములు, విషయములు, సామాన్యములు, అచేతనములు, కార్యకారణాది లక్షణోపేతములై యుండును. కాని 'సత్వరజస్తమసాం సామ్యావస్థా ప్రధానం'(సా. కా. గౌ.16) అనురీతి త్రిగుణ సామ్యావస్థయే ప్రధానము. అనగా త్రిగుణ విశిష్టముగానున్నదని తాత్పర్యము.

ఇట్లు నిర్వచింపబడిన ప్రధానము ప్రసవధర్మి యన కార్య సంతానములకు జనకసంబంధియై పురుషునికి విషయమై, ఆతని పురుషార్థసిద్ధికై ప్రవర్తించును. అనగా నది సర్వోపాదానత్వమున మహదాది తన్మాత్రపర్యంతము వ్యక్తముగవికారమై పురుషుని దర్శనార్థ ప్రవృత్తికాకరమై యొప్పుచున్నది. అచేతనమై యుండియు నది 'వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తి రజ్ఞస్య' (సా.కా. 57) అజ్ఞమగుక్షీరము వత్సాభివృద్ధికి ప్రవృత్త మగునట్లు, 'అచేతనత్వేపి క్షీరవచ్చేష్టితం ప్రధానస్య' (సా. సూ. 3. 59) అనురీతి అచేతనమైయుండియు క్షీరమువలె జేష్టితమై ప్రధానము వ్యవహరించును. మరియు 'స్వార్థ ఇవ పరార్థ ఆరంభః' (సా. కా. 56) నది పరార్థమే ప్రవృత్తమగు చున్నను, స్వార్థముగ గోచరించుచుండును. అది సదా 'ఉపకారిణి గుణవతి' (సా. కా. 60) యగుటచే, 'యథా కశ్చిత్ పరోప కారీ సర్వస్యోపకురుతే, నాత్మనః ప్రత్యుపకారమీహతే. ఏవం ప్రకృతిః పురుషార్థం చరతి కరోత్యపార్థకం' (సా. కా. గౌ.60) ఒకానొక పరోపకారి ప్రత్యుపకృతి గోరక, నెట్లుపకార మెల్ల రకు జేయునో, యట్లు ప్రకృతి ప్రతికాంక్షలేక, పురుషునికొరకై 'త్రిషు లోకేషు శబ్దాదివిషయైః' (సా. కా. గౌ. 56) త్రిలో కములగల సర్వవిషయములద్వార యుపకరించుచున్నది.

దర్శనార్థ కైవల్యార్థ ద్వివిధ పురుషార్థములలో దనకు బ్రాధాన్యతగల దర్శన వ్యవహారమునందు మాత్రి ముపయుక్త మగుటయేగాక, 'ప్రకృతిర్వియోగో మోక్షః' అన్నట్లు తన పాశములనుండి పురుషుడు విడివడు మోక్షవ్యవహారమునగూడ 'ప్రతిపురుషవిమోక్షార్థం' (సా. కా. 56) 'పురుషవిమోక్ష

which seems to be impentrable [21] అద్వైతము ఏ కాలమునగాని ఏ దేశమునగాని నిర్మింపబడని సుందర తాత్త్విక పుష్పరాజము. ఇచ్చట మానవ ధీశక్తి ఉన్నతోన్నతోచ్చారణము నొంది అభేద్యమగు పించురహస్యతత్త్వమును అతీతించియు వెడలి యున్నది అని వివేకానందస్వామి స్తుతించెను. The Stupendous system [22] అద్భుత సిద్ధాంతమని ఆచార్య రాధాకృష్ణ పండితుడుచ్చరింప, The crown of Indian philosophy [23] హిందూతత్త్వశాస్త్ర శిరోభూషణమని ఎస్. ఎన్. సూర్యనారాయణశాస్త్రి వచించియున్నాడు. శంకరాద్వైతవాదము అతీతింపబడలేదనియు, It represents the highest pinnacle of thought ever reached by the human intellect [24] మానవబుద్ధిచే నందుకొనబడిన ఉత్కృష్ట విజ్ఞానశిఖరముగ నమెరికా దేశస్థుడైన అతులానందుడు చిత్రించియున్నాడు. అట్టి విశిష్ట సిద్ధాంత ప్రతిపాదనమునకు Dielectic is necessary to put intuition to the proof [25] అనుభూతిని నిర్ధారణమొనరించుటకు దర్కమవసరమని బెర్గ్సన్ అనునట్లు Discussion or Veda is breath of intellectual life [26]. వైజ్ఞానిక జీవితమునకు వాద మావశ్యకమని పండితరాధాకృష్ణుడు నుడువునట్లు, అద్వైత సిద్ధాంతమున వాదతర్కములు అకుంఠిత

21. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 247.
22. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1.
23. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 1.
24. Swami Atulananda : The Story of Sri Sankaracharya
Vedanta Kesari, 1928.
25. Bergson : Creative Evolution, p 251.
26. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 33.

## పురుష స్వరూపము

ఇక నిట్టి సుకుమారతరమైన ప్రకృతి నుపభోగించు పురుషు డెట్టివాడో యొకించుక విచారించి చూతము. 'ప్రధానపురుషావతీంద్రియౌ' (సా. కా. గా. 6) ప్రధాన పురుషు లిరువురింద్రియాతీతు లగుటచేత 'సామాన్యతోదృష్టానుమానేన సాధ్యేతే' (సా. కా గా. 6) సామాన్యతోదృష్టరూప అనుమాన ప్రమాణముచేతనే వారిరువురి గ్రహింప సాధ్యము. ఎట్లన, 'యస్మాన్మహదాది లింగం త్రిగుణం' (సా. కా. గా. 6) త్రిగుణాత్మకమైన మహదాదిసృష్టి ఎందుండి జనితమో, అది ప్రధానమనియు, 'యతశ్చాచేతనం చేతనమివాభాతి, అతోఽన్యోఽధిష్ఠాతా పురుష ఇతి' (సా. కా. గా. 6) అచేతనము చేతనమువలె గోచరించుచున్నది. దాని కధిష్ఠాతగా నొక చేతనుడుండవలె, నాతడే పురుషుడనియు పురుషప్రధానముల ననుమానించి గ్రహించవలెనని భావము, అందుచే నదృష్టరూపుడగు పురుషు డింద్రియాగోచరుడు. ఆ పురుషుడు, 'శ్లో॥ సంఘాతపరార్థత్వాత్ త్రిగుణాదివిపర్యయాదధిష్ఠానాత్, పురుషోఽస్తి భోక్తృభావాత్ కైవల్యార్థం ప్రవృత్తేశ్చ' (సా. కా. 17) కార్యములన్నియు బరార్థములగుటచేతను, త్రిగుణాత్మకసృష్టికి యధిష్ఠాన మవసరములగుటచేతను, విషయనియామకు డవసరమగుటచేతను, భోక్త యవసరముగావునను, మోక్షార్థప్రవృత్తియుండుటచేతను, వీనికన్నింటికి కధిష్ఠానముగ బురుషు డుండవలెను. అందుచే గలడు. అనగా బూర్వోక్తచందము, ప్రధాన

ముమాత్రమే పరార్థముకాక, ప్రధానజన్య మహదాది తన్మాత్రపర్యంతసృష్టియును పరార్థమగుచుండ, 'శ్లో॥ స్వాం స్వాం ప్రతిపద్యంతే పరస్పరాకూతహేతుకాం వృత్తిం । పురుషార్థ ఏవ హేతుర్న కేనచిత్కార్యతే కరణం' (సా. కా. 31). ఇంద్రియ వృత్తులు పరస్పరము సంభ్రమముతో నన్యోన్యముగ బనిచేయును. వాని ప్రవృత్తి పురుషార్థము మాత్రమే యగును. అటులే 'శ్లో॥ ఏతే ప్రదీపకల్పాః పరస్పరవిలక్షణా గుణవిశేషాః । కృత్స్నం పురుషస్యార్థం ప్రకాశ్య బుద్ధౌ ప్రయచ్ఛంతి॥' (సా. కా. 36) గుణోత్పన్నములగు కరణములు దీపికలవలె విషయముల గోచరింపజేయును. ఈ బుద్ధీంద్రియ కర్మేంద్రియాహంకార మనములు పురుషునికొరకై బుద్ధివిషయముల వ్యక్తపరచును మరియు లింగప్రవృత్తియు 'పురుషార్థహేతుకమిదం... లింగం' (సా కా. 42) అన్నట్లు పురుషునికొరకే ప్రవృత్తమగుచుండును. అట్లు మహదాది సర్వ ప్రవృత్తి కధిష్ఠాతయగు పురుషుడు సర్వవిషయభోక్త యగుచున్నట్లు అనుమానితము. అతడు 'మహతోఽహంకారోఽహంకారాత్ పంచతన్మాత్రాణ్యుభయమింద్రియం। తన్మాత్రేభ్యః స్థూలభూతాని పురుష ఇతి పంచవింశతిర్గణః' (సా.సూ. 1. 61) అను సూత్రము పురుషుని పంచవింశతితత్త్వముగా బరిగణించి యున్నది. అందుచేతనే, పూర్వ చతుర్వింశతికమును అచేతనమై వ్యక్తావ్యక్తము లనబరగుచుండ 'జ్ఞః' (సా.కా, 2) 'జ్ఞః పురుషః' (సా.కా.గౌ. 2) జ్ఞ పురుషుడనియు చేతనుడనియు వాకొనబడియున్నాడు. ఇతడు 'న ప్రకృతిర్న వికృతిః పురుషః' (సా. కా. 3) ప్రకృతివికృతి ద్వంద్వమున జేరక నతీతుడై యుండును. అనగా బ్రధానము మూలకార

ణామై యుండును. మహదాదులు ప్రకృతి జన్యములుగాన వికృతులగుచు, షోడశకమునకు ప్రకృతులగుచున్నవి. కాన నవి కార్యకారణము లగుచున్నవి. షోడశకమునాబడు ఏకాదశేంద్రియములు పంచభూతములును కేవలము కార్యములుమాత్రమగుచున్నవి, కాని పురుషుడు యీ కార్యకారణత్వమునకు అసంబంధియై చెలరాగునని తాత్పర్యము, అనగ నతనికి కారణము లేదు. అతనినుండి కార్యమును లేదు. ఇంకను యితడు 'తద్విపరీత స్తథా చ పుమాన్' (సా.కా. 11) వ్యక్తావ్యక్తము లకు విపరీతము లగు కొన్నిలక్షణములను, కొన్ని వాని గుణములను గలిగియుండును. ఎట్లన ప్రథమమున విపరీతముల దిల కింతము, 'త్రిగుణం వ్యక్తమవ్యక్తం చ అగుణః పురుషః అవివేకి వ్యక్తమవ్యక్తం చ వివేకీ పురుషః। తథావిషయో వ్యక్తమవ్యక్తం చ, అవిషయః పురుషః తథాసామాన్యం వ్యక్తమవ్యక్తం చ, అసామాన్యః పురుషః। అచేతనం వ్యక్తమవ్యక్తం చ. చేతనః పురుషః। సుఖదుఃఖమోహాన్ చేతయతి సంజానీతే తస్మాచ్చేతనః పురుషః। ప్రసవధర్మి వ్యక్తం ప్రధానం చ అప్రసవధర్మీ పురుషః। తస్మాదుక్తం తద్విపరీతః పుమానితి' (సా.కా.గౌ.11) వ్యక్తావ్యక్తములు త్రిగుణాత్మకములైయొప్పు బురుషుడు అగుణుడు, వ్యక్తావ్యక్తము లవివేకులు, వివేకి పురుషుడు. సామాన్యము వ్యక్తావక్తములు, పురుషుడు అసామాన్యము. వ్యక్తావ్యక్తము లచేతనములు చేతనుడు పురుషుడు. సుఖదుఃఖమోహముల గ్రహించినది గాన పురుషుడు చేతను డగుచున్నాడు. వ్యక్తావ్యక్తములు కారణములగుచున్నవి, కాని పురుషుడు ప్రసవధర్మికాదు. అందుచేత బురుషుడు వ్యక్తావ్యక్తములకు వ్యత్య

స్తుడు. ఇక సామాన్యలక్షణముల బరికింతము. ప్రధానము అహేతుకమగు అవికృతి. యస్లే పురుషుడును అకారణుడు. ప్రధానమువలె నితడు నిత్యుడు. 'వ్యాపి ప్రధానం, తథా చ వ్యాపి పుమాన్ సర్వగతత్వాత్' (సా. కా. గా. 11) సర్వగతుడగుటచే ప్రధానమువలె బురుషుడును సర్వవ్యాపి. పురుషప్రధానములు అక్రియులు. సర్వగతులుఅగుటచే నిష్క్రియత్వమునకు హేతువు. అవ్యక్తమువలె బురుషు డేకుడు. అతడు ప్రధానమునవలె నలింగుడు. వీరిరువురు స్వతంత్రులు. ఇట్లు 11వ కారిక పురుషుని లక్షణముల ప్రబల విస్తృతపరచినది. మహదాది సర్వసంఘాతములకు భోక్తయు నతడే. (సా. కా. 17) 'అథ స కిమేకః సర్వశరీరేఽధిష్ఠాతా మణిరసనాత్మకసూత్రవత్, ఆహోస్విత్ బహవ ఆత్మనః ప్రతిశరీరమధిష్ఠాతార' (సా. కా. గా. 18) మణులలోని దారమువలె నన్నిశరీరముల నియమించు పురుషుడొకడా, ఒక్కొక్క శరీరమున నొక్కొక్కడై యనేకమా యని గౌడపాదులు ప్రశ్నించుకొని 'శ్లో॥ జననమరణకరణానాం ప్రతినియమాదయుగపత్ప్రవృత్తేశ్చ । పురుషబహుత్వం సిద్ధం త్రైగుణ్యవిపర్యయాచ్చైవ॥ (సా. కా. 18) జన్మమరణములును, ఇంద్రియములును, ప్రత్యేకప్రత్యేకముగ నియమింపబడి యుండుట చేత, నేకకాలమున నేకప్రవృత్తి యెల్లరకు నుండకపోవుటచేత, త్రిగుణవిపర్యయము వివిధరీతుల నుండుటచేతను పురుషు లనేకులని సిద్ధము, అను కారికద్వారా పురుషబహుత్వమునే నిర్ణయించెను. అనగా నొక్కొక్క శరీరమున నొక్కొక్క పురుషుడుండునుగాన అనేక పురుషులున్నట్లు సాంఖ్యమతము. ఒకే పురుషుడున్నచో వివిధరూపములైన జననమరణాదులుండ వలను

పడను. ఒకడు జనింప నందరు తత్క్షణము జనింపవలెను. అటులే ఒకడు మరణింప దత్కాలమున నెల్లరు మృతినొంద వలసియుండును. మరియు నొకనికి శరీరేంద్రియములలో నెద్ది యేని కుంటుపడినచో నన్ని దేహములు నట్టులే పొందియుండ వలె. కాని అటులకాకుంటచే బహుపురుషవాదమున కవకాశ మున్నదని భావము. అదేవిధముగ నొకడొక కార్యము చేయు చున్నచో నెల్లరాకార్యనిమగ్నులు కావలసియుండును. అట్లు కాక కర్మప్రవృత్తియందును, తారతమ్యము గోచరించుచున్నది. త్రిగుణవిభాగముగూడ వివిధముగా నుండుట గ్రాహ్యము. ఈవి షయమే 'జన్మాదివ్యవస్థాతః పురుషబహుత్వం' (సా సూ.1.149) అను సూత్రముగూడ వ్యక్తపరచుచున్నది. కాని 'ఉపాధిభే దేఽప్యేకస్యనానాయోగ ఆకాశస్యేవఘటాదిభిః'(సా.సూ.150) ఒకేఆకాశము ఘటాద్యుపాధులద్వారా నానాయైనట్లు అను మొదలగు సూత్రముల నాధారముగగైకొని ఒకేపురుషుడు ఉపాధిభేదముల మూలమున ననేకముగా గోచరించునని కొం దరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. కాని యీ విధమైన సమన్వయ మెంతవరకుచితమో విజ్ఞులే యోచింపవలెను. ఈవిషయమున కారికాగ్రంథముగాని గౌడపాదుడుగాని విశదపరుపలేదు. వారి తాత్పర్యము సంపూర్తిగా పురుషబహుత్వవాదమే యగుచున్నది. కాని సూత్రగ్రంథము వేదాంతభావముల సమన్వయించుకొన యత్నించినట్లు తోచుచున్నది. మరియు సూత్రగ్రంథము 'నా ద్వైతశ్రుతివిరోధో జాతిపరత్వాత్' (సా. సూ. 1. 154) సూత్రముద్వారా సాంఖ్యప్రవచన మీవిషయమున అద్వైత శ్రుతి విరోధి కాదనియు, పురుషైకత్వము జాతిపరముగా నన్వ

యింపనగుననియు చేరొ్కనియున్నది. అనగా పురుషజాతి యొక్కటియనియు, బురుషులనేకమనియు, భావము.

పురుషుడు భోగ్యములమధ్య నున్నను 'శ్లో॥ తస్మాచ్చ విపర్యాసాత్ సిద్ధం సాక్షిత్వమస్య పురుషస్య। కైవల్యం మాధ్యస్థ్యం ద్రష్టృత్వమకర్తృభావశ్చ॥' (సా. కా. 19) గుణవిశిష్టత్వమను విభేదమువలన, సాక్షిత్వము, కైవల్యము, మాధ్యస్థ్యము ద్రష్టృత్వము, అకర్తృత్వాదిలక్షణములు గలవాడు పురుషుడు. అనగా, త్రిగుణములు కర్తృత్వముగలవిగాన పురుషుడు సాక్షియై యొప్పును. త్రిగుణాదికమున కన్యముగనుండునుగాన కైవల్యరూపుడు ఏసంబంధములేని 'పరివ్రాజకవత్ మధ్యస్థః పురుషః' (సా. కా. గౌ. 19) సన్న్యాసివలె బురుషు డుదాసీనుడు. పురుషుడు అట్లుదాసీనాది లక్షణముల గలిగియున్నను, 'తస్మాత్తత్సంయోగాదచేతనం చేతనావదివ లింగం గుణకర్తృత్వే చ తథా కర్తేవ భవత్యుదాసీనః' (సా. కా. 20) పురుషసంయోగముచేత నచేతనమైన లింగము చేతనమువలె నగుచున్నది. నైజమున గర్తృత్వము గుణములదైనను, ఉదాసీనుడగు పురుషుడు కర్తవలె నగుచున్నాడు. చేతనాచేతనముల కెట్లు సంయోగమని సంశయింప, బురుషుని దర్శన కైవల్యార్థమై 'పంగ్వంధవదుభయోరపి సంయోగ స్తత్కృతః సర్గః' (సా. కా. 21) గ్రుడ్డికుంటి సంయోగమువలె నగుననియు, ఆసంయోగజన్యమే సర్గయనియు సమాధానము. 'ఏవం పురుషే దర్శనశక్తిరస్తి పంగువత్ న క్రియా' (సా. కా. గౌ. 21) పంగునకువలె బురుషునికి దర్శనశక్తి గలదు కాని నిష్క్రియుడు. 'ప్రధానే క్రియాశక్తిరస్త్యంధవత్, నదర్శన శక్తిః' (సా. కా. గౌ. 21) ప్రధానమునకు గ్రియాశక్తి

యంధునకువలె గలదు కాని దర్శన శక్తి యభావము. వీరి యన్యోన్యతకారణముగా సర్గ ముత్పన్నమగుచున్నది. ప్రధానము పురుషునకు బురుషార్థసిద్ధికొరకు వివిధరీతుల నుపయుక్తమగుచున్నను, అత డుదాసీనుడగుటచే 'పురుషోఽత్ర ప్రధానస్య న కించిత్ ప్రత్యుపకారం కరోతి' (సా. కా. గౌ. 56) పురుషుడు ప్రధానమున కిసుమంతగనైన ప్రత్యుపకారము సేయడు. అందుచే 'అనుపకారిణః పుంసః' (సా. కా. 60) అని పురుషుడు కీర్తి గడించెను. అట్లసంగుడై సాక్షిమాత్రుడై యుండు పురుషునకి బంధమోక్షములుండునా? లేనిచో 'కైవల్యార్థం' అను ప్రధాన ప్రవృత్తికి హేతువెయ్యది? యను ప్రశ్న యుదయించును. పురుషసన్నిధాన మహిమచే లింగమునకు జేతనత్వమును, పురుషునకు గర్తృత్వమును అన్యోన్యాధ్యాసమూలమున నేర్పడుచుండ 'శ్లో॥ తత్ర జరామరణకృతం దుఃఖం ప్రాప్నోతి చేతనః పురుషః। లింగస్యావినివృత్తేః తస్మాత్ దుఃఖం స్వభావేన॥' (సా. కా. 55) లింగనివృత్తి యగునంతవరకు జరామరణకృత దుఃఖమును పురుషు డనుభవించును. అందుచే దుఃఖము విషయస్వభావము. అందుచే బురుషుడు 'శ్లో॥ తస్మాన్న బధ్యతే నాపి ముచ్యతే నాపి సంసరతి కశ్చిత్ । సంసరతి బధ్యతే ముచ్యతే చ నానాశ్రయా ప్రకృతిః॥' (సా. కా. 62) బద్ధుడుగాని ముక్తుడుగాని కాడు. సంసరణముగూడ నతనికి లేదు, నానాశ్రయయగు బ్రకృతియే సంసరించుచు, బందియగుచు, ముక్తమగుచు నున్నదిగా దాత్పర్యము. 'తేన పురుషో బధ్యతే పురుషో ముచ్యతే పురుషః సంసరతీతి వ్యపదిశ్యతే యేన సంసారిత్వం న విద్యతే' (సా. కా. గౌ. 62) దానివలన పురుషుడు బద్ధుడు, ముక్తుడు,

సంసరించును అనువ్యవహారము సంసృతిరహస్యము నెఱుంగని యజ్ఞులచే గలుగుచున్నది. కాన నైజమునకు బురుషుడు బంధ మోక్ష విరహితుడు అని సాంఖ్యవాదము. కాని ప్రకృతియే 'ప్రకృతిశ్చ బధ్యతే ప్రకృతిశ్చ ముచ్యతే సంసరతి' (సా. కా. గా. 63) ప్రకృతియే బంధించుకొనుచు, ప్రకృతియే ముక్తిబొం దుచూ, సంసరించుచున్నది. ఎట్లన 'శ్లో॥ రూపైః సప్తభిరేవ తు బధ్నాత్యాత్మానమాత్మనా ప్రకృతిః। సైవ చ పురుషార్థం ప్రతి విమోచయత్యేకరూపేణ॥' (సా.కా. 63) జ్ఞానమువినా ధర్మవిరాగాది సప్తకముద్వారా ప్రకృతి తననుదాను బంధించు కొనుచున్నది. అదేప్రకృతి పురుషునికొరకు జ్ఞానమూలమున తనకుదానే మోక్షము నొందుచున్నది. కాన యథార్థమునకు బురుషుడు సర్వబంధరహితుడుగనే యున్నాడు.

## మోక్షము, తత్సిద్ధి.

'కేవలభావాన్మోక్షః' (సా. కా. గా. 68) నాబడు ముక్తిని గూర్చియు నొకించుక గ్రహింపయత్నింతము. కారికాగ్రంథ మాద్యంతపర్యంతము బురుషునకు 'ధర్శనార్థం కైవల్యార్థం' అను ద్వివిధపురుషార్థములను జెప్పుచు నందు 'కైవల్యార్థం' (సా. కా. 17) 'కైవల్యం' (సా. కా. 19) 'ప్రతిపురుషవిమో క్షార్థం' (సా. కా. 56) 'పురుషవిమోక్షనిమిత్తం' (సా. కా. 57) 'పురుషస్య విమోక్షార్థం' (సా. కా. 58) 'నాపి ముచ్యతే' (సా. కా. 62) 'పురుషార్థం విమోచయత్' (సా. కా. 63) 'కైవల్యమాప్నోతి' (సా. కా. 68) అనురీతి బెక్కుపర్యాయ

ములు ప్రత్యక్షముగను అప్రత్యక్షముగను సూచించియున్నది. అంతియగాక 'దుఃఖ త్రయాభిఘాతాత్ జిజ్ఞాసా తదభిఘాతకే హేతౌ'(సా. కా. 1)దుఃఖత్రయముండుటచేత దన్నివారణోపాయ విచారణము కర్తవ్యమని ప్రారంభించుచు, 'శ్లో॥ ప్రాప్తే శరీరభేదే చరితార్థత్వాత్ ప్రధానవినివృత్తౌ। ఏకాంతికమాత్యంతికముభయంకైవల్యమాప్నోతి॥'(సా. కా. 68)శరీరభేదప్రాప్తినొంది ప్రకృతినివృత్తికాగా, ఏకాంతికమును ఆత్యంతికమునుఅగు కైవల్యమును పురుషుడు పొందునని కారికాగ్రంథ ముపక్రమోపసంహారములందు రూపించి యుండుటచేత నీగ్రంథఫలము కైవల్యమేయని నిర్ధారణ మగుచున్నది. అట్టియెడ కైవల్యమన నెట్టిదో గ్రహింపనావశ్యకము.

అవికారియై యుదాసీనుడైయున్నట్లు నిర్వచింపబడిన పురుషుడు అనిర్వచనీయకారణమున దర్శనాపేక్ష నొందినవాడై, 'శ్లో॥ ప్రీత్యప్రీతివిషాదాత్మకాః ప్రకాశప్రవృత్తినియమార్థాః। అన్యోన్యాభిభవాశ్రయజనకమిథునవృత్తయశ్చగుణాః॥'(సా. కా. 12) సుఖ దుఃఖ మోహాత్మికములును, ప్రకాశ క్రియా స్థితి శీలములును, పరస్పరానరక ఆశ్రయ, కారక, సంయుక్తవృత్తులు గలిగియున్న సత్త్వరజస్తమోగుణములచే నావరింపబడి, 'శ్లో॥ సత్త్వం లఘు ప్రకాశకమిష్టముపష్టంభకం చలం చ రజః। గురు వరణకమేవ తమః' (సా. కా. 13) ప్రకాశ లఘుత్వములు గలది సత్త్వము, ఉద్రేక చలనత్వములుగలది రజస్సు, ఆవరక మాంద్యములుగలది తమస్సులగుటచే వాని ప్రవృత్తులకు లోబడి భోక్తృభావము (సా. కా, 17) వహించి 'ధర్మో జ్ఞానం విరాగ ఐశ్వర్యః (సా. కా. 23) ములగు సాత్వికరూపములనేగాక, 'తద్వి

పర్యస్త' (సా. కా. 23) ములగు అధర్మ, అజ్ఞాన, రాగ, అనై శ్వర్యములనబరగు తామసికవృత్తులతోడను, కూడినవాడై సంస్మృతిబద్ధుడగును. అప్పుడతనికి ఏకాదశేంద్రియములనబరగు బుద్ధీంద్రియ కర్మేంద్రియ మనములు తోడ్పడుచుండ, లింగశరీర బద్ధుడై 'శ్లో॥ ధర్మేణ గమనమూర్ధ్వం గమనమధస్తాత్ భవత్యధర్మేణ। జ్ఞానేనచాపవర్గో విపర్యయాదిష్యతే బంధః॥' (సా. కా. 44) ధర్మప్రవృత్తిచేనుత్తమజన్మమును, అధర్మముచే నీచ గర్భప్రవేశమును, జ్ఞానముచే నపవర్గమును, విపర్యయముచే బంధమును బొందుచుండును. అందు అధర్మాజ్ఞానములే యతనికి ప్రబల బంధహేతువులై సంసృతికారణము లగుచున్నవి. బంధములన '(ప్రాకృతేన చ బంధేన తథా వైకారికేణ చ। దాక్షిణేన తృతీయేన బద్ధో నాన్యేన ముచ్యతే' (సా. కా. గా. 44) ప్రాకృత, వైకారిక, దాక్షిణములను బంధత్రయముచే బద్ధుడగుననియు, జ్ఞానేతరముచే ముక్తుడు కాడనియు ననగా, యజ్ఞయాగాది కర్మ సంబంధ బంధము దాక్షిణసంబంధమనియు, ప్రకృతిని బురుషుడుగా భావించుట యారాధించుట ప్రాకృతబంధమనియు, మహదాది భూతపర్యంతము పురుషునిగా భావించి యర్చించుట వైకృత బంధమనియు భావము. అన్యోన్యాధ్యాసవలన అచేతనలింగమునకు చేతనత్వమును, అకర్తయగు పురుషునికి కర్తృత్వము నేర్పడుట జూచియున్నారము. తన్మూలముగ చేతనమువలె గోచరించు లింగమును పురుషుడుగా భావించుటయు జరుగుచుండును. పూర్వోక్త సాంసిద్ధిక, ప్రాకృతిక, వైకృతభావములు సంసార నాశకములై జ్ఞాన వైరాగ్య ధర్మైశ్వర్యముల గలిగించుచుండ. నీప్రాకృతాది బంధత్రయము సంసారహేతువు లగుచున్నవి.

మరియు 'శ్లో॥ వైరాగ్యాత్ ప్రకృతిలయః, సంసారో భవతి రాజసాద్రాగాత్ । ఐశ్వర్యాదవిఘాతో విపర్యయాత్ తద్విపర్యాసః॥' (సా. కా. 45) వైరాగ్యమున బ్రకృతిలయమును, రాగోద్భవమున సంసారమును, ఐశ్వర్యమువలన నాటంక రాహిత్యమును, అనైశ్వర్యఫలితముగ వైరుధ్యమును గలుగుచుండును. ఎట్లన, బుద్ధికిగల ధర్మాద్యనైశ్వర్య పర్యంతమగు యష్టలక్షణములచేత 'ఏష ప్రత్యయసర్గః' (సా. కా. 46) ప్రత్యయరూప సృష్టి యుత్పన్నమై, 'విపర్యయాశక్తితుష్టి సిద్ధ్యాఖ్యః' (సా. కా. 46) విపర్యయ అశక్తి. తుష్టి సిద్ధి యను చతుర్విధ ప్రత్యయబద్ధమై 'గుణవైషమ్యవిమర్దేన తస్యభేదాస్తు పంచాశత్' (సా. కా. 46) గుణవిభేదమున వివిధమై యేబదివిధముల సృష్టి కలుగుచున్నది. అనగా బుద్ధిగుణవిభేదము ననుసరించి పంచాశతరూపములుగా నగుచున్నదని యర్థము.

అందు 'శ్లో॥ పంచ విపర్యయభేదా భవంత్యశక్తిశ్చ కరణవైకల్యాత్ । అష్టావింశతిభేదా తుష్టిర్నవధాఽష్టధా సిద్ధిః॥' (సా. కా. 47) విపర్యయరూపమైన యజ్ఞానము అయిదువిధములుగను, ఇంద్రియవైకల్యముచే నశక్తి యష్టావిశంతి రూపముగను, తుష్టి నవవిధముగను, సిద్ధి యెనిమిదిరీతులును మొత్తమునకు పంచాశత్ రూపముగ నేర్పడినవి. వానిలో బంచవిపర్యయములు 'శ్లో॥ భేదస్తమసోఽష్టవిధో, మోహస్య చ, దశవిధో మహామోహః। తామిస్రోఽష్టాదశధా, తథా భవత్యంధతామిస్రః॥' (సా. కా. 48) 'తమః మోహః మహామోహః, తామిస్రః, అంధతామిస్రః' (సా. కా గా. 47) అను విధముగ విపర్యయమగుచు, తమ మష్టముగను, మోహ మష్టముగను, మహా

మోహము దశవిధముగను, తామిస్రి మష్టాదశముగను, అంధ తామిస్రముగూడ నష్టాదశవిధములుగను నగుచు, మొత్తము నకు 'ద్విషష్టి భేదాః సంవృత్తా ఇతి' (సా. కా. గా. 48) అన్నటుల నఱువదిరెండు భేదముల సంవృత్తులగుచున్నవి. అట్లే యశక్తత యును 'శ్లో॥ ఏకాదశేంద్రియవధాః సహ బుద్ధివధైరశక్తిరుద్దిష్టా। సప్తదశవధా బుద్ధేర్విపర్యయాత్ తుష్టిసిద్ధీనాం॥' (సా. కా. 49) ఏకాదశేంద్రియములకు బుద్ధితో సహా బాధకలుగుట యశక్తత యనబడును. తుష్టి యైశ్వర్యవైరుధ్యములే సప్తదశబుద్ధ్యశక్తతలు మొత్తమునకు నిరువదిఎనిమిది యశక్తతలేర్పడుచున్నవి. మరియు దుష్టియు'శ్లో॥ఆధ్యాత్మికాశ్చతస్రః ప్రకృత్యుపాదానకాలభాగ్యాఖ్యాః। బాహ్యా విషయోపరమాత్ పంచ, నవ తుష్టయోభిహితాః॥' (సా. కా. 50) ప్రకృతి, ఉపాదాన, కాల, భాగ్యములను అంతరములును, శబ్దాది విషయనివృత్తమును బాహ్యములును గలసి నవవిధముగా నొప్పును. ప్రకృతిజ్ఞానమువలన జ్ఞానరహిత సన్న్యాసమువలన, కాలపరిణామభావమున, అదృష్టవిశేషమున ముక్తిగలుగు ననురీతి దుష్టినుండుట అంతరరూపమగు తుష్టి. కాని వానివలన మోక్షము కలుగనేరదు. బాహ్యతుష్టి పంచ విధములు. అనగా బంచవిధ జ్ఞానేంద్రియ విషయములనుండి వైదొలగుట యైదు విధములగు బాహ్యతుష్టి యగుచున్నది. సిద్ధులు నష్టవిధములై రాజిల్లును. ఎట్లన 'శ్లో॥ ఊహః శబ్దోధ్యయనం దుఃఖవిఘాతాస్త్రయః సుహృత్ప్రాప్తిః। దానం చ సిద్ధయోష్టౌ సిద్ధేః పూర్వోంకుశస్త్రివిధః॥' (సా. కా. 51) ఊహయన 'కిమిహ సత్యం, కిం పరం, కిం నైశ్రేయసం' యనియు, చింతించుటవలన 'ప్రధానాదన్య ఏవ పురుష ఇతి, అన్యా బుద్ధిః'

అనెడు తత్త్వజ్ఞానముత్పద్యమానమై 'యేన మోక్షో భవతి' దానివలన మోక్షముగలుగుట ఊహాసిద్ధి యనబడును. అటులే 'శబ్దజ్ఞానాత్ ప్రధానపురుషబుధ్యహంకారతన్మాత్రేంద్రియ పంచ మహాభూతవిషయం జ్ఞానం' (సా. కా. గా. 51) కలిగి అంత మోక్షముగలుగుట శబ్దాఖ్యయగు సిద్ధియగును. 'వేదాదిశాస్త్రాధ్యయనాత్ పంచవింశతితత్త్వజ్ఞానం ప్రాప్య మోక్షం యాతి' (సా. కా. గా 51) యనుట అధ్యయనసిద్ధి యనబరగును. 'ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికదుఃఖత్రయవిఘాతాయ... మోక్షం యాతి' అనునట్లు దుఃఖనిర్మూలనరూపమే మోక్షహేతువగుట నవి మూడుసిద్ధులు. 'కశ్చిత్ సుహృజ్జ్ఞానమధిగమ్య మోక్షం గచ్ఛతి' మిత్రునిద్వార జ్ఞానము నార్జించి ముక్తిగాంచుట యేడవ సిద్ధి. దానాదులచేత మోక్షమును బొందుట అష్టమసిద్ధి.

పైవచింపబడిన విపర్యయాశక్తితుష్టి సిద్ధులలో ప్రథమ త్రయము ముక్తి ప్రతిబంధకములై యుండుటచే బరిత్యాజ్యములు. మోక్షదాయకమగు సిద్ధులు సేవ్యము. 'ససిద్ధేస్తత్త్వజ్ఞానముత్పద్యతే, తస్మాత్ మోక్ష ఇతి' (సా. కా. గా 51) యగుటచే సిద్ధియే ముముక్షుకోటిచే నవశ్యగ్రాహ్యము.

పురుషు డీవిధముగా పంచాశక సర్గమునందు మగ్నుడై, 'జరామరణకృతం దుఃఖం ప్రాప్నోతి చేతనః పురుషః' (సా. కా. 55) జరామరణరూప దుఃఖమును బొందుచున్నాడు. ఇట్లు దుఃఖత్రయాభిఘాతే' (సా. కా. 1) ములచే బాధింపబడుచుండుటచే 'తదభిఘాతకే హేతౌ జిజ్ఞాసా (సా. కా. 1) తన్నివారణార్థము జిజ్ఞాస యవసరమగుచున్నది. కావున కర్మానుష్ఠానాదులు 'స హ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః' (సా. కా. 2) పశు

హింసారూపక అవిశుద్ధతయు, ఇంద్రియాదినాశముతో క్షయ మును అతిశయమును గలవిగాన 'పంచవింశతితత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసేత్ । జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః' (సాం.కా.గౌ. 1) జటిగాని, ముండికాని, శిఖిగాని, యే యాశ్రమమందున్నను పంచవింశతితత్త్వజ్ఞుడైనచో నిస్సంశయ ముగ ముక్తినొందు ననురీతి, బంచవింశతిజ్ఞానరూపమగు 'తద్వి పరీతః శ్రేయాన్ వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్' (సాం.కా. 2) కర్మ వ్యతిరిక్త వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానముచేత నిశ్శ్రేయసప్రాప్తి గలుగు చున్నది. ఇయ్యదియే 'వ్యక్తావ్యక్తవిజ్ఞానాత్ మోక్షః' (సాం. కా.గౌ.17) అనియు వచింపబడియున్నది. మరియు 'ఏవం వ్యక్తా వ్యక్తజ్ఞానాం విభాగో వివ్యాతః. యద్విభాగాన్మోక్షప్రాప్తిః' (సాం.కా. గౌ. 20) ఈవిధముగ వ్యక్తావ్యక్తజ్ఞ విభాగము చేయ బడినదగుచు దానివలన మోక్షప్రాప్తియనియు, 'వ్యక్తా వ్యక్తజ్ఞవిజ్ఞానాన్మోక్ష ఇతి' (సాం.కా.గౌ. 23) యనియు 'ఏవమే తాని పంచవింశతితత్త్వాని । యస్త్రైస్త్రైలోక్యం వ్యాప్తం జానాతి।' (సాం.కా.గౌ. 23) ఇట్లు పంచవింశతితత్త్వములు. వీనిచే నావృత మగు త్రిలోకముల నెవడెరుంగునో వాడు ముక్తుడగుననియు, 'సైవ చ విశినష్టి ప్రధానపురుషయోర్విషయవిభాగం కరోతి ...' (సాం.కా.గౌ. 37) బుద్ధియే ప్రధాన పురుష విషయవిమ ర్శను గావింపజేయుటచే 'అపవర్గో భవతి' (సాం.కా.గౌ. 37) అపవర్గము గలుగుచున్నదనియు 'గుణపురుషాంతరోపలబ్ధిర్మోక్ష ఇతి' (సాం.కా.గౌ. 42) గుణపురుషాంతర పరిజ్ఞానమే మోక్ష మనియు, 'అపవర్గః చ పంచవింశతితత్త్వజ్ఞానం । తేన నిమిత్తేనా పవర్గో మోక్షః' (సాం.కా.గౌ 44) అపవర్గమన పంచవింశతి

తత్త్వజ్ఞానము. దానివలన మోక్షమనియు, 'స సిద్ధేస్తత్త్వజ్ఞానముత్పద్యతే। తస్మాత్ మోక్ష ఇతి' (సా. కా. గా. 51) ఆసిద్ధులవలన తత్త్వజ్ఞానప్రాప్తియు దానివలన మోక్షమును గలుగుననియు. 'యదా పంచవింశతితత్త్వజ్ఞానం స్యాత్ ... ఏవం జ్ఞానాల్లింగనివృత్తిస్తతో మోక్ష ఇతి' (సా. కా. గా. 55) ఎప్పుడు పంచవింశతితత్త్వజ్ఞానము గలుగునో, ఆజ్ఞానమువలన లింగనివృత్తియు, నంత మోక్షమును ప్రాప్తించుననియు, బహువిధంబుల మోక్షస్థితియు, తత్ప్రాప్తిసాధనంబును వివరింపబడియున్నవి.

కాన మోక్షమార్గము, 'ఇదం ప్రధానం, ఇయం బుద్ధిః, అయమహంకారః, ఇమాని పంచ మహాభూతాని, యేభ్యోన్యః పురుషో విసదృశ ఇతి' (సా. కా. గా. 55) ఇది ప్రధానము, యిది బుద్ధి. యిది అహంకారము, ఇవి పంచమహాభూతములు, వీనికన్నింటికి అన్యుడు పురుషుడని 'ఇయం ప్రకృతిః, అయం పురుషః ఏతాని పంచతన్మాత్రేంద్రియమహాభూతానీతి' (సా. కా. గా. 64) ఇది ప్రకృతి, యితడు పురుషుడు, యివి పంచతన్మాత్రలు యింద్రియములు మహాభూతములు, అనియు, 'ఏవం తత్త్వాభ్యాసాత్' (సా. కా 64) నీవిధముగా తత్త్వజ్ఞానాభ్యాసము సేయగా, 'శ్లో॥ నాస్మి న మే నాహమిత్యపరిశేషం। అవిపర్యయాద్విశుద్ధం కేవలముత్పద్యతే జ్ఞానం॥' (సా. కా. 64) నేను లేను, నాది లేదు, అహంకారముగూడ లేదనెడు సంపూర్ణమును, అవిపర్యయమును, శుద్ధమును, కేవలమును, అగు జ్ఞానముదయించును, ఈజ్ఞానోద్భవమున 'ఏవం జ్ఞానాల్లింగనివృత్తిస్తతో మోక్ష ఇతి' (సా. కా. గా. 55) లింగనివృత్తియు మోక్షమును

ప్రాప్తించును. అట్లు లింగనివృత్తికాగా 'లింగనివృత్తౌ మోక్షః, మోక్షప్రాప్తౌ నాస్తిదుఃఖం' (సా. కా. గా.55) మోక్షమును అంత దుఃఖవినాశమును లభించును. అంత ప్రకృతిర్వియోగో మోక్షః' (సా.కా, ) అనురీతి నింతకాలము పురుషునకు దర్శనార్థ ముప యుక్తమగుచు నున్న ప్రకృతి కైవల్యార్థము ప్రవర్తించి విర మించుచున్నది. అంత ప్రకృతి తన ప్రభావమును పురుషునిపై జూపక 'శ్లో॥ రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్। పురుషస్య తథాత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః॥' (సా.కా.59) నృత్యప్రదర్శనానంతరము నర్తకి రంగ స్థలమునుండి నివర్తించువిధాన, బురుషసన్నిధానమున వివిధ గతుల నటించి ప్రకృతి నిష్క్రమించుచున్నది. మరియు సుకు మారతరమగు నాప్రధానము 'యా దృష్టాస్మీతి పునర్న దర్శన ముపైతి పురుషస్య॥' (సా.కా,61) చూడబడితినని మరల బురుషునెదుటికి ప్రకృతి రానేరదు. అందుచేత 'శ్లో॥ తేన నివృత్తప్రసవామర్థవశాత్ సప్తరూపవినివృత్తాం। ప్రకృతింపశ్యతి పురుషః ప్రేక్షకవదవస్థితః స్వస్థః॥' (సా.కా.65) వ్యక్తావ్యక్తజ్ఞ జ్ఞానమువలన ధర్మాద్యష్టకమున జ్ఞానంవినా ధర్మాదిసప్తకము నుండి విరమించినట్టియు, ప్రసవత్వమును విడనాడినట్టియు, ప్రకృ తిని ప్రేక్షకునివలె స్వస్థుడై పురుషుడు తిలకించుచుండును. అంతట, 'శ్లో॥ రంగస్థ ఇత్యుపేక్షక ఏకో దృష్టాహమిత్యు పరమత్యేకా। సతి సంయోగేఽపి తయోః ప్రయోజనం నాస్తి సర్గస్య॥' (సా.కా, 66) నాటకరంగమున ప్రేక్షకునివలె నుదాశీ నుడై పురుషుడుండ జూడబడితినని ప్రకృతి విరమించును. వారి రువురికింకను సంయోగమున్నను, సర్గకారణమగు ప్రయోజన

మేమియు నుండదు. అనగా ప్రకృతివలన బురుషునికింక జననాది సర్గ ముద్భవింపదు. ఎట్లన 'ఉభయత్రాపి చరితార్థస్వాత్ సర్గస్య నాస్తి ప్రయోజనం' (సా.కా.గా. 66) పురుషునియొక్క దర్శనార్థ కైవల్యార్థములగు నుభయ పురుషార్థములును సృష్టిమూలమున దీరియుండుటచే నిక సృష్టి కారణములేదని తాత్పర్యము. యథా దానగ్రహణనిమిత్త ఉత్తమర్ణాధమర్ణయోర్ద్రవ్యవిశుద్ధా సత్యపి సంయోగే న కశ్చిదర్థసంబంధో భవతి' (సా. కా.గా. 66) ఋణప్రదాత ఋణగ్రస్థుల సంయోగము ఋణవిమోచనానంతర సమయమందు ద్రవ్యసంబంధమే లేక నుండునట్లు, 'ఏవం ప్రకృతి పురుషయోరపి నాస్తి ప్రయోజనం' (సా. కా.గా. 66) ప్రకృతిపురుషుల సంయోగముగూడ ప్రయోజనాపేక్షా రహితమై యుండును. అయినను 'తిష్ఠతి సంస్కారవశాచ్చక్రభ్రమవత్ ధృతశరీరః' (సా.కా.67) సంస్కారవశమున, కులాల చక్రభ్రమణమువలె బురుషుడు శరీరస్థుడై సంస్కార నాశమువరకు నుండి 'శ్లో॥ ప్రాప్తే శరీరభేదే చరితార్థత్వాత్ ప్రధానవినివృత్తౌ। ఏకాంతికమాత్యంతికముభయం కైవల్యమాప్నోతి॥' (సా.కా. 68) ప్రధాన నివృత్త్యనంతరము దేహత్యాగమున, అవశ్యమును పర్యవసానమును అగు కైవల్యమును పురుషుడు పొందును. అనగా 'కేవలభావాన్మోక్షః' అను సూత్రరీతి కేవలభావరూప మోక్షమునొందును, 'కేవలస్య భావః కైవల్యం' (సా.కా.గా.17) అనుటచే 'శరీరాద్వ్యతిరిక్తః' (సా. కా. గా. 17) శరీరాదులకు వ్యతిరిక్తమై 'కేవలభావః కైవల్యమన్యత్వమిత్యర్థః। త్రిగుణేభ్యః కేవలః అన్యః' (సా.కా.గా.19) కైవల్యమన నేకముగనుండుట లేక నన్యముగ

నుండుట యగును. త్రిగుణాదిజన్య సర్గమునుండి యన్యముగ నుండుటయే కైవల్యార్థము. అనగా నీస్సృష్టితంత్రమునుండి విడివడి దూరమై శుద్ధమైయుండుటయే యగుచున్నది. అట్టిస్థితిలో బురుషుడు ద్వితీయపురుషార్థమునుబొంది కేవలీభావమున నుదాశీనుడై యుండుచు, 'మోక్షప్రాప్తే నాస్తి దుఃఖమితి' (సా. కా. గౌ.55) యనురీతి దుఃఖరహితుడై యుండునని గ్రాహ్యము. ఈవిచారణమువలన సాంఖ్యమోక్షము దుఃఖనివృత్తస్థితియే యగునుగాని పరమానందప్రాప్తిగాదని కొందరు పండితుల అభిప్రాయము. కాని దుఃఖనివృత్తి యనుటతోడనే పరమానందప్రాప్తియు సంఘటిల్లుట సహజమగుటచే సాంఖ్యకైవల్యము సుఖవిరహితమనుట యసమంజసము. అది జడతయుగాదు. పురుషుడు బద్ధమోక్షస్థితులలో సదా చేతనుడై యుండుటచే దుఃఖరహిత కాలమున జడత్వమును బొంద నశక్యముగాన, దుఃఖవ్యతిరిక్తమగు ఆనందస్థితినే పొందియుండునని వేఱుగ జెప్పననావశ్యకము. అదియునుగాక, సుషుప్తియందువలెగాక కైవల్యమునొందిన పురుషునికి సంస్కారనాశమొందుటయేగాక, త్రిగుణములు సంపూర్తిగ నశించియుండుటచే నతడు తమస్సున లయించియుండుననుటయు బాడికాదు. సాంఖ్యకైవల్యమును గ్రహింపనివారు కొందరు ప్రధానలయమే సాంఖ్యమోక్షమని విపరీతమగు అర్థమును నుపయోగించుచున్నారు. అట్టి ప్రకృతిలయమును 'ప్రకృత్యుపాదాన' (సా. కా.50) అను కారికలో ప్రకృతిని బ్రస్తావించి 'యథా కశ్చిత్ ప్రకృతిం వేత్తి తస్యాః సగుణత్వనిర్గుణత్వం చ, తేన తత్త్వం తత్కార్యం విజ్ఞాయైవ కేవలం తుష్టస్తస్య నాస్తి మోక్షః' (సా. కా. గౌ.50) ప్రకృ

తిని దాని గుణముల నొకడు గ్రహించును. అట్లు ప్రకృతి ప్రకృతికార్య జ్ఞానమున సంతుష్టుడైయుండుచో నతనికి మోక్షము లేదని, ప్రకృతిజ్ఞానముగాని తల్లయముగాని మోక్షము కాదని స్పష్టము కావున సాంఖ్యసిద్ధాంత మోక్షమన ప్రేక్షకునివలె నుదాశీనత్వమే యనియు నదియే యానందస్థితియనియు గా వ్రాస్యాము.

## ఈశ్వర ప్రశంస

సాంఖ్యమున నింతవరకు జరిగిన కారికా గ్రంథమున నెక్కడనైన ఈశ్వరప్రశంసగాని కనీసము ఈశ్వరశబ్దముగాని లేదు. యథార్థమునకు నీశ్వరవిషయములో గారికలు చాల తటస్థవైఖరినే వహించియున్నవి. కాని మన యుపోద్ఘాతమున దెలిపినట్లు సాంఖ్యశాస్త్రవిషయము, ముఖ్యముగా బృహత్సాంఖ్యము యొక్క లఘుస్వరూపమగు కారికాగ్రంథముయొక్క తాత్పర్యము ఈశ్వరప్రతిపాదనము గాదనియు, ముఖ్యముగా బురుష ప్రకృతులయొక్కయు జీవప్రపంచముయొక్క సంబంధముల సహేతుకముగా నిర్ణయింప యత్నించుటయే యని వ్రాసియున్నాము. అందుచేతనే కారికాకారుడుగూడ వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానమని ప్రారంభముననే వాకొనియున్నాడు. కాన నతని గ్రంథరచనాతాత్పర్యము మీమాంసాదులవలె నీశ్వర ప్రతిపాదనముగాదని సుబోధకము. అయినను, ఈశ్వరకృష్ణునితర్వాత నొకశతాబ్దముతర్వాత యే తెంచి కారికలకు భాష్యమునువ్రాసిన మాఠరుడును, దానిననుసరించి భాష్యములిఖించిన గౌడపాదుడును తమ భాష్యముల నీశ్వరవిషయము నెట్లు అన్వయించిరో చూచెదముగాక. ఈశ్వరకృష్ణునికి సమకాలికుడు కాకున్నను,

ఒకశతాబ్దముననే మాఠరుడు వృత్తి వ్రాసియుండుటచే, నతడు చాలవరకు కారికల సంప్రదాయకభావముల స్వీకరించియుండు ననుట కెట్టి సందియముండదు. అట్లే గౌడపాదుడును సంప్ర దాయమునే యనుసరించియుండును. అందుచే వారి భావముల సంగ్రహించుటయు నవసరమగుచున్నది.

మాఠరునే యనుసరించిన గౌడపాదుడు తనభాష్యసంద ర్భమున ముఖ్యముగ నాలుగుస్థానముల నీశ్వరప్రసంగము జేసి యున్నాడు. అందు ప్రథమతః 'గుణపరిణామవిశేషాత్ నానా త్వం' (సాం.కా.27) అను కారికకు భాష్యరచనము జేయుచు, 'అథైతానీంద్రియాణి భిన్నాని భిన్నార్థగ్రాహకాణి కిమీశ్వరేణ ఉత స్వభావేన కృతాని' (సాం.కా.గౌ.27) వివిధ విషయగ్రాహ కములగు వివిధేంద్రియములు ఈశ్వరకృతములా లేక స్వభావ జనితములా యని ప్రశ్నించుకొని, ప్రధానాదు లచేతనములగు టయు, బురుషుడకర్తయు నగుటచే స్వభావము కారణముగా సాంఖ్యవాదులు వాకొందురని రచించెను. అవి 'గుణపరిణామ విశేషాత్' అని సూచించుచు, 'అద్వైతన్నానాత్వం నేశ్వరేణ, నాహంకారేణ, న బుద్ధ్యా, నప్రధానేన, న పురుషేణ, స్వభా వాత్ కృతగుణపరిణామేనేతి' (సాం.కా.గౌ.27) నానాత్వము ఈశ్వరునిచేగాని, అహంకార, బుద్ధి, ప్రధాన, పురుషులచేగాని యేర్పడక గుణపరిణామరూప స్వభావముచే గలుగుచున్నదనియు గౌడపాదుడు వివరించియున్నాడు. మరల 'సుకుమారతరం' (సాం.కా.61) పద వివరణమున 'కేచిత్ ఈశ్వరం కారణం బ్రువతే' కొందరు ఈశ్వరుని కారణముగా భావింతురని వచించి 'శ్లో॥ అజ్ఞో జంతురనీశోఽయమాత్మనః సుఖదుఃఖయోః।

ఈశ్వర ప్రేరితో గచ్ఛేత్స్వర్గం నరకమేవ వా॥' (మహాభారత, 3.30 38) అజ్ఞజీవుడు సుఖ దుఃఖవిషయముల నస్వతంత్రుడు. ఈశ్వర ప్రేరితుడై స్వర్గనరకముల బొందునను ఈశ్వరకారణవాదుల ప్రమాణమునుగూడ బేర్కొని, 'నిర్గుణత్వాదీశ్వరస్య కథం సగుణాః ప్రజాః జాయేరన్' గుణాత్మకమగు జీవకోటి నిర్గుణ మగు యీశ్వరుచేత నెట్లు గలుగును? అని ప్రశ్నించి, 'తస్మాత్ ప్రకృతేర్వ్యుజ్యతే' అందుచే బ్రకృతిచే గలిగినదనుట యుచిత మనియు, శుక్ల తంతువులనుండి శుక్లవస్త్ర ముత్పన్నమైనయట్లు త్రిగుణరూప ప్రధానమునుండి త్రిగుణములు లోకత్రయము సంభ వించినట్లు గ్రాహ్యముగా వాదించును. ఎందుచేనన, 'నిర్గుణ ఈశ్వరః సగుణానాం లోకానాం తస్మాదుత్పత్తిరయుక్తేతి' (సా.కా.గా.61) ఈశ్వరుడు నిర్గుణుడగుటచే, త్రిగుణాత్మకమగు నీలోక మతనినుండి జనించినదనుట యుక్తిబాహ్య మగుచున్న దనియు తీర్మానించుచు సర్గకారణము త్రిగుణాత్మకమగుప్రకృతిగా నెలకొల్పెను. ఇంద్రియప్రవృత్తిహేతువును బ్రస్తావించి, పురు షార్థహేతుకము లేయని వచించి, 'న కేనచిత్ ఈశ్వరేణ కార్యతే ప్రబోధ్యతే కరణం' (సా.కా,గా.31)పురుషునికొరకే కరణములు ప్రవర్తించునుగాని ఈశ్వరప్రేరితము కాదనియు నిర్ణయించెను.

ప్రథమవృత్తికారు డనబరగు మాఠరియన్ననో 'ఇమాసాం ఖ్యేపురుషేశ్వర స్వభావా న కారణం' (సా.కా.మా,31) పురు షేశ్వర స్వభావములు కారణములుగావని సాంఖ్యవాద మని వచించెను. మరియు నితడు 'అద్వైతన్నానాత్వం నేశ్వరేణ న బుద్ధ్యా నాహంకారేణ న ప్రధానేన న పురుషేణ న స్వభావేన కృతం గుణపరిణామేనేతి' (సా.కా.మా.31) నానాత్వమునకు

కారణము ఈశ్వరబుద్ధ్యహంకార ప్రధాన పురుష స్వభావములు గాదనియు గుణపరిణామమే కారణమనియు విరచించెను గౌడ పాదుడు స్వభావకారణమని (సా. కా గా 27) ఒకచో వచించి, స్వభావకారణము కాదని (సా. కా. గా 34) యితర ప్రదేశముల వచించియుండుట కొంత వివాదమున కెడమిచ్చియున్నది. కాని మాఠరుడు రచించినట్లు స్వభావముకూడ కారణముగాక గుణ పరిణామమే కారణమనుట సమంజసమని విజ్ఞుల అభిప్రాయము

పరమార్థయను వ్యాఖ్యాత, 27 వ కారికలోని 'స్వభావ అను పదమునకు ప్రత్యేకమగు. పురుషునిగా నిర్వచించియున్నాడు

ఈవిధముగ కారికావ్యాఖ్యాతలు ఈశ్వరప్రసంగము జేయుచు, సాంఖ్యులచే సమ్మతములై, ప్రతిపాదితములై, అస్తిత్వ ముగల ప్రధాన పురుషాదులతో నీశ్వరునికూడ ప్రస్తావించి యుండుటచే నీశ్వరనాస్తికత్వ మెచట యున్నదో గోచరింపదు. నిరీశ్వరత్వమే సాంఖ్యవాదమైయున్నచో, లేని యీశ్వర ప్రసంగమే సంభవించెడిదికాదు. లేక పరవాద ఖండనరూపముగ ఈశ్వరప్రస్తావన గలిగె నన, నీశ్వరుడు లేడనియే ముందు వచించి, అభావమగు నీశ్వరు డెట్లు కారణమగునని పూర్వపక్షముగా బలికి యుండవలసినది. అందుచే సాంఖ్య సిద్ధాంతము, ఈశ్వరయునికి విషయమున సంశయింపక, నతనికి యీసృష్టి తంత్రమున, సృజించుటగాని, నియమించుటగాని, ఈశ్వరునకెట్టి సంబంధము లేదనియు, సృష్టినిర్వహణ కార్యభారమంతయు త్రిగుణాత్మకమగు ప్రధానమునకే జెందుననియు భావము. అందు చేతనే 'His idea is that a personal God is quite unnecessary; Nature itself is sufficient to work out the whole

of ereation' (Complete works Vol 2, 437) సగుణ్ణదైవ మన వసరమనియు, సర్వసృష్టిని జరుపుటకు ప్రకృతియే చాలుననియు గపిలుని భావమని వివేకానందు డుద్ఘోషించియున్నాడు.

అంతియగాక 'జ్ఞానేన చాపవర్గః' (సా.కా.44) అను విషయమునకు వ్యాఖ్యానిాయుచు, 'తతః సూక్ష్మశరీరం నివర్తతే, పరమాత్మా ఉచ్యతే' అంత నపవర్గలో సూక్ష్మశరీరము నివర్తింప బరమాత్మయగును అని గౌడపాదులు రచించిరి. దీని వలన మోక్షమన పరమాత్మైక్యమే యనుభావముప్రస్ఫుటము. కాన గౌడపాదుడుగాని అతని దృష్టికి కారికలుగాని, సాంఖ్య శాస్త్రముగాని నిరీశ్వరత్వముకాదని' నాస్తికముకాదని విదిత మగుచున్నది.

ఈవిషయము నేసూత్రముల ననుసరించి యోచించుచో, "ఈశ్వరాసిద్ధేః' (సా.సూ.1, 92) 'ఈదృశేశ్వరసిద్ధిః సిద్ధా, (సా.సూ.3.57) నేశ్వరాధిష్ఠితే ఫలనిష్పత్తిః కర్మణా తత్సిద్ధేః' (సా.సూ 5, 2) 'స హి సర్వవిత్ సర్వకర్తా' (సా.సూ.3.56) యను సూత్రములద్వారా యీశ్వరాస్థిత్వమును ద్రోసిపుచ్చక యీశ్వర కర్తృత్వమునే ఖండించినట్లు సుస్పష్టగోచరము. ఈసూత్రములద్వారా విజ్ఞానభిక్షువు సాంఖ్యము ఆస్తికమే యనియు సమన్వయబరచును.

అందుచే సాంఖ్యము నిరీశ్వరముగాక నాస్తికముకాక అవైదికముగాక, సేశ్వరమును. ఆస్తికమును, వైదికమును అయి యున్నదని యిందలి తాత్పర్యము. సృష్టికి గారణముగ నీశ్వరునిగాక ప్రధానమునే జేయుట సాంఖ్యాభిప్రాయము. ఈశ్వర ప్రతిపాదన నిర్వచనకార్యము 'Mimamsa systems stress the

spiritual aspect) మిూమాంసాదర్శనములు పారమార్థికవిషయమును స్థిరపరచునను (కళ్యాణకల్పతరు 1936) వచనమును, సాధకచిత్తముల ధీకుశలత కాటంకదాయకమగు నీశ్వరాస్తికతను సాంఖ్యము అప్రధాన మొనర్చియున్నదను శ్రీవారి పలుకులును చాల సమంజసములగును.

ఇట్లు హైందవతత్త్వార్థ శాస్త్రమునకేగాక సర్వప్రపంచ విజ్ఞానమునకెల్ల బునాదిగా నాదివిద్వాంసుడును, ఋషికుల చక్రవర్తియు, నసమప్రఖ్యాతుడును, యాదర్శతత్త్వవిదుడును, సర్వతత్త్వవిద వంద్యపాదుడునైన శ్రీకపిలాచార్యులచే ప్రతిపాదింపబడి, యుచిత శిష్యపరంపరాగతమై గంగాస్రవంతివోలె కాలక్రమమున ప్రబలయ వాహినియై సర్వతత్త్వశాస్త్రాధిపతియై, యధినేతయై శోభిల్లు సాంఖ్యశాస్త్రము ఎల్ల ముముక్షుకోటిచే నవశ్యపఠనీయము, అంతియగాక, సాంఖ్యప్రోక్త పంచవింశతి తత్త్వములనే సర్వసిద్ధాంతములును స్వీకరించియుండుటయు. దాని విశిష్టగుణత్రయబోధను అనుసరించుటయు, దాని ఘనతకు తార్కాణమగుటచే, సర్వశాస్త్రరసపానాభిలాషులకు నిది జిజ్ఞాస్యమానమగు సిద్ధాంతరాజము. అంతియగాక విజ్ఞానభిక్షువు మాక్స్ ముల్లరు మొదలగు దత్త్వవేత్తల పలుకులవిని దర్శనములలో నొక క్రమము గలదనియు, నవి నవిరుద్ధములనియు, నందు సాంఖ్యసిద్ధాంతము చాల ప్రధానస్థానము నధిష్ఠించియున్నదనియు గ్రహించి, ఎల్లతత్త్వగ్రహణ పారీణులు ఆదృష్టి సాంఖ్యరహస్యముల బఠించి గ్రహించి ధన్యత నొందుదురుగాక!

హరిః ఓం తత్ సత్

# సర్వ సిద్ధాంత సౌరభము

## దర్శనఖండము

## యోగదర్శనము

ఓం

# యోగదర్శనము

## ఉపోద్ఘాతము

### యోగ విశిష్టత

శ్లో॥ యోగాత్సంజాయతే జ్ఞానం జ్ఞానాద్యోగః ప్రవర్తతే।
యోగజ్ఞానపరో నిత్యం స యోగీ న ప్రణశ్యతి॥

త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు

యోగమువలన జ్ఞానము జనించును. జ్ఞానమూలమున యోగము ప్రవర్తించును. యోగజ్ఞానపరుడైన యోగి నశింపడు, అని త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తుచేతను, 'యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువం' యోగములేకున్న ధృఢముగ జ్ఞానము మోక్షము నెట్లొసంగును? అని యోగతత్వోపనిషత్తు చేతను, 'తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః' సర్వకారణమును, సాంఖ్యయోగములచే గ్రాహ్యమును, అగు నీదేవత నెరింగినవాడు సర్వపాశముల నుండి విముక్తుడగును, అను శ్వేతాశ్వతరోపనిషత్తుచేతను, యింక ననేక శ్రుతిపరంపరచే జ్ఞానప్రదాతయనియేగాక, మోక్ష విభూతి సంధాత యనియు గీర్తింపబడుచు; 'శ్లో॥ ద్వాక్రమౌ చిత్త నాశాయ యోగో జ్ఞానం చ రాఘవ। యోగో వృత్తి నిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణం। అసాధ్యః కస్యచిత్ యోగః కస్య

చిత్ తత్త్వ నిశ్చయః॥' చిత్తవినాశమునకు యోగజ్ఞానములను ద్వివిధ క్రమములు గలవు. అందు వృత్తినిరోధము యోగము, సమ్యగ్దృష్టి జ్ఞానము అనబడును. ఆ యోగజ్ఞానము లసాధ్యములు సుమా యని శ్రీరామచంద్రునకు వసిష్ఠమునీంద్రునిచే యోగవాసిష్ఠమున నుపదేశింపబడుచు, 'హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః॥' యోగశాస్త్రమున కుపదేష్ట పురాతనుడైన హిరణ్యగర్భుడేగాని యితరులుగారను యాజ్ఞవల్క్య స్మృతి వచనమురీతి సాక్షాత్తు హిరణ్యగర్భునే యాదిగురువుగా గలిగి; శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోధికః। కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥' తాపసులకంటెను, జ్ఞానులకంటెను, కర్మానుష్ఠానపరులకంటెను, యోగి యుత్తముడను మొదలుగాగల యసంఖ్యాక వాక్యరూపమున శ్రీకృష్ణభగవానులచేతను (గీత.6.46) నుతింపబడుచు; యోగస్మృత్యధికరణమున వేదాంతసూత్రకారునిచే స్మరింపబడుచు; ననాదికాలమునుండి యప్రతిహతమై యతిప్రఖ్యాతమై 'పరమకారుణికః పతంజలిమునివరః।'[1] అని సన్నుతుడైన 'భగవాన్ పతంజలి మహర్షి సత్తమునిచే 'సుఖావబోధార్థ'ము 'సంక్షేపతస్తాత్పర్యార్థ'ము, యోగసూత్రములుగా 'ననుశాసింప' (తత్త్వవైశారది. 1.1) బడినది యీ యోగశాస్త్రరాజము.

ఇది కేవలము తత్త్వశాస్త్రము మాత్రమేగాక (Philosophy is the study of the nature of experience as a whole.)[2] అనుభూతి యొక్క సమగ్రజ్ఞానమే తత్త్వశాస్త్రమను

---

1. పురుషోత్తమశర్మ: పాతంజల యోగసూత్రాణి పు 1
2. John. S. Mackenzee: A Manual of Ethics, p 23

(Mackenzee) మెకంజి వాక్యము న సార్థకనామ ధేయుడై, (Here first sprang up inquiries into the nature of man and into the internal world) 3 మానవతత్త్వమును గూర్చియు అంతః ప్రపంచమును గూర్చియు, గవేషణము యిచ్చటనే యుద్భవించినది యని వివేకానందు లన్నరీతి బాహ్యాభ్యంతర మానవతత్త్వ పరిశీలనము గావించి, (This divine madness is the supreme sourse of chiefest blessings granted to man) మానవునకు ప్రసాదింపబడిన వర [illegible]ములకు నిదియుత్పత్తి కేంద్రస్థాన మనుచు (Plato) ప్లేటోచే సంస్తుతింపబడిన 'సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః॥' (యో.సూ. 1.51) సర్వమును నిరోధించుటచే నిర్బీజసమాధి యనబడు అసంప్రజ్ఞాతము లభించునని వాగ్దానమిచ్చుచు, (Religion is Realisation) అనుభూతియే మతమను శ్రీరామకృష్ణపరమహంసదేవుని వాక్యము ననుసరించి (The Science of Raja-Yoga proposes to put before humanity a practical and scientifically worked-out method of reaching this Truth) 4 సత్పదార్థప్రాప్తికై రాజయోగశాస్త్రము అనుష్ఠాన యోగ్యమును, శాస్త్రీయమును, పరిశుద్ధమును, అగు మార్గమును మానవలోకమున కుపదేశించుచున్నది. మరియు (Ethics is the science of conduct. It considers the actions of human beings with reference to their rightness or wrongness, their tendency to good or to

---

3. Swami Vivekananda: The Complete Works Vol 3 p 285

4. Do Do Vol I P 128

evil) 5 ప్రవర్తనశాస్త్రమే నీతిశాస్త్రము. మంచి చెడుగులను సంబంధించి మానవతత్త్వముల ననుసరించి వారి కర్మల నడి పరిశీలించును అన్నట్లు మానవప్రవర్తనను శుద్ధిపరచి, (The Science of Ethics - - stretches out its hands to metaphysics) 6 నైతికధర్మము తత్త్వశాస్త్రము నందుకొనునని (Mackenzee) మెకంజి వచించుటచేత తత్త్వగవేషణమునకుగూడ మార్గదర్శియై (My strength is as the strength of ten, because my heart is pure) నాహృదయము పవిత్రతచేత పదిమందికి తుల్యమగు శక్తి నాకు గలదను (Tennyson) టెన్నిసన్ ధైర్యము నకు మించిన శక్తి యమ నియమాదికముల నాశ్రితులకు గలుగ జేయుచు; (The Truth cannot be expressed in words, and when words are used, even by Sankara, acute minds can always find a loop hole for attack. The finite, in fact, cannot contain the infinite. It follows that only by actual personal realisation by practice or method, can Truth ever be known beyond doubt) 7 పదములతో సత్య మవాచ్యము. శ్రీశంకరునిచేనైనను పదము లుపయోగింపబడినప్పుడు, ఖండనార్థము దోషముల సదా ధీమంతులు కనుగొందురు. అపరిమితము పరిమితముచే ధరింపబడదు. అందుచే స్వానుభవముననే, నిస్సందేహముగా సత్యము గ్రాహ్యము అను (Duglas) డగ్లసు యొక్క సరసవచనములవలె (While the Sankhya is busy with logical investigations,

5. John. S. Mackenzee: A Manual of Ethics, p I
6. Do Do p 435
7. Duglas Ainslie: Preface; Science Religion of Swami Yogananda P I

the Yoga discuss the nature of devotional excercises and mental discipline)[8] సాంఖ్యము యౌక్తికగవేషణాయుక్తమగుచుండ యోగము మానసిక సాధనావిధానముల జర్చించుచున్నది. అందుచేతనే (For thousands of years, such phenomena (mental) have been studied, investigated and generalised, the whole ground of the religious faculties of man has been analysed, and the practical result is the science of Raja-Yoga)[9] ఈమనోధర్మము అనేకవేల వత్సరములనుండి పరిశీలింపబడి, సమన్వయింపబడినది. మానవుని యొక్క [illegible] ములను విచక్షణాపరుపబడెను. అట్టి కృషియొక్క ప్రత్యక్షఫలితమే రాజయోగశాస్త్రమని వివేకానందులవారు కొనెను. అంతియగాక నీశాస్త్రము( Raja-Yoga proposes to start from the internal world, to study the internal Nature and through that, control the whole - both internal and external)[10] అంతఃప్రపంచమును అంతస్తత్త్వ విచారణముతో ప్రారంభించి, దానిద్వారా బాహ్యాభ్యంతర రూప సర్వమును స్వాధీనపరుచుకొనుచున్నది. కావున (The Yoga is much more emphatic than many other systems in holding that philosophy cannot save us. What we need of is not subtlities of disquisition, but control of will)[11] తత్త్వశాస్త్రముమాత్రమే మనల దరింపజేయజాలదనుటలో నితర సిద్ధాంతములన్నింటిలో నీయోగశాస్త్రము

8. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 344
9. Swami Vivekananda: The Complete Works Vol I p 121
10. Do Do p 133
11. Prof. S. Radhakrishnan; Indian Philosophy Vol 2 p 364

చాల నొక్కి వక్కాణించుచున్నది. తార్కిక సూక్ష్మత్వములు గాక చిత్తస్వాధీనత్వమే మనకు అత్యవసరమని వాదించుచు, (So long as we are bound by intellect and are lost in the world of many, we shall seek in vain to get back to the simplicity of the One)[12] బుద్ధికి బద్ధులమై నానాత్వ ప్రపంచమున నైమరచి యెంతకాలముందుమో అంతకాలము మనము నిరుపాధికమగు నేకత్వమును బొందజాలమని పల్కుచు; (One ounce of practice is worth a thousand pounds of theory)[13] వెయ్యిపౌనుల శాస్త్రజ్ఞానముతో నొక ఔన్సు అనుష్ఠానము సమమనునట్లు నొక్కిపల్కుచు; 'తాం యోగమితి మన్యంతే స్థిరమింద్రియధారణాం' (కఠ.6.11) స్థిరమైన యింద్రియధారణమే యోగమునకు ముఖద్వారమని యీశాస్త్రము తీర్మానించుచున్నది. అనగా 'యోగశ్చిత్తవృత్తినిరోధః' (యో.సూ.1.2) చిత్తవృత్తినిరోధమే యోగమని అనుశాసించుచున్నది. అనగా 'యోగః సమాధిః' (యో.భా.వా.1 1) యోగమన సమాధియే యని వ్యాఖ్యానించుచున్నది. ఇట్లు (Sankhya and Yoga emphasize the mental aspect)[15] సాంఖ్య యోగములు బుద్ధివిషయము నాదేశించుచు, సంపూర్ణాధ్యాత్మికానుభవ సంధానమును, (More than five thousand years ago, while the fore-fathers of and Briton and Gaul, Greek and Latin, were roaming the vast forests of Europe in search of food, true barbarians, the Hindu was already

12. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 341
13. Swami Vivekananda: The Complete Works Vol. 5 p 228
14. Kalyana Kalpataru 1936

engaged in pondering the mystery of life and death)[15] అయిదు వేల సంవత్సరములకు పైన, బ్రిటను, గాలు, గ్రీకు, ల్యాటిను దేశీయుల పితృవ్యులు నైజమున కాటవికులై విశాలారణ్యముల అన్నాతురులై గుర్రుమ్రుచుండు కాలమునగూడ హిందువులు జననమరణ రహస్య విచారణములలో మగ్నత బొంది యుండిరని (Duglas) డగ్లసు అన్నటుల, భారతావని కనాదికాలమునుండి కీర్తిని బ్రసాధించి, (The East is grand and makes Europe appear the land of trifles) ప్రాగ్దేశ మద్భుతమై యూరోపుదేశవిజ్ఞానమును నల్పముగ గనుపింపజేసిన దని బాస్టన్ బ్రాహ్మణుడని ప్రఖ్యాతుడగు (Emerson) ఎమర్సను మొదలగు అసంఖ్యాక పండితవర్గముచే చిరమును స్థిరమును అగు ప్రఖ్యాతిని గడించి యొప్పారిన దీయోగశాస్త్రరాజము.

---

## యోగసూత్రకర్త పతంజలి

ఇట్లు సుప్రశస్తిగనిన యీ యోగశాస్త్రమునకు బ్రథమోపదేష్ట యెవరో, కాలక్రమ గురులోకమెద్దియో మొదలగు విశేషాంశముల నొకించుక బరిశీలించి చూతము. ఇతరదేశములందువలె గాక, భారతదేశమున సిద్ధాంత ప్రాధాన్యతయే గాక తత్కర్తయు మిగుల ముఖ్యము. సిద్ధాంతమున కనుగుణ జీవిత

---

15. Duglas Ainslie: Preface, Science of Religion

విధానము కర్తలోనుండి తీరవలయును. అనగా జీవితవిధానమెట్లున్నను, యుత్కృష్ట భావప్రకటనము గావించి నంతమాత్రమున నితర దేశముల ప్రశస్తుడై తత్త్వవేత్తయని యశస్సు గడింప సాధ్యమగుచుండ, నార్యావర్తమున మాత్రము, భావన, భాషణ జీవనములు ఏకస్థానములై యొప్పారిననే, కేవలము పరిభాషా పరిచయమేగాక తత్తదనుకూలానుభవ సంపత్తియు గలిగియున్న గాని ఋషి యని పరిగణింపబడ వీలు లేదు. అందుచే ఋషిప్రోక్తములకును ఋషిజీవితమున కత్యంత సన్నిహిత సంబంధముండుటయే గాక, సిద్ధాంత భాగము ననుష్ఠింప సులభోపాయములును, అసంఖ్యాకమైన అనుభవ రహస్యములును, సిద్ధాంతియొక్క జీవితవిధానమున గోచరించును. అట్లు సిద్ధాంతి సిద్ధాంతము లన్యోన్యాపేక్షికములుగాన నుభయములు నావశ్యపఠనీయము లగుచున్నవి. కాని (Study the history of the whole world, and you will see that every high ideal you meet with any where, had its origin in India) 16 ప్రపంచచారిత్రము నంతటిని బరీక్షింపుడు. ఎచ్చటనైన నెట్టి యుత్కృష్టాదర్శము గోచరించినను దాని మూలము భారతదేశమున గలదని మీరు గ్రహించెదరను వివేకానందుని వాక్యానుసారముగను, (Their philosophy their thought, is so sublime, so elivating, so accurate, and true, that any comparison with the writings of the Europeans appears like a Promethean fire stolen from heaven as in the presence of the full glow of the noon-

16. Swami Vivekananda: The Complete Works Vol 5 p 228

day Sun)[17] భారతీయుల, తత్త్వశాస్త్రము, వారి విజ్ఞానము మిగుల పవిత్రము, ఉన్నతము, సిద్ధమము, సత్యము; దానితో బోల్చినచో, యూరోపుదేశీయ రచన లన్నియు, మాధ్యందిన మార్తాండుని ప్రజ్వలప్రకాశమున కెదుట స్వర్గమునుండి అప హృత పారిమాధి యాగ్నివలె గోచరించునని ఫ్రాన్సుదేశచరిత్ర కారుడైన (Victor Cousins) విక్టరు కసిన్సు పలికినట్లు అత్యంత విశిష్టాదర్శముల ప్రపంచమునకు, గ్రంథముల ద్వారముననే గాక, నిత్యజీవితానుష్ఠానమునకూడ ప్రసాదించి, యుగాంతికా నంద విహారులయ్యేను, (A pantheon of God-like figures, representing various stages of the immenent logic of all human thought) మానవవిజ్ఞానమున కాసన్నమగు వివిధ సోపానముల ప్రదర్శించు విశ్వదేవతాదృశ మహాపురుషులు అను (Hegel) హెగెల్ వాక్యసరణి యుత్కృష్టాదర్శ యశో నిధానులై పరమకారుణికులై; అజ్ఞానాంధకారమున నసహా యులై దిక్కుగాంచక మ్రగ్గుచున్న దీనజనోద్ధరణ కార్యోన్ముఖ ప్రవృత్తులై ఆత్మానుభవము నుపదేశించియు ప్రపంచోపశమ స్థితులగుటచేతను, (Those great master-minds producing momentous results in the hearts of mankind were content to write their books with out even putting their names and to die quietly, leaving the works to posterity)[18] ఈయసాధారణ ధీయుక్తులు, మానవకోటి హృదయముల నద్భుతఫలితముల గలిగించుచు, తమ నామ

---

17. Victor Cousins: Swami Rama Thirtha Vol p 113
18. Swami Vivekananda: The Complete works Vol 3 p 275

ములనైన ప్రకటింపక యుద్గ్రంథముల రచించి తమ సంతానము నకు వాని వదలుచు ప్రశాంతచిత్తముల దివంగతులైరి యను నట్లు యీఅజ్ఞప్రపంచ గౌరవమర్యాదలను పేరుప్రతిష్ఠలను కాం క్షింపక అతినిరాడంబరులై తమ జీవితవిశేషముల మరుగుపరచిరి. సుమారొక శతాబ్దముక్రితముండిన మహాపురుషుల జీవితములే అవిస్పష్టములై చరితాకథనదూరములై బహుళ సమస్యాపూరిత ములై యుండ నిక నతిప్రాచీనుల, అందును బ్రహ్మానందామృత విలోల జనితోన్మత్తుల జీవితవిశేషములు కాలవాహినిలో మరుగు పడుట యందాశ్చర్య మావంతయును లేదు. అయినను (All this is very discouraging to the students accustomed to chronological accuracy, but it was always seemed to me far better to acknowledge our poverty and the utter absence of historical dates in the literary history of India)[19] కాలక్రమ నిర్ణయమున కలవడిన విద్యా ర్థులకిది యధైర్యమును కలిగించును. కాని భారతవాఙ్మయ చారిత్రములో చారిత్రాత్మక కాలావధులు బొత్తుగా లేకుండు టయు, తద్విధాన దారిద్ర్యమును మనకు గలదని సమ్మతించిన బాగుండునని నాకు తోచుచున్నదని (Max Muller) మాక్సు ముల్లరు చింతించెను. కాని మరల నాతడే (After all, the importance of that literature, and more particularly of its philosophical portion is quite independent of age. It has something to teach, is quite apart from the names and dates of its authors)[19] ఆవాఙ్మయముయొక్కయు

19. Prof. Max Muller: The Six Systems of Indian Philosophy p 120

ముఖ్యముగా దాని తాత్త్వికభాగముయొక్క ప్రాధాన్యత సర్వకాలముల కతీతము, స్వతంత్రము. దాని కర్తలకును కాలమునకును అతీతమైన విశేషముల నది బోధించు నని సమన్వయించుకొని యతడు సంతృప్తి చెందెను ఇట్లు అజ్ఞాతములగు మహాపురుష జీవితరహస్యముల నిసుమంతయేని గ్రహింపజాలని గవేషణాశీలునకు మనోసంకటమును, ఆగ్రహమును; ఏతద్రహస్యాంతర్గత విశాలానుష్ఠానుభవకోటిని యూహింపజాలని తీవ్రముముక్షువునకు నాశాభంగమును, నైరాశ్యమును, తీవ్రసంవేగులగు మహర్షికోటి గలుగజేయుచున్నను, వారియొక్క యసమాన, ఆదర్శనీయ నిస్పృహయును, పరమవైరాగ్యమును సాధకహృదయమునకు మార్గదర్శకము కాక మానదు.

అట్లే ముముక్షులోకమునకు సాధనానుష్ఠాన, అనుభవ విభూతుల వివరించు నీయోగశాస్త్రమునకు కర్తయనియు (father of the theory of evolution, spiritual and physical) 20 భౌతికాధ్యాత్మిక పరిణామమునకు జనకుడని అతుల ప్రతీతుడైన శ్రీపతంజలిమహర్షియు బూర్వపద్ధతి ననుసరించి యుండుట నతని జీవితమంతయు నజ్ఞాతము. అయినను 'శ్లో॥ య స్త్యక్త్వా రూపమాద్యం ప్రభవతి జగతోఽనేకధాఽనుగ్రహాయ। ప్రక్షీణక్లేశ రాశిర్విషమ విషధరోఽనేకవక్త్రః సుభోగీ। సర్వజ్ఞాన ప్రసూతిర్భుజగపరికరః ప్రీయ తే యస్య నిత్యం। దేవోఽహీశః స వోఽవ్యాత్సితవిమలతనుర్యోగదో యోగయుక్తః॥' (యో.భా.1.1) యోగయుక్తుడై యోగప్రదాతయై,

20. Swami Vivekananda: The Complete Works Vol 6 p 79

ఆద్యరూపమును. శుద్ధశుక్లవర్ణుఁడుగు భుజంగశరీరయున నిత్య సుఖియై, సర్వజ్ఞాన నిధియై, సర్వక్లేశ విధ్వంసకుఁడై, విషము విష ధరుఁడై, తన పూర్వరూపమును వర్జించియనేకవిధముల జగతి నెమ్మ హానుభావు డనుగ్రహించి యుండెనో ఆయాది శేషుడు మిమ్ము రక్షించుగాత యని వ్యాసభగవానుడు యోగభాష్య ప్రారంభ మున పతంజలిమహర్షి చంద్రుని నుతించియుండెను. కాన యోగ సూత్రరచయిత యగు పతంజలి కేవలము మానవుఁడుగాక, ఆదిశేషుని యవతారమని సువిదితము. ఈయవతార మెట్లేర్పడి నదియు నొకించుక జూతముగాక.



## పతంజలి చరిత్ర

పూర్వము ఉమాసహితుఁడైన పరమేశ్వరుడు తాండవ నృత్యము సల్పుచుండ పణిమునిసుతుఁడైన పాణిన్యాదిమహర్షి గణ ముదర్శించి ఆనందపరవశులైరి. ఆనృత్యకాలమున మ్రోగింపబడిన మృడ చండా ఢమరు ప్రణాదులనుండి బయల్వెడలిన అఇఉణాది హల్పర్యంత చతుర్దశ శబ్దముల నాకించినవారిలో పాణిని 'ఈశ్వ రానుగ్రహాత్ నిబధ్నన్ సూత్రాణి స వ్యాకృత శబ్దజాలం' (పతంజలి చరిత 1.51) ఈశ్వరానుగ్రహమున నాశబ్దజాలముల సూత్రములుగా రచించి వ్యాకరణశాస్త్రమును నిర్మించెనని రామ భద్రదీక్షిత వచనము. అంత కాత్యాయనుడు మహేశ్వరుని దపస్సుచే సంతోషపరచి కర్కశమైన పాణినిసూత్రములకు పదా ర్థబోధప్రవర్తకమైనవార్తికా గ్రంథమును పచరించెను. అందులకు

ణిని కాత్యాయనుగూర్చి కుపితుడై శపింప గాత్యాయనుం డును పునః పాణినిమునిని శపింప నిరువురు పరస్పర శాపగ్రస్తులై నశించిరి. అందులకు జింతించి మహేశ్వరుడు యీగాథను ఫణీంద్రునకు బోధించి వ్యాకరణశాస్త్ర తరణార్థము లోకమున నవతరింప నాజ్ఞ యొసంగెను. అంత భూతలమున నుచిత జనని కొరకై యన్వేషించుచు (Gonarda a tract of country in Cashmere)[21] కాశ్మీరమునగల గోనర్ద దేశమున 'శ్లో॥ తత్ర కాపి దదృశే మునికన్యా గోణికేతి గుణసింధుర నేన। యా హి యాపయతి పుత్రనిమిత్తం దారుణేన తపసా దివసాని॥'(ప.చ.2.7) పుత్రార్థియై దారుణ తపశ్చర్యనున్న గోణిక నాబడు మునికన్యను తృప్తిపరుప నట కరుదెంచెను. 'జన్మ తాపసకులే పరిశుద్ధే శీలం ఈశగృహిణీస్పృహణీయం। తాం చ వీక్ష్య తపసా గ్లపితాంగీం మాతరం' (ప. చ. 2, 8) పరిశుద్ధ తాపసకుల సంజాతయు శీలవతియు పరమేశ్వరసతియను స్పృహగలదియు తపస్సుచే కృశించిన శరీరముగలదియు నగు నామాతృదేవి నతడు వీక్షిం చెను. అప్పుడామె నిమీలితలోచనయై భగవంతుడగు భాస్క రుగూర్చి యర్ఘ్యప్రదానమొనరింప ముకుళితాంజలియై చేత జలము ధరించి 'ప్రాజ్ఞమర్పయ సుతం మమ' (ప.చ.2.10) తనకు ప్రాజ్ఞుడైన సుతు ప్రసాదింప బ్రార్థించుచుండ, నర్క నియుక్తుడై పన్నగాధిపతియగు నాదిశేషుడు ఆమెయొక్క అం జలిపుటగర్భమును సూక్ష్మరూపమున ప్రవేశించి, యామె అర్ఘ్యజలము ను భాస్కరముఖయై విడుచునప్పు డందుండి

---

21. Pandit. N. Bhashyacharya: The Age of Patanjali p 2

'తాపసాకృతిరహిః స పపాత|' (ప.చ.2.11) తాపసాకారమున నాపన్నగరాజు పడెను. అతడు ప్రస్ఫుట ప్రకాశస్వరూపుడై జటాభర మృగాజినాది ధరుడై యొప్పారుచుండెను. అట్టి పావనుడైన మూర్తిని సమ్ముఖమున దిలకించి యామునికన్యయు, సర్పమును గ్రహించినదై, 'పుత్ర ఏష మమ పుణ్యవిపాకాత్ప్రాదురాస కిల పావకతేజాః' (ప.చ.2.17) అగ్ని తేజుడగు సతని తనపుణ్యపరిపాకమున లభించిన పుత్రునిగా గ్రహించి, 'యత్పతన్న భవదంజలితో௨సౌ తత్పతంజలిరితి ప్రథమానం' (ప.చ.2.19) అంజలి నుండి పడియుండుటచే బతంజలి యని నామకరణ మొసంగెను. 'పాణ్యంజలేః పతిత ఇతి పతంజలిః' పాణ్యంజలినుండి పడుటచే బతంజలియనియు వ్యుత్పత్త్యర్థము. 'గోనర్దదేశే కస్యాచిద్ఋషేరంజలేః సంధ్యాకరణసమయే పతిత ఇత్యైతిహ్యాత్' (1.1.64) గోనర్దదేశమున నొకానొక ఋషియొక్క అంజలినుండి సంధ్యాకాలమున బడెనని సాంప్రదాయిక వాక్యమనియు పాణినీ వ్యాఖ్యాతయగు నాగోజీభట్టు వచనము.

అంత నాపతంజలిఋషివరేణ్యు డుగ్రతపశ్చర్యకై 'దక్షిణోదధితటేऽథ నివేశ్య' (ప.చ.2.21) దక్షిణసముద్రతీరమును జేరి ఈశ్వరానుగ్రహప్రాప్తికై దారుణ తప మాచరించెను. 'తస్యాతి దుష్కరమవేక్ష్య తపః ప్రసన్నో దాతుం వరం' (ప.చ.2.63) అతని దుష్కరతపము నవలోకించి ప్రసన్నుడై వర మొసంగ పరమేశ్వరు డరుదెంచి చిదంబరమునకు వచ్చి తన తాండవనృత్యమును దర్శింప నాజ్ఞ నిడెను, ఫణిపతియైన పతంజలి ఆనృత్యమును విలకించిన పిమ్మట 'త్వం కృత్వా భువి దశాస్త్రవార్తికానాం భాష్యం' (ప చ.4.75) గిరీశునిచే, పద

శాస్త్రమైన సూత్రగ్రంథమునకును వార్తికకును భాష్యమును రచింప నియుక్తుడై వ్యాఘ్రపాదుడైన గోణికేయుడు. సంభ్రమాశ్చర్యస్థితుడై 'జగదుపకృతయే చకార భాష్యం మహాదచిరేణ పతంజలిర్మహాత్మా' (ప. చ.5.3) మునికల్పితమైన పద శాస్త్ర వార్తికాదులకు జగదుపకృతికొరకై మహాత్ముడైన పతంజలి భాష్యమును నిర్మించెను. అది 'దురవగమపదార్థబోధహేతో రమృతరుచేరివ చంద్రికావిశుద్ధా' (ప. చ.5.10) దురవగమమగు పదముల కర్థబోధ మొసంగుచు, అమృతరుచియై చంద్రికాదృశ విశుద్ధమై యొప్పారినదని ప్రఖ్యాతిగాంచెను. దానిని 'నఖలిఖితపతంజలిప్రబంధం వటదళజాలకముత్తరీయబద్ధం' (ప.చ. 5.36) అనుటచే నఖములచే రచింపబడి వటపత్రముల బంధింపబడినట్లు విదితము. (No nation has yet produced a grammar like that of Panini) 22 పాణినీయ వ్యాకరణమును బోలుదాని నింతవర కేదేశమును నిర్మింపలేదని వివేకానందుడు పలికినట్లు, అట్టి సుప్రసిద్ధవ్యాకరణమునకు నీశ్వరానుగ్రహ పరతంత్రుడగు వరరుచి నామాంతరుడగు కాత్యాయనుడు వార్తిక వ్రాయుటయు, దానిపై పరమేశ్వర వరప్రసాదలబ్ధ జ్ఞానభూషితుడగు పతంజలి ఋషివరేణ్యుడు భాష్యరచనముగావించుటయు నెంతయు శోభనము, కావుననే నేటిదనుక మహాభాష్యమునాబడు పతంజలికృత పాణినీసూత్రభాష్యము నధ్యయనముగావించువారు 'శ్లో॥ వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిం।
పాణినిం సూత్రకారం చ ప్రణతోస్మి మునిత్రయం॥' (సిద్ధాంత

---

22. Swami Vivekananda: The Complete Works Vol 6 p 71

కౌముది. ధాతుపాఠ) అని మునిత్రియనమస్కారము జేసి కాని ప్రారంభించుట లేదు.

అంత మునికులావతంసుడగు పతంజలి సంయమీంద్రుడు మహామహిమశాలి యగుటచే లోకోపకృతి గోరినవాడై 'శ్లో॥యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన। యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి॥' యోగరూపమున జిత్తమునకును, పదద్వారమున వాక్కునకును, వైద్యమూలమున దేహమునకును నెవడుపకరించెనో ఆమునిశ్రేష్ఠుడగు పతంజలిమహర్షికి నమస్కరించుచున్నానని విద్వజ్జనులచే సంప్రదాయకముగ స్వీకరింపబడిన శ్లోకరాజముచే వ్యక్తమయినట్లు, యోగసూత్ర, వ్యాకరణ మహాభాష్య వైద్యశాస్త్ర వార్తికాదులను పతంజలిమహర్షి విరచించినట్లు తెలియనయ్యెడిని. దీనినివివరించుచు 'శ్లో॥సూత్రాణి యోగశాస్త్రే వైద్యకశాస్త్రే చ వార్తికాని తతః। కృత్వా పతంజలిమునిః ప్రచారయామాస జగదిదం త్రాతుం॥' (ప.చ.5.25) యోగశాస్త్రమునందు సూత్రములను, వైద్యశాస్త్రమున వార్తికను రచించి జగత్తును రక్షించుటకు పతంజలి ప్రకటించెననియు 'శ్లో॥పాతంజల మహాభాష్య చరకప్రతిసంస్కృతైః। మనోవాక్కాయ దోషాణాం హంత్రేఽహి పతయే నమః॥' యోగసూత్ర, మహాభాష్య, చరకవార్తికాదుల నిర్మించి, మనోవాక్కాయదోషముల నశింపజేసిన మునివరునకు నమస్సులను చక్రపాణిశ్లోకరాజము (చరకటీక) గూడ జనోద్ధరణోపయుక్తమును, మనోవాక్కాయ సముద్ధరణమును అగు సూత్ర, భాష్య వార్తికలను పతంజలిమహర్షి ప్రసాదించి అజ్ఞజనుల నుద్ధరించె

నని వక్కాణించుచున్నది. అందుచేతనే వాక్యపదికర్తయగు భర్తృహరియు 'శ్లో॥ కాయవాగ్బుద్ధివిషయా యే మలాః సమవస్థితాః। చికిత్సాలక్షణాధ్యాత్మ శాస్త్రైస్తేషాం విశుద్ధయః॥' కాయ వాగ్బుద్ధి విషయములగల దోషములకు చికిత్సాలక్షణముల బోధించిన పతంజలిమహర్షి వరేణ్యుని నుతించియుండెను. కాన పతంజలిమునిచంద్రు డితరమహర్షులవలె నొక యాధ్యాత్మిక, తాత్త్విక విషయానుభూతి గడించి బోధించుటమాత్రముగాక, మానవునకుగల మనోవాక్కాయముల మూడింటి ప్రాధాన్యత గ్రహించి వాని అన్యోన్యాపేక్షకత్వమును గుర్తెరింగి, వానిలో నెద్ది కలుషితమైనను, ఆధ్యాత్మికాభ్యుదయ సంసిద్ధి కాటంకమను రహస్యము నెరింగి త్రికరణశుద్ధియు, త్రికరణాభివృద్ధియు గ్రంథ రూపమున ప్రబోధించి ఆర్యావర్తమునకేగాక సర్వమానవలోకమునకు నాదర్శమూర్తి యయ్యెననుట కెట్టి సందేహమును లేదు. ఆతత్త్వత్రయము నేకస్థమొనర్చినగాని సర్వతోముఖాభివృద్ధి యేగాక ముఖ్యముగ నాధ్యాత్మికశ్రేయస్సును లేదను పరమ రహస్యమును వ్యక్తపరచి సుప్రశస్తి నార్జించిన యీ ఋషివరేణ్యు డెల్లప్రపంచమునకు మననీయుడు, వంద్యుడు, పూజ్యుడు.

పైవిధాన భూతలముననే అమరత్వము గడించి, 'శ్లో॥ గోనర్దాఖ్యం దేశం ప్రాప్య నమస్కృత్య గోణికాం జననీం। తస్యాం త్రిదివగతాయాం తస్థౌ శేషః స్వయం స మునిః॥' (ప.చ.5.26) మరల గోనర్దమునకేగి మాతృదేవి గోణికకు ప్రణమిల్లి స్వర్గమునగల శేషస్వరూపమున ఆమునిచంద్రుడగు పతంజలి యుండిపోయెను. అనగా త్రివిధరూపమున జగతి నుద్ధరించిన పతంజలి తన భౌతికదేహ పరిత్యాగమొనర్చి తన నిజస్వరూపమగు ఆదిశేషు నాకృతిని గైకొనెనని తాత్పర్యము.

పతంజలినామము సిద్ధాంతకౌముది గుణపాఠమున(2,24) పదంజల అను పదమునకు ప్రక్కనే లిఖితమైయున్నది. మరల బృహదారణ్యకమున (3. 3. 1) కపిగోత్రజుడైన పతంజలి ప్రస్తావన గలదని భాష్యాచార్యులు వ్రాసిరి కాని ఆపదము పతంచల యని యుండుటచే ఆనామమును పతంజలి కన్వయింప యత్నించుట అసమంజసము కాని పతంజలచరితమున వ్యాఘ్రపాదశబ్దము పతంజలి కన్వయించును ననేకపర్యాయములు(4.36,58,72,76) గోచరించుచుండుటచే నితనికి వ్యాఘ్రపాదుడనియు నామాంతరము గలిగియుండును. పూర్వోక్తవిధమున (Patanjali, the author of the Mahabhashya, was born at Gonarda, a tract of country in Cashmere, and his mother's name was Gonika, and he refers to himself as Gonikaputra. (1.4. 51 Mahabhashya) and Gonardiya (1.1.21 Mahabhashya), which the commentator Kaiyata explains as refering to Patanjali) 23 మహాభాష్యకర్తయగు పతంజలి కాశ్మీరమున గల గోనర్ద దేశమున జనించెను. అతని తల్లి పేరు గోణిక. కాన నతడు గోణికాపుత్రుడనియు గోనర్దీయుడనియు తననుగూర్చి ప్రస్తావించుకొనెను. ఈ రెండుపదములు పతంజలిముని కన్వయమని మహాభాష్యవ్యాఖ్యాతయగు కైయటుడు రచించెను. అందుచే నతడు గోణికాపుత్రుడనియు గోనర్దీయుడనియు గూడ ప్రతీతియున్నట్లు విదితము. కాని (That 'Gonardiya' and 'Gonikaputra' donot apply to Patanjali but to some other grammarians) 24 గోనర్దీయ గోణికాపుత్ర నామములు

23. Pandit N. Bhashyacharya: The Age of patanjali, p 2
24. Dr. Kielhorn: Indian Antiquity Vol 14-82-83.

పతంజలి కన్వయించక పూర్వకాలిక వ్యాకరణవేత్తల సూచించునను (Dr. Kielhorn) డాక్టరు కీల్హార్న్ వచనములకు సమ్మతింపక గెయటవ్యాఖ్యయే కీల్హార్న్ వ్రాతకు సమాధానమనియు నారెండుపదములును పతంజలికే యన్వయమనియు భాష్యాచార్యుని తుది తీర్మానము,

---

## పతంజలి ద్వయము

ఈవిధముగా గోనర్దీయ గోణికాపుత్రాది నామములే గాక పతంజలి వ్యక్తిత్వమునగూడ యనేక భిన్నాభిప్రాయములు సంస్కృతలోకమున గానుపించుచున్నవి. వాని నిసుమంత పరిశీలింతము. (Kielhorn) కీల్హార్న్ యొక్క అభిప్రాయమురీతి మహాభాష్యకర్తయగు పతంజలి వేరనియు, గోణికాపుత్రాదులు వ్యాకరణశాస్త్రజ్ఞులనుటతో బతంజలి వృత్తాంతమున నన్యత్వమేర్పడుచున్నది. అంతియగాక, మహాభాష్యరచయిత పతంజలి యొకడనియు యోగసూత్రకారుడగు పతంజలి మరియొక డనియు కొందరి పండితుల భావము. ఆవిషయమునుగూర్చి (Patanjali the grammarian is assigned to the middle of the 2nd century B. C., though his identity with the author of the Yoga-Sutra is not proved) 25 వ్యాకరణశాస్త్రజ్ఞుడగు పతంజలియే యోగసూత్రకర్తయని నిర్ణయము కాకపోయినను నతడు క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునకు జెందినవాడని

---

25. Prof. S. Radhakrishnan; Indian Philosophy Vol 2 p 338

రాధాకృష్ణపండితుడు రచించుటచేత నిరువురు పతంజలులున్నట్లు సూచితమగుచున్నది. (The Yoga Sutra, the foundation of the Yoga Philosophy, is ascribed to Patanjali, who, however, is probably not identical with the grammarian, the author of the Mahabhashya) 26 వ్యాకరణనేత్రయై మహాభాష్యకర్తగా నేకీభవింపబడని పతంజలి యోగవాద మూలమగు యోగసూత్రముల రచించెననియు (There seems, moreover, to be no sufficient ground to doubt the correctness of the native tradition identifying the founder of the yoga system with the grammarian, Patanjali) 27 యోగసిద్ధాంతకర్తయు వ్యాకరణనేత్రయునగు పతంజలియు నొక్కడేయను జాతీయ సంప్రదాయ యథార్థ్యతను సందేహింప నెక్కువ యాధారము లేదనియు (Macdonell) మాగ్డొనెల్ వ్రాయుచు పతంజలిద్వయ సిద్ధాంతమును సంశయించినట్లు విదితము (Both Lassen and Garbe seem, inclined to accept the identity of the two Patanjalis) 28 పతంజలి ద్వయముయొక్క ఏకత్వమునకు లాస్సేన్ గార్బేలు సమ్మతించినట్లు పలుకుచు (Nor has it even been possitively proved that Patanjali, the reputed author of the Yoga Sutras, was the same person as Patanjali the author of the Mahabhashya and the Katyayana Vartika, Some scholars have rushed at this conclusion chiefly in order to fix the date of the Yoga Sutras, but this also would force us to ascribe the most hetergeneous works

26. Dr. A. A. Macdonell: India.s Past.
27. Dr. A. A, Macdonell: A. History of ... Literature p 119

to one and the same author) 28 యోగసూత్రములకు ప్రఖ్యాతకర్తయగు పతంజలియు కాత్యాయన వార్తిక మహాభాష్య రచయితయగు పతంజలియు నొక్కరేయని నిస్సందేహముగా నిర్ణయము కాలేదు. యోగసూత్రకాల నిర్ణయమునకై గొందరు పండితు లావిధముగ దీర్ఘాలోచింప దొందరపడిరి, కాని పరస్పరవిరుద్ధమగు రెండు రచనలకు నొక్కే యొకని కర్త గావించుట యగుచున్నదని (Max Muller) మాక్సు ముల్లరు వ్రాయుచు, పతంజలి ద్వయత్వ ప్రతిపాదననే సమర్థించెను. ఇంతకంటె నవిస్పష్ట వచనముల (The Yoga Sutra is ascribed to Patanjali, and the similarity of name has led to the foolish identification of the philosopher with the author of the Mahabhashya) 29 పతంజలికి యోగసూత్రము సంబంధింపబడినది. మరియు నామ సాదృశ్యముచే తత్త్వవేత్తకు మహాభాష్యకర్తకును యుక్తిబాహ్యమగు అభేదమునకు కారణమయ్యెనని (Keith) కీత్తు వ్రాసెను. కాని సద్విమర్శా దృష్టి బరిశీలించినచో (So far as the Hindu Pandits are concerned, they would not for a moment believe that there were two different persons known by the name of Patanjali, one of whom wrote the Mahabhashya and the other the Yoga Sutras) 30 యోగసూత్రకారుడు ఒక్కడును మహాభాష్యకర్త యొకడుగా నిరువురు పతంజలులు గలరను విషయమునే హైందవ పండితలోకము విశ్వసింపరనియు

28. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 119
29. Prof. A. B. Keith: A History of Sanskrit Literature p 490
30. Pandit N. Bhashyacharya: The Age of Patanjali p 28

(for if the tradition handed down from generation to generation in the line of teachers and which is current among the Pandits, is to be believed, no one will hesitate to declare that the authors of those two works are identical) 30 ఎందుచేత నన దరతరములనుండి పండితవర్గమున వ్యవహారమున నున్న గురుపరంపరను విశ్వసింపవలెను. ఆ రెండు కృతుల కర్తయొక్కడే యని వచింప నెవరును వెనుకంజ వేయరను భాష్యాచార్యుని పలుకులెంతయు సమంజసములు. కాన ఒకేపతంజలి పూర్వోక్త ప్రార్థనశ్లోకము ననుసరించి గ్రంథత్రయ కర్తృత్వమును వహించి చిరస్మరణీయుడైన మహాత్ముడని తీర్మానించుటయే సముచితము.



## పతంజలి కాలము

పతంజలి యొక్కడా యిరువురా యని తీర్మానింప సంశయించుచున్న పండితులు పతంజలి కాలనిర్ణయ విషయమున గూడ నెంత యూహాగానమొనరించిరో తిలకించుట యవసరమగుటచే నావిషయ మొకించుక విచారించెదముగాక. పతంజలి ద్వయ వాదమును విశ్వసించు (Harold Smith) హెరాల్డు స్మిత్తు మహాభాష్యకారుడగు పతంజలి (Jocobe) జకోబి అభిప్రాయము ననుసరించి యోగకర్త కాదనియు, నితడు క్రీస్తుతర్వాత అయిదవ శతాబ్దమువాడనియు దెలిపెను. 31 అట్లే (Keith) కీత్తుకూడ

31. F. Harold Smith: Outline of Hinduism p 53

(The Yoga Sutra is not an early work, it seems to recognise the Vijnana Vada school of Buddhism, which in all probability, belongs to the fourth century A. D., and the popular identification of Patanjali with the author of the Mahabhashya is clearly untenable) 32 యోగసూత్రము ప్రాచీనకృతముకాదు. క్రీస్తుకు తర్వాత గల దనబడు బౌద్ధ విజ్ఞానవాదము నది సూచించి యున్నది. మరియు దీనికర్తను మహాభాష్యరచయితతో నభేదము దెలుపు సంప్రదాయికవాదము సుస్పష్టముగ నసంబద్ధము అని వచించి యున్నాడు. అందుచే (The Yoga Sutra, he (Jacobe) assigned to the period after the Vijnana Vada school) 33 యోగసూత్రమును జకోబి విజ్ఞానవాదమునకు దర్వాతిదిగా నిర్ణయించెనని వ్రాసెను. కాని (Macdonell) మాక్డొనెల్ యింక కొంచెము జాగ్రత్త వహించి, మహాభాష్యకర్తయే యోగసూత్రకారుడని విశ్వసించి (The Yoga Sutras, therefore, probably date from the 2nd century B. C.) 34 కాన యోగసూత్రములు క్రీ. పూ. 2 వ శతాబ్దమునకు జెందిన వని అభిప్రాయమును వెలిబుచ్చెను. వ్యాకరణవేత్తయగు పతంజలి క్రీ. పూ. 2 వ శతాబ్దమువాడనియు, యోగసూత్రకర్తకూడ యతడని నిరూపింపబడలేదనియు వ్రాయుచు, పాతంజల యోగసూత్రములు క్రీ. త. 4 వ శతాబ్దమునకు జెందినట్లు కొందరు భావించియున్నను, వానిని క్రీ. పూ. రెండవశతాబ్దము

32. A. B. Keith: Karma Mimamsa, p 5
33. Prof. A. B. Keith: A History of Sanskrit Literature p 472
34. Prof. A. A, Macdonell: A. History of Sanskrit Literature p 385

నను నిర్ణయించి రని రాధాకృష్ణపండితుడు 35 వచించెను. కాని (Jacobe) జకోబి (thinks that the Yoga system was in existence as early as 300 B. C., Patanjali cannot be later than A. D. 30C) 35 యోగవాదము క్రీ. పూ. 300 సంవత్సరములకే గలదని జకోబి అభిప్రాయము. పతంజలి క్రీ. త. 300 కు తర్వాత మాత్రము ఉండజాలడని తెలిపెను. (Bohtlingk) బోట్లింగ్ పండితుడు క్రీ. పూ. 250 వత్సరముల నియు 36 క్రీ. పూ. 200 సంవత్సరములని (Max Muller) మాక్సు ముల్లరు 37 క్రీ. పూ. 140 సంవత్సరములనుండి క్రీ. త. 60 సంవత్సరముల మధ్యయని (Weber) వెబ్బరు 38 క్రీ. పూ. 140 నుండి 120 సంవత్సరములలో యోగసూత్ర రచనమని (Gold stucker) గోల్డు స్టక్కరు 39 మొదలగు విమర్శకుల అభిప్రాయములు. యోగభాష్య వాచస్పత్యముల నాంగ్లమున కనువదించిన రామప్రసాదుడు (The age of Patanjali is now generally fixed at three centuries before Christ) 40 క్రీ.పూ. మూడవశతాబ్దము పతంజలికాలముగా ప్రస్తుతము సర్వసమ్మత నిర్ణయముగా వాక్రుచ్చెను.

కాని పైయభిప్రాయములకు భిన్నముగా హిందూ బౌద్ధ ప్రమాణముల స్వీకరించి (There is abundent evidence, both in Hindu and Buddhist's works, of unquestionable

35. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338
36. Pandit N. Bhashyacharya: The Age of Patanjali p 3
37. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 24
38. Prof, Weber: Indian Literature
39. Prof. Thegdore Goldstucker: Panini p 234
40. Rama Prasad; Patanjali Yoga Sutras

antiquity and authenticity of the Sankhya and the Yoga systems having been current before the time of Buddha) 41 బుద్ధుని కాలమునకు బూర్వమే సాంఖ్య యోగ సిద్ధాంతములు వాడుకలో నున్నట్లును, అవి నిస్సందేహముగ ప్రామాణికములును పురాతనములనియు హైందవ బౌద్ధ గ్రంథములలో బహుళ నిదర్శనములు గలవని రాజేంద్రలాల్ మిత్ర భావమును వ్యక్తపరచెను. అందుచేత (At any rate they have decided from the internal evidence furnished by the Mahabhashya itself, Patanjali flourished after Buddha's Nirvana, which is fixed by them at 543 B. C.) 42 ఒకవిధముగా మహాభాష్యాంతర్గత ప్రమాణముల ననుసరించి, వారిచే నిర్ణీతమైనట్లు క్రీ. పూ. 543 వత్సరమగు బుద్ధ నిర్వాణానంతరము పతంజలి యుండెనని కొందరు పండితులు భావించినట్లును గలదు. కాని బుద్ధ నిర్వాణవిషయమున గూడ భిన్న భావములు గలవు. పాశ్చాత్యుల గణనము ననుసరించి నిర్వాణ కాలము క్రీ. పూ. 543 సంవత్సరమైనను, (Chinese believe that Nirvana of Sakyamuni took place in 949 or 973 B. C. instead of in 543 B. C.) 43 క్రీ. పూ. 543 సంవత్సరముగాక క్రీ. పూ. 949 కాని 973 సంవత్సరముకాని బుద్ధుని నిర్వాణకాలముగా చైనాదేశీయులు విశ్వసించుచున్నారు. అందుచే బతంజలి కాలముగూడ తదనుగుణ్యముగ వెనుకకు జరుగవలసియుండునని భాష్యాచార్యుని దృఢాభిప్రాయము. కాన

41. Rajendralal Mitra: Yoga Sutra
42. Pandit N. Bhashyacharya: The Age of Patanjali p 3
43. Do - Do p 32

(From valuable and undesputed evidence furnished by Indian Literature, we arrive at the conclusion that he also wrote the Yoga Sutras and that he lived about the 10th century B, C.) 44 భారతవాఙ్మయ మొసంగు అమూల్య నిర్వివాద ప్రమాణముల ననుసరించి యాతడే యోగసూత్ర రచనము గావించెననియు, నతడు క్రీ. పూ. పదియవ శతాబ్ద మునకు జెందినవాడనియు తన తీర్మానముగా భాష్యాచార్యులు భావించిరి. శ్రీవివేకానందులు మరికొంచెము వెనుకకు జరిగి (About 1400 years before Christ, there flourished in India a great philosopher, Patanjali by name. He collected all the facts, evidences and researches in psychology and took advantage of all the experiences accumalated in the past) 45 క్రీస్తుకుపూర్వము 1400 సంవత్సరముల ప్రాంతమున హిందూ దేశమున పతంజలియను గొప్పతత్వవేత్త యుండెను. ప్రాచీనకాలమున జేరియున్న యనుభవముల సహాయమును గొని అధ్యాత్మశాస్త్రమున సర్వప్రమాణములను నతడు సేకరించెనని యుపన్యసించియున్నాడు.

మరొకవిధానమునగూడ పతంజలి కాలనిర్ణయమును గావింప బండితులు యత్నించిరి. సోమదేవ విరచిత కథాసరిత్సాగరము ననుసరించి (Katyayana studied along with Panini and with Vyadi, the grammar of Indra under Upavarshopadhyaya in Pataliputra) 46 పాటలీపుత్రనివాసి

44. Pandit N. Bhashyacharya: The Age of Patanjali
45. Swami Vivekananda: The Complete Works Vol 2 p 27
46. Pandit N, Bhashyacharya: The Age of Patanjali

యగు ఉపవర్షోపాధ్యాయునిదగ్గర పాణిని వ్యాడులతో సహా కాత్యాయనుడు ఇంద్రవ్యాకరణము నభ్యసించినట్లు తెలియుచున్నది. ఉపవర్ష కాలనిర్ణయముతో పాణిని కాల నిర్ణయమగుటచే దాని తర్వాతనే పతంజలి కాలమని నిర్ణయింప కొంత యవకాశమేర్పడును. కాని ఉపవర్ష కాలనిర్ణయమునగూడ భిన్న భావములు గలవు. (Macdonall) మాగ్డొనెల్ ఉపవర్షుని క్రీ. త. అయిదవశతాబ్దమునకు నిర్ణయించునంతటి 47 యవకాశము లుండ నిక నీతని కాలనిర్ణయసమస్య ఎంత కష్టసాధ్యమోగదా. అంతియగాక పూర్వోత్తరమీమాంసా వ్యాఖ్యాతయగు ఉపవర్షుడును, పాణిని యుపదేష్టయగు ఉపవర్షు డొకడేనా యని (Max Muller) మాక్సుముల్లరు సంశయించెను. 48 కాన నదియు కష్టభూయిష్టమే యగుచున్నది.

మరల పతంజలి కాలనిర్ణయమున మరియొక్క సమస్య ఉద్భవించియున్నది. కొందరు పతంజలియొక్క శిష్యుల ననుసరించి కాలమును తీర్మానింప యత్నించిరి. అందు కొందరివాదమును గ్రహింతము. పతంజలి మునీంద్రుడు చిదంబరక్షేత్రమున నున్నకాలమున శ్రీశంకరభగవత్పాదుల వారి పరమగురువులగు గౌడపాదాచార్యులవారు పతంజలి సన్నిధానమున వ్యాకరణభాష్యమును అభ్యసించిరట. 49 పతంజలి యాదిశేషుడగుటచే దన వేయిముఖములద్వారా వేయిశిష్యుల కుపదేశించుచుండెను. కాని తన నిజస్వరూపము శిష్యుల కగుపడకుండు

47. Prof. A. A. Macdonell; India's Past
48. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 116
49 శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య; జగద్గురు శ్రీశంకరభగవత్పాదాచార్య చరిత్రము. అనుబంధము 3.

నట్లు తెరచాటునుండి బోధించుచుండెను. కాని భాష్యము పూర్తియగుకాలమునకు శిష్యుల కాతని నిజస్వరూప దర్శనాపేక్ష గలిగి తెరలోపలకు దొంగిజూడ ఆదిశేషుని వేయిముఖముల బయల్వెడలు అగ్నిజ్వాలల నందరు భస్మీభూతులైరి. అదృష్టవశమున నప్పుడు గౌడపాదుడు లేకుండుటచే నతడు రక్షితుడయ్యెను, అయినను పారమర్థ్యమున గుర్వాజ్ఞలేక గౌడపాదుడు వెడలియుండుటచే గురుకోపమునకు గురియై బ్రహ్మరక్షస్సుగ గాగ శపింపబడెను. కాని సత్పాత్రుడగు శిష్యునకు వ్యాకరణోపదేశము గావించినవెనుక శాపవిముక్తి గలుగుననియు గురు వనుగ్రహించెను. అంత గౌడపాదులు ఉత్తరదేశ పర్యటనము గావించుచు నుజ్జయినీనగరమున చంద్రశర్మయనునాతనికి వ్యాకరణభాష్యము నుపదేశించెను. ఆచంద్రశర్మయే కాలాంతరమున గోవిందభగవత్పాదులై శంకరులవారి గురువులైరి. మరల శ్రీశంకరులు తమ పదునాల్గవయేట బదరికాశ్రమమున శ్రీగౌడపాద దర్శనము గావించిరి. అప్పుడు గౌడపాదునికి 120 వత్సరముల వయస్సట. 50 కాబట్టి గౌడపాదులు క్రీ. పూ. 7వ శతాబ్దమునకు జెందినవారని కృష్ణస్వామయ్య తీర్మానము. 51 గౌడపాదులు పతంజలికి శిష్యులైనచో నాపాత్రింతమునకే పతంజలికాలమును నిర్ణయింపనగుచున్నది. కాని అనిర్ధారితములగు శంకర గౌడపాదుల కాలముల ననుసరించి పతంజలికాలమును నిర్ణయించుట కడుంగడు కష్టసాధ్యము.

---

50. చిత్సుఖాచార్యులు: బృహచ్ఛంకర విజయము.

51. శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీశంకర భగవత్పాదాచార్య చరిత్రము అనుబంధము 3.

శ్రీశంకరభగవత్పాదుల గురువైన గోవిందయతీంద్రుడే పతంజలియనియు గొందరివాదము. శ్రీశంకరులు ఉత్తర దేశపర్యటనము గావించుచు నర్మదాతీరమున గోవిందుని దర్శించి 'నీవు తొలి యాదిశేషుడవై, తర్వాత పతంజలివై యవతరించితివి. ఇప్పుడు గోవిందయోగివై యుంటివని స్తుతించిరట. 52 కాన గోవిందుడే పతంజలియని కొందరు భావించిరి. 52 కాని మహాభాష్యగత ప్రమాణములుగాని శంకర రచనలుగాని పైభావము నెట్లును సమర్థింపకుండుటచే పై భావము నిరాధారమని భాష్యాచార్యులు త్రోసిపుచ్చిరి.

అందుచే పై విమర్శననుసరించి (Patanjali was the author of the Mahabhashya - and also of the Yoga Sutras and that he lived without any doubt between the 9th and 10th centuries B. C., that is about the 10th century B. C,) 53 పతంజలియే మహాభాష్య యోగసూత్ర కర్తయనియు, నతడు క్రీస్తుకుపూర్వము 9, 10 శతాబ్దములకు అనగా సుమారు పదియవశతాబ్దమునకు జెందినవాడనియు తీర్మానము.

(The theory of Patanjali is the only theory, I think, a rational man can accept) 54 పతంజలిసిద్ధాంతమే వివేకవంతుని సంగ్రహీతమగునది యని వివేకానందుడన్నట్లు అది చాల సుప్రసిద్ధమై యొప్పారియున్నది. (The authors of the Sutras are not the founders or originators of the

52. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya p 19
53; Do The Age of Patanjali p 33
54. Swami Vivekananda: The Complete Works Vol 5 p 205

systems, but only their compilers and formulators) 55 సూత్రకర్తలు దర్శనస్థాపకులునుమాత్రమే యగుచున్నారని యనునట్లు సూత్రకర్తలకు బూర్వమే సిద్ధాంత ముండియుండును. అందుచేతనే (No system of thought issues forth in all its fulness from the head of any one man) 56 సిద్ధాంతము సమగ్రరీతి నొక్క మానవుని మేధస్సునుండి యుద్భవింపదు. కాన (One thing is certain, namely, that while he is the author of the Yoga Sutras, he follows the systems founded by Hiranyagarbha Varshaganya and Yajnavalkya) 57 ఒకవిషయము మాత్రము స్పష్టము. పతంజలి యోగసూత్ర కర్తయగుచు, హిరణ్యగర్భ వార్షగణ్య యాజ్ఞవల్క్యులచే స్థాపింపబడిన సిద్ధాంతముల ననుసరించెను. అందుచే సూత్ర కాల నిర్ణయముతో సిద్ధాంత కాలనిర్ణయము గావించుట దుర్లభము.

---

## వ్యాస భాష్యము

పైవిధానమున క్రీ. పూ. పదియవశతాబ్దమున పతంజలి మునిపుంగవునిచే నిర్మింపబడిన సూత్రగ్రంథము (The Sutra has been accused of being a mere patch-work of different treatises, and though this is exaggeration, it is a con-

55. Prof. S. Radhakrishnan; Indian Philosophy Vol 2 p 23
56; Do Do Vol 2 p 249
57. Pandit. N. Bhashyacharya: The Age of Patanjali p 27

fused text, which is only intelligible by the aid of the Yoga Bhashya, ascribed to Vyasa) 58 వివిధ రచనల కలియకయే యోగసూత్రముగ గొందరు వాకొనిరి. ఈభావము అతిశయోక్తి యయినను, అది యొక క్లిష్టమగు గ్రంథము. కాన వ్యాసుని కన్వయింపబడు యోగభాష్యసహాయము లేక నది అగ్రాహ్యము అని (Keith) కీత్తు అన్నటుల సూత్రాన్వయమునకు భాష్య మత్యవసరమగుచున్నది. ఆభాష్యము (Macdonell) మాక్డొనెల్ అభిప్రాయములో (The oldest and best commentary on this work) 59 యీగ్రంథముపై నతిప్రాచీనమును ఉత్తమమును అగు భాష్యముగా పేరొందియున్నది. రాధాకృష్ణుని ఉద్దేశ్యమునగూడ నిది (Gives the standard exposition of the Yoga principles) 60 యోగసిద్ధాంతముల ప్రామాణికమైన వివరణము నొసంగుచున్నది. ఇట్లు భాష్యకర్త వ్యాసదేవుడుగా తీర్మానింపబడియున్నను, అతని భాష్యము ప్రామాణికమని పైవారనుచుండ (Who (Vyasa) may or may not have accurately rendered the original sense, very probably moulding it in his own views) 61 వ్యాసుడు సూత్రముల ముఖ్యతాత్పర్యముల యథాతథముగా వివరించియు వివరింపకయు నుండవచ్చును. బహుశః అతని భావముల కనుగుణముగ దాని రూపాంతరమొనరించి యుండవచ్చుననియు (Keith) కీత్తు అనుమానించెను. కాని యితనితో నేకీభవించు

---

58. Prof. A. B. Keith: A History of Sanskrit Literature p 472
59. Prof. A. A, Macdonell: A History of Sanskrit Literature p 385
60. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338
60. A. B. Keith: A History of Sanskrit Literature p 490

పండితులు లేకుండుటచే వ్యాసభాష్యము ప్రామాణికమేయని స్వీకరింపదగి యున్నది.

పూర్వము సూత్రకర్త విషయములో పతంజలిద్వయము మున్నట్లు సంశయము లెట్లు పొడమియుండెనో యట్లే వ్యాస విషయమునగూడ ననేక భిన్నభావములు పండితశ్రేణిలో గలవు. (Vyasa, the reputed author of the Brahma Sutras wrote also a commentary to Patanjali's Yoga Sutra) 62 బ్రహ్మసూత్రములకు బ్రఖ్యాతకర్తయగు వ్యాసుడు, పతంజలి యోగసూత్రములకు గూడ భాష్యమును రచించెనని (Dr. Roer) రోయరు ఉద్దేశించెను. కాని (As the commentary on the Patanjali Yoga Sutra being the work of the same Vyasa, this seems to me altogether out of the question) 63 పాతంజలయోగసూత్రభాష్యముగూడ ఆవ్యాసుడేరచించెననుట నాభావమున నసంభవము. ఎందులకన (There are hundreds of people in India who have the name of Vyasa) 63 భారతదేశమున వ్యాసనామము గలవారు శతాధికముగ గలరని (Max Muller) మాక్సుమ్యుల్లరు వ్రాసెను. ఈవిషయమును సవిమర్శముగ జర్చించుచు బాదరాయణుడు తన వేదాంత సూత్రముల (2.2.3) యోగసిద్ధాంతమును ఖండించెననియు, నందుచే బాదరాయణునకు బూర్వమే పతంజలి యుండెననియు, కాని పాణిని 'పారాశర్య శిలాలిభ్యాం భిక్షునట సూత్రయోః' (4.3.110) 'పారాశర్యేణ ప్రోక్తం భిక్షుసూత్రమధీయతే

62. Dr. E. Roer: The Twelve Principal Upanishads p 258
63. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 117

పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః' (4.3.111) మొదలగు సూత్రముల భిక్షుసూత్రములనబడు బ్రహ్మసూత్రములను వాని కర్తయగు పారాశర్యుని సూచించియుండుటచే బాదరాయణుడు పాణినికి పూర్వుడనియు స్ఫురించుచున్నది. కావున పాణినికి పూర్వుడైన బ్రహ్మసూత్ర రచయితయగు వ్యాసు డొకడును, పాణినీయ సూత్ర మహాభాష్యకర్తయగు పతంజలి యోగసూత్ర భాష్య కర్తయగు వ్యాసుడొకడుగా నిరువురు వ్యాసులున్నట్లు భాష్యా చార్యుల తాత్పర్యముగా దెలిపెను. బ్రహ్మసూత్రకర్తయు యోగభాష్యకర్తయు నొకరే యయినచో, రాజమార్తాండ యనబడు యోగవ్యాఖ్యకర్తయగు భోజదేవు డీవిషయమును బ్రస్తావించియుండునని యితని వాదము. అట్లే బ్రహ్మసూత్ర భాష్యకర్తలగు శ్రీశంకర రామానుజులైనను ఆవిషయమును సూచించియుందురు. అట్టిది జరుగకుండుటచే (there can be no doubt that this Veda Vysa was quite a modern author and is no way connected with the author of the Brahma Sutras) 64 యోగభాష్యకర్త యగువ్యాసుడు అర్వా చీనుడనియు, నితనికి బ్రహ్మసూత్రకారునికి నెట్టి సంబంధము లేదనియు నితని తీర్మానము.

కాన యోగభాష్యకర్తయగు వ్యాసభట్టారకుని వ్యక్తి నిర్ణయమే యిల్లు కడు సంశయావిష్ట మగుచుండ నిక గాల నిర్ణ యము ఎట్లుండునో యోచింపుడు. (His date is probably before Magha (7th century) but nothing certain can be said) 65 క్రీ.శ. ఏడవశతాబ్దమునకు జెందిన మాఘ కవివరు

64. Pandit N. Bhashyacharya: The Age of Patanjali p 3
65. Prof. A. B. Keith: A History of Sanskrit Literature p 490

reaching a plane above the storms of human passions 107 మనోవ్యాపారమును స్తంభింపజేసి, మానవోద్రేక సంక్షోభములకతీత సంస్థితిని జేరుటకు సుస్థిర యత్నముల యనంతరము సంప్రాప్తించిన అసాధారణక్షణముల నా పరబ్రహ్మముతో నైక్యానుసంధానము నార్జించి, యందుండి, ఋషీశ్వరులు బ్రహ్మమునుగూర్చి వచించియుండిరని వి. టి. శ్రీనివాస అయ్యంగారు వ్రాసినట్లుగ, వారు బ్రహ్మానుభూతినిగూడ నార్జించి, బోధించి, Philosophy is the highest music తత్త్వశాస్త్రము అత్యున్నత సంగీతము అని పైథాగొరసు అను గ్రీకు దేశ తత్త్వవేత్త అనురీతి, దమ అనుభవసుధాస్వాదనోన్మత్తత గానమొనరించియున్నారు. అట్టి సుస్థిర విధానము నవలంబించుటచేతనే వారి-కృషిఫలితములును అజేయములు, అద్భుతములై The only religion that can have any hold is the rationalistic religion of Adwaita 108 వివేకజ్ఞానము గల అద్వైత మతమే స్థిరత్వమును గనజాలియున్నదని రొమెన్ రోలా అనునట్లు స్థిరత్వమును గడించియున్నది. అంతియగాక The labours of the Indian thinkers are so valuble to the advancement of human knowledge భారతీయ మేధావంతుల కృషియే మానవ విజ్ఞానాభివృద్ధికి అమూల్యమని విక్టరు కజిన్సు; I make no secret that all my life I have been very fond of the Vedanta 109 నా జీవితమునందంతయు వేదాంతమునందే అధిక ప్రేమ

107. V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 34.

108 Romain Rolland : Sankaracharya of S. S. S. Sastry

109. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 193.

గంభీర భాష్యమును విరచించి లోకమునకు మహోపకృతి గావించెనని ప్రస్తుతమునకు భావించెదముగాక. వ్యాసవిషయ విమర్శ మన ఉత్తర మీమాంసా దర్శన సందర్భమున నింకను బహుళమున జరుగును గాన నందు తుది తీర్మానమును గావింతుముగాక.



## వాచస్పతి తత్త్వవైశారది.

శ్రీవ్యాసప్రోక్త భాష్యముగూడ (Yoga Bhashya is an admitedly abscure and difficult text.) 71 నిర్ధారణము కఠినమును క్లిష్టమును అను గ్రంథమై పురుషోత్తమశర్మ వచనములలో 'దురూహావిషయ జటాజాల జటిల' మనిగ్రహించి 72 సకల శాస్త్ర పారావార పారీణుడును, విచక్షణా మూర్ధన్యుడును, పరమ దార్శనికుడును(Vachaspati Misra, who commented on almost all the systems of the Hindu thought wrote on each, as if he believed in its doctrines.) 73 భారత విజ్ఞానమున సకల సిద్ధాంతముల వ్యాఖ్యల విరచించిన వాచస్పతి మిశ్రులు, ఆయా సిద్ధాంతావలంబకునివలె నిర్మించె నన్నటుల నిష్పాక్షికస్వభావుడును నగు వాచస్పతి మిశ్రులు బలవదనుకంపాపరవశుడై వ్యాసభాష్యమునకు 'తత్త్వవైశారది'యను సవివరవృత్తిని వెలువరించెను. ఇతడు మిథిలాదేశ బ్రాహ్మణు

71. Prof. Ganganadha Jha: Yoga Darshana, Preface p I
72. పురుషోత్తమశర్మ : పాతంజల యోగసూత్రణి
73. Prof, S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 preface

డని ప్రతీతి. తనయపార పాండితీగరిమచే, అప్రతిహత పాండిత్య ప్రధానుడై, అతితర ప్రసిద్ధుడై వాచస్పతి యను బిరుద విభూషితుడయ్యెను. అంతియగాక నితడు నిష్పక్షపాతదృష్టి నవలంబించి, సర్వదర్శన వ్యాఖ్యానములద్వారా దర్శన యాథార్థ్య స్వరూపమును లోకమునకు బ్రసాదించెను. ఈతని గ్రంథములసంఖ్యాకములు, ప్రఖ్యాతములు, జటిలములు, విద్వజ్జన మనోరంజకములు. పసితనముననే యిల్లు బాసి వారణాసి జేరి విద్యాతపముల గాలము నుపయోగించుకొని, సంపూర్ణప్రకీర్తిదుడై, యొకానొక కాలమున స్వస్థానమున కరుదెంచి, దీనత నున్న తనసతీలలామమునుదిలకించి అనుగ్రహించి, ఆమెకీర్తి చిరస్థాయి యొనర్ప సంకల్పము వొడమ యద్గ్రంథరచనము గావించి దాని కామె నామమగు 'భామతి' అను నామకరణ మొనరించెనని ప్రసిద్ధి. భారతీయ తత్త్వ విజ్ఞానమున కెల్ల యితడొక మహాదీయాలంకారమును, సంపదయు ననుట కెట్టి సందియమునులేదు. ఇతడు శ్రీశంకర భగవత్పాదులకు వెంటనే క్రీ. త. 840 లో జనించెనని పండితాభి ప్రాయము. భరతఖండ మతనికి సర్వదా కృతజ్ఞమై యుండక తప్పదు.

పతంజలివోలె మనోవాక్కాయముల కుపయుక్తమగు గ్రంథరచనము బూనిన శ్రీభోజదేవుడు తన 'శబ్దప్రకాశిక' యను వ్యాకరణ, 'రాజమృగాంక' యను వైద్యగ్రంథములతోపాటు యీ యోగశాస్త్రమునకు 'రాజమార్తాండ' యను వృత్తిని నిర్మించెను. ఇతడు క్రీ. త. 11వ శతాబ్దము వాడయి యుండును. మరియు సర్వశాస్త్ర పారంగతుడై వాతస్పతివోలె సర్వదర్శన వ్యాఖ్యాతయగు విజ్ఞానభిక్షువుగూడ 'యోగవార్తిక' అను టీకను పాతం

దాని నార్జించుటకై సాధకుని శక్తిసామర్థ్యముల ననుసరించి, అధికార నిర్ణయము గావించి, తదనుగుణ సాధనా విశేషముల నాతనికి బోధించి, క్రమక్రమముగ మెట్ల నెక్కించి, చివరకు అద్వైత శిఖరమునందాతని తృప్తి యుపవిష్టుని గావించుచున్నది. ఆ నిశ్రేణిలో ప్రథమ స్థానము కర్మమార్గమున కీయబడి యున్నది. కర్మసాధనము నిత్య, నైమిత్తిక రూపమున ద్వివిధమై యున్నది. నిత్య కర్మ ఎట్టి యలౌకిక ఫలమును ఒసంగదు. అట్లే అది నిష్ఫలమును గాదు. కాని, మనోవాక్కాయములకు బలము జేకూర్చి, నైమిత్తిక కర్మానుష్ఠానమునకు శక్తిమంతునిగ నొనర్చును. నైమిత్తికమునగల యజ్ఞ యాగాదిక కర్మలు, ప్రపంచ జీవితమున సత్ఫలహేతువులై, యతని యైహిక జీవితమును సుఖవంతమొనర్చి, చాంద్రాయణ జ్యోతిష్టోమాది స్వర్గహేతుక యజ్ఞముల జేయింప సమర్థములగును. కాని జ్యోతిష్టోమాదిక కర్మలైనను సద్యోఫలము నొసంగనేరక, యజ్ఞగుండము నుండి 'అపూర్వ' మను నొక యపూర్వశక్తి నుద్భవింపజేసి, ఆ సాధకుని శరీరత్యాగానంతరము, వాని స్వర్గాది లోకముల ద్రిప్పి, అందందుగల సుఖాదుల నాతని పుణ్యమునమసరించి అనుభవింపజేయుచు, గ్రమముగ దానుగూడ దరిగిపోవుచు, నతని పుణ్యవ్యయమున దాగూడ వ్యయమైపోవును. అంత నా సాధకుడు యజ్ఞఫలమును గోల్పోయి, సామాన్యుడై, మరల జన్మము నొందును. అందుచే గర్మమార్గము ప్రత్యక్షముగ నిందు జీవునికి శాశ్వత సుఖ హేతువు గాకుండుటయేగాక, బహుళ ప్రయాసమున సాధించిన యజ్ఞముచే నైనను నతనికి జన్మరాహిత్యము నొసంగజాలక బునరావృత్తినే పొందించుచున్నది. కావుననే 'పరీక్ష

30)

# యోగశాస్త్ర ప్రాధాన్యత

## యోగశాస్త్రకర్త హిరణ్యగర్భుడు.

'అథ యోగానుశాసనం' (యో. సూ. 1.1) ఇప్పుడు యోగశాస్త్రము ప్రారంభింపబడుచున్నదని యుపక్రమింపబడిన, సాధనశాస్త్రమునా ప్రఖ్యాతిగనిన, యోగగ్రంథమునకు కర్త పతంజలి మునివరుడని మున్నె తెలిపియుంటిమి. కాని యోగ శాస్త్రమునకు మాత్ర మితడు కర్త కాడనియు బూర్వము వ్యక్తము. ప్రథమసూత్రమున 'అనుశాసన' పద ముపయోగింప బడుటచే నీశాస్త్రకర్త తాను కాదనియు, శాస్త్రమునకు వివర ణము మాత్రమే తాను రచించినటుల పతంజలియే చెప్పుకొని యుండుటచే పూర్వశాస్త్రవిషయమునే యాతడు వ్యాఖ్యా నించి యున్నట్లు విదితము. అంతియగాక యేయొకని చిత్తము నుండియు నేసిద్ధాంతము జనింపజాలదు కాన (There must have existed philosophical ideas and doctrines affording the necessary material for the founder to work upon) 74 శాస్త్రకారున కుపయుక్తమగు తాత్త్వికవిషయములు సిద్ధాంత ములు పూర్వమే యుండియుండవలెనను నది సువిదితము. కాన బతంజలికి బూర్వమే యాచార్యులచే నీశాస్త్రరాజ ముపదిష్టి తమో తిలకింప 'హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురా తనః' హిరణ్యగర్భుడే యోగప్రవక్తయని యాజ్ఞవల్క్యస్మృతి

---

74. Prof, S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 249

తెలుపుచున్నది. అందుచేతనే (Patanjali was not the founder of the Yoga system of Philosophy. Hiranyagarbha, a Maharshi, was the founder of this system and it was promulgated by his successors Varshaganya, Yajnavalkya etc.) 75 యోగసిద్ధాంతమునకు బతంజలి సంస్థాపకుడు కాడు. హిరణ్యగర్భుడను మహర్షి యీసిద్ధాంత ప్రతిపాదనము గావింప నతని యనుచరులగు వార్షగణ్య యాజ్ఞవల్క్యాదులు దాని ప్రచార మొనరించిరనియు (According to Yajnavalkya Smriti, Hiranyagarbha is the founder of the Yoga system, and Madhava points out that this does not contradict Patanjali's authorship of the Yoga Sutra, since Patanjali calls his Work అనుశాసన where the preposition అను implies that this statement follows a primary revelation, and is not itself the first formulation of the system.) 76 యాజ్ఞవల్క్యస్మృతి ననుసరించి యోగసిద్ధాంత కర్త హిరణ్యగర్భుడు. దీనివలన యోగసూత్రములకు పతంజలి కర్తృత్వమున కెట్టి విరుద్ధమును రానేరదు. అతని గ్రంథమున 'అనుశాసన' అను పదమున 'అను' అను యుపసర్గవలన యీ యోగసూత్రములు ప్రథమగ్రంథము కాదనియు, దీనికి ముందు గ్రంథము గలదనియు అన్వయమగుచున్నది. ఇట్లు పాతంజల యోగ గ్రంథమునకు బూర్వము యోగశాస్త్ర గ్రంథము లున్నట్లు (Two Verses from Hiranyagarbha's Work are

---

75. Pandit. N. Bhashyacharya: The Age of Patanjali p 22
76. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338

quoted in the Vishnupurana (అంశ. 2. అ 13, 5,5,42.45) and Varshaganya is mentioned by Vachaspati Misra in his Bhamati, Yajnavalkya promulgated the same system in his Yoga, Yajnavalkya Gita) 77 హిరణ్యగర్భ ప్రోక్త శ్లోకములు విష్ణుపురాణమున రెండు స్వీకరింపబడియున్నవి. వాచస్పతి మిశ్రులు భామతిలో వార్షగణ్యకృతముల ప్రస్తావించెను. యాజ్ఞవల్క్య గీతలో నీసిద్ధాంతమును యాజ్ఞవల్క్యుడు వివరించెనని భాష్యాచార్యులు వ్రాయుచున్నారు. అంతియగాక శ్రీశంకరులు తమ బ్రహ్మసూత్రభాష్యమున యోగకర్తనామముల సూచింపక కేవలము యోగసిద్ధాంతమునే ఖండించుచు 'అథ తద్దర్శనాభ్యుపాయో యోగః' సమ్యక్ జ్ఞానము మోక్ష సాధనమని నిశ్చయింపబడిన పిమ్మట ఆజ్ఞాన సాధనమగు యోగము చెప్పబడుచున్నది యను యోగసూత్రమును ప్రమాణముగ స్వీకరించి యుండిరి, కాని యది పాతంజలము కాక పోవుటచే (it must either belong to Hiranyagarbha or Varshaganya.) 77 హిరణ్యగర్భునకు గాని వార్షగణ్యునకు గాని చెందినదై యుండవలయును. పైసూత్రార్థము సమ్యక్ జ్ఞాన సాధనము యోగమని నిర్వచించుచుండ చిత్తవృత్తి నిరోధమే యోగమని పతంజలి నిర్వచించెను, అందుచే నీ యోగశాస్త్రము కేవలము పతంజలిమహర్షితోడనే ప్రారంభముకాక 'సర్వేషామపి గురుః కాలే నవచ్ఛేదాత్' (యో. సూ. 1.26) కాలాతీతుడు గాన, నీశ్వరుడు ప్రాచీనగురువుల కెల్లరకు గురూత్తముడనియు, పతంజలియే చెప్పియుండుటచే ననాదినుండి

77. Pandit N. Bhashyacharya: The Age of Patanjali p 24

ప్రవాహరూపమున నీ శాస్త్రము ఆగతమగు చున్నదని నిర్ధారణము.



## యోగ శాస్త్రము – ఉపనిషత్తులు

పై నుదహరింపబడిన విధమున యోగ శాస్త్రమునకు బతంజలి సూత్రకర్తగను హిరణ్యగర్భుడు ప్రవర్తగ నున్నను, యోగశాస్త్రమున కాధారము కేవలము వీరి యుక్త్యనుభవములు మాత్రమేగాక (We know that all our great Philosophers whether Vyasa, Patanjali or Goutama and even the father of all Philosophy, the greal Kapila himself, whenever they wanted an authority for what they wrote, every one of them found it in the Upanishads and no where else.) 78 వ్యాస పతంజలి గౌతములే గాక సర్వతత్త్వశాస్త్ర జనకుడును మహాత్ముడును అగు కపిలుడుగూడ, వారి రచనలకు ప్రామాణికత్వ మవసరమగునప్పుడు ప్రతియొక్కరును యుపనిషత్తులందే, మరి ఇతరమునందుగాక, దాని గాంచిరని వివేకానందులు వాకొనినట్లు యోగశాస్త్రమునకు బరమ ప్రమాణముగా యుపనిషత్తులే విరాజిల్లుచున్నవి. ఆయుపనిషత్తులు యోగమును బలుతెరంగుల నుతించుచు, 'యథైవ బింబం మృదయోపలిప్తం తేజోమయం భ్రాజతే తత్సుధాతం' (శ్వే. 2. 14) మృదాదిచే

78. Swami Vivekananda: The Complete Works Vol 3 p 395

మలినమైన సువర్ణాదికము పరిశుద్ధిచేయబడగ తేజోమయమై ప్రకాశించు విధాన యోగి 'ముచ్యతే సర్వపాశైః' (శ్వే.2.15) సర్వపాశ విముక్తిగాంచినవాడై 'నతస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం' (శ్వే.2.12) రోగముగాని, వృద్ధాప్యముగాని, మృత్యువుగాని యోగాగ్ని మయ శరీరుడైన నతనికి లేవు అనియు 'అప్రమత్తస్తదా భవతి యోగః' (కఠ.6.11) అప్పుడు యోగి అప్రమత్తుడై యుండు ననియు, మొదలగు నసంఖ్యాక వచనములద్వారా నీయోగ శాస్త్రము ఉపనిషత్తులచే నుతింపబడియున్నది. మరియు (Of the technical names of fhe Six Systems of Philosophy, two only occur in the classical Upanishads, namely Sankhya and Yoga or Sankhya-Yoga) 79 షడ్దర్శనములకుగల పారిభాషిక పదములలో సాంఖ్య, యోగ, లేక సాంఖ్యయోగ అను రెండుమాత్రమే సంప్రదాయికములగు ఉపనిషత్తులలో గల వన్నట్లు (The Upanishads which speak of the Sankhya theories refer to the Yoga practices as well) 80 సాంఖ్యసిద్ధాంతమును వచించు యుపనిషత్తులు యోగసాధనను కూడ సూచించుచు, (Its origin may be traced to pre-Vedic ideas) 80 యోగమూలము వేద పూర్వభావములవరకు గొంపోవుచున్నది. కాన సూక్ష్మదృష్టి బరిశీలించినచో (Crude conception of the value of ecstasy and hypnotic trance are to be met with in the Rig-Veda which also mention the word Muni (x. 136). In the Atharvana-Veda the idea

79. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 84
80. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338

బంధములు లేక, 'భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః। క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే' (ముం. 2. 2. 8) పరావరమైన నా పరమాత్మ దర్శనమగుటతోడ, హృదయ గ్రంథులు విడివడును, సర్వసంశయములు విచ్ఛిన్న ములగును. సర్వకర్మలు నశించును. అందుచే నతడు సతతానంద సాగర విహారమున, నెట్టి వికారములులేని స్థితిలో, నెట్టి భేదములు లేక జరించుచుండు. అతని స్థితి సామాన్యులకు దురూహ్యము, దుర్గ్రాహ్యము, దుస్తరము. అతనికి నతడే సమానము. అతని నతడే గ్రహించును. సర్వప్రపంచ నానాత్వమున నేకత్వమునందే మునింగి, 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' అనునట్లు ద్వైతదృష్టి వివర్జితుడై, ప్రవర్తించుచుండును.

కాని, యింకను అతడు శరీరధారియై యుండవచ్చును. సామాన్య మానవులవోలె ఆహార పానీయ నిద్రాదుల స్వీకరించుచు నుండవచ్చును. భ్రాంతికధిష్ఠానమైన రజ్జుజ్ఞానముతో సర్పజ్ఞానము అదృశ్యమైనట్లు, యిచట నా సిద్ధునికి సర్వ బాహ్యప్రపంచము అదృశ్యముకాక, **The realisation of truth does not mean the abolition of plurality, but the removal of the sense of plurality** 118 సత్పదార్థానుభూతి యన నానాత్వ నిర్మూలనముగాక నానాత్వదృష్టి నాశనమేయని రాధాకృష్ణ పండితుడు వాకొనునట్లు, మృగతృష్ణలోని నీరముపై భ్రాంతి మృగతృష్ణ తత్త్వదర్శనమున నదృశ్యమైనను, నీరభ్రాంతి నశించినను, ఆ మరుమరీచి యింకను ద్రష్టకు గోచరించుచునే

118. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2. p 637

లోగల యోగము పాతంజలమున కేకీభూతమని తెలుప సాధ్యము కాదని రాధాకృష్ణపండితుడే వ్రాయుచున్నాడు. కాలక్రమమున యోగవిద్యలో మార్పులు అవతరించియున్నను, పాతంజలమునకు ఆధారము ఉపనిషత్తులనుట కెట్టి సంశయమును లేదు. అందుచేత మనకు లభించు అష్టోత్తర శతోపనిషత్తులలో నిరువది యోగోపనిషత్తులుగా శాస్త్రజ్ఞులు విభజించియున్నారు. అవి ఎవ్వియన 1) అద్వయతారక 2) అమృతబందు 3) యోగతత్త్వ 4) మండల బ్రాహ్మణ 5) యోగకుండలి 6) యోగచూడామణి 7) యోగశిఖ 8) బ్రహ్మవిద్య 9) క్షురిక 10) త్రిశిఖబ్రాహ్మణ 11) దర్శన 12) అమృతనాద 13) తేజోబిందు 14) ధ్యానబిందు 15) నాదబిందు 16) పాశుపతబ్రహ్మ 17) మహావాక్య 18) వరాహ 19) శాండిల్య 20) హంస. ఉపనిషత్తులు. ఇవి సంపూర్ణముగా యోగప్రతిపాదకములై యుండ నింక 1) శ్వేతాశ్వతర 2) కఠ 3) మహా 4) అన్నపూర్ణ 5) అక్షి 6) అధ్యాత్మ 7) సౌభాగ్యలక్ష్మి 8) సరస్వతీరహస్యాదులును యోగమార్గ ప్రవర్తకములుగా దెలియ బడుచున్నవి. ఈయుపనిషత్తులందు యోగానుష్ఠానజనిత విభూతులును, అనుభవ సహస్రములును వివరింపబడియున్నవి.

అందుచేతనే 'శ్లో॥ ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసరసేన చ। త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగముత్తమం' (యో.భా.1. 48) అగమానుమాన ధ్యానాభ్యాసములచే ప్రజ్ఞను క్రమపరచి యోగి పరమోత్కృష్ట యోగమును బొందును అనుచు భాష్యకారులైన వ్యాసభగవానుడును, శ్రుతిప్రమాణమును ముఖ్యముగా వచించియున్నాడు. మరియు బతం

జలి మునీంద్రుడును, 'ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని' (యో.సూ.1.7) మొదలగు సూత్రముల ఆగమమునుగూడ ముఖ్యప్రమాణముగ స్వీకరించి యున్నాడు. కాన యోగశాస్త్రము, హైరణ్యగర్భముమాత్రమే గాక పాతంజలముగూడ, వేద ప్రమాణ సంబద్ధమనుట కెట్టి సందియమును లేదు. యోగమునకు భగవద్గీతాశాస్త్రము ప్రాధాన్యత నొసంగి యుండుటచేతనే దానికి 'యోగశాస్త్ర' మను నామ మేర్పడియున్నది. అంతియు గాక (In one form or another, Yoga is to be found among all Indian ascetics, including Buddhists and Jains)[81] ఏదోయొక రూపమున యోగము భారతీయ సన్న్యాసు లందరిలో బౌద్ధ జైనులలో గూడ గానవగునని (Macdonell) మాక్డోనెల్ వ్రాయురీతి యోగము సర్వసిద్ధాంతములకు సాధనమార్గమై యనుష్ఠితమగుచు సర్వవ్యాప్తమై వెలుగొందుచున్నది. సాక్షాత్తు హిరణ్యగర్భప్రోక్తమై యాజ్ఞవల్క్యాది మహర్షిగణ ప్రేష్ఠమై వార్షగణ్యాది సిద్ధుల కాటపట్టగుచు, గురు దత్తాత్రేయాది యీశ్వరాంశ సంభూతుల ప్రాపకమును సంపాదించి ఆదిశేషావతారమగు పతంజలిఋషితిలకముచే దర్శనమై యొప్పు యోగము పైవిధంబున సుప్రసిద్ధమై సర్వాకర్షణీయమై సర్వోపయుక్తమగుటలో ఆశ్చర్య మావంతయును లేదు.

---

81. Prof. A. A. Macdonell: India's Past

## యోగసూత్ర గ్రంథము.

దర్శనషట్కమున సాధనశాస్త్రమనియు అనుభవగ్రంథమనియు బేరెన్నికగన్న పాతంజలదర్శనము అధ్యాయచతుష్టయగ్రంథము.(Since the criticisms of the other schools occur in the fourth part of the Yoga Sutras, and since the word 'ఇతి' denoting the conclusion of a work occurs at the end of the third, it is suggested that the fourth part is a later addition) 82 యోగసూత్రమున చతుర్థాధ్యాయమున అన్యసిద్ధాంత ఖండన ముండుటచేతను, తృతీయాధ్యాయాంతమున, గ్రంథాంత సూచికమగు 'ఇతి' పద ముండుటచేతను, నాల్గవప్రకరణము ప్రక్షిప్తమని దాసుగుప్త భావము. అందుచే నతని వాదప్రకారము ప్రకరణత్రయ గ్రంథముగా పాతంజలమగుచున్నది. ఇంకను సూక్ష్మబుద్ధి యోచించుచో, (The first chapter thus, in fifty one aphorisms, gives what may be called the theory or the science of Yoga. An ardent and intelligent person can learn enough from this chapter alone to become a practical yogin) 83 ప్రథమ ప్రకరణము ఏబదియొక్క సూత్రములద్వారా యోగశాస్త్ర విధానము నంతటిని తెలుపుచున్నది. బుద్ధిమంతుడును ఆర్తుడును నైనవాడు అనుష్ఠానపరుడగు యోగియగుట కొక్క ప్రథమాధ్యాయమునుండియే అవసర విషయముల గ్రహింపగలుగునని రామప్రసాదు డనుచందమున సమాధి ప్రకరణమే

82. Prof. S. Das Gupta: Indian Philosophy Vol p 230
83. Rama Prasad: Patanjali Yoga Sutra p 5

సమగ్రము. కాని న్యాయ వైశేషిక వేదాంత దర్శనములగూడ పరసిద్ధాంత ఖండనమునకై యొక్కొక్క ప్రకరణముపయోగింప బడియుండుట గాంచ నగుటచే నీయోగదర్శనమున కైవల్య పాదము ప్రక్షిప్తమనుట అనుచితమగునేమో. 'ఇతి' పద ప్రయోగము పాదాంత సూచికముగ నన్వయింపనగును, అంతియు గాక, భోజసంకలిత సూత్రముల 'కైవల్యమితి' యని గాక కేవలము 'కైవల్యం' అని తృతీయపాదాంతమున గలదు. కాన పాఠాంతర సంప్రాప్తముగా 'ఇతి' ఏర్పడియుండవచ్చును. అటులే ప్రథమపాదమే సమగ్రముగ నున్నను, తదంశ వివరణార్థము తర్వాతిగ్రంథ మవసరమనుటయు సమంజసము.

ఇట్లు పాదచతుష్టయాలంకృతమగు పాతంజల యోగము అల్పాక్షరయు సంపూర్ణార్థకమును అగు సూత్రవిధానము గ్రంథ రచనము. నాల్గుపాదములకు మొత్తమునకు నూటతొంబది యైదు సూత్రములచే నిర్మిత మీశాస్త్రము. అందు సమాధి ప్రకరణ నామమున బరగు ప్రథమాధ్యాయమునగల 51సూత్ర ములతో యోగానుశాసనమును బ్రారంభించి 'యోగః చిత్త వృత్తి నిరోధః' (యో.సూ.1.2) యని యోగనిర్వచనము గావించి, తత్ఫలితమగు 'తస్యాపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజ సమాధిః' (యో.సూ.51) అను సూత్రముతో నధ్యాయమును పరిసమాప్తిజేయుచు, గ్రంథతాత్పర్యము నిర్బీజము నాబడు అసంప్రజ్ఞాత సమాధియని సూత్రకారుడు వివరించెను. ఈప్రకరణమున యోగలక్షణము, సమాధిద్రష్టృ స్వరూపము, చిత్తవృత్తులు, విపర్యయరూపము, వృత్తినిరోధోపాయములు, అభ్యాస స్వరూపము, వైరాగ్య లక్షణము, సంప్రజ్ఞాత సమాధి, ఈశ్వర

ప్రణిధానము, సబీజ నిర్బీజ సమాధ్యాది ముఖ్యవిషయములు వివరింపబడియున్నవి. సాధనప్రకరణము నాఁ బెలంగు ద్వితీయమున గేవలము సాధనయోగాక, ప్రథమ సప్తవింశతి సూత్రములలో యోగాధిష్ఠానమగు సాంఖ్యసిద్ధాంత తాత్పర్యమును స్మరించి, ఇరువది ఎనిమిదినుండి అష్టాంగ యోగవిధానమును వివరించుచు 'యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయోఽ ష్టావంగాని (యో.సూ.2.29) యను అష్టాంగముల యమాది ప్రత్యాహార పర్యంతము గల స్థూలయోగము బోధింపబడెను. అంత విభూతి యను తృతీయప్రకరణమును ధ్యానయోగము నాబడు ధారణతో ప్రారంభించి, ధారణ ధ్యాన సమాధి స్వరూపములను, సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాత చిత్తపరిణామమును, ఇంద్రియ జయోపాయమును,ఆయా యింద్రియజయఫలమును.వివేకసంజనితఫలమును, మోక్షప్రకారంబును పతంజలియోగిపుంగవుడు పచరించెను. కైవల్యాఖ్యయగు చతుర్థపాదము జన్మాది పంచసిద్ధులతో ప్రారంభించి, చతుర్విధ కర్మజాతులు, వాసనాక్షయము, వాసనాక్షయోపపత్తి, వస్తుజ్ఞానభేదము, ధర్మమేఘ సమాధి, జీవన్ముక్తి, కైవల్యస్వరూపాది విషయములు మీమాంసించి 'కైవల్యం స్వరూపప్రతిష్ఠా' అను అంత్యసూత్రముతో గ్రంథము సాంతమగుచున్నది. గ్రంథ మాద్యంతముల నుపక్రమోపసంహారముగ కైవల్య ఫలప్రదాతయగు అసంప్రజ్ఞాతసమాధియే స్మరింపబడుచు,గ్రంథభాగమంతయు తత్సంబంధవిషయమే చర్చింపబడియుండుటచే నిది కేవలము సాధనశాస్త్రమే యయ్యెడిని. అందుచేతనే (The main interest of Patanjali is not meta-

phyisical theorising, but the practical motive of indicating how salvation can be attained by disciplined activity) 84 పతంజలియొక్క తాత్పర్యము తత్త్వమీమాంస గాక ముఖ్యముగ సాధనమార్గమున కైవల్యమునొందు అనుష్ఠేయ పద్ధతిని దెలుపుటయేయని రాధాకృష్ణాది పండితవర్గము భావించుట చాల సముచితము. (Religion is not in books, nor in theories, nor in dogmas, nor in talking, nor even in reasoning. It is being and becoming) 85 మతము గ్రంథములగాని, సూత్రములగాని, విశ్వాసములగాని, సంభాషణములగాని చివరకు తర్కమునగాని లేదు. తాదాత్మ్యత్వము అనుష్ఠానముననే గలదను నమ్మకమే పతంజలి మునివరేణ్యుని యాదర్శమై యీశాస్త్రరచనమునకు ప్రోద్బలమయినదని స్పష్టము.



## యోగశాస్త్రము - ప్రాణాయామము

కాని యష్టాంగ యోగాంతర్గత విషయ రహస్యముల నవగాహన మొనరింపనేరక (The Yoga has come to mean, in the thoughts of many, posturing and nose-closing) 86 ఆసన ప్రాణాయామములే యోగమని యనేకమంది కర్థ

84. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338
85. Swami Vivekananda: The Complete Works Vol 3 p 395
86. Rama Prasad: Patanjali Yoga Sutra p viii

మగుచున్నది. పతంజలి యుద్దేశ్య మది కాకున్నను కొంద రిట్టి యర్థమును గొనుటచే (The regulation of breath recieves considerable emphasis, though Patanjali mentions it as an optional measure) 87 పతంజలి ప్రాణాయామమును ఐచ్ఛికవిధానముగ సూచించి యున్నను దాని కధికతర ప్రాధాన్యత యొసంగబడియున్నదనియు బండితులు చింతించిరి. అంతియగాక, 195 సూత్రములుగల యోగశాస్త్రమున 1.34, 2.49, 50, 51, 52 గాగల సూత్ర పంచకమున మాత్రమే అతిక్లుప్తముగ నీప్రాణాయామవిధానము సూచితమైయున్నదగుటచే దీనికెంత అప్రాధాన్యత యోగమున నీయబడినదో గ్రాహ్యము. మరియు 'ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య' (యో.సూ.1.34) అను సూత్రమున 'ప్రాణ' శబ్దమునకు 'శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః' (యో.సూ.2.49) అను సూత్రముతో శ్వాసప్రశ్వాసరూప మనియే గ్రహించినట్లు అనుమానితము. ఈయన్వయమునే స్వీకరించి 'కౌష్ఠ్యస్య వాయో ర్నాసికాపుటాభ్యాం ప్రయత్న విశేషాద్వమనం ప్రచ్ఛర్దనం' (యో.భా.1.34) నాసికాపుట ద్వారమున ప్రయత్నవిశేషముగ నంతరమగు వాయువును రేచించుట కుంభించుట యని భాష్యకారుడును నిర్వచించి యున్నాడు. 'బాహ్యస్య వాయోరాచమనం శ్వాసః, కౌష్ఠ్యస్య వాయోర్నిఃసారణం ప్రశ్వాసః తయోర్గతి విచ్ఛేద ఉభయా భావః ప్రాణాయామః' (యో.భా.2.49) బాహ్యవాయుపూరణము శ్వాసము, అంతర్వాయు నిస్సారణము ప్రశ్వాసము,

87. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338

ఈ రెంటిని నిరోధించుటయే ప్రాణాయామముగ నతడు వివరించి యున్నాడు.

'ప్రాణ' శబ్దనిర్వచనమునగూడ పండితలోకమున నభిప్రాయవ్యత్యాసము గానవగును. 'అరా ఇవ రథనాభౌ ప్రాణో సర్వం ప్రతిష్ఠితం। ఋచో యజూంషి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మ చ' (1.6) ఋగ్యజుస్సామ యజ్ఞ బ్రహ్మ క్షత్రాది సర్వమును రథచక్రమునం దాకులవలె ప్రాణమునందు నిలచి యున్నవనియు 'ఆత్మన ఏష ప్రాణో జాయతే' (3.3) ఆత్మ నుండి ప్రాణజనించెనని ప్రశ్నోపనిషత్తు; 'ప్రాణో బ్రహ్మ' (ఛాం.4. 10. 5) ప్రాణయే బ్రహ్మము, 'ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి' (ఛాం.7.15.4) ప్రాణయే యీసర్వ మగుచున్నది. 'ప్రాణో వై బ్రహ్మేతి' (బృహదారణ్యక. 4.1 3, కౌషీతకి బ్రాహ్మణ. 2.1) మొదలగు నసంఖ్యాక ఉపనిషత్ప్రమాణముల నాధారముగగొని (Prana is not exactly breath. It is the name for the energy that is in the Universe) 88 ప్రాణ యన సంపూర్తిగ శ్వాస కానేరదు. విశ్వగతమగు శక్తికది నామము అని వివేకానందులు వచించి, (Whatever you see in the Universe, whatever moves or works, or has life, is a mainfestation of this Prana. The sum-total of the energy displayed in the Universe in called Prana) 88 విశ్వమున దేనిని చూచినను, ఏది కదలినను మెదలినను, జీవము గలిగియున్నను అది ప్రాణయొక్క మూర్తిమత్వమే. విశ్వమున

88. Swami Vivekananda: The Complete Works Vol p 223
88. Prof Kokileswar Sastri Vidyaratna: A Realistic Interpretation of Sankara Vedanta p 70

సమగ్ర శక్తివ్యక్తిత్వమే ప్రాణయని నిర్వచించియున్నారు. ఈవిషయమునే గ్రహించి (The term Prana is the world-seed) 89 ప్రాణ విశ్వబీజమనియు, 'అవ్యాకృత ఏవ ప్రాణః — సర్వభావానా ముత్పత్తేః ప్రాక్ ప్రాణ - బీజాత్మనైన సత్వం' (మాండూక్య. శంకరభాష్య.1.2) ప్రాణయే అవ్యాకృతము. సర్వసృష్టికి బూర్వము సత్వమై బీజాత్మగా ప్రాణ యున్నదను ప్రమాణములనాధారముగగొనికోకిలేశ్వర శాస్త్రిగూడ నచించెను అందుచేగల్పప్రాగవస్థలో నీప్రాణ అవ్యక్తరూపముగ నుండికల్పారంభముతో వ్యక్తరూపముదాల్చుచున్నదని తాత్పర్యము, మరల (It is this Prana that is manifested as motion, as the nervous motion in the human beings or animals, and the same Prana that is manifesting as thought and so on) 90 ఈప్రాణయే స్పందనరూపమున వ్యక్తమై మృగ నరాది జీవులలో నాడీస్పందనముగను భావాది రూపములుగను రూపొందుచున్నదనియు (Now this throwing out and restraining the Prana is what is called Pranayana) 90 నీప్రాణను వెలి నుంచి నిరోధించుటయే ప్రాణాయామమనియు వివేకానంద తాత్పర్యము. పతంజలి ప్రాణాయామమునుగూర్చి వివరము లొసంగకున్నను, తర్వాతి యోగాచార్యులు దీని స్థూలముగ ఆసన ప్రాణాయామములకే మిగుల ప్రాధాన్యతనొసంగి నభివృద్ధి గావించి గొప్పవైజ్ఞానిక శాస్త్రముగ రూపొందించియుండిరి.

---

89. Prof. Kokileswar Sastri Vidyaratna: A Realistic Interpretation of Sankara Vedanta p 70

90. Swami Vivekananda: The Complete Works Vol I 223

తర్వాతివారి భావజాలము లెట్లున్నను, (First, you must remember that this Prana is not breath. But that which causes the motion of the breath, that which is the vitality of the breath is the Prana) 90 ప్రథమతః 'ప్రాణ' వాయువు గాదని గ్రహింపవలెను. శ్వాస సంచలనమున కేది కారణమో దాని కేది యాధారమో అది ప్రాణయని వివేకానందుడు హెచ్చరించును. కాని (It is the energy that is in each body, and its most apparent manifestation is the motion of the lungs.) 91 అది ప్రతిశరీరమునగల శక్తి, శ్వాసాశయ స్పందనమే దానియొక్క ప్రత్యక్షరూపము. కాబట్టి, (We begin by controling the breath, as the easiest way of getting control of Prana.) 91 ప్రాణ బంధమునకు సులభోపాయముగ శ్వాస నిరోధముతో ప్రారంభించుచుందుము, అని వివేకానందులు సమన్వయ పరచియున్నారు.



## యోగశాస్త్రము-సాంఖ్యము.

అందుచే సప్తాంగ మధ్యస్థమగు ప్రాణాయామమునకు మాత్రమే ప్రాధాన్యతనొసంగి, దానికంటె ముఖ్యమగు యోగశాస్త్రతాత్పర్యమగు సమాధిని విస్మరింపజనదు. యోగసౌధమునకు యమాదులు పునాదులు, ధర్మమేఘాదులు శిఖరములు.

90. Swami Vivekananda: The Complete Works Vol I p 223
91. Do Do p 267

మధ్యగల ఆసనాది ధ్యానపర్యంతమగు అంగములు అంతర్భాగములు. సర్వసోపానముల నధిగమించి సాధించుటయే యోగసిద్ధి యనబడును. అష్టాంగములలో నెద్ది లోపించినను యోగమసమగ్ర మగుటయేగాక నిష్ఫలము, యోగ సిద్ధి దూరము. అందుచే హెచ్చరిక యవసరము.

'విశేషా విశేష లింగ మాత్రా లింగాని గుణపర్వాణి' (యో.సూ. 2.19) మొదలగు సూత్రముల ననుసరించి చూచిన (The Yoga system of cosmogony is the same as that of the Sankhya.) 92 యోగశాస్త్రముయొక్క సృష్టిసిద్ధాంతము సాంఖ్యమేయని రామప్రసాదుడన్నట్లు యోగము సాంఖ్యమునే సిద్ధాంతముగ గ్రహించియుండుటచే సాంఖ్యప్రోక్త వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానము, బ్రహ్మసూత్రమునందు శ్రీ శంకరాదులగు నద్వైతులచే స్మృత్యధికరణమున నిరాకరింపబడిన సాంఖ్యము వలెనే యోగ ప్రత్యుక్త్యధికరణమున 'ఏతేన యోగః ప్రత్యుక్తః' (వే. సూ. 2.1.3) యను సూత్రమున యోగముగూడ పూర్వపక్షము సేయబడియున్నది. సాంఖ్యమునే తాత్త్వికముగ గ్రహించియుండుటచే (Yoga Sastra promulgated by Patanjali, - which also bears the name fo the Sankhya Pravachana.) 93 పతంజలి ప్రోక్త యోగశాస్త్రము సాంఖ్యప్రవచన నామముగలదిగ నగుచున్నది. కాన (The Yoga Sutra disignates itself Sankhya Pravachana exposition of Sankhya.) 94 సాంఖ్యప్రవచనముగ యోగశాస్త్రమే చెప్పు

92. Rama Prasad: Patanjali Yoga Sutra p 5
93. మాధవాచార్య: సర్వదర్శన సంగ్రహము
94. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 113

కొనినదని శ్రీనివాస అయ్యంగారుకూడ వ్రాసెను. (Closely allied as philosophy with the Sankhya is the Yoga) 95 సాంఖ్యముతో సన్నిహిత తాత్త్వికసంబంధముకలది యోగమని (Keith) కీతుకూడా వాకొనియున్నాడు. అందుచే యోగశాస్త్రముయొక్క పరమ సిద్ధాంతము సాంఖ్యమే యని నిర్ణయము.

కాని (The other philosophers, though occationally differing from Patanjali in some philosophical points, have as a rule, acceded to his method of practice a decided consent.) 96 కొన్ని తాత్త్విక విషయములలో కొందరుతత్త్వవిదులు ఒక్కొక్కప్పుడుపతంజలినుండి వ్యతిరేకించియున్నను, ఎల్లరును ఏకగ్రీవముగ నతని సాధనావిధానమును సమ్మతించిరి అని వివేకానందులు వచించురీతి సర్వసిద్ధాంతములకు బతంజలి మునిచంద్రుడే సాధనపద్ధతిని ప్రసాదించి మహోపకారి యయ్యెననుట యుక్తము. (Believe nothing until you find it out for your self) 97 దేనిని ప్రత్యక్షముగ గాంచునంతవరకు విశ్వసింపవలదన్నట్లు అనుభూతికి ప్రాధాన్యత యొసంగి, (The Hindus, alone of mankind, have penetrated behind the veil, and possess the knowledge, which is not really philosophical, ie., wisdom-loving, but wisdom itself.) 98 సర్వమానవకోటిలో హిందువులుమాత్రమే యవనికనధిగమించి కేవలము జ్ఞానప్రియత్వ మనబరగు పరోక్ష జ్ఞానముగాక జ్ఞానమునే పొందియున్నారని ప్రథమ యోగా

95. Prof. A. B. Keith: A History of Sanskrit Literature p 472
96. Swami Vivekananda: The Complete Works Vol p 223
97. Do. Do
98. Douglas Ainslie: Preface, Science of Religion

మొసంగుట పమంజసమను అభిప్రాయమున, సర్వ సిద్ధాంత సౌరభమున నద్వైత ఖండము అర్వాచీన సిద్ధాంతముల నగ్ర స్థానము నలంకరించియున్నది. Ever since Sankara's time the majority of the best thinkers of India have been men belonging to this school 142 శంకరకాలమునుండి భారతీయ ఉన్నత శేముషీదురంధరులలో నధిక సంఖ్యాకులు, ఈ సిద్ధాంతావలంబకులే యయియున్నారని శ్రీశంకర, రామానుజ భాష్యానువాద కర్తయు, వ్యాఖ్యాతయు నగు జి. తిభేట్ అనునట్లు, నదియే అఖిల ధీమంతుల నాకర్షించి యుండుటచే సౌరభ నిర్ణయమే సముచితమని విజ్ఞులకు దోపక మానదు.

ఈ అద్వైత సిద్ధాంతము అతి ప్రాచీనమై, When and by whom the threads that constituted the warp and woof of Adwaita were spun, we do not know - - - 143 ఎప్పుడు, ఎవరిచేత నీ యద్వైత సిద్ధాంతముయొక్క యల్లిక జరిగియున్నది. అను విషయము మనకు అగ్రాహ్యము. అందులకు గారణము, అది దేశకాలముల నెదుర్కొనియుండిన వేదముల సహోత్పన్నమై, వ్యక్తుల నతీతించి, కేవల బ్రహ్మమునే జూపించు ఆధ్యాత్మిక శక్తిస్వరూపములైన ఉపనిషత్ హృదయసీమయై, పురాణప్రదములైన పురాణేతిహాస స్మృత్యాదుల యందధిష్ఠానమై యొప్పు నద్వైత సిద్ధాంతము యొక్క పుట్టుపూర్వోత్తరముల నిర్ణయింప గష్టసాధ్యమే. అయి

142. Dr. G. Thibaut : The Vedanta Sutras Sankara Bhashya. Introduction

143. Prof S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 74.

Patanjali-) 99 తన నిజస్వరూపమున కాపిలము సాంఖ్యము లేక యాంత్రికముగను, పాతంజలము సేశ్వరముగను శుద్ధ తత్త్వ శాస్త్రమున సర్వమును భారతావనికి ప్రసాదించెనని (John Davis) జాన్ డేవిస్ వ్రాయుచుండ. నంతకుమించు విస్పష్ట వాక్యముల (The Sankhya Philosophy declares itself fearlessly as an - Iswara, Lordless, leaving it to another philosophy, the Yoga, to find in the old Sankhya system some place for an Iswara or a personal God.) 100 ప్రాచీన సాంఖ్యమున, సగుణుడైనముగ నీశ్వరునకు కొంచెము స్థానము గల్పింప యోగసిద్ధాంతమునకు అవకాశ మొసంగుచు, సాంఖ్య తత్త్వము నిర్భయముగ నిరీశ్వరముగ ప్రకటించుకొనెనని (Max Muller) మాక్సు ముల్లరు భావించెను. కాని సాంఖ్యమున మనము వినియున్న తెరంగున సాంఖ్యము నిరీశ్వరమనుటయు దోషభూయిష్ఠ మగుచున్నది. అంతియగాక యోగము సేశ్వర మనుటయు లోపభూయిష్ఠమే యగును. కాని బాహ్యముగ దిలకించి, సాంఖ్యము యీశ్వరభావలోపమున నిరీశ్వర మనియు యీశ్వరపద కలిమిచే యోగము సేశ్వరమనియు దీర్మానింపరాదు. ఎందుచేతనన యోగమునగల యీశ్వరుడు, (The Iswara, here refered to, is not the Lord of the world, but Lord only of his devotees.) 101 విశ్వపాలకుడు గాక, భక్తపాలుడుగ మాత్రమే యున్నాడు. యోగశాస్త్రమున నీశ్వరుడు సర్వజ్ఞబీజమై యున్నను, కాలాతీతుడై ప్రాచీన

99. John Davis: Sankhya Karika, Preface
100. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p 9
101. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 113

గురువనేయొక్కడై యొప్పారినను, (The Iswara of Yoga Darsana therefore, is neither the Reality behind Nature, nor any universal Being in which human selves find their unity.) 101 యోగదర్శనమున, నీశ్వరుడు ప్రకృతి కధిష్ఠాన తత్త్వము గాని, జీవులు ఏకత్వముగాంచు విశ్వాత్మ తత్త్వముగాని, గలిగిన వాడు కాడు. (He is neither the ruler of Nature nor the moral Governor of the Universe.) 101 అతడు విశ్వపాలకుడు కాడు. ప్రకృతి నియంతయు గాడు. అతడు (Who was never touched by 'Klesa' the defects of Ignorence)101 అజ్ఞానదోషము లగు క్లేశములచే నంటబడనివాడై, (Out of the multitude of Purushas, in the Universe, he is a special Purusha.) 101 విశ్వమునగల అసంఖ్యాక పురుషులలో నీశ్వరుడు ఒక ప్రత్యేక పురుషుడై మాత్ర మున్నాడు. అందుచే (Yoga is in its tenets as atheistic as Sankhya.) 101 యోగము సాంఖ్యమువలె నిరీశ్వరమే యగుచున్నదని శ్రీనివాస అయ్యంగారు వ్రాసిరి. (He is no where spoken of as the creator; nor even as the Conscieousness' permeating through all Existence) 102 యోగశాస్త్రమునం దెచ్చటను యీశ్వరుడు సృష్టికర్తగాని, సర్వజీవుల కధిష్ఠాన చైతన్యమనిగాని వాకొనబడలేదు. (He is spoken of only as an object of devotion, devoiton to whom leads to highest results.) 102 భక్తిలక్ష్యముగ నతడు వచింపబడి, అతనిపై భక్తి

101. P. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy p 116
102. Prof. Ganganadha Jha: Yoga Darsana, Preface p I

సర్వోత్తమ ఫలదాయకముగ జెప్పబడెనని గంగానాధ ఝూ తెలిపియున్నాడు. కావున సాంఖ్యము సిద్ధాంత శాస్త్రమై (The idea of Super-Natural beings may rouse to a certain extent the power of action in man; but it also brings spiritual decay. It brings dependence, it brings fear; it brings superstition.) 103 అమానుషపురుష భావనము మానవునిలో నొకించుక కర్మప్రవృత్తిని గలిగించినను, అది ఆధ్యాత్మిక క్షీణత్వమునుగూడ గలుగజేయును. అస్వాతంత్ర్యమును, భీతిని, మూఢ విశ్వాసమును అది యుదయింపజేయును, అని వివేకానందులుపన్యసించినట్లు సాంఖ్యము, ఈశ్వర పరాధీనత పురుషునకు అనుచితముగ దలంచి, యీశ్వరప్రశంస సేయకున్నను, పాతంజలము సాధనశాస్త్రమై సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాతాద్యనుభూతికి ఆటంకదాయకములగు విపర్యయాదుల నడంప 'అభ్యాస వైరాగ్యా' దులవలె 'ఈశ్వరప్రణిధానాద్వా' (యో సూ. 1.23) ఈశ్వరప్రణిధానముద్వారా గూడ సాధ్యమని ఈశ్వరుని సాధనోపాయముగ మాత్రము గ్రహించియున్నాడు. కాన పాతంజలము కేవలము సాధనశాస్త్రమనుట మిగుల సమంజసము.

## నామ తాత్పర్యము

'యోగః సమాధిః' (యో. భా, 1. 1) యోగమన సమాధియని వ్యాస నిర్వచనము. అనగా 'యుజిర్ యోగే'

103. Swami Vivekananda: The Complete Works Vol I p 223

(యో. భా. వాచస్పతి 1. 1) అనువ్యుత్పత్తి ననుసరించి సంయోగమను నర్థమున్నను, 'యుజ్ సమాధౌ' (యో.భా.వాచస్పతి 1.1) అను వ్యుత్పత్తిచందము యోగమన సమాధి యని యర్థము. దీని ననుసరించియే (The word Yoga comes from a Sanskrit root which means 'to go' 'to trance' 'to meditate'.) 104 సమాధిగాంచుట లేక ధ్యానమునొందుట యను సంస్కృత వ్యుత్పత్తినుండి యోగపదము జన్యమని రామప్రసాదుడు వ్రాసియున్నాడు. అందుచేత సమాధి సాధనమగు నిరోధముగూడ యోగమే యగుటచే 'యోగశబ్దస్య చిత్తవృత్తి నిరోధ ఏవేతి పరమార్థః' యోగశబ్దమునకు చిత్తవృత్తి నిరోధమే పరమార్థముగా 'యోగః చిత్తవృత్తి నిరోధః' (యో. సూ. 1. 2) అను సూత్రము నాధారముగాగొని వాచస్పతులు వచించిరి. అట్లే రాజమార్తాండకారుడైన భోజదేవుడుగూడ 'యుజ్ సమాధౌ'(1.1) అను వ్యుత్పత్తినే గ్రహించియున్నాడు. 'యోగవిషయస్య శాస్త్రస్యాధికృతత్వం వేదితవ్యం' (యో.భా వా, 1.1) ఈశాస్త్రమునకు యోగవిషయమే యధికృతమని గాహ్యముగాన నీశాస్త్రము యోగశాస్త్రమనియు 'దృశ్యతే తత్త్వమనేనేతి దర్శనం' తత్త్వదర్శనము చేయించునది దర్శనమను నర్థమున యోగ దర్శనమనియు దీనికి ప్రఖ్యాత నామధేయములు.



104. Rama Prasad: Patanjali Yoga Sutra p 5

ఈశాస్త్రమునకు రాజయోగనామముగూడ ప్రఖ్యాతము. హిరణ్యగర్భప్రోక్తమగు నీశాస్త్రమే యోగమన బడక, శివప్రోక్తమనబరగు మరియొక యోగశాస్త్రము గనన య్యెడిని. అయ్యది తంత్రశాస్త్రమూలమున ప్రఖ్యాతము. శివ ప్రోక్తయోగము ఔపనిషదముగాక ఖిలవైదికమని ప్రతీతి గను టయు, నీహైరణ్యగర్భయోగము ఉపనిషదాధారమగుటయు గారణమున నిది రాజయోగమని కీర్తి గడించియున్నది. 105 మరియు (To a later period belong the treatises on Hatha Yoga which are practical manuals giving rules on the external aspects of Yoga, such as posture, breathing, diet and so on, as opposed to Raja Yoga of Patanjali, which is cheifly concerned with meditation)106 పాతంజల రాజయోగమునకు విరుద్ధముగ ఆసనప్రాణాయామా హారాది బాహ్య యోగాంగములకు నియమావళి విధించు హఠ యోగాదిక సంక్షిప్తగ్రంథములు తర్వాతకాలమున నుద్భవించెను. రాజయోగము ముఖ్యముగా సమాధిని గూర్చి వివరించును, అని (Macdonell) మాక్డోనెల్ రాజయోగ హఠయోగ తారతమ్యమును విశదీకరించెను. (The exercises of mental concentration are in ater Commentaries distinquished by the name of Raja Yoga, the external expedients are called KriyaYoga.)107 బాహ్యోపకరణములు క్రియా

105. నిర్మలానందస్వామి: భారతీయ తత్త్వశాస్త్రము 1 భా
106. Prof. A. A. Macdonell: India's Past
107. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p 385

యోగమనియు, మానసిక ధ్యానాదిక సాధనలు రాజయోగ మనియు విచక్షణము తర్వాతి వ్యాఖ్యాతలు గావించి యుండి రనియు నాతని భావము. ఈవిషయమునే చర్చించుచు (Yoga-tatwa speaks of four kinds of Yoga-Mantra Yoga, Laya Yoga, Hatha Yoga, and Raja Yoga. Patanjali's Yoga is of the last kind, since it deals at length with the powers of stilling the mind and attaining Samadhi.) 108 మంత్ర, లయ, హఠ, రాజ రూపమున యోగము చతుర్విధములని యోగతత్త్వము తెలుపుచున్నది. సమాధిప్రాప్తికొరకై మనోప శమనార్థ ముపయుక్తమగు శక్తుల వివరించుచున్నది గాన కడపటి దగు రాజయోగమే పాతంజల యోగమని రాధాకృష్ణుడుగూడ వ్రాసియున్నాడు. అంతియేగాక సాధనావతారమై అనుభవ స్వరూపుడగు శ్రీరామకృష్ణ పరమహంసదేవుడుగూడ క్రింది విధముగ వచించెను. (There are two kinds of Yoga, Hatha Yoga, and Raja Yoga. The Hatha Yogi practices physical exercises. His goal is to acquire super - natural powers: longivity and the eight psychic powers. But the aim of Raja Yoga is the attainment of devotion, ecstatic love, knowledge and renunciation. Of these two Raja Yoga is the better) 109 హఠయోగము రాజయోగము నా ద్వివిధయోగము గలదు. హఠయోగి శారీరక వ్యాయామము నభ్యసించును. అష్టసిద్ధులు చిరంజీవత్వములును అమానుష శక్తులే యతని గమ్యము. కాని రాజయోగము యొక్క

108. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p 338
109. Sri Ramakrishna: Gospel of Sri Ramakrishna p 168

గమ్యము భక్తిజ్ఞానవైరాగ్యములు భక్తున్మత్తతలుగా నుండును. ఈరెంటిలో రాజయోగ ముత్తమము. పైవాక్యముల ననుసరించి పాతంజలము కేవలము సమాధియను పరమావధినిగలిగి, చిత్తవృత్తినిరోధమే యోగమార్గముగ నిర్వచించి యుండుటచే, రాజయోగమును ప్రశస్తనామమున కెంతయు తగియున్నది.

మరియును పతంజలిమహర్షి ప్రోక్తమగుటచే పాతంజలమనియు పేరుగలదు. పూర్వోక్తరీతి సేశ్వర సాంఖ్యమనియు, సాంఖ్యసిద్ధాంతమునే గ్రహించి తత్సిద్ధి సాధనోపాయముల వివరించుటచే సాంఖ్య ప్రవచనమనియు వివిధరీతుల నీయోగశాస్త్రము వ్యవహరింప బడుచున్నది.



# పాతంజల యోగసూత్రములు

## 1. సమాధి పాదము

1 అథ యోగానుశాసనం
2 యోగశ్చిత్తవృత్తి నిరోధః
3 తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానం
4 వృత్తిసారూప్య మితరత్ర
5 వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః
6 ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతయః
7 ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని
8 విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రూప ప్రతిష్ఠం.
9 శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః
10 అభావప్రత్యయాలంబనా వృత్తి ర్నిద్రా
11 అనుభూత విషయాసంప్రమోషః స్మృతిః
12 అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః
13 తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః
14 స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః
15 దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యం
16 తత్పరం పురుషఖ్యాతేర్గుణ వైతృష్ణ్యం
17 వితర్క విచారానందాస్మితా రూపానుగమాత్సంప్రజ్ఞాతః
18 విరామ ప్రత్యయాభ్యాసపూర్వః సంస్కార శేషోఽన్యః
19 భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం
20 శ్రద్ధావీర్యస్మృతి సమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషాం

మున అనాదికాలమునుండి వ్యవహారమున నున్నట్టివే యనియు వివేకానందుని వాక్యము.

పై విషయ నిర్ధారణమునకై కొంత గ్రంథావలోడనము గావించినచో శంకరుడు అద్వైత సిద్ధాంతమునకు ప్రథమ నిర్మాత కాకుండుటయే గాక వ్యాఖ్యాతయు గాదనియు గ్రహించెదము. అతని గురుపాదులు గోవింద భగవత్పాదుల గ్రంథరచనము మనకు లభింపకపోయినను, నా భావముల శంకరునకు బోధించి రచనమునకు ప్రోత్సహించిన పూర్వద్వైతాచార్యుడు అతడు. కొంచెము వెనుకకు నేగినచో, నాతని గురువర్యుడనబడు గౌడ పాదాచార్యులు, స్పష్టముగ నద్వైతప్రబోధ గావించు మాండూక్యోపనిషత్తునకు అద్వైత వివరణమున నొక సిద్ధాంతరూపముగ అద్వైత తత్వమునకొక స్వరూపమొసంగి కారికలను వివరించి యుండుటచే, నాతడు శంకర పూర్వాద్వైతాచార్యులలో ప్రముఖ వ్యక్తియే. ఆ గౌడపాదునికిగూడ నాధారభూతమైన సూత్రకర్త బాదరాయణ వ్యాసుడును, అతఃపూర్వముండియున్న కాశకృత్స్నాదిక ఋషీశ్వరకోటియు, ఉపనిషదృషిసత్తములును, అతిప్రాచీన అద్వైతాచార్యకోటియే. అంతియగాక శంకరుడు తన రచనము లందైనను దా వివరించు సిద్ధాంతము స్వకల్పితమని వాకొన కుండుటయే గాక, his constant appeal to Sruti, is really to be taken as an acknowledgement of his past, of the debt he owed to his illustrious predecessors who gave him a clue, - - to the philosophy of which he afterwards become a

41 క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృగ్రహణ గ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిః

42 తత్ర శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః

43 స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవార్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా

44 ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా

45 సూక్ష్మవిషయత్వం చాలింగపర్యవసానం

46 తా ఏవ సబీజః సమాధిః

47 నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః

48 ఋతంభరా తత్ర ప్రజ్ఞా

49 శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్

50 తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ

51 తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః



## 2 సాధన పాదము

1 తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియా యోగః

సమాధి భావనార్థః క్లేశతనూకరణార్థశ్చ

3 అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః

4 అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్తతను విచ్ఛిన్నోదారాణాం

5 అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా

6 దృగ్దర్శన శక్త్యోరేకాత్మతేవాస్మితా

7 సుఖానుశయీ రాగః

8 దుఃఖానుశయీ ద్వేషః

9 స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః

10 తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః

11 ధ్యానహేయాస్తద్వృత్తయః

12 క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మవేదనీయః

13 సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః

14 తే హ్లాదపరితాపఫలాః పుణ్యాపుణ్యహేతుత్వాత్

15 పరిణామతాప సంస్కార దుఃఖైర్గుణవృత్తివిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః

16 హేయం దుఃఖమనాగతం

17 ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః

18 ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యం

19 విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి

20 ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః

21 తదర్థ ఏవ దృశ్యస్యాఽఽత్మా

22 కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్

23 స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుః సంయోగః

24 తస్య హేతురవిద్యా

25 తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యం

26 వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః

27 తస్య సప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా

28 యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః

29 యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యానసమాధయోఽష్టావంగాని

30 అహింసా సత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః

31 జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతం

32 శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః

33 వితర్కబాధనే ప్రతిపక్షభావనం

34 వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా లోభ క్రోధమోహపూర్వకా మృదుమధ్యాధిమాత్రా దుఃఖాజ్ఞానానంతఫలా ఇతి ప్రతిపక్షభావనం

35 అహింసాప్రతిష్ఠాయాం తత్సంనిధౌ వైరత్యాగః

36 సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం

37 అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం

38 బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః

39 అపరిగ్రహస్థైర్యే జన్మకథంతాసంబోధః

40 శౌచాత్స్వాంగజుగుప్సాపరైరసంసర్గః

41 సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేంద్రియ జయాత్మదర్శనయోగ్యత్వాని చ

42 సంతోషాదనుత్తమః సుఖలాభః

43 కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః

44 స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః

45 సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్

46 స్థిరసుఖమాసనం

47 ప్రయత్నశైథిల్యానంత సమాపత్తిభ్యాం

48 తతో ద్వంద్వానభిఘాతః
49 తస్మిన్సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః
50 బాహ్యాభ్యంతర స్తంభవృత్తిర్దేశకాల సంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః
51 బాహ్యాభ్యంతర విషయాక్షేపీచతుర్థః
52 తతః క్షీయతే ప్రకాశావరణం
53 ధారణాసు చ యోగ్యతా మనసః
54 స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః
55 తతః పరమా వశ్యతేంద్రియాణాం



## 3 విభూతి పాదము

1 దేశబంధశ్చిత్తస్య ధారణా
2 తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం
3 తదేవార్థ మాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః
4 త్రయమేకత్ర సంయమః
5 తజ్జయా త్ప్రజ్ఞాలోకః
6 తస్య భూమిషు వినియోగః
7 త్రయమంతరంగం పూర్వేభ్యః
8 తదపి బహిరంగం నిర్బీజస్య
9 వ్యుత్థాననిరోధ సంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధ క్షణచిత్తాన్వయో నిరోధపరిణామః

10 తస్య ప్రశాంతవాహితా సంస్కారాత్

11 సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయా చిత్తస్య సమాధి పరిణామః

12 తతః పునః శాంతోదితౌ తుల్యప్రత్యయా చిత్తస్యైకాగ్రతా పరిణామః

13 ఏతేన భూతేంద్రియేషు ధర్మలక్షణావస్థాపరిణామాః వ్యాఖ్యాతాః

14 శాంతోదితావ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ

15 క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః

16 పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానం

17 శబ్దార్థప్రత్యయానామితరేతరాధ్యాసాత్సంకరస్తత్ప్రవిభాగ సంయమాత్సర్వభూత రుతజ్ఞానం

18 సంస్కారసాక్షాత్కరణాత్పూర్వజాతిజ్ఞానం

19 ప్రత్యయస్య పరచిత్తజ్ఞానం

20 న చ తత్సాలంబనం తస్యావిషయీభూతత్వాత్

21 కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభే చక్షుఃప్రకాశాసంప్రయోగేంతర్ధానం

22 సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సంయమాదపరాంత జ్ఞానమరిష్టేభ్యో వా

23 మైత్ర్యాదిషు బలాని

24 బలేషు హస్తిబలాదీని

25 ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానం

26 భువనజ్ఞానం సూర్యే సంయమాత్

27 చంద్రే తారావ్యూహజ్ఞానం

28 ధ్రువే తద్గతిజ్ఞానం

29 నాభిచక్రే కాయవ్యూహజ్ఞానం

30 కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః

31 కూర్మనాడ్యాం స్థైర్యం

32 మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనం

33 ప్రాతిభాద్వా సర్వం

34 హృదయే చిత్తసంవిత్

35 సత్త్వపురుషయోరత్యంతాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థత్వాత్స్వార్థసంయమాత్పురుషజ్ఞానం

36 తతః ప్రాతిభశ్రావణవేదనాదర్శాస్వాదవార్తా జాయంతే

37 తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః

38 బంధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః

39 ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ

40 సమానజయాజ్జ్వలనం

41 శ్రోత్రాకాశయోః సంబంధసంయమాద్దివ్యం శ్రోత్రం

42 కాయాకాశయోః సంబంధసంయమాల్లఘుతూలసమాపత్తేశ్చాకాశగమనం

43 బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః

44 స్థూల స్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వసంయమా ద్భూతజయః

45 తతోఽణిమాది ప్రాదుర్భావః కాయసంపత్తద్ధర్మానభిఘాతశ్చ

46 రూపలావణ్య బల వజ్ర సంహననత్వాని కాయసంపత్
47 గ్రహణస్వరూపాస్మితాన్వయార్థవత్త్వ సంయమాదింద్రియ జయః
48 తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయశ్చ
49 సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ
50 తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యం
51 స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్
52 క్షణతత్క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానం
53 జాతి లక్షణ దేశైరన్యతానవచ్ఛేదాత్తుల్యయోస్తతః ప్రతిపత్తిః
54 తారకం సర్వవిషయం సర్వథావిషయమక్రమం చేతి వివేకజం జ్ఞానం
55 సత్త్వ పురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి.

---

## 4 కైవల్య పాదము.

1 జన్మౌషధి మంత్ర తపః సమాధిజాః సిద్ధయః
2 జాత్యంతర పరిణామః ప్రకృత్యాపూరాత్
3 నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్
4 నిర్మాణచిత్తాన్యస్మితా మాత్రాత్
5 ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషాం

6 తత్ర ధ్యానజమనాశయం
7 కర్మా శుక్లాకృష్ణం యోగినస్త్రివిధ మితరేషాం
8 తతస్తద్విపాకానుగుణానామేవాభివ్యక్తిర్వాసనానాం
9 జాతిదేశకాల వ్యవహితానామప్యానంతర్యం స్మృతిసంస్కా-
రయో రేక రూపత్వాత్
10 తాసా మనాదిత్వం చాఽఽశిషో నిత్యత్వాత్
11 హేతుఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వాదేషా మభావే
తదభావః
12 అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వభేదా ద్ధర్మాణాం
13 తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః
14 పరిణామైకత్వాద్వస్తుతత్త్వం
15 వస్తుసామ్యే చిత్తభేదా త్తయోర్విభక్తః పంథాః
16 న చైకచిత్తతంత్రం వస్తు తదప్రమాణకం తదా కిం స్యాత్
17 తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతం
18 సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయ స్తత్ప్రభోః పురుషస్యాపరిణామి
త్వాత్
19 న తత్స్వాభాసం దృశ్యత్వాత్
20 ఏకసమయే చోభయానవధారణం
21 చిత్తాంతర దృశ్యే బుద్ధిబుద్ధేరతిప్రసంగః స్మృతిసంకరశ్చ
22 చిత్తేరప్రతిసంక్రమాయా స్తదాగారాపత్తౌ స్వబుద్ధిసంవేదనం
23 ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థం
24 తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం సంహత్య కారి
త్వాత్
25 విశేష దర్శిన ఆత్మభావభావనానివృత్తిః

26 తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తం

27 తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః

28 హానమేషాం క్లేశవదుక్తం

29 ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘః సమాధిః

30 తతః క్లేశకర్మనివృత్తిః

31 తదా సర్వావరణ మలాపేతస్య జ్ఞానస్యాఽఽనంత్యాజ్జ్ఞేయమల్పం

32 తతః కృతార్థానాం పరిణామక్రమ సమాప్తిర్గుణానాం

33 క్షణ ప్రతియోగీ పరిణామాపరాంత నిర్గ్రాహ్యః క్రమః

34 పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి.

సంపూర్ణము



# యోగతత్త్వము

'Patanjali systematised the conceptions of the Yoga and set them forth on the back-ground of the metaphysics of the Sankhya' (Indian Philosophy Vol 2. 342) యోగభావముల గ్రమపరచుచు బతంజలి, సాంఖ్యసిద్ధాంతతమును ఆధారముగ గొనెను అను రాధాకృష్ణపండితుని వచనసరణి యోగశాస్త్రము సాంఖ్యతత్త్వవాదమును స్వీకరించెను. గావున 'విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి' (యో. సూ. 2.19) మొదలగు సూత్రములందును 'సాంఖ్యయోగాదయః' (యో. భా. 4.21) నాభాష్యపాఠముననుమరియు నింక ననేక సందర్భముల బ్రస్ఫుటముగ సాంఖ్యశబ్దస్మరణమేగాక సాంఖ్యసిద్ధాంతమును యోగశాస్త్ర మనువదించుచు, గపిల, పంచశిఖ, జైగీష్వ, వార్షగణ్యాది సాంఖ్యయోగిపుంగవ నామములనేగాక వారివాక్యముల బ్రమాణముల గైకొని సంస్తుతించి యున్నది యోగశాస్త్రము. అందుచే సిద్ధాంతికముగ యోగము సాంఖ్యపరమేయనుట నిస్సందేహము. కాని మొత్తము 195 సూత్రములలో జాల స్వల్పసంఖ్యాక సూత్రములు సిద్ధాంతప్రతిపాదనమున కుపయుక్తమగుచుండ నధికసంఖ్య సాధన **అనుభవ విషయ** మీమాంసయందే నిమగ్నమై యుండుటచే, శాస్త్రదృక్పథము సిద్ధాంతికము గాక సాధనాపరమని పూర్వమే వచింపబడియున్నది. కాని 'యథా చికిత్సాశాస్త్రం చతుర్వ్యూహం – రోగో రోగహేతు రారోగ్యం భైషజ్యమితి (యో. భా. 2.15) ఎట్లు వైద్యశాస్త్రమున రోగ రోగహేతు రారోగ్య

ఔషధములను చతుర్విధభాగములు గలవో 'ఏవమిదమపి శాస్త్రం చతుర్వ్యూహమేవ' అదే విధముగా నీశాస్త్రమును చతుర్విధము. ఎట్లన, 'సంసారః, సంసార హేతు ర్మోక్షో మోక్షోపాయ ఇతి' (యో. భా. 2.15) అనురీతి చతుర్విధ మీ శాస్త్రము. అందు 'దుఃఖబహుళః సంసారో హేయః, ప్రధానపురుషయోః సంయోగో హేయ హేతుః, సంయోగ స్యాఽత్యంతికీ నివృత్తిర్హానం, హానోపాయః సమ్యగ్దర్శనం' (యో.భా.2.15) దుఃఖబహుళత్వ కారణమున సంసారము హేయమగుచున్నది. ప్రధానపురుషసంయోగమే హేయకారణము. సంయోగనివృత్తియే నిరాసము. సమ్యగ్దర్శనమే ఉపాయము, అను వ్యాసవాక్యానుసారము పరమావధియగు కైవల్యా ప్తికి సాధన ఎంత అవసరమో సిద్ధాంతముగూడ అంత ఆవశ్యకమగుటుచే, సాధనాభాగమును సంపూర్ణముగ వివరించుచు, సాధనాదృష్టి నెట కేంద్రీకరింపవలయునో యను సిద్ధాంతవిషయములగూడా యిందు పతంజలి మునీంద్రులు క్లుప్తముగ వివరించియున్నారు. కాన మనముగూడ యోకించుక యోగ సిద్ధాంతభాగమును గ్రహింప యత్నించెదముగాక.

---

## పురుష ప్రధాన విషయము

'ఆకారః స్వరూపం సదా విశుద్ధిః శీలమౌదాసీన్యం విద్యాచైతన్యం' (యో.భా.వా 2.6) పురుషుడు స్వరూపతః దా పరిశుద్ధుడును, ఉదాసీనశీలుడును, చైతన్యుడును, 'వివేకః

శుద్ధః' (యో భా.వా.1.16) పురుషుడు వివేకుడు శుద్ధుడు 'పురుషః శుద్ధః ప్రసన్నః కేవలోనుపసర్గః' (యో.భా.1.29) పురుషుడు శుద్ధుడు, ప్రసన్నుడు, కేవలుడు, దుఃఖరహితుడు, 'పురుషముదాసీనః' (యో.భా.వా.2,17) పురుషు డుదాసీనుడు మొదలగు వాక్యములచే బురుషుడు స్వరూపతః విశుద్ధుడై ఉదాసీనుడై చైతన్యమాత్రుడై యుండుటయు విదితము, ఉదాసీనత్వము ననే ప్రసన్నతయు. దానివలన దుఃఖాభావము నేర్పడుచున్నవి. అందుచే నతడు 'నిష్క్రియః పురుషః' (యో భా.1.9) 'నిష్క్రియో క్షేత్రజ్ఞో' (యో,భా.2.17) నా వాక్యములరీతి బురుషుడు నిష్క్రియుడునై యొప్పారుచున్నాడు. నిష్క్రియత్వ మెప్పుడు గలదో యప్పుడతడు 'అనుత్పత్తిధర్మా పురుషః'(యో.సూ.4.18) అను చందము జన్మాద్యవస్థలు లేనివాడై 'పురుషస్యాపరిణామిత్వాత్' (యో.సూ.4.18) 'అపరిణామిని' (యో.భా.2,17;4.22) మొదలగు వచనప్రకారము పరిణామముల కతీతుడై 'యస్మిన్పరిణమ్యమానేతత్త్వంనవిహన్యతేతన్నిత్యం' (యో.భా.4.33) పరిణమించినను దేని తత్త్వము నశింపదో అది నిత్యమన బడు పరిణామినిత్యము గూడగాక, 'ద్వయీచేయం నిత్యతా కూటస్థనిత్యతా పరిణామినిత్యతా' కూటస్థ పరిణామి నిత్యములనబరగు రెంటిలో 'తత్ర కూటస్థనిత్యతా పురుషస్య' (యో.భా.4.33) వ్యాసప్రోక్తమురీతి కూటస్థనిత్యమై స్వభావతః ప్రచ్యుతము కాని నిత్యమై పురుషుడున్నాడు. అట్లు నిర్వికారుడగుటచే 'శుద్ధః కూటస్థనిత్యతయోదయవ్యయరహితః' (యో.భా.వా.1.16) శుద్ధమనగా కూటస్థుడై జన్మమరణములు లేనివాడును 'ప్రసన్నః క్లేశవర్జితః (యో.భా.వా.1.16) క్లేశవిరహిత

మైన ప్రసన్నుడును. 'కేవలోధర్మాధర్మోపేతః'(యో.భా.వా. 1.16) ధర్మాధర్మాతీత కేవలుడునునై ప్రకాశించుచు 'పురుషః శుద్ధోఽనంతః' (యో.భా వా. 1.16) అనంతరూపుడై పురుషుడుండును. అందు చే స్థూలత్వమిసుమంతయు నుండజాలదు. గాన నతడు 'పురుషః సూక్ష్మ ఇతి' (యో.భా.1 45) నతడతి సూక్ష్మమై తనరొందుచున్నాడు.

అయినను 'ఇదమనాది దుఃఖస్రోతః' (యో.భా.2.15)అన్నటుల యీదుఃఖప్రసంతతి యనాదియగుటవలన, 'అనాదవిద్యా' (యో.భా.వా.1.4) అనాదియు 'మోహరూపాఽవిద్యా' (యో భో.2.24) మోహరూపమును అగు అవిద్యచే బురుషుడు ఆకర్షింపబడిన ట్లగుచున్నది. అంత హేయహేతువైన 'ప్రధాన పురుషసంయోగ' (యో.భా.2.15) ము గలుగుచున్నది.

ఇక బ్రధానవిషయముగూడ నొకించుక గ్రహించుట యవసరము. ప్రధానమన 'లింగమాత్రస్యాప్యలింగం సూక్ష్మో విషయః। న చాలింగాత్పరం సూక్ష్మమస్తి" (యో.భా.1,45) లింగముకంటె నలింగము సూక్ష్మము. ఆయలింగముకంటె సూక్ష్మతరము లేదనియు 'సూక్ష్మవిషయత్వం చాలింగపర్యవసానం' (యో.సూ 1 45) అలింగముతో సూక్ష్మవిషయత్వము సంపూర్ణమగును, అను సూత్రవాక్యము ప్రకారము అతి సూక్ష్మత త్త్వము యీప్రధానము, అదియే'ప్రధీయత అధీయతే విశ్వం కార్యమేభిః' (యో.భా.వా.2.18) అను వ్యుత్పత్తిప్రకారము సర్వవిశ్వమును బోషించునదనుటచే ననాదియగు సర్గకు అధిష్ఠానమై యవిద్యాసంబంధమున బురుషసన్నిధానమునకు

జేయును. ప్రధానావిద్యా సంబంధ మెద్దియన చూతము. సర్గాంతరమున అవిద్య స్వచిత్తముతో సహా ప్రధానములో లయించి యుండును. సర్గారంభమున ప్రధానము 'తత్తత్పురుష సంయోగినీం తాదృశమేన బుద్ధిం సృజతి' (యో.భా.వా. 2. 24) ఆయా పురుష సంబంధియగు బుద్ధిని బూర్వమువలె సృజించుచుండును. 'ఏవం పూర్వపూర్వసర్గేష్విత్యనాదిత్వాత్' (యో. భా. వా.2.24) ఇట్లు పూర్వపూర్వసర్గము ననుసరించి సర్గము నాది యగుచుండును, అనగా 'అవిద్యా స్వచిత్తేన సహా నిరుద్ధా స్వచిత్తస్యోత్పత్తి బీజం' (యో. భా.2.24) అవిద్య తన చిత్తముతో లయించి మరల స్వచిత్తమునకు ఉత్పత్తిబీజ మగుచుండ 'ప్రధీయతే జన్యతే వికారజాతమనేనేతి ప్రధానం' (యో.భా. వా.2.23) కార్యజాతమగు ప్రపంచమును జనింపజేయునది ప్రధాన మగుచున్నది. అట్లు సర్వమునకు నుపాదానత్వము నొందుచున్నది యీ ప్రధానము. 'ఏతే గుణాః ప్రధాన శబ్ద వాచ్యా భవంతి' (యో.భా.వా. 2 18) ఈగుణములే ప్రధాన శబ్దమున వ్యవహరింప బడుచున్నవను వాచస్పతి వాక్యమురీతి ప్రధానమే త్రిగుణరూపము. కాని 'సత్త్వరజస్తమసాం సామ్యావస్థా న క్వచిత్పురుషార్థ ఉపయుజ్యత' (యో.భా.వా.2.19) ఆప్రధానము సత్త్వరజస్తమసముల సామ్యావస్థలో నున్నకాలమున పురుషార్థముల కుపకరింప జాలకుండును. అనగా నాదిలో 'నిస్సత్తా సత్త' (యో.భా 2.19) రూప 'అలింగావస్థాయాం న పురుషార్థో హేతుః' (యో.భా.2.19) అలింగావస్థకు బురుషార్థతకారణము కానేరదు. అందుచేత 'నాసౌ పురుషార్థ కృతేతి నిత్యాఖ్యాయతే' (యో.భా.2.19) పురుషార్థకృతము

కాకుండుటచే నీలింగమునాబడు ప్రధానము నిత్యము నాబడియు న్నది. అయినను ప్రధాన వికారములగు 'త్రయాణాం త్వవస్థా విశేషాణా మాదౌ పురుషార్థతా కారణం భవతి' (యో.భా, 2.19) లింగ మాత్రావిశేషవిశేషము లనబడు మూడింటికి ప్రథమకారణము పురుషార్థత యగుచున్నది. అదియే వీనికి 'అర్థోహేతుర్నిమిత్తం కారణం భవతి' (యో.భా.2.19) అర్థత్వము హేతుత్వమును నిమిత్తకారణమును అగుచున్నది. అందుచే ప్రస్తుతమగు ప్రధానము అకారణమని నిర్ణయము. అది అలింగ మనబడినట్లును విస్పష్టము.

పూర్వోక్తముగ లింగమాత్ర మనబరగు మహత్తు 'సత్తామాత్ర' మున బురుషార్థతను గలిగియుండుటచే, నందంతర్గతమై యున్న అవిద్యాప్రాబల్యముచే చిద్రూపుడైన పురుషునియొక్క ప్రతిబింబము బుద్ధి నాబడు మహత్తు నం దేర్పడుచున్నది. ఇట్లు సంభవించిన పురుషప్రధాన సంబంధమునే హేయమైన 'ద్రష్టృదృశ్యయోః సంయోగః' (యో. సూ. 2. 17) ద్రష్టృదృశ్య సంయోగమనియు, పురుష బుద్ధి (యో. భా. వా. 1. 3) సంయోగమనియు, ప్రకృతిపురుష సంయోగ (యో.భా,1.24) మనియు సత్త్వపురుష (యో.భా.2.2) సంబంధమనియు, మొదలగు రీతుల వ్యవహరింపబడుచున్నది. సామాన్యదృష్టి కీపదము లన్నియు బర్యాయములవలె గోచరించినను, విశేషదృష్టికి వ్యత్యస్తములు. పూర్వగ్రంథమున వివరింపబడినట్లు, పురుషుడుగాని ప్రధానముగాని యథాతథముగా భోగాపవర్గకారణములు కాదు. అయినను 'యథా జయః పరాజయో వా యోద్ధృషు వర్తమానః స్వామిని వ్యపదిశ్యతే' (యో.భా.1,24) జయాపజయ

ములు యథార్థమునకు యోధులకు జెందియున్నను, వారిస్వామి కన్వయింపబడినట్లు పురుషునకును ప్రధానమునకును నీసంబంధ మన్వయింపబడుచున్నది. త్రిగుణవిశిష్టమైన ప్రధానమునందుగల సామ్యావస్థలో అనాద్యవిద్యా సంజనిత సంచలన మేర్పడుట తోడనే గుణములు 'పరిణామినిత్యతా గుణానాం' (యో. భా. 4. 33) అన్నట్లు పరిణామినిత్యములుగాన వానియందు విషమ పరిణామ మేర్పడినప్పుడు సత్త్వాధిక్యతచే మహత్తు ప్రధానము నుండి యేర్పడుచున్నది. దానినే బుద్ధి యనియు, 'పురుషార్థ క్రియాక్షమం సత్తస్య భావః సత్తా' (యో. భా. వా. 2.19) పురుషార్థక్రియా కారకత్వముగలది సత్తా యనుటచే, 'తన్మాత్రం తన్మహత్తత్త్వం' (యో. భా. వా. 2.19) అదియే మహత్తు అనురీతి సత్తాయనియు, సత్త్వప్రాధాన్య లక్షణయగుటచే సత్త్వ మనియు వివిధ విధానముల నీబుద్ధి వచింపబడును.

ఈబుద్ధి 'ప్రకాశః సత్త్వస్య ధర్మః' (యో. భో. 2.18) ప్రకాశలక్షణయగు సత్త్వగుణప్రధానమై యుండుటచే ప్రకాశ భూయిష్ఠయై 'శాంత' (యో భా. వా. 1.4) స్థితినుండి 'సత్త్వం ప్రకాశసుఖాత్మకః ప్రాధానికః పరిణామవిశేషః' (యో. భో. 3. 35) సత్త్వమునాబడు బుద్ధి ప్రకాశ సుఖస్వరూపమై ముఖ్యముగా బరిణామ విశేషమైనది కావునను, 'స్వతంత్రమపి' (యో. భా. 2. 17) నైజమున స్వతంత్రమైయున్నను, 'వస్తుతో బుద్ధి సత్త్వం స్వాద్భవేత్స్వయం ప్రకాశం' (యో. భా. వా. 2.17) స్వతః స్వయంప్రకాశమై యున్నను, 'తయోర్దృగ్దర్శనశక్త్యోరనాది రర్థకృతః" (యో. భా. 2. 17) పురుషార్థమై దృగ్దృశ్యసంబంధ మనాదిబద్ధమగుటచేత 'నతు బుద్ధిబోధరహితో౽తో౽స్య పురు

షస్య బుద్ధిబోధః స్వభావః సవితురివ ప్రకాశః' (యో.భా.వా.
1.3) బుద్ధి కన్యముగ బురుషుడు గోచరింపడు కావున, బుద్ధి
బోధ పురుషునకు సూర్యునికి ప్రకాశమువలె నవినాభావసంబంధ
మున నుండును, కాన, 'సన్నిధిమాత్రోపకారిణో ఽ
యస్కాంతమణి కల్పాః' సన్నిధిమాత్రమునసే పురుషార్థ
ముల కుపకారిణియై అయస్కాంతమువలె బురుషు నాకర్షించి
'యథా హి చంద్రమసః' (యో.భా.వా.4 22) జలములో
జంద్ర ప్రతిబింబమువలె 'చంద్రమస ఇవ స్వచ్ఛసలిల ప్రతిబింబి
తస్య' (యో.భా.వా.3.35) స్వచ్ఛజలమున శశిప్రతిబింబమును
వలె బురుషుని తనలో దర్పణమందు బ్రతిబింబములువలె
'చితేః స్వబుద్ధిసంవేదనం బుద్ధేస్తదాకారాపత్తౌ చితిప్రతిబింబా
ధారతయా తద్రూపతాపత్తౌ సత్యాం' (యో.భా.వా.4.22)
పురుషునియొక్క స్వబుద్ధిగ్రహణము, బుద్ధి పురుషాకృతిని బొంది
నప్పుడు, అనగా దనలో పురుషుని ప్రతిబింబింపజేసికొని ఆయా
కృతిని బొందినపుడు గలుగునన్నట్లు, పురుషుని బ్రతిబింబమును
బుద్ధి గ్రహించుచున్నది.

అట్లు ప్రతిబింబ మేర్పడుతోడ, నంతవరకు స్వతంత్రుడై
యున్న పురుషుడు, 'ద్రష్టా బుద్ధేః ప్రతిసంవేదీ పురుషః (యో.
భా.2.17) బుద్ధిలో బ్రతిబింబింపగా ద్రష్టయగుననియు, 'న
పురుషో బుద్ధేః ప్రతిసంవేదీ' (యో.భా.2.20) బుద్ధిలో బ్రతి
బింబించిన పురుషుడనియు, 'బుద్ధౌ సన్నిధిమాత్రేణైవ పురు
షస్య ద్రష్టృత్వం' (యో.భో.2.20) బుద్ధియొక్క సన్నిధిమా
త్రముచేతనే పురుషునకు ద్రష్టృత్వమనియు, మొదలగు వాక్యము
లరీతి నతడు దృక్కనియు, ద్రష్టయనియు వ్యవహారము నొందిన

వాడగుచున్నాడు. అంత నతడు, 'బుద్ధేశ్చైతన్యబింబోద్గ్రాహేణ చైతన్యస్య శాంతాద్యాకారాధ్యారోపశ్చంద్రమస ఇవ' (యో. భా. వా. 3.35) బుద్ధిలో పురుషుడు ప్రతిబింబింపగ జలచంద్ర న్యాయమున శాంత ఘోర మూఢ చిత్తవృత్తులు పురుషునకు అధ్యారోప మగుచున్నవి. అయినను యథార్థమునకు 'యథా నిర్మలే జలేఽసంక్రాంతోఽపి చంద్రమాః సంక్రాంతప్రతిబింబతయా సంక్రాంత ఇవ, ఏవమత్యసంక్రాంతాపి సంక్రాంతప్రతిబింబా చితిశక్తిః సంక్రాంతేవ' (యో. భా. వా. 2.20) ఎట్లు నిర్మలజలమునకు జంద్రబింబము సంక్రమింపకున్నను, ప్రతిబింబ రూపమునసంక్రమింపన ట్లున్నవిధాన, చితిశక్తియు బుద్ధియందు స్వరూపతః సంక్రమింపకున్నను, ప్రతిబింబరూపమున సంక్రమించినట్లగుచు, దానెట్టి వికారములను చెందకున్నది. 'పురుషస్య హి చైతన్యం స్వరూపమనౌపాధికం' (యో. భా. వా. 1.3) పురుషచైతన్యస్వరూపము ఉపాధిశూన్యము గలదియయ్యు 'శాంతాదిరూప ఔపాధికో హి స స్ఫటికస్యేవ స్వభావ స్వచ్ఛ ధవళస్య జపాకుసుమ సన్నిధానోపాధి రరుణిమా' (యో. భా. వా. 1.13) శాంతాది యుపాధిసహితుడై యుండియు, స్ఫటికము స్వభావతః శుద్ధ శుక్లమైయుండియు జపాకుసుమ సన్నిధానముచే రక్తవర్ణమును పొందినట్లు, 'న ఖలు శుక్తికాయాః ప్రమాణ విపర్యయ జ్ఞానగోచరత్వేపి స్వరూపోదయవ్యయౌ భవతః' (యో. భా. వా. 1.3) ముత్యపుచిప్ప ప్రమాణ భ్రాంతి కాలముల స్వభావవ్యతిరిక్త స్వరూపముల ధరించుటయు త్యజించుటయు లేనట్లు, 'న జాతు కూటస్థనిత్యా చితిశక్తిః స్వరూపాచ్చ్యవతే' (యో. భా. వా. 1.3) చితిశక్తి కూటస్థనిత్యమగుటచే స్వరూప

వికారము నేమాత్రమునొందక పురుషుడు ద్రష్టృత్వాదికము నొందినట్లుగ గోచరించును.

ఈవిధముగ నేర్పడిన కల్పితమైన పురుషబుద్ధి సంయోగజమైన అన్యోన్యాధ్యాస ఫలితముగ 'అపరిణామినీ హి భోక్తృశక్తి రప్రతి సంక్రమా చ పరిణామన్యర్థే ప్రతిసంక్రాంతేవ తద్వృత్తిమనుపతీతి' (యో.భా.4.22) అపరిణామియైనను భోక్తృశక్తి బుద్ధి ప్రతిబింబముకాగా బుద్ధివృత్తుల నొందుచున్నది. అనగా బురుషుడు 'ఏతేన గ్రహణ ధారణోహాపోహతత్త్వజ్ఞానాభినివేశా బుద్ధౌ వర్తమానాః పురుషేఽధ్యారోపిత సద్భావాః। స హి తత్ఫలస్య భోక్తేతి' (యో.భా.2,18) గ్రహణాది అభినివేశ పర్యంత వృత్తులన్నియు యథార్థముగ బుద్ధిగతములైయున్నను, పురుషునిపై నధ్యారోపితములై యుండుటచే దత్ఫలితముగ నతడు భోక్త యనబడుచున్నాడు. ఇక బుద్ధి యన్ననో 'స్వరూపం తు పరరూపేణ' (యో.భా.2.21) పరరూపమును ధరించి, 'చిత్తం సర్వార్థగ్రహణసమర్థం భవతి' (యో.భో.4.22) సర్వార్థగ్రహణ సామర్థ్యమును బొంది చేతనమువలె ప్రవర్తించును. ఈవిధాన నుభయులును, 'అనాదిరర్థకృతః సంయోగః' (యో.భా 2.17) అనాదియగు పురుషార్థకృత సంయోమున బద్ధులై, 'హేయహేతు' (యో.సూ.2.17) బాంధవ్యమున జిక్కి, 'వ్యుత్థానే యాశ్చిత్తవృత్తయ స్తదవిశిష్టవృత్తిః పురుషః' (యో.భా.1.4) బుద్ధిగత చిత్తవృత్తులలో వ్యుత్థానస్థితి యనబడు సర్గమున నేకీభూతమునొంది 'దృశ్యత్వేన స్వం భవతి పురుషస్య స్వామినః' (యో.భా.1.4,2.17) స్వామియగు పురుషునికి చిత్తము దృశ్యత్వముచే స్వామ్యమగుచున్నది. అనగా

'పురుషః స్వామీ దృశ్యేన స్వేన' (యో.భా.2.23) దృశ్యత్వ ముచే బుద్ధి స్వామ్యముగను, పురుషుడు స్వామిగ నగుచున్నా రని తాత్పర్యము. 'అత ఏవ చ శబ్దాద్యాకార పరిణత బుద్ధి సత్త్వోపనీతాం శబ్దాదీన్ భుంజానః స్వామీ భవతి ద్రష్టా' (యో భా. వా. 2.17) అందుచే బుద్ధి సత్త్వ వికారములగు శబ్దాదుల ననుభవించు భోక్తయగు ద్రష్టయే స్వామి యగు చుండ, 'తాదృశం చాస్య బుద్ధి సత్త్వం స్వం భవతి' (యో. భా.వా.2.17) తత్సంబంధియగు బుద్ధి అతనికి స్వామ్య మగు చున్నదను వాక్యానుసరణి. యీ సంయోగానంతరము వీనికి స్వామ్యస్వామి భావసంబంధముండుటయేగాక 'స హి తత్ఫలస్య భోక్తేతి' (యో.భా.1.24) తత్ఫలముల కతడే భోక్త యగుట చేతను, 'అస్తి చ పురుషస్య భోక్తృశక్తిశ్చిత్తస్య భోగ్యశక్తిః' (యో.భా.వా.1.4,2 6) పురుషునికి భోగించుశక్తియు, చిత్తము నకు భోగింపబడు శక్తియు నుండుటచే, భోక్తృభోగ్య భావసం బంధమును, 'దృగ్దర్శన శక్త్యోః' (యో.భా.2.6) దృగ్దర్శనశక్తు లనగా 'పురుషో దృక్శక్తిర్బుద్ధిర్దర్శన శక్తిః' (యో. భా. 2.6) పురుషుడు దృక్శక్తియు బుద్ధి దర్శనశక్తి యనబడుటచే దృగ్దర్శన భావసంబంధమును, 'ద్రష్టా చిద్రూపః పురుషః దృశ్యం బుద్ధి సత్త్వం' (యో.భో.2.17) చిద్రూపుడైన పురుషుడు ద్రష్ట, బుద్ధి సత్త్వము దృశ్యమనియు 'ద్రష్టృ దృశ్యయోః సంయోగః' (యో.సూ.2.17) ద్రష్టృ దృశ్యముల సంయోగము అను వాక్య ములచేత ద్రష్టృదృశ్య భావసంబంధము అనియు ననేకవిధముల నేకార్థముతోడనే వివరింపబడియున్నది. బుద్ధిసత్త్వ సంయోగ జనితముగ 'వ్యుత్థాన' ము నాబడు అనాది సర్గ మేర్పడు చున్నది. అదెట్లు సంప్రాప్తించెనో చూచెదముగాక.

everything; Indra by His maya (creative illussion) moves in many forms, verily his bay steeds are yoked a thousand times [174] సర్వరూపములకు నతడే ప్రమాణము. అతని రూపమే అఖిలమును దర్శించును. ఇంద్రుడు తన సృష్టికారక మాయాశక్తిచే ననేక రూపముల జరించును. అతని సకిలించు హయములు సహస్రాధిక పర్యాయములు సంధింపబడినవి అని ఎ. సి. బోసు అర్థమును గ్రహించుటతో దాత్పర్యభేదము ఏర్పడుచున్నది. ఇదే మంత్రమును బృహదారణ్యకోపనిషత్తు స్వీకరించి, దీనికి ముందు 'పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః। పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్' అతడు ద్విపాద చతుష్పాదముల సృజించెను. ఆ శరీరములలో నా పురుషోత్తముడు పక్షిరూపమున ప్రథమమున ప్రవేశించెను అని వివరించుచు, 'స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః, నైనేన కించన నానావృతం, నైనేన కించనా సంవృతం॥' (బృ.2.5.18) సకల శరీరముల నతడు వసించుచుండుటచే నతడు పురుషుడనబడెను. అతనిచే నావృతము గానిదేదియును లేదు. అతనిచే వ్యాప్తము కానిదెద్దియును లేదు అని సృష్టికర్తను, సృష్టివిధానమును ప్రస్తావించి, తర్వాత 'రూపం రూపం....' అను మంత్రమును వివరించియున్నది. ఆ మంత్రమునకు He transformed Himself in accordance with each form of His was for the sake of making Him known. The Lord on account of Maya (notions of superimposed by

---

174. A. C. Bose: The Call of the Vedas, p 172.

కారణములుగా నాదిలో నేర్పడుటచే నవి పురుషునివోలె, అప రిణామి నిత్యములుగాక, పరిణామి నిత్యమనాంబడు ప్రధానజనిత ములై యున్నవని యర్థమేర్పడుచున్నది. అనగా నవి బీజన్యాయ మున సామ్యావస్థకాలమున బ్రధానమునం దంతర్గతమైయుండి, వ్యుత్థానకాలమున వ్యక్తమగుచుండునని తాత్పర్యము. అట్లు వ్యక్తరూపమును అవి దాల్చుటకు అందు లీనమయియున్న సంస్కారములు హేతువులగుచున్నవి. ఎట్లన:

'తథా జాతీయకాః సంస్కారా వృత్తిభి రేవ క్రియంతే। సంస్కారైశ్చ వృత్తయ ఇతి' (యో. భా,1.5) ఒకేజాతి సంస్కా రము లాయా జాతివృత్తుల గలుగజేయుచున్నవి. మరియు నావృత్తులు సంస్కారముల నుదయింపజేయును. 'ఏవం వృత్తి సంస్కారచక్రమనిశ మావర్తతే' (యో. భా,1.5) ఈసంస్కార వృత్తిచక్రము అవిచ్ఛిన్నలీల పరిభ్రమించుచుండును. కాని 'తదేవంభూతం చిత్తమవసి తాధికారమాత్మకల్పేన వ్యవతిష్ఠతే ప్రళయం వా గచ్ఛతీతి' (యో. భా. 1.5) అట్లు పరిభ్రమించు చున్న బుద్ధి, స్వకార్య నిర్వృత్తి నొందినప్పుడు, పురుషాకృతిని గాని, ప్రళయమునుగాని పొందుననియు, 'క్లేశ కర్మతద్వాసనా సంతానశ్చాయమనాదిః ప్రతిసర్గావస్థాయాం చ సహాంతఃకర ణేన ప్రధానసామ్య ముపగతోఽపి సర్గాదౌ పునస్తాదృగేవ ప్రాదుర్భవతి' (యో. భా. వా. 2.17) క్లేశకర్మ వాసనాప్రవా హము నిత్యము. ప్రతి సర్గాంతమున నవి యంతఃకరణముతో బ్రధానమునందు లయించి, సర్గోద్భవకాలమున నవి మరల పూర్వస్థితితో నావిర్భవించుచుండును. ఎట్లన 'వర్షాపాయ ఇవో ద్భిజ్జభేదో మృద్భావముపగతోఽపి పునర్వర్షాసు పూర్వరూప

ఇతి' (యో. భా. వా. 2.17) ఉద్భిజ్జములగు మొక్కలు కొన్ని వర్షాభావమున మృల్లయము నొందినవియై వర్షాగమనమున నమ పూర్వరూపముల నెట్లావిర్భవించుచున్నవో యనుదృష్టాంత మీయబడినది. అందుచే సృష్టితత్త్వ మహాదియైనను, అది యావిర్భావ తిరోభావ రూపమగుటచే సృష్టిచింతన యవసర విచారణీయము.

మరియు సృష్టికల్పనమున నీశ్వర సంబంధముగూడ యొకించుక యున్నట్లు వినెతము. ఎట్లన, 'తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం' (యో. సూ. 1.25) ఈశ్వరునియందు నిరతిశయమైన సర్వజ్ఞబీజము గలదు. 'ఏతద్వివర్ధమానం యత్ర నిరత్యంత, మతిశయాత్స సర్వజ్ఞ ఇతి' (యో. భా. వా. 1 25) ఏజ్ఞానము అభివృద్ధి పరిణామముల దాటియుండునో అట్టి సర్వజ్ఞత్వమును గలిగి 'ఈశనశీల' (యో. భో. 1, 24) యగు యీశ్వరుడు 'ఇచ్ఛామాత్రేణ సకలజగదుద్ధరణ క్షము' డై (యో. భో 1 24) 'ప్రకృతిపురుష సంయోగ వియోగయోరీశ్వరేచ్ఛావ్యతిరేకే ణానుపపత్తేః' (యో. భో. 1. 4) ప్రకృతిపురుష సంయోగవియోగములు యీశ్వరసంకల్పము వినా జరుగవు. కావున 'తస్య స్వప్రయోజనాభావే' (యో. భో. 1.25) అతనికి స్వప్రయోజనము దానివలన లేకున్నను, 'తస్యాఽత్మానుగ్రహాభావేఽపి భూతానుగ్రహః ప్రయోజనం' (యో. భా. 1.25) సృష్టికార్యమున నతనికి స్వార్థము లేకున్నను, జీవుల ననుగ్రహించు ప్రయోజనాపేక్షచే, 'కారుణికత్వాత్' (యో. భో. 1.25) కరుణావిశేషమున 'జ్ఞాన ధర్మోపదేశేన కల్ప ప్రళయ మహాప్రళయేషు సంసారిణః పురుషానుద్ధరిష్యామి' (యో. భా. 1.25) జ్ఞాన

ధర్మోపదేశమూలమున కల్పప్రళయ మహాప్రళయరూప సంసారములో ఆపురుషులు మఱలమరల జనింపకుండ నే నుద్ధరింతు నను సంకల్పమున నీశ్వరుడుగూడ సృష్టి కిసుమంత కారణు డగుచున్నాడు.

కాని 'సంసారిణః' అనుటచే నీశ్వరుడు అనాద్యవిద్యా బద్ధజీవుల సృష్టికే కారణమగుచున్నట్లు విదితము. అనగా నజ్ఞ జీవుల ననుగ్రహించి యుపదేశించి, తరింపజేయుట కుపయుక్త మగుచున్నాడనుట ప్రస్ఫుటము. కాన నీశ్వరసంకల్పమునకు గూడ, పురుషాంతరమగు సంస్కార సంతానరూప కర్మాశయ మును, తదధిష్ఠాతయగు అవిద్యయు బరమకారణము లనదగును. వీని గొంత విచారింతము.

'కర్మా శుక్లాకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం' (యో, సూ.4.7) కృష్ణ, శుక్లకృష్ణ, శుక్ల, శుక్లకృష్ణరహిత రూప మున కర్మ చతుర్విధములు. అనగా 'తత్ర కృష్ణా దురాత్మ నాం' (యో,భా.4.7) దురాత్ములకు జెందినది కృష్ణము. 'శుక్ల కృష్ణా బహిః సాధనసాధ్యా' (యో, భా. 4. 7) శుక్లకృష్ణము బాహ్యసాధనాపరమై పరపీడనానుగ్రహద్వారమున నుండును. 'శుక్లా తపఃస్వాధ్యాయధ్యానవతాం' శుక్లము తపఃస్వాధ్యాయ ధ్యాన పరులదై పరపీడాదూరమై యొప్పారును. 'అశుక్లాకృష్ణా సన్న్యాసినాం' అశుక్లకృష్ణము క్షీణక్లేశులగు సన్న్యాసులకు జెందినది. 'తతః స్తద్విపాకానుగుణానామేవాభివ్యక్తిర్వాసనానాం' (యో. సూ.4.8) యీ చతుర్విధ కర్మలనుండి ఆయా కర్మ విపాకముకొరకు వాసన లభివ్యక్తములగును. అట్లు కర్మ జనిత మగు వాసనాచయము 'జాతిదేశకాల వ్యవహితానామ ప్యానం

తర్యం స్మృతిసంస్కారయో రేక రూపత్వాత్' (యో.సూ.4.9) స్మృతి సంస్కారములకు నైక్యముండుటచే జన్మకాల దేశభేదము లేర్పడినను ప్రవాహమువలె నవిచ్ఛిన్నముగ నుండును. అనగా జన్మదేశకాలభేదముల బురుషునిలో భేదములు గోచరించినను, సంస్కార స్మృతి యైక్యతాసంబంధము యెడతెగనిదిగ నుండు నని భావము. ఎట్లన 'యథాఽనుభవా స్తథాసంస్కారాః। తే చ కర్మవాసనానురూపాః' (యో.భా.4.9) అనుభవము నను సరించి సంస్కారములుండును. అవి కర్మవాసనా రూపములు. మరల 'యథా చ వాసనా స్తథాస్మృతిః' (యో. భా. 4. 9) వాసనల ననుసరించి స్మృతియుండును, ఈ రెండును పరస్పరా పేక్షికములై 'సంస్కారేభ్యః స్మృతిః। స్మృతేశ్చ పునః సంస్కారాః' (యో.భా.4.9) సంస్కారములనుండి స్మృతియు మరల స్మృతినుండి సంస్కారములు నుద్భవించుచు, వాని నిమిత్త నైమిత్తిక భావమవిచ్ఛిన్నమై యుండును. అదియును గాక 'తాసామనాదిత్వం చాఽఽశిషో నిత్యత్వాత్' (యో. సూ.4.10) తృష్ణ నిత్యమగుటచే స్మృతి సంస్కారములు గూడ యనాది యగుచున్నవి. ఈవిధముగ స్మృతి సంస్కారరూప ప్రవాహ మనాదియై పురుష కర్మ బద్ధత్వమునకు హేతువగు చున్నది.

అంతియగాక 'క్లేశమూలః కర్మాశయః' (యో.సూ.2 12) పైనుదహరింపబడిన వాసనారూప కర్మాశయమునకు క్లేశ ములే మూలము. ఆకర్మాశయము 'పుణ్యాపుణ్య' (యో భా. 2.12) రూపమున 'కామలోభమోహక్రోధభవ' (యో.భా.2. 12) ము, అనగా వానినుండి సంజనితము. 'తద్విపాకో జాత్యా

యురోభోగాః" (యో.సూ.2,13) జన్మాయురోభోగరూపమున నది ఫలముగ పరిణమించుచుండును. అట్టి సమర్థయగు కర్మాశయము నాబడు వాసనాసంతానము క్లేశముల కాధారమగు అవిద్యా శ్రయమున నవినాభావ సంబంధమున 'బీజాంకుర సంతానము' (యో. భా. వా.1.5) వలె అవిద్యావాసన లనాదులై, సర్గ ప్రళయ కాలముల నవినాశములై పరిభ్రమించుచున్నవి. (యో.భా.వా.2,24) వాసనల కాశ్రయమైన అవిద 'మోహ రూపాఽవిద్యా' (యో.భో.2.24) మోహ మనియు, 'విపర్యయ జ్ఞాన' (యో.భా.2.24) మనియు వర్ణితము. ఇంక కొంచెమా లోచించి చూచిన 'బుద్ధిరవిశుద్ధాఽనుదాసీనా జడా చేతి తత్రాఽ ఽత్మబుద్ధిరవిద్యా' (యో.భా.వా 2.6) అశుద్ధమును, అనుదా సీనమును, అచేతనమును, అగు బుద్ధియం దాత్మభావము గలు గుట అవిద్య యనబడును. 'మోహః పూర్వావిద్యాజనితః సంస్కార స్తమో వాఽవిద్యాయాస్తామసత్వాదితి' (యో. భా.వా.2.6) పూర్వకాలికావిద్యా సంభవముగ మోహము గలుగును. లేక, అవిద్య తమో రూపమగుటచే మోహము గూడ తమోరూపమనియు వివరింపబడియున్నది. ఈ యవిద్యా మోహ ప్రభావముననే బుద్ధి పురుష సంయోగము గలుగు చున్నది.

సర్గమునకు ముఖ్యకారణమగుచున్న అవిద్యయు 'అవి ద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః' (యో.సూ.2.3)అవిద్య అస్మిత రాగ ద్వేష అభినివేశములను క్లేశరూపమున బంచవిధ ములు. కాని 'అస్మితాదయోఽప్యవిద్యోపాదానా స్తదవినిర్భాగ వర్తిని' (యో భా.వా.2.3) అస్మితాది చతుష్టయము తమలో

నవిద్యనుగలిగి తద్వినా నుండజాలవు, కావున 'అవిద్యాక్షేత్ర ముత్తరేషాం' (యో.సూ.2.4) అవిద్యయే చతుష్టయమునకు అధిష్ఠాన మగుచున్నది. ఇట్లు అవిద్యాప్రతిష్ఠితమగు క్లేశములు క్లేశపదముతో 'తేచ బాధనాలక్షణం పరితాప ముపజనయంతః క్లేశశబ్దవాచ్యా భవంతి' (యో.భా.2.3) బాధారూప పరితాపమును జనియింపజేయు లక్షణము గలవని గ్రాహ్యము. అందు అవిద్య మిథ్యాజ్ఞానరూపమై, 'అతద్రూపప్రతిష్ఠం' (యో సూ. 1.8) అన్యరూప ప్రతిష్ఠితమగును. అనగా 'యత్ జ్ఞానప్రతిభాసి రూపం, తద్రూపాప్రతిష్ఠమేవా తద్రూపప్రతిష్ఠ' (యో.భా. వా.1.8) తనది కానిరూపమును బొందుట యన, తన స్వరూపమున లేకుండుటయని గ్రాహ్యము. తనరూపమును త్యజించి పరరూపధారణమే దాని లక్షణమై యున్నది. క్లేశములగు అవిద్యాదులే శాస్త్రపరిభాషలో 'తమో మోహో మహామోహా స్తామిస్రోఽంధతామిస్ర ఇతి' (యో. భా. 1, 8) తమము, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అనబరగినవి. అందు 'అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా' (యో.సూ.2.5) అనిత్యముల నిత్యములుగ, అశుద్ధముల శుద్ధములుగ, దుఃఖమును సుఖముగ భావించుటయే యవిద్యానామమున నుండును. 'దృగ్దర్శన శక్త్యో రేకాత్మతేవాస్మితా' (యో.సూ.2.6) ప్రకృతిపురుషుల యేకాత్మభావమే అస్మిత యనబడును. 'సుఖానుశయీ రాగః' (యో.సూ.2.7) సుఖదృష్టియే రాగము. 'దుఃఖానుశయీ ద్వేషః' (యో.సూ.2.8) దుఃఖదృష్టియే ద్వేషమని చెప్పబడును. 'స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః

(యో. సూ.2.9) స్వతః ప్రవాహమై విబుధులకునైన గ్రాహ్యమగు జీవనతృష్ణయే అభినివేశమగుచున్నది. అవిద్యాక్షేత్రమందు అస్మితాది క్లేశచతుష్టయము, 'ప్రసుప్త తను విచ్ఛిన్నోదారాణాం' (యో.సూ.2.4) ప్రసుప్తముగ, అనగా 'చేతసి శక్తిమాత్రప్రతిష్ఠానాం బీజభావోపగమః' (యో భా.2.4) తమ బీజస్థితిలో చిత్తమున శక్తిరూపమున లయించి నిద్రాణమై యుండును. మరియు విచ్ఛిన్నముగ, నన 'తేన తేనాఽఽత్మనా పునః పునః సముదాచరంతీతి విచ్ఛినాః' (యో.భా,2.4) మరల మరల నాటంక పరుపబడుచున్నను, పునః పునః ప్రవృత్తమగుచుండును ఇంకను ఉదారముగ, నన 'సర్వ ఏవైతే క్లేశవిషయత్వం నాతిక్రామంతి' (యో. భా.2.4) విషయములపై బ్రవృత్తమగుచుండును. అందుచే క్లేశములు బహుళ బలీయములుగానున్నట్లు విదితము. అస్మితాది క్లేశచతుష్టయము అవిద్యయందు చరించుచుండ నవిద్య చిత్తమునందు వ్యవహరించుచుండును. అనగా నవిద్య వాసనాసంయుక్తమై ప్రలయకాలమున బ్రధానాంతర్గతమై సాంతఃకరణ వాసనలతో సర్గమున నభివ్యక్త మగుచుండునని యర్థము. పై అవిద్య వాసనా బుద్ధిసంబంధము పూర్వాపూర్వ సర్గానుసారముగ కర్మాశయద్వారమున ననాది యని పూర్వమే వివరింపబడియున్నది.

'తే స్పందమానా గుణాధికారం దృఢయంతి' (యో.భా. 2.3) అవిద్యాది పంచక్లేశపుంజ మెప్పుడు స్పందించునో అప్పుడు గుణములుప్రవృత్తములగును. ఆగుణములు 'శాంతఘోరమూఢా' (యో. భా. వా, 1.3) త్మకముగ నున్నవి. సత్త్వము శాంత్యాది లక్షణములతోడను, రజము ఘోరాది లక్షణములు గలిగియు,

తమము మూఢత్వాది విశిష్టస్వభావములగలిగి యుండును. మరియు 'ప్రకాశశీలం సత్త్వం । క్రియాశీలం రజః । స్థితిశీలం తమః' (యో. భా. 2.18) అన్నటుల ప్రకాశ క్రియా స్థితి శీలములై త్రిగుణములు యొప్పారును. అవి సామ్యావస్థలో 'గుణత్వేఽపి చ వ్యాపారమాత్రేణ ప్రధానాంతర్లీనానుమితాస్థితాః' (యో. భా.2.18) గుణములేయైనను, ప్రధానమునం దంతర్లీనములని తమవ్యాపారమూలమున అనుమానింపబడుచున్నవి. ఇంకను యీగుణత్రయ సామ్యావస్థయే 'ప్రధానశబ్దవాచ్యా భవంతి' (యో.భా.2,18) ప్రధానముగ వ్యవహరింపబడుచున్నది. ఇవి పూర్వోక్త క్లేశస్పందన ప్రభావమున బ్రవృత్తములై 'పరస్పరోపరక్తప్రవిభాగాః పరిణామినః' (యో.భా.2.18) పరిణామిని యగు ప్రకృతి కంతర్గతములై పరస్పరసంబంధముతో గార్యరూపమును ధరించుచున్నవి. అందుచేతనే 'పరిణామమవస్థాపయంతి' (యో.భా.2.3) పరిణామము నుపక్రమింప జేయుచున్నవనియు వచింపబడినది. మరియు 'ఇతరేతరోపాశ్రయేణోపార్జితమూర్తయః' (యో.భా.2 18) పరస్పరాపేక్షికములై మూర్తిమంతములగుచున్నవి. అంత 'కార్యకారణస్రోతా ఉన్నమయంతి'(యో. భా.2.3) కార్యకారణ వాహినిని ప్రారంభింప జేయుచున్నవగును. కార్య కారణ రూపమున 'గుణానాం పరిణామే చత్వారి పర్వాణి' (యో.భో.1.45) గుణములు పరిణమించి నాలుగు విధములగును. వాని నామములు 'విశిష్టలింగ మవిశిష్టలింగం లింగమాత్ర మలింగం చేతి' (యో.భో.1 45) విశిష్టలింగము, అవిశిష్టలింగము, లింగమాత్రము, అలింగము నాగలవు. వానిలో 'విశిష్టలింగం భూతాని, అవిశిష్టలింగం తన్మాత్రేంద్రియాణి,

లింగమాత్రం బుద్ధిః, అలింగం ప్రధానం' (యో.భో.1.45)అను భోజవాక్యముగ నగుచున్నవి. ఈనాలుగింటిలో నలింగ మనబడు ప్రధానమున గుణములు సామ్యావస్థారూపమున నవ్యక్తములై యుండుచు, బురుషార్థములగు 'భోగాపవర్గ' (యో.భా.3.44) హేతుకములు గాక యుండును. కాని వాని యంతర్గత వాసనా సహిత అవిద్యాసంచయము, 'అనాది వాసనా విచిత్రయా చిత్తవృత్త్యా సమంతః' (యో.భా.2.15) అనాదివాసనా వైచిత్ర్యమున బద్ధమైన చిత్తవృత్తులతో బద్ధుడై అను వాక్యరీతి 'వాసనాభిరనాదికాలసంమూర్ఛితమిదంచిత్తం' (యో.భా.2.13) వాసనాదులచే ననాదికాలమునుండి సంబద్ధమగు చిత్తము అను వచనసరణి, బుద్ధితో నవినాభావసంబంధమున 'పరస్పరానుగ్రహ తంత్రీ భూత్వా కర్మవిపాకం చాభినిర్హరంతి' (యో.భా.2.3) పరస్పర సహాయమున కర్మపరిపాకమున కుపయుక్తముగ గుణములు వ్యవహరించును, అనగా సృష్టి కుపయుక్తమగుచున్నవి.

ఇంతదనుక సృష్టి కాధారతత్త్వముల నొకించుక జూచి యున్నాము. ఇక సృష్టిక్రమవిషయము నిసుమంత విచారించెదముగాక. 'విశేషా విశేష లింగమాత్రా లింగాని గుణపర్వాణి' (యో.సూ.2.19) గుణపరిణామము విశేష అవిశేష లింగమాత్ర అలింగరూపముగ నుండునని యితఃపూర్వమే వినియున్నాము. అందు అలింగము నాబడు ప్రధానము పూర్వ ముల్లేఖితము. తదనంతరమగు బుద్ధినే మహత్తు చిత్తము మొదలగు పదముల బిలుతురు, 'లింగమాత్రం మహత్తత్త్వం తస్మిన్నేతే సత్తామాత్రే మహత్యాత్మన్యవస్థాయ వివృద్ధి కాష్ఠా మనుభవంతి' యో. భా. 2..19) లింగమాత్రమగు మహత్వము గలదు.

దానిలో సర్వకార్యములును దమ సూక్ష్మావస్థ కాలమున లయిం చియుండును. అనగ, 'లింగమాత్రమలింగస్య ప్రత్యాసన్నం తత్ర తత్సంసృష్టం వివిచ్యతే క్రమానతి వృత్తేః' (యో.భా.2.19) గుణములు లింగమాత్రమనబడు మహత్తునందుండి సన్నిధాన విశేషమున బ్రధానమున లయించి మరల ప్రధానమునుండి మహద్రూపమున అభివ్యక్తమగుచున్నవి. ఈక్రమము నుండి యితరము లేదు. 'తథా షడవిశేషా లింగమాత్రే సంసృష్టా వివి చ్యంతే' (యో.భా.2.19) అంత నామహత్తున లయించియున్న షడవిశేషములు వివిచ్యములగును. 'శబ్దతన్మాత్రం స్పర్శతన్మా త్రం రూపతన్మాత్రం రసతన్మాత్రం గంధతన్మాత్రం' (యో. భా. 2.19) అనునట్లు పంచతన్మాత్రలుగా 'పంచావిశేషాః' (యో. భా.2.19) పంచ అవిశేషములగుచున్నవి. 'షష్ఠశ్చాఽవిశేషోఽ స్మితామాత్ర ఇతి' (యో భా.2.19) ఆరవ యవిశేష మస్మితా నాబడు అహంకార మగుచున్నది. ఈషట్కము 'మహతః షడ విశేషపరిణామాః' (యో.భా.2.19) మహత్తునుండి పరిణమించు చున్నవి. 'తథా తే ష్వవిశేషేషు భూతేంద్రియాణి సంసృష్టాని వివిచ్యంతే' (యో.భా.2 19) పిమ్మట నవిశేషాంతర్గతమగు ఇంద్రియములు మహాభూతము లుత్పన్నములగుచున్నవి. ఈ భూతేంద్రియములే షోడశకముగా వ్యవహరింపబడుచున్నవి. 'తత్రాఽఽకాశవాయ్వగ్న్యుదకభూమయో భూతాని శబ్దస్పర్శ రూప రసగంధ తన్మాత్రాణామవిశేషాణాం విశేషాః' (యో.భా.2. 19) వీనివో శబ్దాది తన్మాత్రలు అవిశేషములు, అహంకారోద్భ వములు. వానినుండి ఆకాశాది పంచ స్థూల భూతములు జనిత ములు. 'తథా శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాని బుద్ధీంద్రియాణి,

వాక్పాణిపాదపాయూపస్థాః కర్మేంద్రియాణి' (యో.భా.2.19) శ్రోత్రాదులు బుద్ధీంద్రియములు, వాగాదులు కర్మేంద్రియములును, 'ఏకాదశం మనః సర్వార్థం' (యో.భా.2.19) పదునొకండవది మనస్సు, అది సర్వేంద్రియార్థకము. ఇవి అస్మితా జన్యములై యొప్పారును, కాన పరంపరా న్యాయమున 'గుణానామేష షోడశకో విశేషపరిణామః' (యో.భా.2.19) గుణముల నుండియే యీషోడశక ముద్భవించినట్లు వచింపబడును. ఇట్లు పలుతెరంగుల నానాత్వ మేర్పడియున్నను, నైజమునకు 'గుణాస్తు సర్వధర్మానుపాతినో న ప్రత్యస్తమయంతే నోపజాయంతే' (యో.భా.2 19) గుణములు సర్వపరిణామస్థితులలో నంతర్గతమై యంతరింపక, జనింపకయు నుండును. అందుచే గుణరూపైకత్వమే సర్వమున గలదు. ఎట్లన 'ప్రఖ్యాక్రియాస్థితిశీలానాం గుణానాం గ్రహణాత్మకానాం కరణభావేనైకః పరిణామః శ్రోత్రమింద్రియం' (యో.భా.4,14) ప్రకాశ క్రియా స్థితి లక్షణములు గల గుణములెట్లు విషయగ్రహణమునకు శ్రోత్రాది కరణ రూపమున బరిణమించినను నేకరూపముగనే యుండునో, అట్లే మరల నదే గుణము 'గ్రాహ్యాత్మకానాం శబ్దతన్మాత్రభావేనైకః పరిణామః శబ్దోవిషయ ఇతి' (యో. భా. 4. 14) గ్రాహ్యమగు శబ్దాది తన్మాత్ర రూపమున మారగా నేకరూపముననే శబ్దవిషయమై యొప్పారును. అనగా 'గ్రహణాత్మకానాం సత్త్వప్రధానతయా ప్రకాశాత్మ నాహంకారాహాంతర కార్యాణాం కరణభావేనైకః పరిణామః శ్రోత్రమింద్రియం' (యో.భా.వా. 4.14) గ్రహణాత్మకముల విషయమున నవి అహంకారజనితములై ముఖ్యముగా సత్త్వాధిక్యతచే ప్రకాశాత్మకములై శ్రో

్రోత్రాది కరణరూపము నొందుచున్నవి. అట్లే 'తేషామేవ గుణానాం తమః ప్రధానతయా జడత్వే సగ్రాహ్యాత్మకానాం శబ్ద తన్మాత్రభావేనైకః పరిణామః శబ్దోవిషయః' (యో.భా.వా.4.14) ఆగుణములనుండియే ఏకరూపమున శబ్దతన్మాత్ర విషయముగా జడముగ తమాధిక్యతవలన గలుగుచున్నది. మరియు 'శబ్దాదీనాం మూర్తిసమాన జాతీయానామేకః పరిణామః పృథ్వీ పరమాణు స్తన్మాత్రావయవః' (యో.భా 4.14) యీశబ్దాదులు ఏకమై మూర్తిమంతముకాగా తన్మాత్రావయవియగు పృథ్వీ పరమాణు వేర్పడుచున్నది. 'తేషాం చైకః పరిణామః పృథివీ గౌర్వృక్షః పర్వత ఇతి' (యో.భా.4.14) పృథ్వీపరమాణువుల కొక పరిణామమేర్పడి గో వృక్ష పర్వతాదిరూప పృథ్వి యుత్పన్నమగుచున్నది. ఇట్లే యితర భూతాంతరములన్నియు సంభావ్యములు. 'ఏవం బహుత్వేపి గుణానాం పరిణామైకత్వం' (యో.భా.వా.4.14) ఈవిధముగ గుణములు బహుళములై యున్నను, పరిణామము ఏకముగనే గలదు. ఇట్లు మహతాది స్థూలభూత పర్యంత సృష్టియంతయు గుణములనుండియే జనించుచున్నట్లు విదితము.

పైనుదాహరింపబడిన సృష్టి 'సర్వమర్థవత్' (యో.భా.3.44) అర్థవత్త్వముగా నేర్పడినది, అర్థవత్త్వ మనగా 'భోగాపవర్గార్థతా' (యో.భా.3.44) 'పురుషార్థ' (యో. భా. వా. 1. 3) 'పురుషార్థ నిమిత్తం' (యో.భా.వా.1.45) 'భోగాపవర్గార్థం దృశ్యం' (యో.సూ.2.18) 'పురుషార్థతా' (యో.భా.2,19) 'తదర్థ ఏవ దృశ్యం' (యో.సూ.2 21) 'భోగాపవర్గహేతుః' (యో,భా.వా.2,24) 'పరార్థాత్' (యో.సూ.3,35) మొద

లగు విధముల ననేకస్థానముల సూచింపబడియున్నది. దాని వివరణ మవలోకించెదము గాక.

'అలింగావస్థాయాం న పురుషార్థో హేతుః' (యో.భా. 2.19) అలింగమునాబడు ప్రధానము పురుషార్థ హేతుకము కాదు. అందుచే 'త్రయాణాం త్వవస్థావిశేషాణామాదౌ పురుషార్థతా కారణం భవతి' (యో.భా.2.19) విశేషావిశేష లింగ మాత్రలు మూడును ప్రథమమున పురుషార్థప్రవర్తకము లగుచున్నవి, కాన నవి మూడును త్రిగుణాత్మకములై 'ఏతద్దృశ్యమిత్యుచ్యతే' (యో.భా.2.18) దృశ్యము నాబడినవి. 'తౌ భోగాపవర్గావర్థః' (యో.భా.2.18) భోగ మోక్షములకు ప్రయోజనముగా గలది దృశ్యముగా నిర్వచింపబడియున్నవి. కాన అమూడును పురుషార్థములగు భోగాపవర్గముల కుపయుక్తమగుచు దృశ్యము లనబడినవి. 'పరార్థత్వాత్ పరతంత్రం' (యో.భా. 2.17) అన్నటుల పరతంత్రములై మరియు 'స చార్థో హేతుర్నిమిత్తం కారణం భవతీత్యనిత్యాఽఽఖ్యాయతే, (యో.భా. 2.19) పురుషార్థ హేతుకములగుటచే నవి అనిత్యములుగూడ నగుచున్నవి. ఈదృశ్యమే భోగ్యమనియు, (యో.భా.వా.1.4) స్వామ్యమనియు (యో.భా.వా.1.7) గూడ వచింపబడును. అప్పుడు పురుషుడు, భోక్తృశక్తి (యో.భా.వా.2 6) యనియు దృగ్శక్తి (యో.భా.2.17) యనియు వాకొనబడు శక్తిగలిగి దర్శనార్థము అనాది వాసనా స్రవంతి గలిగియుండుటచే నాతడు భోక్త, ద్రష్ట, దృక్, స్వామి యనబడుచున్నాడు. అట్టి కర్త యగు పురుషునకు గల భోగాపవర్గ ప్రయోజనములలో ప్రథమతః అతడు వాసనాబద్ధ బుద్ధియుక్తుడు గాన, అవిద్యా ప్రావృత

బద్ధ జీవుడుగాన, నతని కీ దృశ్యము దర్శనార్థము అనగా భోగార్థ ముపయుక్త మగుచున్నది. 'తత్రేష్టానిష్టగుణస్వరూపావధారణ మవిభాగాపన్నం భోగః' (యో.భా.2.18) గుణవికారములగు ఇష్టానిష్టములు పురుష వ్యత్య స్తములుగా గ్రహింపకుండుట భోగ మనబడును. అనగా గుణవికారముల పురుషునితో నైక్య దృష్టి గాంచుట యగును. ఆభోగము 'భోగః సుఖాద్యాకారః శబ్దాద్యనుభవః' (యో.భా.వా.2.21) శబ్దాదుల సుఖదుఃఖా కారము ననుభవించుట అనియు నిర్వచనము. దీనినే 'పురుషః స్వామీ దృశ్యేన స్వేనదర్శనార్థం సంయుక్తః తస్మాత్సం యోగాద్ దృశ్యస్యోపలబ్ధిర్యా స భోగః' (యో. భా. 2.23) పురుషుడు స్వామి, దృశ్యము స్వామ్యము. పురుషుడు దృశ్య సంబంధి యగును. అందుచే దానివలన నతనికి దృశ్యోపలబ్ధి గలుగును. అదియే భోగమనియు, 'సత్త్వపురుషయో రత్యంతా సంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః' (యో.సూ.3.35) సత్త్వ పురుషుల ఏకాత్మ భావసంబంధము భోగమనియు వివరింపబడినది. అనగా విరుద్ధతత్త్వములుగల సత్త్వ పురుషుల మధ్య అత్యంత సంకీర్ణత యేర్పడి, భోక్తృ భోగ్యరూపములు, చేతనాచేతనములు భిన్నములైయున్నను భేదము గోచరింపక సత్త్వమునకే కర్తృత్వము గలిగి సుఖదుఃఖ జ్ఞానము గలుగగా భోగ మనబడును. (యో.భో.3.35)

ఈవిధమున బుద్ధిస్థ ప్రతిబింబరూప పురుషుడు అవిద్యా బద్ధుడై భోగ్య ప్రవాహమున బడి, తత్తద్వాసనాజనిత కర్మ వ్యూహమున నిరికి, ధర్మాధర్మప్రవృత్తి పాశముల దగుల్కొని, సుఖదుఃఖాది ద్వంద్వచక్రమున బరిభ్రమించుచుండును. అనాది

పరంపరాగత వాసనా వాహినీగత సంచితాగామి ప్రారబ్ధ కర్మ ముల వలన 'సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః' (యో.సూ.2.13) కర్మాశయ ముండుటచే జన్మాయుర్భోగ ముల ననుభవించును. అందు కర్మాశయము సుఖ దుఃఖ భోగ రూపము ధరింప జన్మాయుష్షులు గూడ తదర్థముగ ప్రవర్తిం చును, 'తే హ్లాదపరితాప ఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్' (యో సూ.2,14) పుణ్యాపాప హేతుకములై సుఖదుఃఖముల ప్రాప్తింప జేయుచున్నవి. అనగా 'పుణ్యహేతుకాః సుఖఫలా, అపుణ్యహేతుకా దుఃఖఫలా' (యో.భా.2,14) పుణ్యకారణ మయినప్పుడు సుఖ ఫలమును, పాపకారితము లగునప్పుడు దుఃఖఫలము నొందునని యర్థము. ఈవిధముగా భోగఫలమగు సుఖ దుఃఖ ద్వంద్వ మనుభూతమగుచున్నను, 'దుఃఖమేవ సర్వం వివేకినః' (యో.సూ.2.15) వివేకజ్ఞాన తత్పరునకు సర్వమును దుఃఖమయమై దోచుచుండును. ఎట్లన 'విషయ సుఖ కాలేఽపి దుఃఖమస్త్యేవ ప్రతికూలాత్మకం యోగినః' (యో.భా.2.14) విషయ సుఖానుభవ కాలమున గూడ అందంతర్గత వాహినియై ఉన్న దుఃఖము యోగులకు ప్రతికూలాత్మకమై యొప్పారును. అదియే 'దుఃఖస్రోతః' (యో.భా,2.15) యనియు పూర్వము వచింపబడియున్నది. మరల నీదుఃఖము త్రివిధముగ నుండును. 'పరిణామతాప సంస్కార దుఃఖై ర్గుణవృత్తివిరోధాచ్చ' (యో.సూ.2,15) పరిణామ తాప సంస్కారరూపముగ గుణ వృత్తి విరోధమై యది యుండును. అందు పరిణామ దుఃఖ రూప మెట్లన, 'సుఖానుశయీ రాగః' (యో.సూ.27.) రాగాశ్రయ ముగ నున్న సుఖమున కాటంకము గలుగగా ద్వేష ముద్భవిం

చును. తజ్జనితముగా 'దుఃఖానుశయీ ద్వేషః' (యో, సూ, 2, 8) అను సూత్రరీతి దుఃఖము గలుగుచున్నది. ఇట్లు దుఃఖము గలిగిన దాని బరిణామ దుఃఖమందురు. సుఖాన్వేషియై స్వార్థ సముపార్జనమునకై మనోవాక్కాయములద్వారా ప్రవర్తించుచు, ఆగ్రహానుగ్రహముల వ్యక్తపరచును. దానిమూలమున బురుషుడు ధర్మాధర్మముల నార్జించును, దానినుండి కలిగిన కర్మాశయము లోభ మోహ ఫలితము. ఈవిధముగ గలిగిన దుఃఖమునకు తాపదుఃఖమని వ్యవహారము. పై సుఖదుఃఖానుభవము పునః సంస్కారరూపమై మరల సుఖదుఃఖాదికముల గలుగజేయును. అది సంస్కారదుఃఖము నాబడును.

ఇవ్విధి నేర్పడిన 'ఏవమిద మనాది దుఃఖస్రోతః' (యో, భా, 2, 15) 'అనాది దుఃఖస్రవంతిలో' నిరికి, 'అనాది వాసనా విచిత్రయా చిత్తవృత్త్యా సమంతతోఽనువిద్ధ మివావిద్యయా హాతవ్య' (యో, భా. 2. 15) 'అనాది వాసనాయుక్త చిత్తవృత్తులచే సంపూర్తిగా గ్రుచ్చబడుచు, అవిద్యాబద్ధుడై, దుఃఖియై, 'అహంకారమమకారానుపాతినం జాతం జాతం బాహ్యాధ్యాత్మికోభయ నిమిత్తాస్త్రిపర్వాణస్తాపా అనుప్లవంతే' (యో. భా. 2. 15) అహంకార మమకారముల ననుసరించుచు జనించినప్పుడెల్ల త్రివిధ దుఃఖముల బాధితుడై యుండు ఆజ్ఞజనునకు గాక 'యోగినమేవ ప్రతికూలాత్మకత్వా దుద్వేజయతి' (యో, భా, 2, 15) యోగులకు ప్రతికూలాత్మకమై బాధాకరముగ నుండును, అట్లను తాప తప్తుడైన వివేకి 'తదస్య మహతో దుఃఖసముదాయస్య ప్రభవబీజమవిద్యా' (యో, భా. 2. 15) అన్నటుల మహాదుఃఖ సముదాయమునకెల్ల అవిద్యయే ప్రభవ కారణమని గ్రహించి,

'తస్యాశ్చ సమ్యగ్దర్శన మభావహేతుః' (యో. భా. 2. 15) దానికి సమ్యగ్దర్శనమే నశింపజేయు కారణమని విశ్వసించును. అట్టి సమ్యగ్దర్శన మార్గమునకై అన్వేషించుచు, 'సంసారః, సంసార హేతుః, మోక్షో, మోక్షోపాయ' (యో. భా. 2. 15) ములను చతుర్విధ భాగములుగల తత్త్వజ్ఞానము నాశ్రయించి, దుఃఖ బహుళత్వముగల సంసారము హేయ కారణమనియు, ప్రధాన పురుష సంయోగమే హేయ కారణమనియు, హానోపాయము సమ్యగ్దర్శనమనియు, సంయోగ వియోగమే హానరూప మోక్ష మనియు, నిర్ణయించుకొనును. అట్టి సమయమున, 'జ్ఞాన ధర్మోపదేశేన కల్ప ప్రళయ మహాప్రళయేషు సంసారిణః పురు షానుద్ధరిష్యామి' (యో. భా. 1. 25) కల్పాదులందు సంసరించు చుండు పురుషులను జ్ఞానధర్మోపదేశమున నుద్ధరింతునని బద్ధకంక ణహస్తుడగు నీశ్వరుని అనుగ్రహవిశేషమున, 'ఆచినోతి చ శాస్త్రార్థమాచారే స్థాపయత్యపి। స్వయమాచరతే యస్మాదా చార్యస్తేన చోచ్యతే' (యో. భా. వా. 2. 24, వాయుపురాణ) శాస్త్రార్థగ్రహణముగలిగి శిష్యుని క్రమమార్గానువర్తిగ జేసి. స్వయముగ సన్మార్గానువర్తిగ నుండు వాడాచార్యుడన్న చందము, నట్టి గురుదేవుని యీ ముముక్షువు చేరును. అంత నతనికి భోగముపై హేయభావ మభివృద్ధిగాంచ నపవర్గముపై నాకాంక్ష వర్ధిలును. అందుచే నిక గురుసన్నిధానమున తగు సాధనా విధానము ననుసరింప నుద్యుక్తుడగుచున్నాడు.



## సాధన

ఇంతవరకు చర్చింపబడిన తాత్త్విక విషయములు కేవలము సాంఖ్యానుసారము లగుటయు, పతంజలి మునీంద్రుని సంకల్పము తత్త్వ విచారణముగాక, తత్త్వార్థ సాధ్యమగు అపవర్గ నాబడు కైవల్యప్రాప్తికై యుపాయాన్వేషణమనియు, నందుచే పాతంజలము తాత్త్విక గ్రంథముగాక, ముఖ్యముగా యోగశాస్త్రముగా ప్రసిద్ధిచెందిన సాధనశాస్త్రమనియు ఉపోద్ఘాతముల వివరింప బడియున్నది. అందుచే పతంజలిప్రోక్త సాధనా విధానము సర్వ సిద్ధాంతులచే నవలంబింపబడి, యనాదికాలము నుండి సుప్రశస్తమగుటచే నద్దాని గ్రహింప ముఖ్యావశ్యకము. కాన నా సాధన పద్ధతి నొకించుక సింహావలోకనము గావించెదముగాక.

'స్వరూపావధారణ మపవర్గ ఇతి' (యో. భా.2.18) స్వస్వరూప ధారణము అపవర్గ యనబడుననియు, 'కైవల్యం స్వరూపప్రతిషా' (యో. సూ. 4. 34) స్వస్వరూప ప్రతిష్ఠయే కైవల్యమనియు నిర్వచింపబడిన మోక్షమునకు గారణభూతమగు 'కుశల ఇత్యేవ భవతి గుణాతీతత్వాదితి' (యో. భా.2.27) గుణాతీత లక్షణముచే గుశలత్వము నార్జింప నుద్యుక్తుడై 'ఘోరేషు సంసారాంగారేషు పచ్యమానేన మయాజనన మరణాంధకారే విపరీత వర్తమానేన' (యో. భా.3.51.) ఘోర సంసారాగ్నిలో నుడికి, జనన మరణాంధకారమున బరిభ్రమించియుండి, 'తృష్ణాయోనయో విషయవాయవః' (యో. భా.3.51) తృష్ణా సంజనిత విషయవాయువున జలించియుండి, 'కథమనయా విషయ

మృగతృష్ణాయా వంచిత స్తస్యైక పునః ప్రదీప్తస్య సంసారాగ్నే రాత్మాన మింధనీ కుర్యామితి' (యో.భా.3.51) విషయములను మృగతృష్ణా వాంఛలబడి మరల నెట్లు వంచితుడ నగుదును? మరల సంసారాగ్నింబడి యెట్లు నశింతును? 'స్వస్తి వః స్వప్నోపమేభ్యః కృపణజన ప్రార్థనీ యేభ్యో విషయేభ్య' (యో.భా.3.51) అజ్ఞ జన కాంక్షితములగు విషయములకు స్వస్తి యని 'ఇత్యేవం నిశ్చితమతిః సమాధిం భావయేత్' (యో.భా.3.51) యీవిధముగా నిశ్చయించుకొని సాధకుడు సంస్మరించును.

సమాధి యనుటతోడనే గమ్యమగు అసంప్రజ్ఞాతాది సంపూర్ణ సమాధ్యవస్థల దృష్టినుంచి 'యోగః సమాధిః' (యో.భా.1.1) యను వ్యుత్పత్తిప్రకారము యోగాన్వేషియై 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' (యో.సూ.1.2.) చిత్తవృత్తుల నిరోధమే యోగమనియు ననగా 'నిరుధ్యంతే యస్మిన్ ప్రమాణాదివృత్తయోఽవస్థావిశేషే చిత్తస్య సోఽవస్థావిశేషో యోగః' (యో.భా.వా.1.2) ఏచిత్త స్థితిలో ప్రమాణాది చిత్తవృత్తులన్నియు నిరోధింపబడి యుండునో ఆస్థితికి యోగమని యర్థము. ఈ నిర్వచనాంతర్గత చిత్తవృత్తుల నవగాహన మొనరించిన గాని వాని నిరోధోపాయ గ్రహణము సంధిల్లదు.

పైజెప్పబడిన చిత్తమే పూర్వగ్రంథమున బుద్ధియనియు సత్త్వమనియును బిలువబడినది. ఇది త్రిగుణాత్మకము. మరియు నిది 'సార్వభౌమ శ్చిత్తస్య ధర్మః' (యో.భా.1.1) సర్వాంతర్యామిత్వమే చిత్తధర్మముగా నున్నది. ఇందు 'క్షిప్తం మూఢం విక్షిప్తమేకాగ్రం నిరుద్ధ' (యో.భా.1.1) ములనబడు భూములు

వివరింపబడియున్నది. పురాణముల బుట్టుపూర్వోత్తరముల జేర్కొ నుచు బృహన్నారదీయపురాణము బ్రహ్మవాక్యముగ 'శ్రుణు వత్స ప్రవక్ష్యామి పురాణానాం సముచ్చయం। పురాణమేకమేవాసిత్సర్వ కల్పేషు మావర॥ చతుర్వర్గస్య బీజస్య శతకోటి ప్రవిస్తరం। కాలేనాగ్రహణం దృష్ట్వా పురాణస్య మహామతిః॥ హరిర్వ్యాసరూ పేణ జాయతే చ యుగే యుగే। చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా॥ తదష్టాదశధా కృత్వా భూలోకేస్మిన్ ప్రకాశ్యతే।' వత్సా! పురాణసముచ్చయమును దెలిపెదను వినుము. సర్వకల్ప ములందును శతకోటిప్రవిస్తరమగు పురాణమొకటియై యుండెను. చతుర్వర్గ సాధనమై, శతకోటి ప్రవిస్తరమైయున్న పురాణము కాలవశముచేత నెవరు గ్రహింపజాలక పోవుటచే, శ్రీహరి వ్యాస రూపముతో బ్రతియుగమునందును అవతరించి, ప్రతి ద్వాపర మున జతుర్లక్ష ప్రమాణముచే దానిని పదునెనిమిది భాగములుగ జేసి, భూలోకమున ప్రకాశింపజేయును. అవి ఎవ్వియన 'బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ। భాగవ తం నారదీయం మార్కండేయం చ కీర్తితం॥ ఆగ్నేయం చ భవిష్యం చ బ్రహ్మవైవర్త లింగకే। వారాహం చ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞికం॥ మాత్స్యం తత్ గారుడం తద్వద్బ్ర హ్మాండాఖ్య మితి త్రిషట్' బ్రహ్మ, పద్మ, విష్ణు, వాయు, భాగ వత, నారద, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మండ, భవిష్యత్తులు పదునెనిమిది. వీనియందుండెడి అద్వైత భావముల గ్రోడీకరించుట పెద్ద కార్యమగుటచే, నవియు శ్రుత్యనుసార రచ నములే యగుట, వానియందు అద్వైతము ప్రస్ఫుటముగ నన్వ

పంచదర్మియగు చిత్తమునకు మరల 'వృత్తయః పంచతయ్యః క్లిష్టా ఽక్లిష్టాః' (యో. సూ. 1.5) క్లిష్టాక్లిష్ట విభాగమున వృత్తిపంచకము గలదు. అవియే 'ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః' (యో. సూ. 1.6) నాబడుచున్నవి. ఈప్రమాణాది వృత్తులు 'క్లేశహేతుకాః కర్మాశయ ప్రచయే క్షేత్రీభూతాః క్లిష్టాః' (యో. భా. 1.5) క్లేశకారకములై కర్మాశయ ప్రవర్ధక క్షేత్రములై యుండగా క్లిష్టము లనబడును. మరియు నవే వృత్తులు 'ఖ్యాతివిషయా గుణాధికార విరోధిన్యోఽక్లిష్టా' (యో. భా. 1.5) సమ్యక్ జ్ఞాన విషయములై గుణవిరోధులై యుండ నక్లిష్టము లగుచున్నవి. ఈవృత్తులలో ప్రథమమగు ప్రమాణము 'ప్రత్యక్షానుమానాగమాః' (యో. సూ. 1.7) ప్రత్యక్ష అనుమాన ఆగమము లని త్రివిధము. ఇంద్రియజన్య జ్ఞానము ప్రత్యక్షము. అనుమానితము అనుమానము. వేదము మరియు నాప్తవచనము ఆగమములైనవి. 'విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూపప్రతిష్ఠం' (యో. సూ. 1.8) వస్తువున కన్యమై యుండుచు, నందు గోచరించు జ్ఞానమే మిథ్య యనబడుచున్నది విపర్యయ జ్ఞానము. ద్విచంద్ర భ్రాంతి దీని కుదాహరణము. 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః' (యో. సూ. 1 9) వస్తు రహితముగ శబ్దజ్ఞానానుసారి భావము వికల్పము. అనగ విషయము నపేక్షింపక శబ్దజ్ఞాన మాత్రమున నే ప్రాప్తి జ్ఞానము గలుగుట యగును. 'అభావ ప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా' (యో. సూ. 1.10) సామాన్యజ్ఞానాభావమే నిద్ర యగును, 'అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః' (యో. సూ. 1.11) అనుభూత విషయమాత్ర స్మరణము స్మృతిః యనియు నీవిధ

ముగ బుద్ధియొక్క వృత్తులు పంచవిధములుగ నుండును. ఈ వృత్తిపంచక నిరోధనమే యోగ మనబడుటచే నిక నిరోధము నాకించుక బరిశీలింతము,

మననాత్మకమగు మనస్సు, అహంకృతిరూప అహంకారము, సంకల్పకమగు బుద్ధియు గలసి చిత్త మగుననియు, నది అతిసూక్ష్మ తత్త్వమనియు దాని నిరోధించుటయే యోగ మనియు, గొందరి తాత్పర్యము (రామప్రసాద). 'చిత్తనదీ నామోభయతో వాహినీ' (యో. భా.1.12) చిత్తనదీ ప్రవాహము, కళ్యాణ పాపములును నుభయదిశలకును బర్విడును. అందు కైవల్యోన్ముఖత్వము కళ్యాణము, సంసృతికారకము పాపము నాబడును. చిత్తసంయుక్త దుష్ట వాసనా చయ నాశమునకును, కళ్యాణదమగు కైవల్య ప్రాప్తికిని 'అభ్యాసవైరాగ్య' (యో.సూ.1.12) ములు బహుళోపయుక్తములు. ఆ ద్వివిధాభ్యాసములే విషయసంస్కార నిరోధము గావించు ననగా, బూర్వోక్త చిత్తవృత్తి పంచకము విషయాభివృద్ధి గావింపక తన్నిరోధము గావించునని యర్థము. 'తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః' (యో.సూ.1.13) శాంతస్థితిలో జిత్తము నుంప దీవ్ర యత్నము గావించుటయే అభ్యాసము. 'రాజస తామసవృత్తి రహితస్య ప్రశాంతవాహితా విమలతా సాత్వికవృత్తి వాహిత్త్వైకాగ్రతా స్థితిః' (యో.భా.వా.1,13) రజస్తమోవృత్తి రహితమై, ప్రశాంత నిర్మల సాత్విక ఏకాగ్రత నుండుటే స్థితి యని భావము. 'స్థితిసాధనా న్యంతరంగ బహిరంగాణి యమ నియమాదీని" (యో,భా.వా.1,13) స్థితి సాధనార్థము యమ నియమము లనబడు అంతర బహిరంగ సాధన యవసరము. వైరా

గ్యము వశీకార సంజ్ఞా, పరంవైరాగ్య రూపమున ద్వివిధమై యొప్పారును. 'దృష్టానుశ్రావికవిషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యం'. (యో.సూ.1.15) దృగ్గోచర శాస్త్రగోచర విషయములపై తృష్ణాభావమే 'వశీకార' నామక వైరాగ్యము. ఇది ప్రాథమికము. 'తత్పరం పురుషఖ్యాతే ర్గుణ వైతృష్ణ్యం' (యో.సూ.1.16) పురుషజ్ఞానమువలన గుణతృష్ణా రాహిత్యము నొందుట పరంవైరాగ్య మనబడును. ఈవైరాగ్యస్థితిలో 'జ్ఞానస్యైవ పరాకాష్ఠా వైరాగ్యం' (యో.సూ.భా.1.16) వైరాగ్యమే యుత్కృష్ట జ్ఞానస్థితియై రాజిల్లును. మరియు 'ఎతస్యైవ హి నాంతరీయకం కైవల్యం' (యో.భా.1.16) కైవల్యమే దీనియొక్క అంతర్యము. చిత్తముయొక్క వృత్తుల నిరోధించుట అభ్యాసమూలమునను, దాని యుద్రేక తత్త్వమును వైరాగ్యమునను నిరోధింప వలయుననియు నన నగును, అనగా నభ్యాసమున చిత్తవృత్తులును, వైరాగ్యమున చిత్తవికారము లును నిరోధింపబడునని రహస్యము.

కాని అభ్యాసవైరాగ్యోన్ముఖ చిత్తమునకు 'వ్యాధిస్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి భ్రాంతిదర్శనాలబ్ధ భూమికత్వాన వస్థితత్వాని చిత్తవిక్షేపా స్తేంతరాయాః' (యో.సూ.1.30) వ్యాధి మాంద్య సంశయ ప్రమాద ఆలస్య విషయతృష్ణ భ్రాంతి యోగనిష్ఠాలబ్ధత అస్థిరత యని తొమ్మిదిరీతుల విక్షేపములు గలుగును. ఇవి చిత్తవృత్తుల నాశ్రయించియే యుండి, 'చిత్త విక్షేప, యోగమల, యోగప్రతిపక్ష. యోగాంతరాయము లన బరగుచుండును (యో.భా.1.30). ఇవియన్నియు 'రజస్త

మోబలాత్ప్రవర్తమానాః' (యో.భో.1.30) రజస్తమోగుణ ప్రవర్ధమానములై యుండును.

ఈ విక్షేప నవకము చాలదో యన్నటుల 'దుఃఖదౌర్మనస్యాంగమేజయత్వ శ్వాస ప్రశ్వాసా విక్షేప సహభువః' (యో.సూ.1.31) దుఃఖత్రియము, ఇచ్ఛావిఘాత జనిత సంక్షోభము, అవయవ ప్రకంపనము, శ్వాస ప్రశ్వాసలు గూడ విక్షేపసహకారులై సాధకు నెనుగొనుచుండును.

అయినను 'ప్రతిపక్షభావనం' (యో. సూ.2.33) అను సూత్రము ననుసరించి విక్షేప ప్రతికూలభావ భావనచే నవి జయేయములు. 'మైత్రీ కరుణాముది తోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్యవిషయాణాం భావనాశ్చిత్త ప్రసాదనం'(యో.సూ. 1.33) సుఖాత్మకులతో మైత్రి, దుఃఖాక్రాంతులపై గరుణ, పుణ్యాత్ములయెడ సంతోషము, పాపకర్ములయెడ యుపేక్షా భావన లుండుయోగికి శుద్ధధర్మ ముదయించి, చిత్తము ప్రసన్న మగును. ఏకాగ్రత స్థిరత లభించును. ఇట్టి ప్రతిపక్ష భావనయే గాక, ప్రాణాయామము (యో.సూ.1.34), చిత్తప్రవృత్తి ధ్యానము (యో.సూ.1.35), సత్వాధిక్య చిత్తధ్యానము, (యో.సూ.1.36) వీతరాగులగు సిద్ధధ్యానము (యో.సూ.1.37) స్వప్న నిద్రాస్థితి ధ్యానము (యో.సూ.1.38), ఇష్టధ్యానము (యో.సూ.1.39), అణు మహత్వ ధ్యానము (యో.సూ.1.40), లచే విక్షేపజాల మంతరించును, క్రమచే విక్షేపరహితమైన చిత్తము, వృత్తిక్షయము నొంది, త్రిపుటీ సంయుక్త స్థితియగు సమాపత్తి జెంది, మణివలె పరిశుద్ధమై యొప్పారును, అప్పుడా యోగికి 'వివేకఖ్యాతి' (యో.సూ.2.26) జనిత వశీకార

వైరాగ్య ముద్భవించి మోక్షమార్గ ప్రవేశము నతడుగావించుననని యోగ తాత్పర్యము.

అందుచే, బూర్వోక్తచందము యమ నియమాది యోగాంగములు సాధకున కవసరమగుచున్నవి. వాని యభ్యాస ఫలితముగ 'యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరా వివేకఖ్యాతేః' (యో.సూ.2 28) యోగాంగానుష్ఠానము వలన నశుద్ధత క్షయించి, వివేఖ్యాతి కలుగునంతవరకు జ్ఞానాభివృద్ధి కలుగుచుండును. 'యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయోష్టావంగాని' (యో.సూ.2.29) అను సూత్రరీతి యోగాంగములు అష్టకముగ నున్నవి.

అందు 'అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా' (యో.సూ.2.30) ములు యమముగా వ్యవహారము. వానిలో 'అహింసా సర్వథా సర్వదా సర్వభూతానామనభిద్రోహః' (యో.భా.2,30) సర్వభూతములందును, సర్వవిధముల సర్వ కాలముల హింసాభావ రాహిత్యమే అహింస యనబడును. ద్వితీయమగు సత్యము 'సత్యం యథార్థే వాఙ్మనసే' (యో. భా.2. 30) యాథార్థ్యత ననుసరించి మనోవాక్కు లుండుటయని నిర్వాచ్యము. అస్తేయమన శాస్త్రవిరుద్ధ మార్గ మున పరధన స్వీకరణము గావింపకుండుట యని వివరణము. 'బ్రహ్మచర్యం గుప్తేంద్రియ స్యోపస్థస్య సంయమః' (యో.భా. 2.30) గుప్తేంద్రియమగు నుపస్థను సంయమించుట బ్రహ్మ చర్యము నాబడును. 'విషయాణాం— అస్వీకరణ మపరిగ్రహా' (యో.భా.2.30) విషయముల గ్రహింపకుండుటయే అపరిగ్ర

హము నాబరగును. ఏని నన్నింటిని దేశ కాల జాతి సంబంధములేక అనుష్ఠించుట 'మహావ్రత' మందురు(యో. సూ. 2. 31).

'శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః'(యో. సూ. 2.32)అనురీతిబాహ్యాభ్యంతర పరిశుద్ధత; 'సంతోష స్తుష్టిః' (యో. భో. 2.32) యను వచనసరణి 'ప్రాణత్రాణమాత్రహేతోరధ్యధికస్యానుపాదిత్సా సంతోషః' (యో. భా. వా. 2.32) ప్రాణ త్రాణమున కత్యవసరమాత్రోపాధికి దృష్టి గలిగియుండుటయను సంతోషమును; 'తపో ద్వంద్వసహనం' (యో. భా. 2.32) శీతోష్ణ, క్షుత్పిపాస, స్థానాసన, ఆకార కాష్ఠమౌనాది ద్వంద్వసహనరూప తపస్సు; మోక్ష శాస్త్రాధ్యయనము; పరమగురుమూర్తియగు యీశ్వరప్రణిధానము నా సర్వకర్మార్పణముల గలిగియుండుట నియమధర్మము.

'స్థిరసుఖమాసనం' (యో. సూ. 2 46) అనగా 'స్థిరం నిశ్చలం యత్సుఖం సుఖావహం తదాసనమితి' (యో. భా. వా. 2.46) స్థిరమన నిశ్చలత్వము, సుఖప్రదమే సుఖము. ఈ రెండును గలది ఆసన మనబడును. 'తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతి విచ్ఛేదః ప్రాణాయామః' (యో. సూ. 2.49) శ్వాస ప్రశ్వాస గమన నిరోధము ప్రాణాయామ మనంబడును. 'స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః' (యో. సూ. 2. 54) విషయములతో నింద్రియములు సంయుక్తములు కాకున్న చిత్తము ప్రత్యాహారము నందుండును అప్పుడు 'పరమా వశ్యతేంద్రియాణాం' (యో. సూ. 2.55) యుత్కృష్ట వశ్యతేంద్రియశక్తి ప్రాపించును. అనగ నింద్రియ స్వాధీనత గలుగుచున్నది. 'దేశబంధ శ్చిత్తస్య ధారణా' (యో

సూ. 3.1) నాభిచక్ర హృదయపుండరీక మూర్ధ్న మధ్య జ్యోతిస్సు, నాసికాగ్ర జిహ్వాగ్రాది స్థానములందుగాని బాహ్యవస్తు స్థానము నందుగాని వృత్తిరూపముననే చిత్తమును లగ్నమొనర్చుట ధారణ యగును. 'తత్ర ప్రత్యయైక తానతా ధ్యానం' (యో. సూ. 3 2) ధారణాస్థానమున నేకప్రవాహరూప చిత్తస్థితిని ధ్యానముగా వచించెదరు. అనగ మైత్ర్యాది లక్షణములచే పరిశుద్ధమైన చిత్తమున యమ నియమాన్వితుడై, జితాసనుడై, ప్రాణాయామాభ్యాసియై, ఇంద్రియబాధా వివర్జితుడై ఋజు కాయుడై, జితద్వంద్వుడైన యోగి (యో. భో. 3, 1) అనగా నష్టాంగయోగ పూర్వపంచక సిద్ధి నొందిన యోగి, సమాధి దృష్టిం దగిలి ధారణాదుల నొందుటకై నాసికాగ్రాది ధ్యానము జేయవలయును. ధారణయందు ధృతచిత్తత నొంది జ్ఞానైక్యత నొందుటయే ధ్యాన మనబడును. అంత 'తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః' (యో. సూ. 3.3) ధ్యానగత ధ్యేయాకారాక్రాంత వృత్తినొంది యుండుట సమాధి యనబడును. ధారణ ధ్యాన సమాధి త్రయమునందు ఏకవిషయత్వ మొప్పారును. వానిని 'సంయమ' నామమున వ్యవహరించెదరు. వానిని స్వాధీనము గావించుకొనినవాడే 'సంయమి' యనుటయు యొప్పును.

పైవివరింపబడిన అష్టాంగయోగ సాధనామూలమున గొన్ని ఫలితము లేర్పడుచున్నవి. అహింసాప్రతిష్ఠా కారణముగ సాధకుని సన్నిధానమున సర్వప్రాణులు పరస్పర వైరత్యాగము నాచరించును. (యో. సూ. 2, 35) సత్యవ్రత ప్రతిష్ఠవలన సత్య సంకల్పుడై వరప్రదాతగ యోగి యగును. (యో. సూ. 2, 36)

అస్తేయ ప్రతిష్ఠితుడుకాగా సర్వరత్న సంపన్నత కలుగును. (యో.సూ.2,37) బ్రహ్మచర్య ప్రతిష్ఠవలన శక్తి నిరవధికాభి వృద్ధినొంది 'జ్ఞానమాధాతుం సమర్థో భవతి' (యో,భా,2.38) జ్ఞానప్రదానము గావింప సమర్థుడగును. అపరిగ్రహమువలన జన్మమూల గ్రహణము గలుగును. బాహ్యశౌచమున స్వాంగ ములపై నసహ్యతయు, నంతశ్శౌచమున సౌమనస్య మనబడు చిత్తశుద్ధియు నేకాగ్రతయు, నింద్రియజయము, ఆత్మదర్శన యోగ్యతయు లభించును. సంతోషమున సర్వోత్కృష్ట సుఖ లాభము కలుగును. తపస్సుచే నశుద్ధిక్షయము కాయేంద్రియ సిద్ధియు గలుగును, తత్ఫలితముగ దూరశ్రవణాది సిద్ధులు గలు గును. స్వాధ్యాయఫలితముగ నిష్టదేవతా సంప్రయోగము ప్రాప్తించును, ఈశ్వరప్రణిధానముచే సమాధిలాభ మొదవును. ఆసనసిద్ధివలన ద్వంద్వజయము గలుగును. ప్రాణాయామాభ్యా సమున వివేక జ్ఞానావరణమగు కర్మాశయాదిక నాశము సంభ వించును. దీనివలన ధారణయు నొదవును. ప్రత్యాహారమున నింద్రియజయము సిద్ధించును. సంయమనామక త్రయమువలన ప్రజ్ఞాభివృద్ధి లభించును. ఈధారణాది త్రియము సంప్రజ్ఞాత మనబడు సమాధికి పూర్వపంచకముకంటె సన్నిహితము.

ఇంతవరకు యోగము నాబడు సమాధిసాధన కుపయుక్త ములగు అష్టాంగముల క్లుప్తముగ సింహావలోకన మొనరించి నారము. ఇక దత్ఫలితములగు సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాతాది సమాధిస్థితుల గ్రహించెదముగాక.

# సమాధి రహస్యము

'అథ యోగానుశాసనం' (యో.సూ.1.1) యోగశ్చిత్త వృత్తినిరోధః'(యో.సూ.1.2) అను సూత్రముల నుపయోగింప బడిన 'యోగ' పదముతో గ్రంథము నుపక్రమించి 'యోగః సమాధిః' (యో.భా.1.1) అను వ్యుత్పత్తి ననుసరించి సమాధి సంస్మరణము గావించి, 'తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః' (యో.సూ.1 51) అని నిర్బీజమగు అసంప్రజ్ఞాత సమాధి నిర్వచనముతో నధ్యాయము నుపసంహరించుచు, నా ప్రథమ ప్రకరణమునకు సమాధిప్రకరణమనియు నామకరణ మొనరించి, తత్సిద్ధికై ద్వితీయమును సాధన ప్రకరణమనియు పేరుంచి, తత్ఫలితముగ గలుగు సామాన్యసిద్ధుల దృతీయమున వివరించుచు, దానికి విభూతి ప్రకరణమనియు నామం బిడి, మరియు నాసమాధి పరమఫలితమగు కైవల్య వివరణమున జతుర్థమునకు కైవల్య ప్రకరణమనియు పతంజలి వక్కాణించి యుండుటచే పాతంజలము నాబడు యీసర్వయోగగ్రంథ మంతయు సంపూర్ణముగ సమాధిపరమే యగుచున్నదని సందేహ మావంతయులేదు. అందుచే నీగ్రంథమున సర్వచర్చావిషయ ములు ఆసమాధిసిద్ధికే దృష్టిని బ్రసరింప జేయుచున్నవి, కాన సమాధిసాధనామార్గమున తత్తత్సాధనా ఫలితముగ గల్గు అనేక సిద్ధుల బ్రస్తావించి 'తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః' (యో.సూ 3.37) ఈసిద్ధులు వ్యుత్థానచిత్తమునాబడు సామాన్య చిత్తమునకు సిద్ధులై పరిగణింపబడినను, సమాధియుక్త చిత్త మునకు ఆటంకములని సూత్రకారులు హెచ్చరిక చేసి, 'సర్వ

నిరోధాత్ నిర్బీజసమాధిః' (యో సూ.1 51) సర్వవిషయ నిరోధమువలననే అసంప్రజ్ఞాతసమాధి సంప్రాప్తించునని వక్కాణించుచున్నాడు. కావున సాధకలోకము, క్షణికములును అల్పములును అగు సిద్ధులపై దృష్టి దగుల్కొననీయక బరమావధి యగు 'కైవల్యం స్వరూపప్రతిష్ఠా' (యో. సూ 4.34) యను పరమపురుషార్థసిద్ధికై యత్నించెదరుగాక!

'యస్త్వేకాగ్రే చేతసి సద్భూతమర్థం ప్రద్యోతయతి క్షిణోతి చ క్లేశాన్కర్మబంధనాని శ్లథయతి నిరోధమభిముఖం కరోతి స సంప్రజ్ఞాతః' (యో.భా.1.1) ఏకాగ్రస్థితిలో గోచరించుచు, సదర్థముల బ్రకాశింపజేయుచు, క్లేశముల నశింపజేయుచు, గర్మపాశముల సడలించుచు, సర్వనిరోధాభిముఖము గావించు సంస్థితిని సంప్రజ్ఞాతమందురు. 'సర్వవృత్తినిరోధే త్వసంప్రజ్ఞాతః సమాధిః' (యో.భా.1.1) సర్వవృత్తి నిరోధ స్థితియే యసంప్రజ్ఞాతము నా నిర్బీజసమాధియను వచన తాత్పర్యము చందము, సమాధి, ముఖ్యముగ ద్వివిధమై విరాజిల్లుచున్నది. 'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానం' (యో.సూ.1.3) అంత ద్రష్ట స్వస్వరూపస్థితు డగుననుటచే 'స్వరూపప్రతిష్ఠా తదానీం చిత్తశక్తిర్యథా కైవల్యే' (యో.భా.1.3) చిత్తవృత్తి నిరోధరూప సమాధియందు బురుషుడు కైవల్యస్థితి యందువలె స్వరూపావస్థితు డగుచున్నాడు. అందుచే బురుషార్థమగు కైవల్యమునకు, సన్నిహిత సంబంధియై యుండును గాన సమాధి విచార ణావశ్యకత విదితమగుచున్నది.

సమాధిద్వయమున 'సంప్రజ్ఞాతపూర్వకత్వాదసంప్రజ్ఞాతస్య' (యో.భా.వా.1.17) అసంప్రజ్ఞాతముకంటె సంప్రజ్ఞా

తము పూర్వమగుటచే 'ప్రథమం సంప్రజ్ఞాతోపవర్ణనం' (యో. భా. వా.,1,17) ప్రథమమైన సంప్రజ్ఞాతము వర్ణింపబడుచున్నది. 'సమ్యక్సంశయ విపర్యయరహితత్వేన ప్రజ్ఞాయతే ప్రకర్షేణ జ్ఞాయతే భావస్య స్వరూపం యేన స సంప్రజ్ఞాతః' (యో. భో. 1.7). దేనిచే సంశయవిపర్యయములు లేక ధ్యేయవస్తువుయొక్క విశిష్ట స్వరూపము విశేషముగా తెలియబడుచున్నదో అది సంప్రజ్ఞాతసమాధి యని భోజ నిర్వచనము. ఇదియే 'సమాపత్తి' యనబడి 'క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిః' (యో సూ.1.41) వృత్తులు క్షీణింప, గృహీత, గ్రహణ గ్రాహ్య విషయములలో దేనిపైననైన చిత్తము లయింప, చిత్తము తన విషయస్వరూపమును మణివలె బొందుచున్నదగుట సమాపత్తి యనబడును అని వివరణము. దీనిలో బాహ్యావస్థాపేక్ష గలదు గాన నీసమాపత్తి నాబడు సంప్రజ్ఞాతము 'ఏవ సబీజః సమాధిః' (యో. సూ. 1. 46) సబీజ సమాధి యనియు ననబడియున్నది.

'స చ సంప్రజ్ఞాతశ్చతుష్ప్రకార ఇత్యాహ' (యో. భా. వా., 1.1) అనురీతి 'చతుర్థోపసంఖ్యాతః సమాధిరితి' (యో. భా. 1.1) ఈచతుర్విధ సమాధులు వర్ణితము అను చందము, సంప్రజ్ఞాతము, 'వితర్క విచారానందాస్మితారూపానుగమాత్సంప్రజ్ఞాతః' (యో. సూ. 1.17) వితర్క విచార ఆనంద అస్మితా రూపమున సంప్రజ్ఞాతము నాలుగువిధములు. 'వితర్కశ్చిత్తస్యాలంబనే స్థూల ఆభోగః' (యో. భా. 1,17) వస్తువుయొక్క స్థూలరూపజ్ఞానమే వితర్క మనబడును. 'సూక్ష్మో విచారః' (యో భా. 1.17) వస్తువుయొక్క సూక్ష్మరూపజ్ఞానము విచా

రము 'ఆనందో హ్లాదః' (యో.భా.1.17) వస్తుజనిత హ్లాదమే ఆనందము, 'ఏకాత్మికా సంవిదస్మితా' (యో.భా.1.17) ఏకాత్మకత్వమే అస్మితారూపము, సవితర్కమున 'చతుష్టయానుగతః' (యో.భా.1.17) అను వాక్యము ననుసరించి నాలుగు నంతర్గతములై 'వితర్కవికలః సవిచారః' (యో.భా.1.17) వితర్కమువినా మిగిలిన మూడింటిని గలది సవిచారము. 'విచారవికలః సానందః' విచారశూన్యమై సానంద సాస్మిత యుగ్మము సానందముగ వ్యవహార్యము. 'చతుర్థ స్తద్వికలోఽస్మితామాత్ర' (యో.భా.1.17) నాల్గవదియగు అస్మిత ఆనందరహితము అస్మితామాత్రస్థితము. వీని కన్నింటికిని ఏకాలంబననేయున ఏకవిషయత్వమే యుండును.

'వితర్కం వివృణోతి' (యో.భా.వా 1.17) ప్రథమమున వితర్కము వివరింపబడుచున్నదని వాచస్పతులు ప్రారంభించి, 'స్వరూపసాక్షాత్కారవతీ ప్రజ్ఞాఽభోగః (యో.భా.వా.1.17) అభోగమన బాహ్యవిషయస్వరూప ప్రజ్ఞాసాక్షాత్కారమే యగుననియు,నది స్థూలవిషయ సంబంధి యగుటచే స్థూలమని వ్రాసిరి. అనగా పాంచభౌతిక విషయికముగా నది యొప్పారుచున్నది. మరియు చిత్తభావన ద్వివిధమున ఈశ్వర, పంచవింశతి తత్త్వరూపముగ నుండును, అందు జడాజడరూపమున రెండవది మరల ద్వివిధ మగుచున్నది. వానిలో పురుషుడు అజడాత్మకముగనుండ జడాత్మకమగును చతుర్వింశతికము. జడములగు చతుర్వింశతికమున పంచమహాభూతములు దశేంద్రియములును గలసి స్థూలములగును. శబ్దాది తన్మాత్రలు బుద్ధి సూక్ష్మములు, అందుచే సవితర్కమున స్థూలములగు భూతేం

ద్రియముల లక్ష్యముగావించి, వీని బూర్వాప రానుసంధాన పూర్వక శబ్దార్థశోధన జేసి, కార్యకారణ భావముల విమర్శించి గ్రహించుట సవితర్కమనబడును. 'ఏవం చిత్తస్యాలంబనే సూక్ష్మః ఆభోగః స్థూలకారణభూతసూక్ష్మపంచతన్మాత్ర లింగాలింగవిషయో విచారః' (యో.భా.వా.1,17) స్థూలభూత కారణములగు పంచతన్మాత్ర, లింగ, అలింగముల విమర్శించుట గ్రహించుట సవిచారమగుచున్నది. మరియు 'ఇంద్రియే స్థూల ఆలంబనే చిత్తస్యాఽభోగో హ్లాద ఆనందః' (యో.భా.వా.1.17) స్థూలవిషయాలంబన జనిత చిత్త హ్లాదస్థితియే ఆనందమగుచున్నది. 'సత్త్వం సుఖం' (యో.భా.వా.1.17) అనురీతి యీ స్థితిలో సత్త్వాధిక్యత యుండును, కాని లేశమాత్రముగ రజస్తమములు భాసించుచుండును. 'తతః పరం రజస్తమోలేశానభిభూతం శుద్ధసత్త్వమాలంబనీకృత్య యా ప్రవర్తతే భావనా తస్యాం గ్రాహ్యస్య సత్త్వస్య న్యగ్భావాచ్చితిశక్తేరుద్రేకాత్సత్తామాత్రావశేషత్వేన సమాధిః సాస్మిత ఇత్యుచ్యతే' (యో.భో.1.17) రజస్తమోగుణములు లేశమాత్రమైన సంబంధింపక యుండు చిత్తమున, శుద్ధసత్త్వము మాత్రము భాసించి, క్రమముగా నాసత్త్వము నశింప, చైతన్యశక్తి వృద్ధిచెంద, చైతన్యశక్తియే శేషించి యుండగలుగు సమాధి సాస్మిత యనబడుచున్నది. ఈవిధానముగ సంప్రజ్ఞాతము చతుర్విధములై యున్నదని విదితము.

చతుర్విధరూపమైన సంప్రజ్ఞాతమే గృహీతృ గ్రహణ గ్రాహ్య విషయముల ననుసరించి త్రివిధసమాపత్తులుగ ఏర్పడుచున్నది. సవితర్క సవిచార ద్వయమున 'గ్రాహ్యాలంబనోప

రక్తం చిత్తం గ్రాహ్యసమాపన్నం గ్రాహ్యస్వరూపాకారేణ నిర్భాసతే' (యో.భా.1.41) చిత్తము గ్రాహ్యముపై బ్రసరింప బడగా గ్రాహ్యసంయుక్తమై గ్రాహ్యాకారమును దాల్చును. ఆగ్రాహ్యము స్థూలముగగాని సూక్ష్మముగగాని లౌకికముగ గాని యుండనగును. దీనిని గ్రాహ్యసమాపత్తి యని యందురు. 'తథా గ్రహణేష్వపీంద్రియేష్వపి ద్రష్టవ్యం' (యో.భా.1.41) అట్లే గ్రహణసమాపత్తియు నగుచున్నది. అనగా చిత్తము ఇంద్రియ సమాపత్తి నొంది తదాకారాకారిత మగుచున్నది. సానంద సమాపత్తి దీని యందన్వయము. 'తథా గృహీతృ పురుషాలంబనోపరక్తం గృహీతృపురుషసమాపన్నం గృహీతృ పురుషస్వరూపాకారేణ నిర్భాసతే' (యో.భా.1.41) అట్లే గృహీతపై చిత్తమును బ్రసరింపజేయగా పురుషసమాపత్తిచేత బురుషాకృతిని బొందుట గృహీతృ సమాపత్తిగా సాస్మితను జేర్కొందురు.

మరల గ్రాహ్యసమాపత్తి నాబరగు సవితర్క సవిచార ద్వయము నిర్వితర్క నిర్విచారములతో జేరి చతుర్విధము లగు చున్నది. అందు బ్రథమము 'తత్ర శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః' (యో.సూ.1.42) శబ్దార్థ జ్ఞాన వికల్ప ములతో గూడిన సమాపత్తి సవితర్క మనబడును. అనగా శబ్దము తదర్థము, అర్థజ్ఞానములందు సంకీర్ణత్వమేర్పడి వికల్ప జ్ఞానము కలుగుట సవితర్కమనబడును. అట్లుగాక 'స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా' (యో.సూ. 1.43) స్మృతివిరహితమై, స్వరూప శూన్యత్వమునొంది చిత్తము విషయాకారవృత్తి నొందుట నిర్వితర్క మగుచున్నది. అనగా

సవితర్కమున, శ్రుత్యనుమానప్రమాణముల సహాయముండ, నిర్వితర్కము, శబ్దానుమానజ్ఞాన వికల్పములు లేక, స్వరూప మాత్రేణావస్థితి నొంది స్వరూపాకారమును నొందియుండు స్థితియై రాజిల్లును. కాన నిర్వితర్కజ్ఞానము స్వతంత్రము, స్వాపేక్షికము స్థిరము. 'ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా' (యో.సూ.1.44) పైవిధానముననే సవిచార నిర్విచారములు సూక్ష్మవిషయముల కన్వయించును. అనగా సూక్ష్మవిషయములగు తన్మాత్రాదికము, దేశకాల నిమిత్తముగా నేవస్తువు నందున్నదియు విచారించుట యని యర్థము. ఇచ్చట సూక్ష్మవస్తువే విషయము. అట్లుగాక సూక్ష్మపరమాణువులు విషయములై, నవి త్రికాలాతీతముగ జూడబడునప్పుడు 'ప్రజ్ఞా చ స్వరూపశూన్యేవార్థమాత్రా యదా భవతి తదా నిర్విచారేత్యుచ్యతే'(యో.భా.1.44) ప్రజ్ఞ తన స్వరూపత్యాగముగావించి,విషయరూపమున వెలుగొందుట నిర్విచార మనబడును. కాని పూర్వోక్తచందము 'తత్ర మహద్వస్తువిషయా సవితర్కా నిర్వితర్కా చ సూక్ష్మవస్తువిషయా సవిచారా నిర్విచారా చ' (యో.భా.1.44)సవితర్కనిర్వితర్కములలో మహద్విషయత్వమును, సవిచార నిర్విచారముల సూక్ష్మవస్తువిషయత్వమును గలిగియుండును. ఈసవితర్కాదిక చతుష్టయమున బాహ్యవస్తువిషయత్వ ముండుటచే, 'తా ఏవ సబీజః సమాధిః' (యో.సూ.1.46) వానిని సబీజ సమాధి యందురు, ఇట్లు క్రమక్రమాభివృద్ధి గని సమాధిసౌధముల నధిరోహించు చిత్తము నిర్విచారమునొంది తత్ఫలితముగ 'నిర్విచార వైశారద్యేఽధ్యాత్మప్రసాదః' (యో.సూ.1.47) నిర్వి

చారవిశారదత్వమున ఆత్మప్రసాదము గలుగును. ఈస్థితినొందిన యోగి 'ప్రజ్ఞాప్రసాదమారుహ్య అశోచ్యః శోచతో జనాన్' (యో.భా.1.47) ప్రజ్ఞాస్థితి నధిష్ఠించి వీతశోకుడై బాధితజనమును దయాదృష్టుల దిలకించును. అంతియగాక 'ఋతంభరా తత్ర ప్రజ్ఞా' (యో.సూ.1.48) యీప్రజ్ఞాస్థితి ఋతసంపూర్ణమై యుండును. అనగా అన్యతత్వ మొకించుకయేని గోచరింపదు. అనగా నచ్చట అవిద్యావిపర్యయాది కానుభవము లేశమంతగనైన నుండజాలదు. అందుచేతనే 'ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసేరసేన చ। త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగముత్తమం' (యో.భా.1.48) శబ్దానుమాన ధ్యానాభ్యాసాదులచే దనప్రజ్ఞను క్రమపరచి యోగి యుత్తమ యోగస్థితిని బడయును, అని వచింపబడియున్నది. మరియు దీనివలన 'తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ' (యో.సూ.1 50) ఈ సమాధిజన్య సంస్కారములు అన్యములగు క్లేశాది సంస్కారముల క్షయింపజేయును. అనగా 'సమాధిప్రజ్ఞాప్రభవః సంస్కారో వ్యుత్థానసంస్కారాశయం బాధతే' (యో.భా.1.50) సమాధీ ప్రజ్ఞా సంభవములోడ సంసారకారణ సంస్కారపుంజము లంతరించును. గ్రాహ్యసమాపత్తి క్రమమునగల నిర్విచార విశేషముననే యీ ఋతంభరాది సమాధి విశేషములు ఫలించుచున్నవని గ్రాహ్యము. దీనితో 'బాహ్యాపేక్షికత్వము క్షీణించుననియు గ్రాహ్యము,

సాధకస్థితుల ననుసరించి 'చత్వారః ఖల్వమీ యోగినః ప్రాథమకల్పికో మధుభూమికః ప్రజ్ఞాజ్యోతిరతిక్రాంతభావనీయశ్చేతి' (యో.భా.3.51) ప్రాథమకల్పిక, మధుభూమిక, ప్రజ్ఞా

జ్యోతి. అతిక్రాంతభావనీయరూపమున యోగులు నాలుగువిధములుగా విభజ్యము. అందు ప్రథముడు ప్రాథమికుడై అభ్యాసియై ప్రవృత్తిమాత్రుడై యుండును, ద్వితీయుడనబడు మధుభూమికస్థితునికే ఋతంభరాప్రజ్ఞ సంధిల్లి యుండును. తృతీయుడగు ప్రజ్ఞాజ్యోతిస్థితుడు. సర్వభూతేంద్రియ జయుడు. కృతఫలితముల నుండి రక్షణము, కర్తవ్యసాధన సాధ్యత్వముల గలిగినవాడితడు. తురీయుడగు అతిక్రాంతభావనీయుడు చిత్తలయ కార్యమాత్రశేషుడై యొప్పారి సర్వోత్తముడై యుండును, ఈనాలుగింటిలో మధుమతిస్థితికే ఋతంభరాప్రజ్ఞాస్థితియను వివేకము. ప్రథమమున యోగారంభకదశ యుండును. తృతీయమున భూతేంద్రియ సంపన్నతచే సంతృప్తుడు. చతుర్థమున పరంవైరాగ్యసంపన్నుడై అసంగుడై యుండును. కాని ద్వితీయమున సాధకస్థితిమాత్రమే యుండుటచే నది సాధకులకు జాల ముఖ్యము.

మరల వీరికే అనుభవస్థితి ననుసరించి 'తస్యసప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా' (యో.సూ.2,27) సాధకునకు ప్రజ్ఞ సప్త సోపానములుగ నుండును. ఈస్థితులు 'వివేకఖ్యాతి' (యో.సూ. 2.26) పొంది వశీకార వైరాగ్య సంపన్నుడగువానికి కలుగును. రజస్తమోరహితునకు నీస్థితులు గలుగును. హేయత్వము సంపూర్తిగ గ్రహించియుండుట ప్రథమభూమిక. హేయవస్తు కారణములు క్షయింపబడుట ద్వితీయము. నిరోధసమాధి నాబడు సంప్రజ్ఞాతముచే హేయత్వవినాశమును దర్శించుట తృతీయము. వివేకఖ్యాతిద్వారమున హేయత్వ హానకార్యము సంపూర్తి యగుట చతుర్థము. ఈనాలుగును పురుషప్రయత్నమున గలుగు ప్రజ్ఞానముక్తస్థితులు. ఈచతుష్టయముద్వారా ప్రజ్ఞ

కార్యములనుండి విముక్తి నొందుచున్నది. ఇక ప్రయత్నాపేక్షి కములుగాక చిత్తవిముక్తిదములు తర్వాత త్రయము. 'చరితాధికారా బుద్ధిః' (యో.భా.2.27) బుద్ధి ప్రవృత్తులు సంపూర్తి నొందుట పంచమము. అందు 'కృతభోగాపవర్గకార్యేత్యర్థః' (యో.భా.వా.2.27) భోగాపవర్గకార్యము సమాప్తి చెందును. గుణ నివృత్తిగలిగి 'న చైషాం ప్రవిలీనానాం పునరస్త్యుత్పాదః ప్రయోజనాభావాదితి' (యో.భా 2.27) అవసరము లేకుండుటచే పునరుత్పత్తి నొందకుండుట షష్ఠము. సప్తమభూమి యందు 'గుణసంబంధాతీతః స్వరూపమాత్రజ్యోతి రమలః కేవలీ పురుష ఇతి'(యో.భా.2.27) పురుషుడు గుణాతిరిక్తుడై స్వరూపమాత్రజ్యోతియై అమలుడై కేవలుడై యొప్పారును. ఇట్టి వానిని కుశలుడని వ్యవహరింతురు. సిద్ధుడనియు నందురు.

సప్తభూమికలలో నాద్యచతుష్టయము సంప్రజ్ఞాతమునకు సంబంధము. ఉత్తరత్రయము అసంప్రజ్ఞాత పక్షము. మరియు సాధకచతుష్టయమున ప్రాథమకల్పక, మధుభూమిక, ప్రజ్ఞాజ్యోతి స్థితులు సంప్రజ్ఞాత రూపములు. అతిక్రాంతభావనీయము అసంప్రజ్ఞాత రూపము, అందుచేతనే, 'సంప్రజ్ఞాతసమాధిసంపన్నయో ర్మధుభూమిక ప్రజ్ఞాజ్యోతిషోర్మధ్యమయో ర్యోగినో శ్చిత్తసత్త్వం సంగృహీతం' (యో.భా.వా.1.2) సంప్రజ్ఞాత సమాధిని పొంది మధుభూమిక ప్రజ్ఞాజ్యోతి రూపముననున్న యోగద్వయముయొక్క మధ్యమరూప చిత్త సత్త్వస్థితి వివరింపబడి యున్నదని వాచస్పతి వివరించెను. ఈ రెండుస్థితులలో రజోలేశముండి 'రజసః ప్రవర్తకత్వాదస్తి ధర్మాది ప్రవృత్తిః' (యో.భా.వా.1,2) ధర్మప్రవృత్తిని గలిగియుండును.

జన, తపో, సత్యరూపమున త్రివిధాత్మకమగు బ్రహ్మలోకములో మూడవదియగు సత్యలోకమున, అచ్యుత, శుద్ధనివాస, సత్యభా, సంజ్ఞాసంజ్ఞానులనబడు చతుర్విధ దేవతాకాయములలో నచ్యుతులు సవితర్కధ్యాన సుఖులుగను, శుద్ధనివాసులు సవిచార ధ్యానానందులుగను, సత్యభారూపులు ఆనందమాత్ర ధ్యానతుష్టులుగను సంజ్ఞాసంజ్ఞానులు అస్మితామాత్ర ధ్యానప్రియులుగ నుందురు. వీరు బ్రహ్మలోకవాసులైయున్నను సంప్రజ్ఞాతసమాధి రతులగుటచే కైవల్యము నొందనివారే యగును. కాన కైవల్యప్రాప్తి సన్నిహితమైన అసంప్రజ్ఞాతమును యిక విచారింతము.

'న తత్ర కించిత్సంప్రజ్ఞాయత ఇత్యసంప్రజ్ఞాతః' (యో. భా.1.2) పూర్వవర్ణిత సంప్రజ్ఞాతసమాధి కన్యమై యేదియు గోచరింపని స్థితి అసంప్రజ్ఞాతము అనబడును. దానినే 'సర్వవృత్తినిరోధే త్వసంప్రజ్ఞాతసమాధిః' (యో. భా. 1.1) సర్వవృత్తినిరోధస్థితి యగుటజే అసంప్రజ్ఞాతమని వచించిరి. మరల నదే 'సర్వవృత్తి ప్రత్యస్తమయే సంస్కారశేషో నిరోధశ్చిత్తస్య సమాధి రసంప్రజ్ఞాతః' (యో.భా.1 18)సర్వవృత్తు లస్తమించి, సంస్కారములుమాత్రము శేషించి యుండునప్పుడుగల స్థితిని అసంప్రజ్ఞాతమని నిర్వచింపబడినది. 'తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః' (యో.సూ.1.51) ఋతంభరాదికముగూడ నిరోధింపబడి సర్వ నిరోధము ఏర్పడ నిర్బీజసమాధియనియు సూత్రకారులనిరి. దీనినే భోజదేవుడు 'ప్రకృష్ట మశుక్లకృష్ణం ధర్మం పరమపురుషార్థసాధకం మేహతి సించతీతి ధర్మమేఘః' (యో.భో.4.28) ఉత్కృష్టమైన పుణ్యాపాపరహితమై పురుషార్థ

సాధనమై ధర్మమును వర్షింపజేయుచున్నది. గాన ధర్మమేఘ మనియు నామకరణము జేసెను.

ఈస్థితియే 'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానం' (యో, సూ. 1.3) అచ్చట ద్రష్టయగు పురుషుడు స్వస్వరూపమున స్థితుడై యుండునన్నట్లు వివరింపబడినది. చిత్తప్రశాంత స్థితి కాటంకదాయక సర్వవృత్తులును నిరోధము నొందియుండుటచే 'రజోలేశమలాపేతం స్వరూపప్రతిష్ఠం సత్త్వపురుషానతాఖ్యాతి మాత్రం' చిత్తము రజోలేశమునుగూడ వర్జించి ప్రధాన పురుష విభేదజ్ఞానమునాబడు స్వస్వరూపము నొందియుండును. అందుచేతనే శుద్ధసత్త్వప్రధానమై 'తారకం సర్వవిషయం సర్వథావిషయమక్రమం చేతి వివేకజం జ్ఞానం' (యో. సూ. 3. 54) తారకమై యన ముక్తిదమై, సర్వజ్ఞమై సర్వథా జ్ఞాతమై యుండు వివేకజన్య జ్ఞానముగూడ 'అతస్తస్యాం విరక్తం చిత్తం తామపి ఖ్యాతిం నిరుణద్ధి' (యో. భా, 1.2) అందుచేత నట్టి జ్ఞానముచేగూడ చిత్తమాకర్షింపబడకుండునప్పుడు, అనుసూత్ర పద్ధతిని చిత్తముచే నిరోధింపబడగా 'సంస్కారోపగం భవతి' (యో, భా. 1.2) పూర్వ సంస్కారాధారమైమాత్ర ముండనది యసంప్రజ్ఞాత మగుచున్నది. కావున నట్టి 'తస్య ప్రశాంత వాహితా సంస్కారాత్' (యో, సూ. 3.10) నిరోధజన్య ప్రశాంత ప్రవాహమధ్యమున 'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానం' (యో. సూ. 1.3) అని యన్వయము. దీనిని వివరించుచు 'కైవల్యం స్వరూపప్రతిష్ఠా తదానీం చితిశక్తిర్యథా కైవల్యే' (యో. భా. 1.3) కైవల్యమునందువలెనే యిచ్చట చిత్తము స్వస్వరూపమున నుండును, అని వ్యాసులు విశదపరచిరి. ఈస్థితిలో 'ఆరో

వేద్యము. (మజ్జిమనికాయము) ఆ నిర్వాణము ప్రశాంతము. సంబంధ రహితము, అనాత్మనిరోధము. (మజ్జిమ) నిర్వాణము ముక్తి స్థితి నిర్మలస్థితి. (మజ్జిమ) నిర్వాణము భావచైతన్యాతీతము. (మజ్జిమ) 'నిబ్బానం పరమం సుఖం' (ధమ్మపద. 15.10) నిర్వాణము ఉత్కృష్టానందము అని నిర్వచించియున్నాడు. Nirvana as awakening from a day dream or night mare 199 నిర్వాణము స్వప్నమునుండి దుస్స్వప్నమునుండి మేల్కాంచుటవంటిది. It is neither infinity of consciousness, nor nothingness. This is rejection of all positive determinations, does not imply nothingness 199 అది అనంతాకాశము గాదు. అనంతప్రజ్ఞానముగూడ శూన్యముగూడ కాదు. శూన్యముకాక సర్వఅనుకూల నిర్వచనముల నివాసమే అగుచున్నదని బుద్ధుని వివరణము. Unto Nirvana. He is One with Life, Yet lives not. He is blest ceasing to be. Om Mani Padme, Om! the dew drop slip into the shining sea 200 నిర్వాణము నందుకొనును. అతడు నిత్యజీవితముతో నేకమగును. కాని జీవించుటలేదు. లేకుండునట్లు ఆశీర్వదింపబడెను. 'ఓం మణి పద్మే ఓం!' మంచుబిందువు ప్రకాశవంతమగు సాగరములోనికి జారినది। As one who stands on yonder snowy horn, Having naught over him but the boundless blue, So, these sins being slain, the man is come NIRVANA'S verge unto 201 ఊర్ధ్వమున నీలాకాశముగాక

199. Sir Francis Younghusband : Some Sayings of Buddha p. viii.
200. Sir Edwin Arnold : Light of Asia, p. 145
201. " " p. 152

ఖ్యాతేః ధర్మమేఘః సమాధిః' (యో.,సూ. 4 29) ప్రసంఖ్యాన జ్ఞానమునందును గూడ, నభిలాష లేకుండునప్పుడు ధర్మమేఘము నను మార్గగామియగు జ్ఞాన ముదయించునను వచనమురీతి 'తత్పరం ప్రసంఖ్యానమిత్యాచక్షతే ధ్యాయినః' ధర్మమేఘము పరంప్రసంఖ్యానమని ధ్యానయోగులు వచింతురు. ఇది 'సర్వాం ధర్మాం జ్ఞేయాం మేహతి వర్షతి ప్రకాశనేనేతి ధర్మమేఘ ఇత్యుచ్యతే' (యో. భా. వా. 4.29) జ్ఞేయములగు సర్వధర్మములపై ప్రకాశమును వర్షింపజేయును గాన ధర్మమేఘమన్న నిర్వచన రీతి బురుషుని శుద్ధముగ ప్రకాశింపజేయుచు స్వస్వరూపస్థితునిగ ధర్మమేఘము గావించుచున్నది. దానిలో 'సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానంత్యా జ్ఞేయమల్పం' (యో.,సూ. 4.31) అంత సర్వావరణములు కర్మాశయమును నివారణమగును. 'తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తిర్గుణానాం' (యో. సూ. 4.32) దానితో గుణపరిణామములన్నియు నుడిగి యోగి కృతార్థత నొందుచున్నాడు.

ఇంతదనుక కైవల్యాత్పూర్వమును గుణపర్యవసానమును అగు అసంప్రజ్ఞాత స్వభావ లక్షణముల నెరింగితిమి. ఇది సంప్రజ్ఞాతానంతర స్థితియనియు గ్రహించియుంటిమి. సంప్రజ్ఞాతము 'అభ్యాసవైరాగ్యా' (యో. సూ. 1.12) దులచే సంప్రాప్తించుచుండ సర్వవృత్తినివృత్తిరూప 'పరం వైరాగ్యముపాయః' (యో. భా. 1.18) పరమవైరాగ్యమే యసంప్రజ్ఞాతమున కుపాయముగ స్పష్టము. కాన 'నిర్ధూతరజస్తమోమలస్య బుద్ధిసత్త్వస్య పరే వైశారద్యే పరస్యాం వశీకారసంజ్ఞాయాం' (యో. భా. 3.49) రజస్తమోరూప మలరహితమై శుద్ధమై బుద్ధిసత్త్వము వశీకార

సంజ్ఞారూపవైరాగ్యమునకు మించిన వైరాగ్యమున నుండగా నిది సంప్రాప్తించుననుటచే పరమవైరాగ్య మత్యవసరమని విదితము. అందుచేతనే దేవతలచే నాహూతుడై అసంఖ్యాకములగు 'దేవానాం ప్రియం' (యో.భా.3.51) దేవతలకు ప్రియమైన సుఖముల వారొసంగుచున్నను 'స్వస్తి వః స్వప్నోపమేభ్యః కృపణజనప్రార్థనీయేభ్యో విషయేభ్యః' (యో.భా.3.51) అజ్ఞజన కాంక్షితములై స్వప్నతుల్యములగు యీవిషయములకు స్వస్తియని పాడిన మధుమతిస్థితుడే ద్వితీయస్థానము నలంకరింప నిక అసంప్రజ్ఞాతుడును తురీయుడును అగు అతిక్రాంతభావనీయుడు 'చతుర్థేపి పరవైరాగ్యసంపత్తేరాసంగశంకా దూరోత్సారితైవేతి' (యో.భా.వా.3.51) నాలుగవవానిలోగూడ రాగశంక, అతని పరమవైరాగ్యకారణమున దూరగతమై యున్నది, అని యనురీతి దన వైరాగ్యాతిశయప్రభావమున నిర్బీజసమాధిస్థితుడు గణుతికెక్కును.

కాని యీయసంప్రజ్ఞాతము ప్రథమమున 'స ఖల్వాయం ద్వివిధః ఉపాయప్రత్యయో భవప్రత్యయశ్చ' (యో.భా.1.19) ఉపాయ భవ ప్రత్యయరూపమున ద్వివిధము. అందు 'భవప్రత్యయో విదేహ ప్రకృతిలయానాం' (యో.సూ.1.19) భవప్రత్యయము విదేహప్రకృతిలయులకు జెందినది, 'విదేహానాం దేవానాం భవప్రత్యయః' (యో.భా.1.19) అనువిధమున విదేహులగు దేవతలకు నీభవప్రత్యయ మన్వయము. ఎట్లన, వీరు స్వసంస్కార మాత్రచిత్తులై, యీచిత్తకారణమున 'కైవల్యపదమివానుభవంతః' (యో.భా.1.19) కైవల్యముబోలు పదము ననుభవించి, సంస్కారవిపాకము నొందుదురు. అట్లే ప్రకృతిలయు

లును, కించిదర్థకాంక్షులై ప్రధానమున లయించి, కైవల్యతుల్య స్థితిని, చిత్తసంస్కారములు పృథక్త్వాసమునకు యోగ్యాంతవరకు ననుభవింతురు. అనగా వీరుభయులును కైవల్యము నొందక సంస్కార శేషులై పునర్జన్ము లగుదురని తాత్పర్యము. కాని సంప్రజ్ఞాతసిద్ధులవలె లోకాంతరగతులుగాక 'విదేహప్రకృతిలయాస్తు మోక్షపదే వర్తంతే ఇతి న లోకమధ్యే న్యస్తా ఇతి' (యో. భా.3 26) విదేహ ప్రకృతిలయులు కైవల్యస్థితి నుందురు గాన నేలోకమునగూడ నుండరు. ఎందులకన 'బుద్ధివృత్తిమంతో హి దర్శితవిషయా లోకయాత్రాం వహంతో లోకేషు వర్తంతే' (యో.భా.వా.3 26) ఎవరి బుద్ధి ప్రవృత్తమై పురుషునికి విషయ దర్శనము గలుగజేయుచుండునో వారు ప్రపంచపరిణామమున నుందురు. కాన ఊర్ధ్వాదిలోకముల వర్తింపరు. కాన 'న చైవం విదేహ ప్రకృతిలయాః సత్యపి సాధికారత్వ ఇత్యర్థః' (యో.భా. వా.3,26) ఇంకను కృతార్థత నొందదగు సంస్కారలేశము లున్నను విదేహ ప్రకృతిలయులు లోకాంతర్గతులు గారు. లోకముల నుండకున్నను వారొకవిధమైన కైవల్యమునుబోలు స్థితి నుందురని యర్థము. పూర్వోక్తముగ 'అస్మిన్నేవ సమాధౌ యే బద్ధధృతయస్తత్త్వాంతరం ప్రధానపురుష రూపం న పశ్యంతి తే విగతదేహాహంకారత్వాద్విదేహశబ్దవాచ్యాః' (యో.భో.1,17) సానందసమాధిలో నెవరు దృఢత్వముగలిగి ప్రధాన పురుషరూపముల జూడరో వారికి దేహాహంకారాదిక రాహిత్యమువలన విదేహు లనబడుదురు అను భోజవాక్యముగ విదేహులు సానంద సమాపత్తి స్థితులై యుందురని గ్రాహ్యము. అట్లే 'అస్మిన్నేవ సమాధౌ యే కృతపరితోషాః పరమాత్మానం పురుషం న

పశ్యంతి తేషాం చేతసి స్వకారణే లయముపాగతే ప్రకృతిలయా ఇత్యుచ్యంతే' (యో.భో.1.17) అస్మిత నాబడు సమాధిలో నెవరు సంతోషము నొందుచు, పరమాత్మయగు పురుషుని దెలియక, తనకారణమగు ప్రకృతియందు లయించియుందురో వారుప్రకృతిలయు లనబడుదురనియు భోజ నిర్వచనము. అందుచే ప్రకృతిలయులు సాస్మితమగ్నులని వ్యక్తము.

'తత్రోపాయప్రత్యయో యోగినాం భవతి' (యో.భా. 1 19) ఉపాయప్రత్యయము కైవల్యసన్నిహితులగు యోగుల కన్వయము. ఉపాయప్రత్యయ సాధనకు 'శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞా' (యో.సూ.1.20) దు లవసరము. 'శ్రద్ధా చేతసః సంప్ర సాదః' (యో.భా.1.20) శ్రద్ధ చిత్తమునకు సంప్రసాదస్థితి యని యర్థము. ఇది జననివలె యోగిని రక్షించును. ఇట్లు శ్రద్ధాళు వునకు వివేకకాంక్ష జనింప 'వీర్యముపజాయతే' (యో భా.1.20) వీర్యమను శక్తి గలుగును. దానివలన 'స్మృతిరుపతిష్ఠతే, (యో.భా.1.20) స్మృతి యుద్భవించును. దానితో 'చిత్తమనాకులం సమాధీయతే' (యో.భా.1.20) చిత్తము ప్రశాంతి నొంది సమాహితమగును. దానినుండి 'ప్రజ్ఞావివేక ఉపావర్తతే' (యో.భా.1.20) ప్రజ్ఞనాబడు వివేక ముదయించును. అంత యథార్థం వస్తుజానాతి' (యో. భా. 1. 20) వస్తువుయొక్క యథార్థజ్ఞానము జనించును. ఈయాస్థితులలో వైరాగ్యము జూపుచుండుటచే 'అసంప్రజ్ఞాతః సమాధిర్భవతి' (యో.భా.1.20) అసంప్రజ్ఞాతసమాధి ప్రాప్తించును. అనగా 'తీవ్రసంవేగానామాసన్నః' (యో.సూ.1.21) ఎవరి వైరాగ్యము తీవ్రాతితీవ్రముగ నుండునో వారికి సంప్రజ్ఞాతము సన్నిహితము. వైరాగ్యము

యొక్క తీవ్రత ననుసరించి 'మృదు మధ్యాధిమాత్రత్వాత్తతోఽపి విశేషః' (యో.సూ.1.22) అను సూత్రప్రకారము మృదు మధ్య అధిమాత్రత్వమను రీతి వైరాగ్యము త్రివిధమై యొప్పు, మృదు తీవ్ర సంవేగులకు అసంప్రజ్ఞాత మాసన్నముగ నుండును. మధ్య తీవ్ర సంవేగులకు ఆసన్నతరముగ నుండును. అధిమాత్ర తీవ్ర సంవేగులకు ఆసన్నతమమై యొప్పారి సమాధి లాభమునునొందుచున్నారు. అందుచే నసంప్రజ్ఞాతసమాధిప్రాప్తికి వైరాగ్యమే శరణ్యమని గ్రాహ్యము. కాన నిది 'సంసారసాగరాత్తారయతీతి తారకం' (యో.భా.వా.3.54) సంసార సాగరము నుండి రక్షించునుగాన 'తారయత్యగాధాత్సంసారసాగరాద్యోగినిమిత్యాన్వర్థక్యా సంజ్ఞయా తారకమిత్యుచ్యతే' (యో భో. 3.54) అగాధ సంసారసాగరమునుండి యోగిని దరింపజేయును గాన నసంప్రజ్ఞాతము తారకమనియు యనదగియున్నది.

పై వివరింపబడిన సమాధి కేవలము చైతన్యవిహీనమగు జడతయని కొందరు భావింపవచ్చును. కాని యది అట్లుకాదని రామప్రసాదు క్రింది వచనములద్వారా సమాధిగత చైతన్యమును వివరించుచున్నాడు. (What is the state of mind in Samadhi and Nirodha? Is it a state of perfect quiescence of the mental body?) నిరుద్ధమునాబడు సమాధిస్థితిలో మనస్సుయొక్క స్థితి ఏది? సూక్ష్మశరీరమందు పరిశుద్ధ నిశ్చలత నొందియున్నదా? అని ప్రశ్నించుకొని దానిస్థితి నిశ్చలముగాదని వచించుచు(it is a state of great molecular motion in the mental body itself) సూక్ష్మశరీరమున నణుస్పందనము అత్యధికస్థితి నుండుననియు, అయినను స్థూలదేహము జడమైయుండు

ననియు (This vibration of the molecules of the mental body, becomes by practice, rythmic and this rythmic flow is the mental peace in Samadhi) సాధనచే నాస్పంద నము క్రమపరుప బడుననియు, నట్లు క్రమస్పందన వాహినియే సమాధిలో చిత్తశాంతియనియు వ్రాసియున్నాడు. అందుచే (That which appears to be the still ness of Samadhi is perhaps the highest activity possible) సమాధిగల ప్రశాంతత అత్యధిక చలనత్వ మగుచున్నది. సమాధియేగాక (Even what is called one pointedness is itself a state of utmost activity) (Patanjali's Yoga Sutras ix) ఏకాగ్రత యనబడునదియుగూడ ఎక్కువ స్పందనమేయని యతెడు వివరించియున్నాడు.

---

## కైవల్యము

ఇంతవరకు గల గ్రంథభాగమున ముఖ్యముగ అసంప్రజ్ఞాత సమాధినిర్వచన భాగమున మనము కైవల్యమునకు జాల సన్నిహితస్థితి కేతెంచి యున్నాము. స్వస్వరూప స్థితులును, కేవలీభావ తత్త్వములును రెండును సామ్యత్వమును బొంది యున్నవి. కాని కైవల్యము వీని కించుక నధికతరస్థితి యగుటచే దాని వివరముగ గ్రహించుట యవసర మగుచున్నది గాన నిక ము క్తివిషయమును బరిశీలించెదముగాక.

'భోగాపవర్గార్థం' (యో.సూ.2.18) అను ద్వివిధ పురుషార్థములలో నిసుమంత సూక్ష్మదృష్టి బరికింప భోగ్యమంతయు దృశ్యరూపమగుచు 'భోగాపవర్గార్థం దృశ్యం' (యో.భా.1.3) ఈనురీతి బురుషార్థముల కన్వయింపబడుచున్నను, 'తదర్థ ఏవ దృశ్యస్యాత్మా' (యో.సూ.2.21) దృశ్యము పురుషునికొరకే యగుటచే బురుషుడు నిత్యుడుగాన నతని స్వస్వరూప సిద్ధ్యర్థము భోగ్యభోగములగుచు, భోగముగూడ నపవర్గార్థమే యగుచున్న దని సువ్యక్తము, నైజమునకు బురుషార్థములు రెండు గాక అపవర్గార్థమను నొకటిగనే యగునని తాత్పర్యము. అందుచేత 'తదర్థావసాయో మోక్ష' (యో.భా.2.18) అర్థములు లేకుండుటయే మోక్షమని నిర్వచనము. అంతియు గాక 'సంసారః, సంసారహేతుః, మోక్షః, మోక్షోపాయః' (యో.భా.2.15) అను శాస్త్రప్రోక్తవ్యూహ చతుష్టయమున గూడ భోగకారణమై భోగ్యమగు సంసారము హేయమై హేయహానానంతర స్థితియే మోక్షము గాన అపవర్గమే పరమ పురుషార్థ మనబరగును.

'అపవృజ్యతేऽనేనేత్యపవర్గః' (యో.భా.వా.2.18) ఇతరమునుండి విడిబడుట యను వ్యుత్పత్త్యర్థము గలది పరమపురుషార్థమగు అపవర్గము, పురుషుడు తనకు బంధహేతువగు భోగ్యమునుండి విడివడుట యని 'అపవర్గో వివేకఖ్యాతిపూర్వికా సంసారనివృత్తిః' (యో.భో.2.18) వివేకఖ్యాతిపూర్వకమైన సంసారనివృత్తియనియు, నిర్వచింపబడి యున్నది. మరియు నిది 'దోషబీజక్షయే కైవల్యం' (యో.సూ.3 50) దోషబీజముల నాశమే కైవల్యమనియు 'సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే

కైవల్యమితి' (యో.సూ.3.55) బుద్ధిపురుషుల నిస్సంబంధరూప శుద్ధత్వమే కైవల్యమనియు నాయపవర్గరూపమును కైవల్యమని గూడ తెలుపబడినది. మరల నాకైవల్యమే 'పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిః' (యో.సూ.4.34) పురుషార్థశూన్యతచే గుణములు నిరుద్ధితములై యుండ కైవల్యమగునని వచింపబడియున్నది. చితిశక్తి స్వస్వరూపస్థితి నొందియుండుట కైవల్యమని పైవాక్యమున సూత్రకారుడు కైవల్యనిర్వచనము గావించియున్నాడు. 'స్వరూపప్రతిష్ఠా కైవల్యం' (యో.భా.1.3) స్వరూపప్రతిష్ఠయే కైవల్యమనిగూడ భాష్యకారుని భావము. కైవల్యస్థితికి 'తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యం' (యో.సూ.2 25) అవిద్యాక్షయమున సంయోగాభావ మేర్పడగ కైవల్యముగలుగు ననబడును. దీనినే వివరించుచు 'దృశ్యస్యాధికారనివృత్తేర్భవత్యేవ కైవల్యం' (యో.భో.2.26) దృశ్యముయొక్క వ్యుత్థానహేతుకవృత్తుల నివృత్తియే కైవల్యముగ భోజ తాత్పర్యము. అందుచేత 'కైవల్యమాత్యంతికీ దుఃఖనివృత్తిః' (యో.భో.3.50) దుఃఖముయొక్క అత్యంత నివృత్తియే కైవల్యమని యాతడు స్పష్టపరచెను. 'పురుషస్యాత్యంతికో గుణవియోగః కైవల్యం' (యో.భా.3.50) పురుషునియొక్క గుణముల యత్యంతనివృత్తియే కైవల్యముగ శ్రీవ్యాసులు వాకొనెను. అప్పుడు 'పురుషస్వరూపమాత్రజ్యోతిరమలః కేవలీ భవతి' (యో.భా.3.55) పురుషుడు స్వరూపమాత్రజ్యోతియై అమలుడై కేవలుడగుట కైవల్యమగుచున్నది. మరల 'చిత్తసత్త్వస్య స్వకారణేఽనుప్రవేశాత్ కైవల్యముత్పద్యత' (యో.భో.3.55) చిత్తసత్త్వము

స్వకారణమున లయింపగా కైవల్య మొదవుననియు మొదలు గాగల వాక్యకోటిచే నపవర్గమే కైవల్య మనబడుచున్నది. మరియు 'భోగవివేకఖ్యాతిరూపపరిణతబుద్ధినివృత్తిరేవ మోక్షః' (యో.భా.వా.2.24) భోగవివేకరూపమగు పరిణతబుద్ధి నివృత్త మగుటయే మోక్షమనియు, 'చిత్తనివృత్తిరేవ మోక్షః' (యో.భా.2.24) చిత్తవృత్తి నివృత్తియే మోక్షమనియు, 'బుద్ధ్యాదివివిక్తస్యాత్మనః స్వరూపస్థానం మోక్షః' (యో.భా.వా.2.23) బుద్ధ్యాదులనుండి విడివడి స్వరూపస్థితి నాత్మ యుండు టయే మోక్షమనియు, 'స్వరూపావస్థానమేవాత్మనో మోక్ష ఇతి' (యో.భా.వా.2.15) ఆత్మయొక్క స్వస్వరూపస్థితియే మోక్షము అనియు మొదలగు వాక్యములద్వారా మోక్ష మన్నను పూర్వార్థముగనే యున్నది. అంతియగాక ముక్తిపదము గూడ యిందన్వయమే యని గ్రాహ్యము. ఇట్లు కైవల్యాది పద నిర్వచనమూలముననే నది వ్యక్తమగుచున్నను, నది క్లుప్త ముగా విచారింపబడునుగాక,

'తదభావా త్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యం' (యో.సూ.2.25) సర్వ సంసారకారణమగు అవిద్యాక్షయము వలన పూర్వము భోగార్థ మేర్పడియున్న సత్త్వపురుషకల్పిత సంయోగము నశింపగా, సర్వనిరుద్ధస్థితి కలుగుచున్నది. అప్పుడు పురుషుడు కైవల్యస్థితి నుండును. అంత ఇంతవరకు తన్నావరించి యున్న హేయ సంసారమునుండి పురుషుడు విడివడును. (యో. భో.2.18) ఇంతదనుక నతని బంధించియుండు సత్త్వపురుషైకత్వ భావమునుండి ముక్తుడై సత్త్వపురుషాన్యతా జ్ఞానము (యో. భా.2.2) నొందుటచే భ్రాంతిరహితుడై యతడుండును. అట

నతనిలో 'తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యం' (యో. సూ 3.50) అను సూత్రవిధాన, సర్వజ్ఞత్వాది కాంక్షాదోష ములుగూడ లేక కైవల్యమున నుండును. కాన నతనికి 'దుఃఖో పరమ' (యో.భా.వా.2.25) ము గల్గి దుఃఖకారణమగు గుణ ములనుండి 'ఆత్యంతికవియోగ' (యో.భా.3.50)ము నొందును. 'పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః' (యో.సూ 4. 34)పురుషార్థతలేని గుణములు వ్యర్థములగుటచే 'తతః కృతార్థా నాం పరిణామక్రమసమాప్తిర్గుణానాం' (యో. సూ. 4. 32) అచ్చట కృతార్థములై గుణములు పరిణామపరిసమాప్తి నొందు చున్నవని ధర్మమేఘమునందే తెలుపబడియున్నది,

'సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యం' (యో.సూ. 3 55) బుద్ధిపురుషులు సమాన శుద్ధత్వము నొందగ కైవల్య మనుసూత్ర రీతి పురుషుడు పరిశుద్ధుడై 'సర్వకర్తృత్వాభిమాన నివృత్త్యా స్వకారణేஉనుప్రవేశః శుద్ధిః' (యో.భో.3.55) బుద్ధి సర్వకర్తృత్వాభిమానముల బాసి, స్వకారణమగు ప్రధానమున లయించి యదృశ్యముకాగా నితడు అమలుడై రాజల్లును. పురుషు డప్పుడు 'స్వరూపప్రతిష్ఠా' (యో.సూ 4.34) 'స్వరూ పానస్థాన' (యో.భా.వా.2 15) స్వరూపావధారణ (యో.భా. 2.18) 'స్వరూపోపలబ్ధిః' (యో. భా. వా. 2. 23) 'స్వరూప మాత్రః' (యో.భా. 3 55) మొదలగు నన్వయముల ననుస రించి స్వరూపస్థితుడై యుండును. అతడు కేవలీభావమున నేకుడై, యుండునని తాత్పర్యము,

'తతః క్లేశకర్మనివృత్తిః' (యో.సూ.4.30) ధర్మమేఘ ముతో క్లేశకర్మాదులు నశించుటచే 'జీవన్నేవ విద్వాన్

విముక్తో భవతి' (యో.భా.4.30) సజీవుడై యుండియు విముక్తుడగుచున్నాడు. అట్టి విద్వాంసుని సిద్ధుడనియు, కుశలుడనియు నందురు.

'నాత్ర దర్శనం మోక్షకారణ మదర్శనా భావాదేవ బంధాభావః స మోక్ష ఇతి' (యో.భా,2.23) సమ్యగ్దర్శనము మోక్షకారణము కానేరదు కాని అదర్శనము నాబడు అజ్ఞానము నశించుటచే బంధ మభావమగును. అదియే మోక్షము. కాన కైవల్యమునకు నెద్దియు గారణము కానేరదు. కాని సాధనాదులన్నియు, వృత్తిరూప బంధనిరోధము గావింప కైవల్యము జ్యోతివలె ప్రకాశించునని భావము. అనగ సాధనలు బంధనివృత్త్యర్థకమేగాని మోక్షప్రాప్త్యర్థకము గాదని రహస్యము. అందుచే మోక్షము సాధ్యముగాక స్వతఃసిద్ధమైనదిగ నుండునని యర్థము.

మరియు'కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్' (యో.సూ.2.22) కృతార్థతగని కైవల్యము నొందినవానికి దృశ్యము పరిహారమైయున్నను, లోకమున బంధముననున్న యితరపురుషుల భోగాపవర్గార్థమై యుండుటచే నొకడు ముక్తిగాంచుటచే, సంపూర్తిగ ప్రపంచము అంతరింపదు, ఎందరు ముక్తులగుచున్నను, 'ఏకస్య ముక్తౌ వా న సర్వముక్తి ప్రసంగ' (యో.భో.2.22) అనురీతి సర్వముక్తి కలుగదు గాన దృశ్యము పూర్తిగ నంతరింపక ముక్తునికి మాత్రము నిష్ప్రయోజక మగుచున్నదని గ్రాహ్యము,

## ఈశ్వరుడు

యోగశాస్త్రమున నీశ్వరునకు గల స్థానమునుగూర్చి యుపోద్ఘాతమున నొకించుక వ్రాయబడి యున్నను, దానిగూర్చి సవివరముగ చర్చించి గ్రహించెదముగాక. 'క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః' (యో.సూ 1, 24) క్లేశకర్మవాసనాదులకు అతీతుడై విశేషలక్షణములుగల పురుషుడే ఈశ్వరుడను ప్రస్తావన పూర్వము సృష్టివివరణ సందర్భమున నిసుమంత గలిగినది. అతడు సామాన్య పురుషులవలె క్లేశకర్మవాసనా బద్ధుడు గాడని అర్థము. అందుచే నతనికి సంకుచితత్వము లేకుండుటచే 'తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం' (యో.సూ.1.25) నిరతిశయ సర్వజ్ఞత్వముయొక్క మూలము నతడు గలిగియున్నాడు. సర్వజ్ఞత్వ నిర్వచనముగ 'యదిదమతీతానాగత ప్రత్యుత్పన్న ప్రత్యేక సముచ్చయాతీంద్రియగ్రహణమల్పం బహ్వితి సర్వజ్ఞబీజమేతద్వివర్ధమానం యత్ర నిరతిశయం సర్వజ్ఞః' (యో.భా.1.25) భూతభవిష్యద్వర్తమానరూప కాలగతమయి, పురుషులచే జూడబడు అల్పమహద్వస్తువులయొక్కయు వర్తమానమున నింద్రియాతీత విషయ సమూహములయొక్కయు, జ్ఞానబీజము వర్ధమానమగుచు, నిరతిశయ స్థానము నొందినప్పుడట్టిజ్ఞానమును సర్వజ్ఞమందురు అని వ్యాసభగవానులు వాకొని యున్నారు. 'ఏతద్వివర్ధమానం యత్ర నిర్ప్రాకాంతమతిశయాత్ స సర్వజ్ఞ' (యో.భా.వా.1,25) ఏజ్ఞానము అభివృద్ధిచేయబడుచు వర్ధమాన పరిమితిని దాటునో అది సర్వజ్ఞ మనబడునని వాచస్పతులుగూడ నిర్వచించిరి. కాన

'యత్ర కాష్ఠాప్రాప్తిర్జ్ఞానస్య స సర్వజ్ఞః స చ పురుషవిశేష ఇతి' (యో. భా. 1,25) ఎవనిలో నీజ్ఞానము పరిమితి నధిగమించునో అతడు పురుషవిశేషుడని పతంజలి మతము. అనగా సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రజ్ఞానమున నున్న పురుషునికే సర్వజ్ఞత్వమున్న అట్టి సిద్ధునికంటె నీశ్వరుని సర్వజ్ఞత్వము అనంతాధికమని తాత్పర్యము. ఎందుచేనన నీశ్వరునికి అవిద్యాక్లేశములు గాని కుశలాకుశలరూప కర్మలు గాని తత్తత్ఫల విపాకము గాని, తదనుగుణ వాసనాచయము గాని లేవు. కావున 'యోఽత్యానేన భోగేనాపరామృష్టః స పురుషవిశేషః ఈశ్వరః' (యో. భా. 1.24) భోగాదులచే నలిప్తుడైయున్న పురుషవిశేషుడే ఈశ్వరు డనబడును. కాని యీస్థితినేయున్న ముక్తులకు నీశ్వరునకు భేదమున్నది. 'కైవల్యం ప్రాప్తాస్తర్హిసంతి చ బహవః కేవలినః' (యో. భా. 1.24) కైవల్యప్రాప్తినొందిన పురుషు లనేకులు గలరు. కాని 'తే హి త్రీణి బంధనాని చ్ఛిత్త్వా కైవల్యం ప్రాప్తా' (యో. భా. 1.24) వారు ప్రకృతేంద్రియ విషయములు నాబడు త్రివిధ బంధముల ద్రుంచి కైవల్యమును బొందగా 'ఈశ్వరస్య చ తత్సంబంధో న భూతో న భావీ' (యో. భా. 1.24) ఈశ్వరునికి నీబంధసంబంధము భూతమునగాని, భవిష్యత్తునగాని యేర్పడక నతడు సదా అతీతుడు. 'స తు సదైవ ముక్తః సదైవేశ్వరః' (యో. భా. 1 24) అతడు నిత్యముక్తుడు, సదా ఈశ్వరుడైయె యుండును. మరియు 'తచ్చ తస్యైశ్వర్యం సామ్యాతిశయవినిర్ముక్తం' (యో. భా. 1.24) అతని యైశ్వర్యము సామ్యరహితము, అసమానము, అద్వితీయము. 'సర్వజ్ఞతా తృప్తిరనాదిబోధః స్వతంత్రతానిత్యమలుప్తశక్తిః। అనంతశక్తిశ్చ

విభోర్విధిజ్ఞాః షడాహురంగాని మహేశ్వరస్య' (యో. భా. 12. 3) సర్వజ్ఞత్వము, తృప్తి, అనాదిజ్ఞానము, స్వాతంత్ర్యత, నిత్యశక్తి, అనంతశక్తి యను నారును మహేశ్వరుని యైశ్వర్యములని వాయుపురాణ వచనము. అందుచే నతడు అద్వితీయుడు నిరతిశయుడు. మరియు 'శుద్ధః ప్రసన్నః కేవలోనుపసర్గః' (యో. భా. 1,29) అనురీతిగ 'శుద్ధః కూటస్థనిత్యతయోదయవ్యయరహితః' (యో. భా. వా. 1.29) కూటస్థనిత్యుడగుటచే నుత్పత్తిక్షయములు లేని పరిశుద్ధుడు యీశ్వరుడు. అతడు 'ప్రసన్నః క్లేశవివర్జితః' (యో. భా. వా. 1. 29) క్లేశవర్జితుడగుటచే ప్రసన్నుడు. 'కేవలో ధర్మాధర్మోపేతః' (యో. భా. వా. 1 29) ధర్మాధర్మములులేని కేవలుడు. 'జాత్యాయుర్భోగా' (యో. భా. వా. 1.29) ములు లేని యతడు యీశ్వరుడు.

అందుచే నీశ్వరుడు 'జ్ఞానధర్మోపదేశేన కల్పప్రలయ మహాప్రలయేషు సంసారిణః పురుషానుద్ధరిష్యామి' (యో. భా. 1.25) అజ్ఞజనులపై ననుగ్రహభావమున సృష్టి నుదయింప జేయుచు జ్ఞానధర్మోపదేశముల జేయుచు, సంసారిణుల నుద్ధరించుచున్నాడు. కాన 'ఈశ్వర ఈశానశీల ఇచ్ఛామాత్రేణ సకలజగదుద్ధరణ క్షమః' (యో. భో. 1.24) ఈశ్వరుడు నియామకుడై ఇచ్ఛామాత్రమున సర్వవిశ్వము నుద్ధరించుచున్నాడని వాకొనబడి యున్నది. అట్లనాదికాలమునుండి జ్ఞానధర్మోపదేశము నొసంగు వాడు గనుక 'పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్' (యో. సూ. 1.26) కాలాతీతుడు కాన అతిప్రాచీన గురులోకమునకు గూడ యీశ్వరుడు పరమగురు వగుచున్నాడు, ఈశ్వరునితో బోల్చిచూచినచో బ్రహ్మాది దేవ

తలుగూడ కాలబద్ధులగుచున్నారు. (యో.భా.వా.1.26) కావున 'ఆద్యానాం స్రష్టౄణాం బ్రహ్మాదీనామపి స గురురుపదేష్టా' (యో.భా.1.26) ప్రథమజన్ములగు బ్రహ్మాదులకుగూడ ఈశ్వరుడే యుపదేష్టయని విదితమగుచున్నది.

అయినను 'ప్రణిధానాత్ భక్తివిశేషాదావర్జిత ఈశ్వర స్తమనుగృహ్ణాత్యభిధ్యాన మాత్రేణ' (యో.భా.1.23) ప్రణిధానరూపమైన భక్తివిశేషముచే నాకర్షింపబడినవాడై ఈశ్వరుడు యోగి ననుగ్రహించుచున్నాడు. 'తదభిధ్యాన మాత్రాదపి యోగిన ఆసన్నతమః సమాధిలాభః సమాధిఫలం చ భవతి' (యో.భా.1.23) ఈయనుగ్రహమువలన యోగికి సమాధియు తత్ప్రయోజనమును సన్నిహితమగుచున్నవి. ప్రణిధానమన భక్తివిశేషమే గాక 'తపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని' (యో.సూ.2.1) యనబడు క్రియాయోగ సూత్రభాష్యమున 'ఈశ్వరప్రణిధానం సర్వక్రియాణాం పరమగురావర్పణం తత్ఫల సంన్యాసోవా' (యో.భా 2.1) ఈశ్వరప్రణిధానమన సర్వకర్మముల తత్ఫలితములతో సన్న్యసించి పరమగురు చరణముల కర్పించుటయనియు, 'శౌచసంతోష తపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః' (యో.సూ.2.32) అను నియమ సూత్రభాష్యమున 'ఈశ్వరప్రణిధానం తస్మిన్పరమగురౌ సర్వకర్మార్పణం' (యో.భా.2.32) అనగా పరమగురువునకు సర్వకర్మార్పణము గావించుట యనియు, 'సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్' (యో.సూ.2.45) అను సూత్రభాష్యమున 'ఈశ్వరార్పిత సర్వభావస్య' (యో.భా.2.45) సర్వభావముల నీశ్వరున కర్పించుట యనియు ప్రణిధాన శబ్దమునకు వ్యాసులు వివరించియున్నారు.

వాచస్పతి మిశ్రుడుగూడ ప్రణిధాన పదవివరణమున పరమగురు భగవానీశ్వరునకు 'కామతోఽకామతో వాఽపి యత్కరోతి శుభాశుభం। తత్సర్వం త్వయి సన్యస్తం త్వత్ప్రయుక్తః కరోమ్యహం' (యో.భా.వా.2.1) శుభాశుభములును కామ్యాకామ్యములును అగు నాకర్మలన్నింటిని నీకర్పించుచున్నాను. సర్వకర్మల నీకొరకే చేయుచుందును, అనువాక్యమునుదాహరించి సర్వకర్మత్యాగమును, మరియు, 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన, మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి' కర్మాచరణమునందే నీయధికారము, తత్ఫలితములందు కాదు. ఫలాసక్తితో కర్మానుష్ఠానము చేయకుము, అను ప్రమాణముల సూచించి కర్మఫలత్యాగమును తెలుపుచున్నాడు. అటులే 'తత్ర ప్రణిధానం భక్తివిశేషో విశిష్టముపాసనం సర్వక్రియాణాం తత్రార్పణం విషయ సుఖాదికం ఫలమనిచ్ఛన్సర్వాః క్రియాస్తస్మిన్ పరమగురావర్పయతి తత్ప్రణిధానం' (యో.భో.1 23) ప్రణిధానము భక్తివిశేషము. శ్రేష్ఠమగు ఉపాసనము. సర్వక్రియల నీశ్వరుని కర్పించుచు, విషయ సుఖాపేక్షలేక, సర్వక్రియల పరమగురున కర్పించుటయే ప్రణిధానమనియు భోజదేవుని తాత్పర్యము. (Surrendering the fruits of work to God is to take to ourselves neither credit nor blame, but to give both up to the Lord and be at peace) (యో.సూ.2.1) ఈశ్వరునకు గర్మఫలత్యాగమనగా దూషణ భూషణముల స్వీకరింపక, నారెండింటిని నీశ్వరున కర్పించి శాంతి నుండుటయని వివేకానందుని నిర్వచనము. మరియు ప్రణిధాన పదము ప్ర=సంపూర్ణముగ ని=స్వాధీనము ధాన=ఉండుట లేక

ఉంచుట అనగా సంపూర్ణప్రపత్తి, శరణాగతి యను నర్థమును తెలుపుచున్నది. అందుచే 1.23 సూత్రమున నీశ్వర సర్వవ్యాపకత్వ స్ఫురణముగను, 2.45 సమాధిసందర్భమున నీశ్వరుని సర్వాధిష్ఠానత్వ స్ఫురణముగను, 2.1,2.32 నియమసందర్భమున నిష్కామకర్మ రూపముగను ఈశ్వరప్రణిధాన పదము జ్ఞాన భక్తికర్మపరముగ నన్వయింపబడినది.

ఈశానుడగుటచే నీశ్వరుడని నామ మేర్పడియున్నది. కాని 'తస్య వాచకః ప్రణవః' (యో.సూ.1.27) అతనికి ప్రణవమే వాచకము. ప్రణవమనగ 'ప్రకర్షేణ నూయతే స్తూయతేఽనేనేతి నౌతి స్తౌతీతి వా ప్రణవః' (యో.భో.1.27) ఎల్లరచే నెక్కువగ నుతింపబడుచు, స్తుతింపబడుచుండుటచేతను లేక, యీప్రణవము ఈశ్వరుని బహుళముగా నుతించుచు, స్తుతించుచుండుటచే దీని ప్రణవ మందురని నిర్వచనము. ప్రణవము యీశ్వరుని అభిధానమగుటచే నితని సాధించి సాక్షాత్కరింప జేసికొనుటకు యిది ముఖ్యసాధనముగ నున్నది. కావున 'తజ్జపస్తదర్థభావనం' (యో.సూ.1.28) అనుసూత్రమున సాధనావిధానము వివరింపబడెను. ప్రణవమును తదర్థపూర్వకముగ, అభిధేయసహిత స్ఫురణముతో జపింపవలయును. జప మన 'భావనం పునః పునశ్చిత్తే నివేశనం' (యో.భా.వా.1.28) భావమును మరల మరల చిత్తమునందుంచుట యే యగుచున్నది. అట్లు భావయుక్త జప ఫలితముగ 'చిత్తమేకాగ్రం సంపద్యతే' (యో.భా.1.28) చిత్తమున నేకాగ్రము జనించును. 'తతః ఈశ్వరః సమాధితత్ఫలలాభేన తమనుగృహ్ణాతి' (యో.భా.వా.1.28) సమాధిని తత్ఫలితముల నొందుటకు యోగిని

యీశ్వర డనుగ్రహించును. పురుషుడు భోగాపవర్గార్థము గలిగిన ప్రకృతిపురుషసంయోగము మరల యీశ్వరప్రణిధానరూపము ననే ఆతని కృపావిశేషముననే వినియోగమై పురుషుని స్వస్వరూప స్థానము నందుంచును.

ఇట్లు ఈశ్వరుడు యోగశాస్త్రమున సృష్టి కుపాదాన నిమిత్తకారణమునుగూడ గాక, పురుషుని తరుణోపాయోపదిష్ట మాత్రమేయై పురుషుడు ప్రకృతిబంధ విముక్తుడగుటకు మాత్రమే యుపయుక్త మగుచున్నాడు. కాన నితనికిని యితర సృష్టికిని సంబంధము చాలవరకు అభావమై కేవలము భక్తత్రాణ పారీణశీలుడై యీశ్వరు డొప్పారునని యోగశాస్త్ర ముఖ్యోద్దేశము.

---

## సమాప్తి

మనోవాక్కాయముల కుపయుక్తమైన యోగ వ్యాకరణ వైద్యగ్రంథముల రచించి వాని సమన్వయముననే సర్వతో ముఖాధ్యాత్మికాభివృద్ధియని నిర్ధారించిన శ్రీపతంజలిఋషి వరేణ్యుడు, యోగశాస్త్రమునగూడ, యోగమగు అసంప్రజ్ఞాత సమాధి ద్వారమున కైవల్య సాధనమునకు 'వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః' (యో.సూ.2 26) దుఃఖ హానోపాయము అత్యంత జ్ఞానమువలననే యగునను మొదలుగాగల సూత్రములచే జ్ఞానమార్గమును, ఈశ్వరప్రణిధానాద్వా' (యో.సూ.1,23) ఈశ్వరునియందు భక్తివిశేషముచేత నను సూత్రము

లచే భక్తిమార్గమును, యోగాంగములకు యమ నియమాదిక మూలమున గర్మమార్గమును ఉపదేశించుచు, వాని సమన్వయించుచు వాని ఆవశ్యకతను నొక్కిచెప్పుచు, సర్వమార్గ సమన్వయమునుగూడ గావించి, ముముక్షులోకమునకు మహోపకారము గావించెననుట కెట్టి సందియమును లేదు. అట్టి సర్వసమన్వయ సర్వసమత్వ స్వరూపులగు మహాత్ములగన్న భారతాంబ కడుంగడు ధన్య. అట్టి గురులోకమును గలిగిన భారతీయులు మిగుల ధన్యాతిధన్యులు. అంతటితో దృప్తిగాంచక, మన మహర్షిగణముచే మనకు వారసత్వముగా బ్రసాదింపబడిన యీసర్వోత్తమ జ్ఞానవిధానమును ఆప్యాయతతో ననుష్ఠించి, అనుభవించి, ఆనందించు, సాధకబృందము అత్యధికతర ధన్యులు ధన్యాతిధన్యులు. ఆకీతి సర్వభారతీయులు ఆర్ష సంప్రదాయానుగత విజ్ఞానధార నాస్వాదించి సర్వమానవకోటి కాదర్శమూర్తు లగుదురుగాక.

మంగళం మహత్

# శ్రీ అనుభవానంద గ్రంథమాల, బాపట్ల.

## పాఠక మహాశయులారా!

శ్రీ అనుభవానంద గ్రంథమాల నియమావళిని ముందు చూచారు. నిజానికి ఇది 1951 వ సంవత్సరములో శ్రీస్వామీజీవారి 'శ్రీరామకృష్ణలీలా సంకీర్తనం' తో ఆరంభించింది. ఆగ్రంథ గానంచేస్తూ దేశం తిరిగే టప్పటికి గ్రంథమాల ధైర్యోత్సాహాలతో 1952 డిశంబరునుండి విజృంభించి, మిత్రుల ఆనందాన్ని పురస్కరించుకొని 1954 ఏప్రిల్ కు 11 గ్రంథాలను ప్రకటించి పంపింది లోకసేవకు. అందులో కొన్ని గ్రంథాలు రెండు మూడు ముద్రణముల కూడా పొంది పొంగి ఉండటం పట్టికలో చూస్తారు. అంటే అవి దేశవ్యాప్తమై అంతట ప్రజలహృదయాలలో చొచ్చుకుని పోతున్నవని యర్థం.

వీటిల్లో శ్రీస్వాములవారు వ్రాసిన బృహద్గ్రంథం 'సర్వ సిద్ధాంత సౌరభం' చాల ముఖ్యం. అది మనభారతీయ తత్త్వసిద్ధాంతాలన్నిటినీ, ఆయా సిద్ధాంతులు చెప్పినట్లే చెప్పుతూ వాటిలో గొప్పదనాన్ని మనకు కన్నులకు కట్టేటట్లు చేస్తుంది. ఆ పెద్దగ్రంథంలో కొంచెంభాగం మొదటిభాగంగా ప్రకటించబడింది. దీనిలో తత్త్వవిచారణకు పునాది అయిన ఆరుదర్శనాలలో సాంఖ్య యోగాలు రెండు మాత్రమే వచ్చాయి. ఇంకా న్యాయవైశేషికాలు మీమాంసా వేదాంతాలు అచ్చుకావాలి. ఈదర్శనభాగమే కాకుండా కొన్ని భాగాలలో అద్వైతఖండం, వైష్ణవఖండం, శైవఖండం, బౌద్ధఖండం, సమన్వయఖండాలు అనేవికూడా లోకానికి రావాలి.

ఇంతేకాకుండా శ్రీస్వాములవారు వ్రాసిన యింకా యితరగ్రంథాలు చాలాఉన్నాయి. అవన్ని క్రమంగా బయటికి రావాలి. ఈగ్రంథాలు, బాహ్య గురువులు అవసరంలేకుండా సాధకుడికి అన్నివిధాల సహాయం చేస్తాయని "సాధనరహస్యం" దేశదేశాల నిరూపిస్తూనే ఉందికదా!

ఇంతవరకు అచ్చు అయిన వాటిలో శ్రీమాతాజీ వ్రాసిన ముచ్చటైన మూడు గ్రంథాలున్నాయి. ఆ శైలిని రచనావిధానాన్ని భావగాంభీర్యాన్ని అందరు పొగుడుతున్నారు. ఇవేగాక శ్రీమాతాజీ వ్రాసిన ఉపనిషత్తులు వేదాంతం మొదలైన విషయాలనుగూర్చి గ్రంథాలు యింకా చాలాఉన్నాయి. అవన్ని లోకసేవకు ఉపయుక్తం కావాలి.

కాబట్టి, మీమీ శక్తికొలది, గ్రంథమాల విరాళకర్తలుగా చేరి యీ మహోద్యమానికి తోడ్పడుతూ, మా చేయు లోకసేవాఫలితంలో మీరు కూడా సమభాగస్థులుగా అవుతారుగాక అని ఆశిస్తున్నాము.

చూచారా! లేకున్న వెంటనే చూడండి.

సాధకులకు కల్పతరువని సాధనవాఙ్మయ గురువని

ఉత్తమాధికారికి ఉపదేశాలని

సాధకలోకంచేత కొనియాడబడుచున్న

# సాధన రహస్యము

ఇంతవరకు తెలుగున అంత విపులంగా సాధన విషయాలను వివరించిన గ్రంథం లేదన్నారు పెద్దరు! ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరు లందరికి అవశ్యపఠనీయ మని, ఏకాగ్రత వైరాగ్యాలను తత్త్వానుభూతిని పొందటానికి చాల సహాయంచేస్తుంది అని ఆంధ్రప్రభ స్తుతించింది.

ముచ్చటైన వ్యావహారిక భాషగూడా స్వాముల వారు వ్రాయగల రనడానికి "సాధనరహస్యం" నిదర్శనమని, ఎంతో సరళత్వం సాధింపబడ్డదని తత్త్వ విషయాలను వీరు విప్పిచెప్పిన ధోరణి చూస్తే ముచ్చట వేస్తుందని, పెద్దల మనుకొనేవారూ పిన్నలై గూర్చుండి విననచ్చునని కృష్ణాపత్రిక నుతించింది.

1/8 క్రా. 290 పుటలు రు 2-0-0 మాత్రం

శ్రీస్వాములవారి, శ్రీమాతాజీయొక్క ఫోటోలు ఉన్నవి.

కర్త.

శ్రీ. అనుభవానంద స్వాములవారు

# శ్రీ అనుభవానంద గ్రంథమాల, బాపట్ల.

## ప్రచురణములు

1 శ్రీరామకృష్ణ లీలాసంకీర్తనము: (తృతీయ ముద్రణము)
శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి
122 కీర్తనలు 170 పుటలు — రు 0–10–0

2 శ్రీరామకృష్ణాంజలి: (తృతీయ ముద్రణము)
శ్రీరామకృష్ణ వివేకానందుల గూర్చి 100 పద్యములు — రు 0–2–0

3 శ్రీ దక్షిణేశ్వరీ స్తవము: (ద్వితీయ ముద్రణము)
భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధిక పద్య శతకము — రు 0–2–0

4 చిత్తప్రబోధ: (ద్వితీయ ముద్రణము)
సాధకులకు అమూల్యరహస్యముల బోధించు పద్యశతకము — రు 0–2–0

5 సాధన రహస్యము:
ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారమైన గ్రంథరాజము
క్రౌను 300 పుటలు — రు 2–0–0

6 అనుభవానందము:
అద్వైతానుభూతి విభూషిత పద్య శతకము — రు 0–2–0

7 సాధన సుధ:
సాధకోపయుక్త పద్య గ్రంథము క్రౌను 62 పుటలు — రు 0–8–0

8 మన శారదామాయి:
శ్రీశారదామాయి జీవితోపదేశములు చక్కగ వివరింప
బడియున్నవి. క్రౌను 64 పుటలు — రు 0–8–0

9 మన వివేకానందుడు:
శ్రీవివేకానందుని మూర్తిని పరిస్ఫుటము మొనరించును.
క్రౌను 68 పుటలు — రు 0–8–0

10 మన రామకృష్ణదేవుడు:
మధురశైలిలో శ్రీరామకృష్ణ జీవితము క్రౌను 78 పుటలు — రు 0–8–0

11 సర్వసిద్ధాంత సౌరభము:
దర్శనఖండము-ప్రథమభాగము. క్రౌను 350 పుటలు — రు 3–4–0

tions assert a particular relation between Sankara and Gaudapada, its accuracy is subject to serious doubt. 226 సంప్రదాయము శంకర గవుడపాదుల కొక సంబంధమును దెలుపుచుండ, దాని నిర్దోషత్వము మిగుల సంశయాస్పదముగ నున్నదనియు, there is not much certainity ఎక్కువ నిశ్చయత్వము కానరాదనియు, గట్టిగా వక్కాణించియున్నాడు. కాన గవుడపాదుడు అద్వైతాచార్యులలో ప్రథముడునుకాక, శంకరుసన్నిహితుడును గాకుండుటచే నాతని కాలనిర్ణయ వ్యవహారము అతిక్లిష్టమై, కష్టసాధ్యమై యున్నదని విదితము. అట్టి అనిశ్చితాంశములపై నాధారపడి, అతని వ్యక్తిత్వ జీవితకాలముల నిర్ణయించుట దోషభూయిష్టము. శంకరజీవిత ములగూడ, గవుడపాద బాదరాయణులు శంకరునికి దర్శన మొసంగి అదృశ్యమైరి 227 అనుటయు, గవుడపాద వ్యాసుల సాక్షాత్తు స్థూలదర్శనముకాదేమో అను సందియముగూడ వాడము గలదు.

అయినను శంకరచరిత్ర ననుసరించి, but he was probably living when Sankara was a student, for Sankara says that he was directly influenced by his great wisdom 228 అతని గొప్ప ప్రజ్ఞాశక్తి ప్రాబల్య మున, దానుగూడ సాక్షాత్తుగా లొంగినట్లు శంకరుడు చెప్పుకొని

---

226. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 10.

227. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య : జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్య చరిత్రము, పు 13.

228. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 423,

(5.10) మొదలగు నుపనిషత్తుల స్పష్టముగా నేమార్పుగూడ లేక గోచరించుచున్నది. అందుచే గౌడపాదుడా శ్లోకరాజమును మార్పు లేకయే వానినుండి స్వీకరింప, నాగార్జున వాల్మీక్యాదులు భాషను మార్చి, భావమును స్వీకరించియుండినట్లు వ్యక్తము.

కావున, గౌడపాదుడు ప్రసంగవశమున అనిర్వచనీయ అవాచ్య విజ్ఞానమును ప్రస్తావించి, అది ఉపనిషత్తులగల ఆత్మకు నన్వయింప యత్నించి, and thus laid the foundation of a rivival of the Upanishad studies on Buddhist lines. How far the Upanishads guaranteed in detail the truth of Gaudapada's views it was left for his disciple, the great Sankara, to examine and explain 246 బౌద్ధవిధానమున నుపనిషత్పరవము నుద్ధరింప గౌడపాదుడు బూనెననియు, గౌడపాదభావముల నుపనిషత్తులెంతవరకు సమర్థించునో విచారించి వివరింప నతని ఉత్తమ శిష్యుడైన శంకరునకు వదలివేయుబడినదనియు సురేంద్రనాథ దాస్ గుప్త భావములు పొసగనేరవని స్పష్టము. బౌద్ధ భావములే యింత తీవ్రముగ గౌడపాదునిలో నున్నచో, బౌద్ధవాద ఖండనము సర్వదా సర్వథా గావించియున్న శంకరులు, అతనికెట్లు ఉత్తమ శిష్యుడగునో ఆశ్చర్యకరము. అట్టి గ్రంథమునకు భాష్యరచనము గూడ విచిత్రమే. అందుచే గారికలలో బౌద్ధభావములున్నవని భావించుటకంటె బౌద్ధములో గారికభావములున్నవని గ్రహించిన సముచితము. ఎందుచేనన నిరువురికి నాధారము నాటి సర్వత్ర

---

246. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 429

31. శ్రీ శంకరానంతరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ సురేశ్వర, విద్యారణ్య జీవితకాల విశేషములతో అద్వైత సిద్ధాంతములిందు చర్చితము. 20-00

32. విశిష్టాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీ రామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములిందు ప్రస్ఫుటము. 20-00

33. వైష్ణవము (2 వ ముద్రణ)

శ్రీ మధ్వాచార్యునినుండి శ్రీ కృష్ణచైతన్యుని వరకుగల వైష్ణవాచార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి. 20-00

34. శైవాద్వైతము (2 వ ముద్రణ)

వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము, వీరశైవము వరకు ఎట్లు పరిణమించియున్నదియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు కలవు. 20-00

35. శాక్తాద్వైతము (2 వ ముద్రణ)

వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనతో ప్రారంభమై, దక్షిణ వామాచారరూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన శాక్తసిద్ధాంత సాధనములతో వివరింపబడినవి. 20-00

36. బౌద్ధము

బౌద్ధసిద్ధాంతము - ప్రాముఖ్యత, శ్రీ బుద్ధభగవానుని, జీవి విశేషములు పరిశీలనాత్మకముగా వివరింపబడినవి.

37. సర్వ సిద్ధాంత సౌరభ సారము
సులభశైలిలో "సౌరభము"ను గూర్చి వివరణాత్మక గ్రంథము.

38. శ్రీ రామకృష్ణ గానసుధ (స్టీరియో కేసెట్)
మధురమైన భక్తిపాటలుగల స్టీరియో కేసెట్.
వెల. రు. 40-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 44-00 లు

39. భారతీయ సంస్కృతి (స్టీరియో కేసెట్)
భక్తిపాటలతో భారతీయ సంస్కృతినిగూర్చి శ్రీ మాతాజీ త్యాగీశానందుల అనర్గళ ఉపన్యాసములుగల స్టీరియో కేసెట్.
వెల రు. 30-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 34-00 లు
*పై రెండు కేసెటులు తీసుకొనేవారికి పోస్టేజి ఉచితము*

40. స్టిక్కర్లు (Stickers), ఒక్కొక్కటి 4 రంగులలో, సైజు 7" × 5".
1) ఓంకారము, 2) శ్రీ రామకృష్ణ పరమహంస, 3) శ్రీ శారదా మాయి, 4) శ్రీ వివేకానందస్వామి. ఒక్కొక్కటి .... 1-50

*అముద్రితములు*

1) శ్రీ అనుభవానందస్వామి జీవితచరిత్ర, 2) శ్రీ అనుభవానందుల లేఖావళి, 3) శ్రీ అనుభవానందుల ఉపన్యాసములు, 4) అనుభవామృతము, 5) మన భారతీయ సంస్కృతి, 6) శక్తి పూజా విశిష్టత, 7) మంత్ర శాస్త్రము, 8) తంత్రశాస్త్రము, 9) శాక్తేయము – శ్రీ రామకృష్ణుడు, 10) పరమహంస ప్రబోధము, 11) శ్రీ శారదా సందేశము, 12) శ్రీ వివేకానంద విజయభేరి, 13) శ్రీ త్యాగరాజ హృదయం మొ॥.

* శ్రీ అనుభవానంద స్వాములవారు చిత్రించిన 'ఓంకారము', శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదామాయి, శ్రీ వివేకానంద స్వామి ఫొటో కాపీలు కాబినెట్ మరియు ఫుల్ సైజులో మన గ్రంథమాలలో లభించును. *